శ్రీ వృష సం॥ర కార్తికమాసః శాలివాహనశకః ౧౮౬౩ కల్యాది ౫౦౪౨ పార్సీ ౧౩౫౧ హూణ 1941

నవంబరునెల 1941

| | | | |
|---|---|---|---|
| 21 | ౫ | ౧౬ | శు-ప్ర॥మం౨౯-౧౩స్వాతి౪౪-౫౩వి౦-౪౨ప్రీ౫౨-౩౧కిం౨-౦ది౧-౫౨త్యా౩-౪౪ రా౨౮-౫౫ త్యా౩-౪౩అహః ౨౯-౦ గోక్రీడనం కార్తీకనక్త,స్నాన,ఆకాశదీపారంభాః చంద్రోదయః ఉత్తరశృంగః భో౪-౪౫చ౨౯ |
| 22 | ౬ | ౧౭ | ద్వి॥బు౨౩-౨౨వి౪౦-౪౨ ఆయు౪౫-౨౨ కౌ౨౩-౨౨ శేషః౧-౩౮రా౨౧-౨త్యా౩-౪౩అహః౨౮-౫౮తిథిద్వయం భగినీహస్తభోజనం భో౪-౩౪ పాబాన్‌చ౧ [చతుర్థీతిథిః త్రిలోచనగౌరీవ్రతం నాగచతుర్థీభో౪-౨౩చ౨ |
| 23 | ౭ | ౧౮ | తృ॥గు౧౭-౨౧అనూ౩౬-౯సౌ౩౭-౩౦ గ౧౭-౧౮ రా౨౦-౩౬ త్యా౩-౪౪ అహః౨౮-౫౬ స్వా౧ రవిః౫౧-౨౬ |
| 24 | ౮ | ౧౯ | చ॥శు౧౧-౨౨జ్యే౩౨-౨౫శో౯-౪౭భ౧౧-౨౨త్యాజ్యాభావః అహః౨౮-౫౪ వృశ్చికాయనం ౦-౪౨భో౪-౧౨ |
| 25 | ౯ | ౨౦ | పం॥శ౫-౪౧మూ౨౮-౪౩అతి౨౨-౨౧ బా౫-౪౧ ది౨౪-౫౮ త్యా౩-౪౫ రా౨౨-౩౫ త్యా౩-౪౭ అహః౨౮-౫౨ వహ్నిపూజా భో౪-౦ చ౪ [వ్రతం ప్రదోషః అవమ భో౩-౪౮ చ౫ |
| 26 | ౧౦ | ౨౧ | ష॥ఆం-౯ఏస్వా౫౫-౧౮పూషా౨౫-౩౩సుక౧౫-౨౦తై౦-౯ రా౧౫-౫౫ త్యా౩-౫౦ అహః౨౮-౫౦ సావిత్రీ |
| 27 | ౧౧ | ౨౨ | అ॥సో౫౨-౩ఉషా౨౩-౭ధృ౮-౫౪భ౨౩-౫౫రా౪-౫త్యా౩-౫౪అహః౨౮-౪౮స్వా౨ రవిః౧౧-౨౩భో౩-౩౬చ౬ |
| 28 | ౧౨ | ౨౩ | న॥మం౪౯-౨౦శ్ర౨౧-౩౩శూ౩-౫౧గం౫౪-౫౧బా౨౦-౪౧రా౨-౫౦ కృతయుగాదిఃవిష్ణుత్రిరాత్రవ్రతంభో౩-౨౪ |
| 29 | ౧౩ | ౨౪ | ద॥బు౪౭-౪౪ధ౨౧-౩వృ౫౩-౫౫తై౧౮-౩౨రా౧౦-౩౩త్యా౪-౩అహః౨౮-౪౪భో౩-౧౨చ౮ |
| 30 | ౧౪ | ౨౫ | ఏ॥గు౪౭-౨౧శ౨౧-౪౩ధ్రు౫౦-౫౧వ౧౭-౩౨౮౯-౩౩త్యా౪-౮ అహః౨౮-౪౨ స్వాతి౩ రవిః౩౦-౫౮ సర్వేషాముద్ధానైకాదశీ తులసీపద్మవ్రతం భీష్మపంచకం భో౩-౧ చ౯ [మన్వాదిఃకేక్రాం భో౨-౫౦ చ౧౦ |
| 31 | ౧౫ | ౨౬ | ద్వా॥శు౪౮-౨౦ పూభా౨౩-౩౭ వ్యా౪౮-౪౭ బ౧౭-౫౦ రా౨౦-౧౩ త్యా౪-౧౩ అహః౨౮-౪౦ స్వాయంభువ |
| 1 | ౧౬ | ౨౭ | త్ర॥శ౫౦-౯ఉభా౨౬-౪౫హ౪౭-౪౧కౌ౧౯-౨౫రా౩౦-౧౮త్యా౪-౧౭అహః౨౮-౩౭శనిత్రయోదశీ భో౨-౪౧ |
| 2 | ౧౭ | ౨౮ | చతు॥ఆ౫౩-౫౩ రే౩౧-౩ వజ్రం౪౭-౩౧ గ౨౨-౧౧ శేషః౩-౧౧ పునస్త్యాజ్యాభావః అహః౨౮-౩౬స్వా౪ రవిః౫౦-౧౨ కుక్రాం రావే అనధ్యయన ౪ భో౨-౩౦ చ౧౨ |
| 3 | ౧౮ | ౨౯ | ○పూ॥సో౫౮-౧౫ అశ్వ౩౬-౨౩ సి౪౮-౪ భ౨౬-౪ ది౨౫-౩౦ త్యా౪-౨౧ అహః౨౮-౩౪ దక్షసావర్ణికమన్వాదిః సింధుస్నానం, వ్యాసపూజజ్వాలాతోరణం వృషోత్సర్గః వ్రీహ్యాగ్రయణం అన్వాధానం భో౨-౨౦ చ౧౩ |
| 4 | ౧౯ | ౩౦ | కృ-ప్ర॥మం౬౦-౧౦భ౪౨-౨౬వ్య౪౯-౯బా౩౦-౫౩ది౨-౪౮త్యా౪-౨౪అహః౨౮-౩౨ త్రిద్యుస్పృక్ భో౨-౯ |
| 5 | ౨౦ | ౧ | ప్ర॥బు౩-౩౨కృ౪౮-౫౭వరీ౫౦-౩౪కౌ౩-౩౨ది౧౫-౪౧త్యా౪-౨౬అహః౨౮-౩౦ కృత్తికాదీపోత్సవఃభో౧-౫౮ |
| 6 | ౨౧ | ౨ | ద్వి॥గు౮-౫౨రో౫౫-౩౩ప౫౨-౧గ౮-౫౨రా౪-౫౫త్యా౪-౨౬అహః౨౮-౨౮విశా౧రవిః౯-౦భో౧-౪౭ చ౧౬ |
| 7 | ౨౨ | ౩ | తృ॥శు౧౪-౪మృ౬౦-౧౦శి౫౩-౫భ౧౪-౪ ది౧౦-౫౭ త్యా౪-౨౪ అహః౨౮-౨౬ చతుర్థీతిథిః ప్రదోషః భో౧-౩౭ |
| 8 | ౨౩ | ౪ | చ॥శ౧౮-౪౦మృ౧-౩౦సి౫౩-౩౪బా౧౮-౪౦ది౨౪-౨౦త్యా౪-౨౧అహః౨౮-౨౪శూన్యతిథిఃభో౧-౨౬చ౧౮ |
| 9 | ౨౪ | ౫ | పం॥ఆ౨౨-౨౪ఆర్ద్రి౬-౪౪సా౫౩-౧౫తై౨౨-౨౪రా౧౦-౩౦త్యా౪-౧౭అహః౨౮-౨౨వి౨౪వి౨౭-౨౭భో౧-౧౬ |
| 10 | ౨౫ | ౬ | ష॥సో౨౫-౦పున౧౦-౫౭శుభం౫౧-౫౭వ౨౫-౦రా౩-౪౦త్యా౪-౧౨అహః౨౮-౩౦ ప్రదోషః భో౧-౫ చ౨౦ |
| 11 | ౨౬ | ౭ | స॥మం౨౬-౨౨పుష్య౧౪-౦శు౪౯-౪౩బ౨౬-౨౨రా౧౮-౪౦త్యా౪-౭ ప్రళయకల్పః భో౦-౫౪ [భో౦-౪౩చ౨౨ |
| 12 | ౨౭ | ౮ | అ॥బు౨౬-౨౬ఆశ్లే౧౫-౪౫ బ్ర౪౬-౨౬ కౌ౨౬-౨౬ రా౧౭-౪౮ త్యా౪ ౨ అహః౨౮-౧౬ విశా౩ రవిః౪౫-౩౭ |
| 13 | ౨౮ | ౯ | న॥గు౨౫-౧౬మ౧౬-౨౦ఐ౪౨-౯గ౨౫-౧౬రా౭-౫౫త్యా౩-౫౮ నవమీతిథిః అహః౨౮-౧౨ భో౦-౩౩ చ౨౩ |
| 14 | ౨౯ | ౧౦ | ద॥శు౨౨-౫౪పూఫ౧౫-౪౪వై౩౭-౦భ౨౨-౫౪రా౫-౩త్యా౩-౫౪అహః౨౮-౧౨ దశమీతిథిః రాక్రాంభో౦-౨౨ |
| 15 | ౩౦ | ౧౧ | ఏ॥శ౧౯-౩౦ఉఫ౧౪-౭వి౩౧-౪బా౧౯-౩౦రా౬-౫ త్యా౩-౫౦ తిథిద్వయం సర్వేషాం౧౧కువేభో౦-౧౨చ౨౫ |
| 16 | ౧ | ౧౨ | ద్వా॥ఆ౧౫-౧౩హ౧౧-౩౭ప్రీ౨౪-౨౮తై౧౫-౧౩రా౨-౨౫ త్యా౩-౪౭ అహః౨౮-౮ విశా౪ వృశ్చికే రవిః౩-౨౭ త్రయోదశీతిథిః ప్రవేశప॥హరిపదపుణ్యకాలః త్రేతాయుగాంతః ప్రదోషఃభో౦-౧చ౨౬[కేవే భో౫-౨౩చ౨౭ |
| 17 | ౨ | ౧౩ | త్ర॥సో౧౦-౧౬చి౮-౨౪ఆయు౧౭-౯వ౧౦-౧౬ది౨౧-౩౧త్యా౩-౪౫అహః౨౮-౬మాసశివరాత్రిః అనధ్యయన౩ |
| 18 | ౩ | ౧౪ | చతు॥మం౪-౪౫●ఏస్వా౫౪-౨౦స్వా౪-౩౮సౌ౯-౪౭శ౪-౪౫ది౧౭-౪౧త్యా౩-౪౪అహః ౨౮-౬సినీవాలీఅవమ. శవే. అన్వాధానం పిండత్రయజ్ఞః భో౫-౧౨ చ౨౮ |

| కుజచారః | ౧౪ఆ-ప్రాగుదయం బుధః | శుక్రచారః | ౧౪మం-పూషా౩శు |
|---|---|---|---|
| శు౩గు-రే౧వక్రీకు౩౧-౫౨ | బ౩శు-బుధవక్రత్యాగః | శు౨బు-జ్యే౨శు౧౫-౩౧ | ౩౯-౫౭ |
| బ౧౨ఆ-వక్రత్యాగః | ౭మం-స్వా౧బు బు | ౫శ-జ్యే౩శు౧౧-౫౫ | శనిచారః |
| బుధచారః | ౪౪-౨౭ | ౭మం-జ్యే౪శు౧౦-౯ | బ౩శు-కృ౨వక్రీశని |
| శు౧మం-స్వా౩వక్రీబు | ౧౦శు-స్వా౨బు బు | ౧౨శు-మూ౧శు౯-౯ | ౪౧-౫౧ |
| ౩౪-౩౧ | ౫౪-౪౧ | ౧౫సో-మూ౨శు౮-౨౦ | రాహుకేతుచారౌ |
| పశ్చాదస్తం బుధః | ౧౩సో-స్వా౩బు బు | బ౨గు-మూ౩శు౯-౧౩ | శు౧౫సో-పూఫ౪రాహుః |
| ౪శు-స్వా౨వక్రీబు౨౬-౨౫ | ౨౮-౪౨ | ౫ఆ-మూ౪శు౧౩-౪౭ | పూభా౨కేతుః౩౩-౧౪ |
| ౮సో-స్వా౧వబు౧౪-౨౩ | గురుచారః | ౮బు-పూషా౧శు౨౦-౧ | |
| ౧౦బు-చి౪వబు౪౨-౩౪ | బ౫-మృ౧వక్రీ గు౫౪-౫౦ | ౧౧శ-పూషా౨శు౩౦-౨౨ | |

| | | | |
|---|---|---|---|
| శు | | గు శ | |
| కే | శు౧౨-వృశ్చిరవి<br>శు౧౨-ధనుషి<br>శుక్రః | | |
| | | | రా |
| | శు | ర బు | |

శ్రీ వృష సం॥ర మార్గశిరమాసః శాలివాహనశకః ౧౮౬౩ కల్యాది ౫౦౪౨ పార్సీ ౧౩౫౧ హిజిరా 1941

నవంబరు నెల 1941 — డిశంబరు నెల 1941

| తేది | | | |
|---|---|---|---|
| 19 | ౪ | ౧౫ | శు-ప్ర॥బు౫౨-౫౪వి౦౬-౩౪అనూ౫౫-౪౯శో౨-౦అతి౫౨-౧౦కి౦-౨౬-౦౯-౫౨త్యా౩-౪౩అహః౨౮-౪౬అనూ రవిః౨౧-౦యోగః భో౫-౧ చ౨౯ [భో౪-౪౯చ౩౦ |
| 20 | ౫ | ౧౬ | ద్వి॥గు౪౭-౩జ్యే౫౨-౧౨సు౬౪౬-౧౫బా౧౮-౫౯ది౯-౨౫త్యా౩-౪౩అహః౨౮-౨ చంద్రోదయః ఉత్తరశృంగః |
| 21 | ౬ | ౧౭ | తృ॥శు౪౧-౨౭మూ౪౮-౨౪ధృ౩౮-౪౦తై౧౪-౧౫రా౧౬-౪౧త్యా౩-౪౫అ ః౨౮-౦భో౪-౩౮ రంజాన్ చ౧ |
| 22 | ౭ | ౧౮ | చ॥శ౩౬-౨౧పూషా౪౫-౪శూ౩౧-౨౭వ౮-౫౪ది౧౧-౪త్యా౩-౪౭అహః౨౭-౫౮అనూ౨౪వి౩౮-౧౩ ధనురయనం౪౭-౨౩కపర్ది గణపతివ్రతం ప్రదోషః భో౪-౨౭చ౨ [పంచమీభో౪-౧౬చ౩ |
| 23 | ౮ | ౧౯ | పం॥ఆ౩౧-౫౫ఉషా౪౨-౨౫గం౨౪-౪౬బ౪-౮ది౪-౧౧ త్యా౩-౪౯రా౨౪-౧౪ త్యా౩-౫౩అహః౨౭-౫౬నాగ |
| 24 | ౯ | ౨౦ | ష॥సో౨౮-౨౦శ్రవ౦-౪౧వృ౧౮-౪౫తై౨౮-౨౦రా౨౨-౪౧త్యా౩-౫౭అహః౨౭-౫౪ప్రదోషః శవే సుబ్రహ్మణ్యషష్ఠీచంపాషష్ఠిభో౪-౪చ౪ [౫౩-చ౫ |
| 25 | ౧౦ | ౨౧ | స॥మం౨౫-౪౫ధ౩౯-౫౬ధ్రు౧౩-౩౦వ౨౫-౪౫రా౩౦-౧౦త్యా౪-౧అహః౨౭-౫౨అనూ౩ రవిః౫౪-౫౭భో౩- |
| 26 | ౧౧ | ౨౨ | అ॥బు౨౪-౧౮శతర౦-౧౮వ్యా౯-౬బ౨౪-౧౮శేషః౨-౩రా౨౮-౫౪త్యా౪-౬అహః౨౭-౫౦అనధ్యాయః భో౩-౪౨ |
| 27 | ౧౨ | ౨౩ | న॥గు౨౪-౬పూభా౪౧-౫౫హ౫-౩౯కౌ౨౪-౬శేషః౦-౫౦ అహః౨౭-౫౦ ఉదయకల్పః క్షేత్రాం భో౩-౩౦చ౭ |
| 28 | ౧౩ | ౨౪ | ద॥శు౨౯-౩౪ఉభా౪౪-౪౬వజ్ర౩-౩౧గ౨౫-౩౪ది౭-౪త్యా౪-౧౧అహః౨౭-౫౦భో౩-౧౯చ౪ |
| 29 | ౧౪ | ౨౫ | ఏ॥శ౨౭-౩౩రే౪౮-౪౮సి౧-౪౫భ౨౭-౩౩ది౬-౪౭త్యా౪-౧౬అహః౨౭-౫౦అనూ౪౪వి ౧౧-౫౭సర్వేషాం౧౧ శుక్రాంభో౩-౮౯ [౫౭చ౧౦ |
| 30 | ౧౫ | ౨౬ | ద్వా॥ఆ౩౧-౬అశ్వ౫౩-౫౬వ్య౧-౧౨బా౩౧-౬రా౧౫-౧౭త్యా౪-౨౧అహః౨౭-౫౦ఉభయప్రదోష రావేభో౨. |
| 1 | ౧౬ | ౨౭ | త్ర॥సో౩౫-౩౭భ౫౯-౫౫వరి౧-౨౯కౌ౩-౨౧ది౨౦- ౨౦త్యా౪-౨౪ఆహః ౨౭-౪౮హనుమద్వ్రతం సోమప్రదోషః రవేభో౨-౪౯చ౧౧ [౩శక్రాంభో౨-౩౪చ౧౨ |
| 2 | ౧౭ | ౨౮ | చతు॥మం౪౦-౪౮కృ౬౦-౧౦ప౨-౨౩గ౮-౧౨రా౫-౨౭త్యా౪-౨౬అహ ౨౭ ౪౮జ్యే౧౪వి౨౮-౩౦ అనధ్యయన |
| 3 | ౧౮ | ౨౯ | ○పూ॥బు౪౬-౧౬కృ౬-౩౧౭౩-౩౯భ౧౩-౩౨రా౨౩-౬త్యా౪-౨౬అహః౨౭-౪౬విష్ణుపూర్ణిమ భో౨-౨౩చ౧౩ |
| 4 | ౧౯ | ౧ | కృ-ప్ర॥గు౫౧-౩౩రో౧౦-౨౩సి౫-౦బా౧౮-౫౫రా౦-౪౩త్యా౪-౨౫అహః౨౭-౪౪యోగః భో౨-౧౨చ౧౪ |
| 5 | ౨౦ | ౨ | ద్వి॥శు౫౬-౧౭మృ౧౯-౧౧సా౬-౪తై౨౩-౫౫రా౧౪-౨౧త్యా౪-౨౨అహః౨౭-౪౪ జ్యే౨౪వి౪౪-౪౬ భో౨-౧ |
| 6 | ౨౧ | ౩ | తృ॥శ౫౯-౩౫ఆర్ద్ర౨౪-౩౮శుభ౬-౩౯వ౨౭-౫౬రా౨౯-౪త్యా౪-౧౮అహః౨౭-౪౨భో౧-౫౦చ౧౬ [భో౧-౩౯ |
| 7 | ౨౨ | ౪ | చ॥ఆ౬౦-౧౦పున౨౮-౫౯శు౬-౨౩బ౩౧-౨౬౧-౫౮రా౨౨-౨౭ త్యా౪-౧౩అహః౨౭-౪౨ పితృశ్రాద్ధం ప్రదోషః |
| 8 | ౨౩ | ౫ | చ॥సో౨-౯పుష్య౩౨-౩౦బ్ర౫-౩౨బా౨-౯తాజ్యాభావః అహః౨౭-౪౨వేభో౧-౨౭చ౧౮ |
| 9 | ౨౪ | ౬ | పం॥మం౩-౪౯ఆశ్రే౩౪-౩౬ఐ౩-౩౪తై౩-౪౯ది౫-౩౭త్యా౪-౮అహః౨౭-౪౨జ్యే౩౪వి౦-౫౪భో౧-౧౬ చ౧౯ |
| 10 | ౨౫ | ౭ | ష॥బు౩-౫౦మ౩౫-౨౭వైం-౩౬వి౫౬-౨౦వ౩-౫౦ది౫-౧త్యా౪-౩రా౨౭-౪౧త్యా౩-౫౯అహః౨౭-౪౦భో౧-౫ |
| 11 | ౨౬ | ౮ | స॥గు౨-౩౬పూఫ౩౫-౮ప్రీ౫౨-౦బ౨-౩౬రా౨౫-౨త్యా౩-౫౪అహః ౨౭-౪౧త్రిస్పృష్టకాః రాత్రా భో౦-౫౩ |
| 12 | ౨౭ | ౯ | అ॥శు౦-౧౬ఏష్యా౫౬-౫౦ఉఫ౩౩-౪౪ఆయు౪౬-౧౪కౌ౦-౧౬రా౨౬-౧౬త్యా౩-౫౧అహః౨౭-౫౩ జ్యే౪౪వి౧౬-౫౪రామకల్పః అవమ శువేభో౦-౪౨చ౨౨ |
| 13 | ౨౮ | ౧౦ | ద॥శ౫౨-౪౨హ౩౧-౨౩సౌ౩౯-౪౬వ౨౪-౫౪రా౨౨-౪౪త్యా౩-౪౮అహః౨౭-౩౬భో౦-౩౦చ౨౩ |
| 14 | ౨౯ | ౧౧ | ఏ॥ఆ౪౭-౩౮చి౨౮-౧౮శో౩౨-౪౫బ౨౦-౧౦రా౧౩-౫౧త్యా౩-౪౫అహః౨౭-౩౪ సర్వేషాం౧౧కే వేభో౦-౧౯ |
| 15 | ౧ | ౧౨ | ద్వా॥సో౪౨-౫స్వా౨౪-౩౮అతి౨౫-౧౬కౌ౧౪-౫౧రా౧౦-౭త్యా౩-౪౪అహః౨౭-౩౨మూ౧ ధను రవిః౩౩-౩౫ మధ్యాహ్న ష॥డశీతిపుణ్యకాలః ధనుర్మాసారంభః ఉభయప్రదోషః భో౦-౭చ౨౫ [౫-౧౦చ౨౬ |
| 16 | ౨ | ౧౩ | త్ర॥మం౩౬-౧౪విశా౨౦-౩౭సు౧౭-౩౦౯-౧౦రా౨-౨౧త్యా౩-౪౩ అహః ౨౭-౩౦ మాసశివరాత్రిః శవేభో |
| 17 | ౩ | ౧౪ | చతు॥బు౩౦-౧౭అనూ౧౬-౨౪ధృ౯-౩౫భ౩-౧౫రా౧-౫౨త్యా౩-౪౩అహః౨౭-౨౮వాజసనేయీ౩౦అనధ్యయన౩భో౪-౫౮చ౨౭ [దర్శతిథిః అన్వాధానం పిండపితృయజ్ఞః భో౪-౪౭చ౨౮ |
| 18 | ౪ | ౧౫ | (●)అమా॥గు౨౪-౨౮జ్యే౧౨-౧౬శూ౧-౪౨గం౫౨-౧౭నా౨౪-౨౮త్యాజ్యాభావ అహః౨౭-౩౦మూ౨౪వి౪౮-౧౫ |

[illegible] నెల ౧౩౫౧ సం॥ — బహామన్ నెల ౧౩౫౧ సం॥

| | | | | |
|---|---|---|---|---|
| కుజచారః | ౧౦శు-౪వృశ్చిబు౫౬-౬ | ౧౪బు-మూ౧ధబు౪౬-౯ | బ౨శు-ఉషా౪శు౩-౫౮ | |
| శు౧౦శు- రేవతిబుకు౩౧-౩ | ౧౨ఆ-అనూ౧బు౪౫-౩౦ | గురుచారః | ౫మం-శ్ర౧శు౨౮-౧౧ | శు / గు శ |
| బ౬బురే౩బుకు౪౫-౪౪ | ౧౪మం-అ౨బు౫౩-౨౫ | బ౧౨సో - రో౪ వక్రిగురుః | ౧౦శ-శ్ర౨శు౨౫-౧౩ | |
| బుధచారః | బ౨శు-అనూ౩బు౧-౧౭ | ౫౪-౫౦ | ౧౪బు-శ్ర౩శు౪౪-౫౬ | బ౧౨- ధను రవి |
| శు౧బు-స్వా౪బు౪౪-౩౬ | ౪ఆ-అనూ౪బు౯-౧౩ | శుక్రచారః | శనిచారః | కే / శు౧౦-వృ బుధ |
| ౪శ-విశాఖబు౨-౩౨ | ౫మం-జ్యే౧బు౧౬-౨౯ | శు౩శు-పూషా౪శు౨౨-౨౬ | బ౨శు-కృ౧మేషవక్రిశనిః | బ౧౪-ధను బుధ |
| ౬సో-విశా౨బు౧౪-౩౩ | ౭గు-జ్యే౨బు౨౪-౪౨ | ౭మం-ఉషా౧శు౧౫-౫౩ | ౨౨-౨౦ | శు౧౦-మకశుక్ర / రా |
| ప్రాగస్తమయం బుధః | ౧౦శ-జ్యే౩బు౩౧-౫౭ | ౧౦శు-ఉషా౨మశు౪౦-౭ | రాహుకేతుచారా న స్తః | బ౨-మేషవక్రిశనిః |
| శు౮మం-విశా౩బు౨౭-౫ | ౧౨సో-జ్యే౪బు౩౮-౩౫ | ౧౪మం-ఉషా౩శు౮-౪౪ | | శు / ర / బు |

| | | | | |
|---|---|---|---|---|
| 19 | ౫ | | ౧౬ | శు॥సు-ప్ర౧౯-౫౬మూ౯-౨౩వృ౪౬-౩౪బ౧౯-౫౬ది౪-౩౯త్యా౩-౪౫రా౩-౩౦త్యా౩-౪౬అహః౨౭-౩౨తిథిద్వయం యాగః చంద్రోదయః ఉత్తరశృంగఃభో౪-౩౭చ౨౯ [మవ్వాల్ చ౧ |
| 20 | ౬ | | ౧౭ | ద్వి॥శ౧౩-౫౬పూషా౪-౫౭ధ్రువ౩౯-౪౧కౌ౧౩-౫౬ది౨౪-౧ త్యా౩-౪౯అహః౨౭-౩౪ తృతీయాతిథిః భో౪-౨౬ |
| 21 | ౭ | | ౧౮ | తృ॥ఆ౯-౩౭ఉషా౨-౯ శ్రు౫౭-౪౯వ్యా౩౩-౨౪గ౯-౩౭ ది౧౧-౪౭ త్యా౩-౫౨ అహః౨౭-౩౬ ప్రదోషః శ్రీశవే భో౪-౧౫ చ౨ [౧౩-౦పక్షిణ్యానధ్యాయః భో౪-౫ చ౩ |
| 22 | ౮ | | ౧౯ | చ॥సో౬-౭ధ౫౮-౫౮హ౨౭-౫౦ భ౬-౭౭-౪౮త్యా౩-౫౬ అహః౨౭-౩౮ మూ౩రవిః౩-౫౨ మకరాయనం |
| 23 | ౯ | | ౨౦ | పం॥మం౩-౪౧శత౫౯-౧ వజ్ర౨౩-౫౦బా౩-౪౧ది౧౬-౫౯త్యా౪-౧ అహః౨౭-౪౦భో౩-౫౪ చ౪ |
| 24 | ౧౦ | | ౨౧ | ష॥బు౨-౨౪పూభా౬౦-౧౦సి౧౯-౨౫తై౨-౨౪ది౧౫-౨౫త్యా౪-౬అహః౨౭-౪౦ప్రదోషఃకేక్రాంభో౩-౪౩ |
| 25 | ౧౧ | | ౨౨ | స॥గు౨-౨౧పూభా౦-౪౧వ్య౧౬-౩౫వ౨-౨౧ది౨౫-౪౩త్యా౪-౧౦అహః౨౭-౪౦మూ౪రవిః౧౯-౧౯ ఉభయాన |
| 26 | ౧౨ | | ౨౩ | అ॥శు౩-౩౮ఉభా౩-౧౮వ౧౪-౪౪బ౩-౩౮రా౭-౩౯త్యా౪-౧౫అహః౨౭-౪౦భో౩-౨౨ [ధ్యాయఃభో౩-౩౩చ౬ |
| 27 | ౧౩ | | ౨౪ | ॥శ౬-౨౨రే౭-౮ప౧౩-౫౩కౌ౬-౨౨త్యాజ్యాభావఃఅహః౨౭-౪౦కుక్రాంభో౩-౧౧చ౮ [౩౪-౪౩రావేభో౩-౧ |
| 28 | ౧౪ | | ౨౫ | ద॥ఆ౯-౫౫అశ్వ౧౨-౪౭౧౩-౫౪గ౯-౫౫ది౧-౧౭త్యా౪-౨౦రా౧౦-౪౯త్యా౪-౨౩అహః౨౭-౪౦పూషా౧౪రవిః |
| 29 | ౧౫ | | ౨౬ | ఏ॥సో౧౪-౩౦భ౧౭-౫౧సి౧౪-౩౪భ౧౪-౩౦రా౨౩-౨౬త్యా౪-౨౫అహః౨౭-౪౦ద్వాదశీతిథిః సర్వేషాం వైకుంఠై కాదశీ రైవతమన్వాదిః శ్రీరంగక్షేత్రేద్వారదర్శనం శక్రాంభో౨-౫౦చ౧౦ [౨-౩౯చ౧౧ |
| 30 | ౧౬ | | ౨౭ | ద్వా॥మం౧౯-౪౩కృ౨౪-౧౧సా౧౫-౪౧ బా౧౯-౪౩ త్యాజ్యాభావః అహః౨౭-౪౦ శూన్యతిథిః ప్రదోషఃభో |
| 31 | ౧౭ | | ౨౮ | త్ర॥బు౨౫-౧౫రో౩౦-౪౭శుభం౧౭-౪తై౨౫-౧౫ది౮-౩౫త్యా౪-౨౬ రా౧౮-౩౭ త్యా౪-౨౫ అహః౨౭-౪౦ పూషా౨౪రవిః౫౦-౫త్రయోదశీతిథిఃభో౨-౨౯చ౧౨ [౨-౧౮చ౧౩హూణవత్సరాదిః |
| 1 | ౧౮ | | ౨౯ | చతు॥గు ౩౦-౩౪ మృ౩౭-౫శు౧౮-౯వ౩౦-౩౪ త్యాజ్యాభావఃఅహః౨౭-౪౯ హిమశోధన౧౫ అనధ్యయన౩భో |
| 2 | ౧౯ | | ౩౦ | ○పూ॥శు౩౫-౧౧ఆర్ద్రా౪౨-౪౭బ్ర౧౮-౫౭భ౨-౫౨ది౦-౫త్యా౪-౨౩అహః౨౭-౪౨అన్వాధానంభో౨-౭చ౧౪ |
| 3 | ౨౦ | | ౧ | కృ-ప్ర॥శ౩౮-౫౫పున౪౭-౩౬ఐ౧౯-౫బా౭-౩ది౧౫-౧౨త్యా౪-౧౯అహః౨౭-౪౨యోగఃభో౧-౫౬చ౧౫ |
| 4 | ౨౧ | | ౨ | ద్వి॥ఆ౪౧-౨౭పుష్య౫౧-౧౬వై౧౮-౨౪ తై౧౦-౧౧ది౮-౫౦ త్యా౪-౧౫ అహః౨౭-౪౪ పూషా౩రవిః౫-౨౭ |
| 5 | ౨౨ | | ౩ | తృ-సో౪౨-౪౨ఆశ్రే౫౩-౪౧వి౧౬-౪౫వ౧౨-౪౨౪-౩౩త్యా౪-౧౦అహః౨౭-౪౬భో౧-౩౪చ౧౭ [భో౧-౪౫ |
| 6 | ౨౩ | | ౪ | చ॥మం౪౨-౩౩మ౫౪-౫౧ప్రీ౧౪-౭బ౧౨-౪౦ది౨౪-౧౬త్యా౪-౫అహః౨౭-౪౬ ప్రదోషః భో౧-౨౩చ౧౮ |
| 7 | ౨౪ | | ౫ | పం॥బు౪౧-౨౧పూఫ౫౪-౫౦ఆయు౧౦-౩౨కౌ౧౨-౦ది౧౪-౫౧త్యా౪-౦ అహః౨౭-౪౬ పూషా౪రవిః౨౦-౫౧ కువేరాక్రాం భో౧-౧౩చ౧౯ |
| 8 | ౨౫ | | ౬ | ష॥గు౩౮-౫౧ఉఫ౫౩-౩౯సౌ౬-౦౫౧౦-౬ది౧౨-౨౯త్యా౩-౫౫అహః౨౭-౪౬ ఉభయప్రదోషః భో౧-౨చ౨౦ |
| 9 | ౨౬ | | ౭ | స॥శు౩౫-౨౦హ౫౧-౩౦శో౦-౧౦అతి౫౪-౩౭భ౭-౫ది౩-౫౪త్యా౩-౫౧అహః౨౭-౪౬భో౦-౫౧చ౨౧ |
| 10 | ౨౭ | | ౮ | అ॥శ౩౦-౫౭చిత్త౪-౩౨సుక౪౭-౪౩బా౩-౮ది౧౦-౩౦త్యా౩-౪౪అహః౨౭-౪౮ఉషా౧రవిః౩౬-౧౭ భో౦-౪౧ |
| 11 | ౨౮ | | ౯ | న॥ఆ౨౫-౫౫స్వా౪౪-౫౭ధృ౪౦-౨౧గ౨౫-౫౫ది౧-౪౨త్యా౩-౪౬రా౩౦-౧౫త్యా౩-౪౪అహః౨౭-౪౮నవమీతిథిఃభో౦-౩౦చ౨౩ [భో౦-౧౯చ౨౪ |
| 12 | ౨౯ | | ౧౦ | ద॥సో౨౦-౨౫వి౪౧-౦శూ౩౨-౪౧భ౨౦-౨౫శే౧-౪౫రా౨౨-౩౧ త్యా౩-౪౩ అహః౨౭-౪౮ తిథిద్వయం శవే |
| 13 | ౩౦ | | ౧౧ | ఏ॥మం౧౪-౩౫అనూ౩౬-౪౭గం౨౪-౪౭బా౧౪-౩౫రా౨౨-౧త్యా౩-౪౩అహః౨౭-౫౦ఉషా౨మకరేరవిః౫౧-౪౭సర్వేషాం౧౧ద్వాదశీతిథిఃపక్షిణ్యానధ్యాయఃభో౦-౮చ౨౫ |
| 14 | ౧ | | ౧౨ | ద్వా॥బు౮-౪౦జ్యే౩౨-౩౭వృ౧౬-౫౧తై౮-౪౦త్యాజ్యాభావఃఅహః౨౭-౫౦ఉదయాది౧౧-౪౭ ప॥ఉత్తరాయణపుణ్యకాలః కూష్మాండదానం ప్రదోషఃభో౪-౨౯చ౨౬ [అహః౨౭-౫౦ అవమ మాసశివరాత్రి భో౪-౨౦ |
| 15 | ౨ | | ౧౩ | త్ర॥గు౨-౫౪వీష్యా౫౪-౨౪మూ౨౮-౪౧ ధ్రు౯-౧౩వ౨-౫౪ ది౨౪-౫౭ త్యా౩-౪౪ రా౨౩-౨౬ యమతర్పణం |
| 16 | ౩ | | ౧౪ | ●అమా॥శు౫౨-౨౧ పూషా౨౫-౮వ్యా౧-౩౫హ౫౨-౫౨ చతు౨౪-౫౦రా౧౬-౧౯ త్యా౩-౪౮ అహః౨౭-౫౨ అన్వాధానం పిండపితృయజ్ఞః భో౪-౧౨చ౨౮ |

Side labels: డిసెంబరు నెల 1941; జనవరి నెల 1942; పుష్యము ౧౩౫౦ సం॥; మాఘమాసము; వృషనామ సం॥ ౧౩౫౧ మకరమాసము

| | | | |
|---|---|---|---|
| కుజచారః | ౬బు-మూ౪బు౫-౨౨ | ౭శు-ఉషా౪బు౨౮-౩ | శు౪సో-శ్ర౪శు౨౮-౨౨ |
| శు౨౭-రే౪కుజః౪-౩౨ | ౮శు పూషా౧బు౯-౪౩ | ౯ఆ-శ్ర౧బు౩౦-౭ | ౯శ-ధ౧శు౫౮-౩౯ |
| ౧౦ఆ-అశ్వి౧మేషకు | ౧౦ఆ-పూషా౨బు౧౪-౩౭ | ౧౧మం-శ్ర౨బు౨౯-౩౩ | బ౩సో-ధ౨శు౩-౪౭ |
| ౧౦-౩౦ | ౧౨మం-పూషా౩బు | పశ్చాదుదయంబుధః | ౧౧మం-శుక్రవక్రారంభః |
| బ౨ఆ-అశ్వి౨కు౩౪-౩౩ | ౧౭-౫౬ | ౧౩గు-శ్ర౩బు౩౮-౭ | శనిచారో నాస్తి |
| ౯ఆ-అశ్వి౩కు౩౧-౩౭ | ౧౪గు-పూషా౪బు౨౧-౪౮ | గురుచారః | రాహుకేతుచారా |
| బుధచారః | బ౧శ-ఉషా౧బు౨౪-౨౧ | శు౧౨మం-రో౩వక్రీగురుః | బ౩సో-పూఫ౩రాహుః |
| శు౧శు-మూ౨బు౫౩-౧౭ | ౩సో-ఉషా౨మబు౨౬-౧ | ౩౩-౫౦ | పూభా౧కేతుః౨౭-౧౨ |
| ౩ఆ-మూ౩బు౫౮-౫౬ | ౫బు-ఉషా౩బు౨౭-౧౩ | శుక్రచారః | |

| | | | |
|---|---|---|---|
| కు | శ | గు | |
| కే | బ౧౧-మకరవిః<br>శు౧౦-మేషేకు<br>బ౩-మకరేబుధః | | |
| శు | | | రా |
| ర బు | | | |

శ్రీ వృషసం॥ర మాఘమాసః శాలివాహనశకః ౧౮౬౩ కల్యాది ౫౦౪౨ ఫార్సీ ౧౩౫౧ హూణ 1942

| | | | | |
|---|---|---|---|---|
| 17 | ४ | ౧౫ | | శు-ప్ర॥శరర-౭౬ షా౨౨-౧౨పర౭-౫౭కిం౨౦-౧రరా౩-౫౯త్యా౩-౫౧అహః౨౭-౫౨౬షా౩రవిః౭-౨౮ మాఘస్నానారంభః యాగః భోర-౧చ౨౯ [భో౩-౫౭చ౩౦ |
| 18 | | ౫ | ౧౬ | ద్వి॥౪౪౪-౪౩శ౨౦-౨౭౪౨-౭ బా౧౬-౨౫రా౧-౫౯త్యా౩-౫౫అహః౨౭-౫౭చంద్రోదయః ఉత్తరశృంగః శవే |
| 19 | | ౬ | ౧౭ | తృ॥సో౪౨-౨౭ధ౧౮-౪౯వ౩౭-౭తై౧౩-౩౨రా౮-౫౩త్యా౩-౫౯అహః౨౭-౫౪భో౩-౪౭జిలకాజ్ చ౧ |
| 20 | | ౭ | ౧౮ | చ॥మం౪౧-౧౦శ౧౪-౩౯వ౩౩-౧౨వ౧౧-౪౬రా౭-౪త్యా౪-౪అహః౨౭-౫౪ ఉషా౪రవిః౩-౧౧ కుంభాయనం ౩౨-౨౭కుందచతుర్థీ ప్రదోషః భో౩-౩౩చ౨ [భో౩-౨౩చ౩ |
| 21 | | ౮ | ౧౯ | పం॥బుర౧-౧౪పూభా౧౯-౪౬పర-౫౬బ౧౧-౧౨రా౧౬-౪౬ త్యా౪-౯అహః ౨౭-౫౬ శ్రీ పంచమీ శ్రీకాం |
| 22 | | ౯ | ౨౦ | ష॥గుర౨-౩౭ఉభా౨౨-౩౭౨౭-౪౬కౌ౧౧-౫౬రా౨౫-౪౪త్యా౪-౧౪అహః౨౭-౫౮భో౩-౧౪చ౪ |
| 23 | | ౧౦ | ౨౧ | స॥గుర౫-౧౬రే౨౫-౩౭సి౨౬-౩౮గ౧౩-౫౬త్యాజ్యాభావః అహః౨౮-౦ శరవిః౩౯-౯ వైవస్వతమన్వాదిః ప్రదోషః రథసప్తమీ సోపపదం సూర్యచంద్రవ్రతం శ్రీ ఆకిరిపల్లి శోభనాచలస్వామి రథోత్సవః భో౩-౫౮చ౫ |
| 24 | | ౧౧ | ౨౨ | ఆ॥శర౯-౨అశ్వ౩౦-౧౭సా౨౬-౨౩ధ౧౭-౯దిర౯-౩౧ రా౨౮-౩౨ కుక్రాం-రావే భీష్మాష్టమీ భో౨-౫౫చ౬ |
| 25 | | ౧౨ | ౨౩ | న॥౭౫౩-౪౦భ౩౫-౫౪శు౨౬-౫౨బా౨౧-౨౧శేం-౫౫పునస్త్యాజ్యాభావః అహః౨౮-౭భో౨-౪౬చ౭ [౨-౩౭చ౮ |
| 26 | | ౧౩ | ౨౪ | ద॥సో౫౯-౩కృర౨-౧౦శు౨౭-౫౪తై౨౬-౨౧దిర౯-౨త్యా౪-౨౫అహః౨౮-౪ శ౨రవిః ౫౫-౧౪౪వే-శ్రీకాం భో |
| 27 | | ౧౪ | ౨౫ | ఏ॥మం౬౦-౧౦రో౪౮-౪౬బ్ర౯-౧౫౨౩౧-౫౧ద౨౬-౩౪త్యా౪-౨౬ అహః౨౮-౬త్రిద్యుస్పృక్ భో౨-౨౭చ౯ |
| 28 | | ౧౫ | ౨౬ | ఏ॥బుర-౩౯మృ౫౫-౧౭ఐ౩౦-౩౫భర-౩౯దిర-౧౭త్యా౪-౨౬ అహః౨౮-౧౦ సర్వేషాం భీష్మ, భీమ, ఏకాదశీ శుక్రమౌఢ్యారంభః తిలపద్మవ్రతం భో౨-౧౭చ౧౦ [ప్రదోషః భో౨-౯చ౧౧ |
| 29 | | ౧౬ | ౨౭ | ద్వా॥గు౯-౫౧ఆర్ద్ర౬౦-౧౦వై౩౧-౩౬ బా-౫౧దిర-౧౭ త్యా౪-౨౩ అహః౨౮-౧౨సోపపదం భీష్మద్వాదశీ |
| 30 | | ౧౭ | ౨౮ | త్ర॥శు౧౪-౨౦ఆ౧-౪వి౩౨-౦తై౧౪-౨౦రా౫-౨౨త్యా౪-౨౦శ౩రవిః౧౧-౩౬ చతుర్దశీతిథి భో౨-౦ చ౧౨ |
| 31 | | ౧౮ | ౨౯ | చతు॥శ౧౭-౫౩పు౬-౩ప్రీ౩౧-౪౦వ౧౭-౫౩ది౨౭-౨౧త్యా౪-౧౬అహః౨౮-౧౬పూర్ణిమాతిథిః భో౧-౫౧చ౧౩ |
| 1 | | ౧౯ | ౩౦ | ◯ పూ॥ఆ౨౦-౧౬పుష్య౯-౫౭ ఆయు౩౦-౨౪బ౨౦-౧౬ రా౧౫-౭త్యా౪-౧౧అహః ౨౮-౧౮శూన్యతిథిః సింధుస్నానం తిలపాత్రకం బహ్వాదిదానాని శ్రీహంసద్వీప వేణుగోపాలస్వామినాంకల్యా॥ భో౧-౪౭చ౧౪ |
| 2 | | ౨౦ | ౧ | కృ-ప్ర॥సో౨౧-౨౩ఆశ్రే౧౨-౩౮ సౌ౨౮-౭కౌ౨౧-౨౩ రా౧౫-౩ప్రతిపత్తిథిః శ౪ రవిః౨౮-౧౦ భో౧-౩౩ |
| 3 | | ౨౧ | ౨ | ద్వి॥మం౨౧-౧౨మ౧౪-౪శో౨౪-౫౭గ౨౧-౧౧రా౫-౪౮త్యా౪-౧౪అః౨౮-౨౨ద్వితీయాతిథిః రవే-కువే భో౧-౨౪ |
| 4 | | ౨౨ | ౩ | తృ॥బు౯-౪౬పూఫ౧౪-౧౭అతి౨౦-౪౦ భ౯-౪౬రా౩-౩౯ తిథిద్వయం అహః ౨౮-౨౪భో౧-౧౫ [భో౧-౬ |
| 5 | | ౨౩ | ౪ | చ॥గు౧౭-౧౧ఉఫ౧౩-౨౪సుక౧౫-౩౩బా౧౭-౧౧రా౫-౯త్యా౩-౫౨అహః ౨౮-౨౬ధనిరవిః ౫౪-౪౪ |
| 6 | | ౨౪ | ౫ | పం॥శు౧౩-౩౬హ౧౧-౩౦ధృ౯-౪౧తై౩-౩౬రా౩-౭త్యా౩-౪౯అహః౨౮-౨౮భో౦-౫౭చ౧౯ |
| 7 | | ౨౫ | ౬ | ష॥శ౯-౧౧చి౮-౪౭శూ౩-౮గ౦౫౩-౨౪౯-౧౧ది౨౨-౦త్యా౩-౪౭అహః౨౮-౩౦ప్రదోషః కేవే భో౦-౪౮చ౨౦ |
| 8 | | ౨౬ | ౭ | స॥ఆ౪-౬స్వా౫౪-౩౨స్వా౫-౨౫వృ౪౮-౩౩ బ౪-౬దిర-౩౧త్యా౩-౪౫ అహః౨౮-౩౨అనధ్యాయః అవమ శుక్రమౌఢ్య సమాప్తిః త్రిస్పృక్ సీతాష్టమీ విశా రవే, శవే భో౦-౩౯చ౨౧ [కువే భో౦-౩౦చ౨౨ |
| 9 | | ౨౭ | ౮ | న॥సో౫౨-౪౩వి౧-౩౪అనూ౫౫-౫౬ధ్రువ౦-౪౫తై౨౫-౪౬దిం౦-౪౭త్యా౩-౪౪అహః౨౮-౩౪ ధని౨రవి౧-౫౦ |
| 10 | | ౨౮ | ౯ | ద॥మం౪౬-౪౧జ్యే౫౩-౧౫వ్యా౩౨-౫౨వ౯-౪౨ది౦౦-౩౧త్యా౩-౪౩అహః౨౮-౩౬భో౦-౨౧చ౨౩ |
| 11 | | ౨౯ | ౧౦ | ఏ॥బుర౦-౫౪మూ౪౯-౨౨హ౨౫-౪బ౧౩-౪౭రా౧౬-౫౨త్యా౩-౪౪అహః౨౮-౩౮సర్వేషాం౧౧భో౦-౧౨ |
| 12 | | ౧ | ౧౧ | ద్వా॥గు౩౫-౨౭పూషా౪౫-౩౩వజ్ర౧౭-౩౦కౌ౮-౧౦ది౧౧-౪౪త్యా౩-౪౫అహః౨౮-౪౦ధని౩కుంభేరవిః౯-౫ ఉదయాది౩-౫ ప్ర॥హరిపద పుణ్యకాలః కలియుగాంతః ఉభయప్రదోషః భో౦-౩చ౨౫ |
| 13 | | ౨ | ౧౨ | త్ర॥శు౩౦-౩౨ఉషా౪౨-౨౮సి౧౦-౨౦గ౩-౦ది౪-౩౧త్యా౩-౪౮రా౨౩-౨౫ త్యా౩-౫౧అహః౨౮-౪౨ సావిత్రీ కల్పః మహాశివరాత్రిః భో౪-౩చ౨౬ [నేయా౩౦అనధ్యయన౩శవే భో౩-౫౪చ౨౭ |
| 14 | | ౩ | ౧౩ | చతు॥శ౨౬-౨౦శ్ర౪౦-౭వ్య౩-౪౦వరి౫౩-౪౪శ౨౬-౨౦రా౨౧-౧౧త్యా౩-౫౪అహః ౨౮-౪౪సినీవాలి౩౦వాజస |
| 15 | | ४ | ౧౪ | ● అమా॥ఆ౨౩-౦ని౩౮-౪౧ప౫౨-౧౩నా౨౩-౦రా౨౭-౫౧ త్యా౩-౫౮అహః౨౮-౪౬ధని౪రవిః౩౬-౩౪దర్శ తిథిః ద్వాపరయుగాదిః అన్వాధానం పిండపితృయజ్ఞః భో౩-౪౬చ౨౮ |

జనవరినెల 1942 (17–31); ఫిబ్రవరినెల 1942 (1–15)

| | | | |
|---|---|---|---|
| కుజచారః | ౪మం-ధని౧బుం-౧౩ | ౧౦మం-ధని బు౨౮-౫౫ | బగసో-శ౩వశు౨౫-౪౩ |
| శు౨౬-అశ్వి౪శు౧౩-౦ | ౬గు-ధనిబు౩౬-౩౭ | ౧౨గు-శ౪వబు౩౦-౫ | ౬శ-శవశు౯-౧ |
| ౮శ-భ౧శు౩౨-౫౩ | ౮శధని౩కుం-బు౩౬-౨౨ | గురుచారః | ౭ఆ-ప్రాగుదితః |
| ౧౩శు-భ౨శు౪౯-౬ | శు౧౨గు-ధని౪బు౫౮-౪౯ | బ౪గు-గురువక్రత్యాగః | ౩౦ఆ-శవశు౧౨-౪౦ |
| బ౪గు-భ౩శు౫౫-౧౭ | బుధవక్రారంభః | శుక్రచారః | శనిచారః |
| ౧౧బు-భ౪శు౩-౨౨ | బగసో-ధని౩వబు౧౫-౫౮ | శు౪మం-ధనివక్రశు౫౩-౩ | శు౨౭ఆ-శనివక్రత్యాగః |
| బుధచారః | పశ్చాదస్తం బుధః | ౧౧మం-శ౪వశు౫౩-౩౮ | |
| శు౧శ-శ౪బు౪౩-౨౩ | ౫శ-ధని౨వక్రబు౫౨-౨ | ౧౧బు-పశ్చాదస్తం శుక్రః | |

| | | | |
|---|---|---|---|
| | కు శ | గు | |
| కే | బ౧౨-కుం రవిః<br>శు౮-కుం బుధః | | |
| ర బు<br>శు | బ౫-వక్రీ మకరే బుధః | | రా |
| | | | |

శ్రీ వృష సం॥ర ఫాల్గునమాసః శాలివాహనశకః ౧౮౬౩ కల్యాది ౫౦౪౨ పార్సీ ౧౩౧౧ హయాణ 1942

ఫిబ్రవరి నెల 1942

| | | | |
|---|---|---|---|
| 16 | ౫ | ౧౫ | శు-ప్ర॥ సో౨౦-౪౩ శత౩౮-౧౯శి౪౭-౫౧ బ౨౦-౪౩ శే౦-౩౩ రా౨౫-౪౪త్యా౪-౩ అహః౨౮-౪౮ తిథిద్వయం |
| | | | చంద్రోదయః సమశృంగః యోగః భో౩-౩౮చ౨౯ [౩-౨౯జిలహేత్ చ౧ |
| 17 | ౬ | ౧౬ | ద్వి॥మం౧౯-౩౬పూభా౩౯-౨ సి౪౪-౨౫కౌ౧౯-౩౪ త్యాజ్యాభావః అహః౨౮-౫౦ తృతీయాతిథిః కేక్రాం భో |
| 18 | ౭ | ౧౭ | తృ॥బు౧౯-౪౪ఉభా౪౧-౫సా౪౨-౩౪౧౯-౪౩ది౩-౫౧ త్యా౪-౮ అహః౨౮-౫౨ శత౧రవిః ౫౪-౨౮క్షూన్యతిథిః |
| | | | ప్రదోషః భో౩-౨౧చ౨ [భో౩-౧౩చ౩ |
| 19 | ౮ | ౧౮ | చ॥గు౨౧-౮శే౪౪-౨౪శుభం౪౦-౩౮భ౨౧-౮ది౧౨-౪౫త్యా౪-౧౩చతుర్థీతిథిః మీనాయనగోరవిః౩-౪౬ |
| 20 | ౯ | ౧౯ | పం॥శు౨౩-౪౮అశ్వ౪౮-౪౫శు౪౦-౧౧బా౨౩-౪౮రా౯-౮త్యా౪-౧౭అః౨౮-౫౮ పంచమీతిథిః రా-వే భో౩-౪ |
| 21 | ౧౦ | ౨౦ | ష॥శ౨౭-౩౭భ౫౪-౧౨బ్ర౪౦-౩౨తై౨౭-౩౭ది౧౪-౫౬త్యా౪-౨౧అహః౨౯-౦ఉభయప్రదోషః భో౨-౫౬చ౫ |
| 22 | ౧౧ | ౨౧ | స॥ఆ౩౨-౧౮కృ౬౦-౧౦ఐ౪౧-౩౦వ౩౨-౧౮ది౨౭-౯౨త్యా౪-౨౫అహః౨౯-౨శత౨రవిః౧౨-౩౫శుక్రాంశక్రాం |
| | | | భో౨-౪౮చ౬ |
| 23 | ౧౨ | ౨౨ | అ॥సో౩౭-౩ కృ౦-౩౨వై౪౨-౫౧భ౪-౫౫రా౧౫-౫౪త్యా౪-౨౬అహః౨౯-౪అనధ్యాయః భో౨-౩౯చ౭ |
| 24 | ౧౩ | ౨౩ | న॥మం౪౨-౫౭రో౭-౫౧వి౪౪-౧౮బా౧౦-౧౫ది౨౨-౩౬త్యా౪-౨౬అహః౨౯-౬భో౨-౩౦చ౮ |
| 25 | ౧౪ | ౨౪ | ద॥బు౪౮-౫మృ౧౩-౩౪ప్రీ౪౫-౩౨తై౧౫-౩౧రా౭-౩౬త్యా౪-౨౪అహః౨౯-౮శత౩రవిః౩౧-౩భో౨-౨౩చ౯ |
| 26 | ౧౫ | ౨౫ | ఏ॥గు౫౨-౨౯ఆర్ద్ర౧౯-౩౩ఆయు౪౬-౧౩వ౨౦-౧౭రా౨౨-౩౪ సర్వేషాం గురువారైకాదశీభో౨-౧౪చ౧౦ |
| 27 | ౧౬ | ౨౬ | ద్వా॥శు౫౬-౩పున౨౪-౪౭సౌ౪౬-౧౩బ౨౪-౧౬రా౧౭-౨త్యా౪-౧౭అహః౨౯-౧౨భో౨-౬చ౧౧ |
| 28 | ౧౭ | ౨౭ | త్ర॥ ౫౮-౨౦పుష్య౨౮-౫౮శో౪౫-౨౦కౌ౨౭-౧౨త్యాజ్యాభావః అహః౨౯-౧౪శత౪౪రవిః౪౯-౫౩శనిత్రయోదశీ |
| | | | కామదహనం దారుబ్రహ్మోత్సవః ప్రదోషః భో౧-౫౮చ౧౨ |
| 1 | ౧౮ | ౨౮ | చతు॥అ౫౯-౪౭ఆశ్లే౩౧-౫౯అతి౪౩-౨౭౪౯-౩ది౨-౩౪త్యా౪-౧౨అహః౨౯-౧౬అనధ్యయనః ౩ భో౧-౪౯ |
| 2 | ౧౯ | ౨౯ | ○పూ॥సో౫౯-౧౦మ౩౩-౪౩సు౪౦-౨౭భ౨౯-౨౮ ది౨-౫౧ త్యా౪-౭ రా౨౪-౩౮ త్యా౪-౨ అహః౨౯-౧౮ |
| | | | బ్రహ్మసావర్ణికమన్వాదిః వసంతపూజ హోళికఅన్వాధానం భో౧-౪౧చ౧౪ |
| 3 | ౨౦ | ౩౦ | కృ-ప్ర॥మం౫౭-౨౭పూఫ౩౪-౧౩ధృ౩౬-౪౧బా౨౮-౧౮రా౨౨-౪౩ త్యా౩-౫౭అహః౨౮-౨౨ వర్షాంత వసం |
| | | | తోత్సవః రాక్రాంయోగః భో౧-౩౩చ౧౫ [రామ్మస్య౨భో౧-౨౫చ౧౬ |
| 4 | ౨౧ | ౩౧ | ద్వి॥బు౫౪-౪౨ఉఫ౩౩-౩౫శూ౩౧-౫౩ తై౨౬-౫౮రా౨౪-౩౯త్యా౩-౫౩అహః౨౯-౨౪పూభా౧రవిః ౯-౮చాతు |

మార్చి నెల 1942

| | | | |
|---|---|---|---|
| 5 | ౨౨ | ౧ | తృ॥గు౫౦-౫౮హ౩౧-౫౪గం౨౬-౧౬వ౨౨-౫౦రా౨౧-౩౯బార్హస్పత్యమానాబ్దాదిః బ్రహ్మకల్పః భో౧-౧౭ |
| 6 | ౨౩ | ౨ | చ॥శు౪౬-౧౮చి౨౯-౨౧వృ౧౯-౫౭బ౧౮-౩౮రా౧౩-౯త్యా౩-౪౭అహః౨౯-౨౮ప్రదోషః రవేకేవే భో౧-౯ |
| 7 | ౨౪ | ౩ | పం॥శ౪౧-౭స్వా౨౬-౫ధ్రు౧౩-౩౩కౌ౧౩-౪౨రా౯-౪౩త్యా౩-౪౫అహః౨౯-౩౨పూభా౨రవిః ౨౮-౨౮భో౧-౧ |
| 8 | ౨౫ | ౪ | ష॥ఆ౩౫-౨౫వి౨౨-౨౦వ్యా౫-౪౩ హ౫౨-౨౪ గ౮-౧౬ రా౨-౬ త్యా౩-౪౪ అహః౨౯-౩౬శవే-శవేభో౦-౫౩ |
| 9 | ౨౬ | ౫ | స॥సో౨౯-౨౯ అనూ౧౮-౧౬వ౫౦-౧౬భ౨-౨౭రా౧-౪౩త్యా౩-౪౩అహః౨౯-౩౮సప్తమీతిథిః భో౦-౪౫చ౨౧ |
| 10 | ౨౭ | ౬ | అ॥మం౨౩-౩౦జ్యే౧౪-౬సి౪౨-౨౫కౌ౨౩-౩౦త్యాజ్యాభావః అహః౨౮-౪౦ పూభా౩రవిః౪౮-౩౩ తిథిద్వయం |
| | | | తిస్రస్పృక్ అబ్దసంధిః అనధ్యాయః భో౦-౩౭చ౨౨ [తిథిః భో౦-౨౮చ౨౩ |
| 11 | ౨౮ | ౭ | న॥బు౧౭-౪౨మూ౧౦-౩వ్య౩౫-౪౪గ ౧౭-౪౨ది౬-౯త్యా౩-౪౪ రా౨-౫౩త్యా౩-౪౫అహః౨౯-౪౪ దశమీ |
| 12 | ౨౯ | ౮ | ద॥గు౧౨-౧౨పూషా౬-౧౮వరీ౨౭-౩౬భ౧౨-౧౨ది౨౫-౧౩త్యా౩-౪౭అహః౨౯-౪౬భో౦-౧౯చ౨౪ |
| 13 | ౩౦ | ౯ | ఏ॥శు౭-౧౬ఉషా౩-౪ప౨౦-౪౭ బా౭-౧౬ది౧౨-౩౯త్యా౩-౫౦అహః౨౯-౪౮సర్వేషాం౧౧శ శవే భో౦-౧౦ |
| 14 | ౧ | ౧౦ | ద్వా॥శ౩-౭ఏష్యా౫౬-౨౪శ్ర౦-౩౩ధని౫౮-౬శి౧౪-౩౫తై౩-౭ది౧౦-౧౪త్యా౩-౫౩అహః౨౯-౫౦అవమపూభా |
| | | | ౪మీనే రవిః౮-౫౦ప్రవేశః ప్రభృతి౧౬పా॥ షడశీతిపుణ్యకాలః శనిత్రయోదశీ ప్రదోషః భో౧-౨చ౨౬ [భో౩-౫౫ |
| 15 | ౨ | ౧౧ | చతు॥ఆ౫౭-౧౨శత౫౭-౫౯౯-౧౦భ౨౮-౨౧ది౧౬-౨౮త్యా౩-౫౭ అహః౨౯-౫౨మాసశివరాత్రిః అనధ్యయన ౩ |
| 16 | ౩ | ౧౨ | ●అమా॥సో౫౬-౪పూభా౫౮-౨౮సా౪-౩౩చతు౨౬-౩౮ది౧౪-౭ త్యా౪-౨అహః౨౯-౫౪ కేక్రాంఅన్వాధానం |
| | | | పిండపితృయజ్ఞః భో౩-౪౮చ౨౮ [అహః౨౯-౫౮ఉభా౧రవిః౨౯-౩౬యోగః భో౩-౩౯చ౨౯ |
| 17 | ౪ | ౧౩ | మం॥ శ్రీ చిత్రభాను సం॥ చైత్ర శు-ప్ర॥౫౬-౯ఉభా౬౦-౯శుభం౦-౫౪శుక్లం౫౭-౦కిం౨౬-౬ది౨౩-౧౬త్యా౪-౭ |

| | | | |
|---|---|---|---|
| కుజచారః | ౨మం-శ౩వబు౪౫-౯ | ౩౦సో-శ౧బు౮-౩౪ | శనిచారః |
| కు౨మం-కృ౧కు౪౫-౧౭ | ౫శు-బుధవక్రత్యాగః [౪౧ | గురుచారః | బ౩గు-కృ౨వృబుశ౬-౫౨ |
| ౮సో-కృ౨వృకు౩౩-౫౩ | కు౧౨శు-శ౪ బుబు౫౭- | బ౯బు-రో౪బుగు౧౪-౫౨ | రాహుకేతుచారౌ నస్తః |
| ౧౪ఆకృ౩కు౧౯-౫౬ | బ౨బు-ధ౧బుబు౪౧-౩౮ | శుక్రచారః | |
| బ౫౭-కృ౪కుం-౨౦ | ౬ఆ-ధ౨బుబు౨౮-౪౯ | కు౮సో-శుక్రవక్రత్యాగః | |
| ౧౦గు-రో౧కు౪౧-౪౦ | ౯బు-ధ౩కుంబుబు | బ౧మం-శ౨బుకు౨-౫౨ | |
| బుధచారః | ౨౬-౩౪ | ౯బు-శ౩బుకు౮-౩౪ | |
| కు౧సో-ప్రాగుదయంబుధః | ౧౨శ-ధ౪బుబు౧౬-౨౬ | ౧౪ఆ-శ౪బుకు౩౮-౩౮ | |

| | | |
|---|---|---|
| | శ కు | గు |
| ర కే | కు౮-వృషే కుజ<br>బ౧౨-మీనే రవి | |
| బు శు | బ౯కుంభే బుధః<br>బ౩-వృషే శనిః | రా |

## రాణీ మార్కు



స్థాపితము 1878.



పేరొందిన

**రాణీమార్కు పెంకులను**

ఉపయోగించి మీ గృహమునకు ఎల్లప్పుడును రాణివాసపు శోభను కల్పింపుడు.



**ది కాలికట్ టైల్సు కంపెనీ**

ఫెరోక్, మలబారు.

---

## మా కంపెనీ ఏజెంటుగ జేరుచో

మీకు

**స్థిరమును శ్రేయోదాయకమును**

అగు పదవి చేకూరగలదు.

**ది నాగపూర్ పయనీర్ ఇన్సురెన్సు కంపెనీ, లిమిటెడ్,**

హెడ్డాఫీసు :— **నాగపూరు, (సి. పి.)**

**పి. యస్. ఆర్. శర్మ,**

మద్రాసు రిప్రజంటేటివ్,

117, ఆర్మీనియన్ వీధి, జి. టి. మద్రాసు.

---

## కాశ్మీర్

దగ్గు, ఉబ్బసము, ఆయాసము, మొదలగు అన్ని శ్లేష్మ వ్యాధులకు, అన్నితత్వములకు ఏ కాలమందైననూ, ఏవిధమైన మార్పును పొందక, ప్రతి మోతాదు అద్భుతముగ పనిచేయు దివ్యౌషధము. సీసా 1-కి రు 1-4-0.

---

## చంద్ర

స్త్రీల ఋతుశూల, ఋతుబద్ధము, ఎఱుపు, తెలుపు కుసుమలు, రజోదోషములుపోగొట్టి, ఆరోగ్య జీవనము, సత్సంతానము ప్రసాదించును. సీసా 1-కి రు 2-0-0.

---

**క్షీరసముద్రం ఫార్మసీ,**

రాజమండ్రి.

---

## ఆంధ్రజ్యోతిషాలయము.

(1) జాతకచక్రముయొక్క నకలుగాని (2) జననతేదీ జనన కాలఘడియలు లేక ఘంటలు, తిథి, వారము, నక్షత్రము,జన్మస్థలము, యివిగాని (3) కొంచె మించుమించుగా ప్రస్తుతము జరుగుచున్న వయస్సున్నూ, హస్తరేఖలు బాగుగా కనబడునట్లు రెండు అరచేతులయొక్క ముద్రలను గాని ఈ మూడింటిలో నేవియో యొకటి మాకుపంపినయెడల:—

1. జాతకునిరూపము 2. స్వభావము 3. శరీరదారుఢ్యము 4. ధనసంపాదన 5 సోదరసోదరీవృద్ధి 6. మాతృసౌఖ్యము 7. విద్య 8. భూమి 9. వాహనము 10. సంతానము 11. శత్రువులు 12. రోగము 13 ఋణము 14.కళత్రము 15. కళత్రముయొక్క ఆయుర్దాయము 16. భార్యాభర్తల అన్యోన్యము 17. ద్వికళత్రయోగము 18. జాతకుని అయుర్దాయము 19. పితృసౌఖ్యము 20. భాగ్యము 21. ఉద్యోగము—జీవనము 22. లాభము 23. వ్యయము 24. వర్తమానఫలము. ఈ 24 సంగతులువ్రాసి రు 2-4-0 లకు వి. పి. గా పంపబడును. ఇవినచ్చినయెడల పూరాజాతకము మహాదశా అంతర్దశాఫలములతోను,పైనవ్రాసిన ఫలములు ప్రమాణశ్లోకములతోను, జీవితముయొక్క ఆఖరువరకూవ్రాయుటకు రు 6/- అగును. ఆపూరా జాతకము 1 బుక్కుమీద వ్రాసిపంపబడును. అందుకుముందుగా రు 2/- లు అడ్వాన్సు పంపినయెడల వెంటనే పూరాజాతకము తయారుచేసి తక్కిన రు 4/- లకు వి. పి. గా పంపెదము.

**ఆకెళ్ల వెంకటశాస్త్రి**, ఆంధ్రజ్యోతిషాలయం,

గోపాలపురం పోష్టు, (వయా) తణుకు, తూ॥ గో॥ జిల్లా.

# ప్రస్తావన

అనంతమగు కాలవృక్షమునం దొకపుష్పు రాలి పోయినది. క్రొత్త మొగ్గ తొడిగినది. నూతన సంవత్సరారంభముతో ప్రజల మానసములు చిగిరింప సాగినవి. కాని, ఈ సంవత్సరమునందు కూడా సంగ్రామారుణ మైయున్న ప్రపంచరంగమునందు శాంతిచ్ఛాయలు నెలకొను ననెడియాశ కన్పించుటలేదు. నూతన సంవత్సరముతో బాటు ప్రజలందరును తమ తమ జీవితములందు నూతనాధ్యాయము ప్రారంభము కావలెనని నూతనాశయములతోడను, నూతనాభిరుచులతోడను ఉవ్విళ్లూరుచున్నారు. జీవితములను సుఖవంతముగ చేసికొనవలె ననెడి యిచ్ఛా, సంకల్పములే ప్రజల జీవితములను శక్తిమంతములుగను, అభివృద్ధిప్రదములుగను చేయ తోడ్పడుచున్నవి. అట్టి యిచ్ఛాసంకల్పములును, కార్యపరత్వమును లేకుండినచో ప్రపంచము అభివృద్ధి యనునది లేక జడత్వమును దాల్చియుండెడిది. ఆధునిక నాగరక, విజ్ఞానములకు దూరులమై మనమెల్లరము ఆదిమవాసుల స్థితిలో నుండెడివారము. ఈప్సితార్థము కొరకే నేటి విజ్ఞానసాధనలు, ఆధునిక శాస్త్రపరికరములన్నియు ఏర్పడినవి. మానవుని మనోరథసిద్ధికై యేర్పడిన ఈ యాధునికశాస్త్ర విజ్ఞానమంతయును ప్రకృతిపై మానవుని విజయపతాకను ప్రతిష్ఠించుచున్నది. ఇదియే నేటి సభ్యతకు మూలాధారము. మానవు డీవిధముగ ప్రకృతిని వశపరచుకొనజాలినను, శాస్త్రీయ పరిశోధనల ద్వారా యంత్రములపై యంత్రములను నిర్మించి జీవితమును సుఖవంతముగ చేసికొనుటకు సుఖాధారములను హెచ్చించుకొనుటకు పలుపాట్లు పడుచున్నను, సుఖము హెచ్చినకొలదియు మానవుని కోరికలు కూడ పెచ్చుపెరుగుటయు, తత్ఫలితముగ జీవితమందు శాంతిగాని, సంతృప్తిగాని లేకపోవుటయు సంభవించుచున్నది. ఆధునిక విజ్ఞానశాస్త్రపరిశోధనాఫలితమగు నీయంత్రములు అపారమగు వస్తు సంపదల నుత్పత్తి చేయగలిగినప్పటికిని మానవుల పీడలను తొలగింప లేకున్నవి. యంత్రపరిశ్రమచే నుత్పత్తియైన యనల్పవస్తురాశి యొకమూలను పడి మూలుగుచున్నది. మరియొకమూల లక్షలు కోట్లకొలదిగ మానవులు క్షుత్పిపాసలకు లోనై అల్లాడుచున్నారు. జీవితమును సుఖకరముగ చేయుటకు తోడ్పడవలసిన యంత్రములు ఘోరసంగ్రామములకు కారణములై, ఆకసమునుండి అగ్నివర్షములు కురియజేయుచు, మానవుల మారణహోమమున కుపకరించుచున్నవి. వీనిని గాంచి ఆధునిక నాగరకత, ఆధునిక విజ్ఞానమంతయును మానవునకు మేలొనగూర్చుటకంటె కీడు చేయుటకే తోడ్పడుచున్నదను భావము కొందరలో నుదయించుచుండుట ఆశ్చర్యకరము కాదు. కాని, నేడీ ప్రపంచమున ప్రత్యక్షమగుచున్న దోషముల నన్నిటిని ఆధునిక విజ్ఞానమునకుగాని, శాస్త్రపరిశోధనకు గాని అంటగట్టుట సమంజసము కాదు. మానవుడెల్లప్పుడును జ్ఞాన, విజ్ఞానములను కాంక్షించుచునే యుండును. విజ్ఞాన మెన్నటికిని దోషభూయిష్ఠము కాదు. దానిని వినియోగించుకొనుటకే మనుజునకు విచక్షణజ్ఞాన మవసర మైయున్నది. సద్వినియోగమైనచో మానవవిజ్ఞానము సత్ఫలితముల నిచ్చును. దుర్వినియోగమైనచో అదియె సర్వానర్థములకును దారితీయును. ఆధునిక శాస్త్రపరిశోధనాఫలితముగను, పాశ్చాత్యప్రపంచమునందు ప్రబలియున్న పారిశ్రామికాభివృద్ధిచేతను తరుచుగా నీ సంగ్రామములు సంప్రాప్త మగుచున్న వనియు, దౌర్జన్యమునకును, హింసకును దారితీయుచున్న వనియు తలంచుట భ్రమ,

ప్రమాదజనితము. మానవుని మానసమున సత్యము, అహింసలవలెనే ఆదికాలమునుండియు అసూయా ద్వేషములుకూడ కాపురముండుచువచ్చినవి. ఆధునికులు నీటిపై నౌకాది జలాంతర్గాములతోను, భూమిపై ఫిరంగులతోను, ఆకసమున వాయువిమానములతోడను ఒకరి నొకరు హింసించుకొనుచుండ ఈ సాధనము లేవియు లేనినాడు ఆదిమవాసులు రాళ్లు రప్పలతోను, కట్టె, కర్రలతోను కొట్టుకొనుచుండెడివా రనుట కెట్టి సందియమును లేదు. పారిశ్రామికాభివృద్ధివలన నేర్పడు అధికోత్పత్తి యేవిధముగ వినిమయము కావలెనో దానిని నిర్ణయించుట లెస్స గాని పారిశ్రామికాభివృద్ధియే కూడ దనుట వాస్తవికదృష్టి గలవా రెవ్వరికి నచ్చదు.

యంత్రమూలక మగు పారిశ్రామికాభివృద్ధికిని, దౌర్జన్యమునకును అవినాభావసంబంధమునుకల్పించుచు, భారతప్రజానాయకుడయిన గాంధిమహాత్ముడు రాట్న చిహ్నితమైన గ్రామపునర్నిర్మాణ విధానమును, గృహ పరిశ్రమోద్ధరణను ప్రబోధించుచున్నాడు. సత్యము, అహింస అనెడి జంటసిద్ధాంతములయొక్క బాహ్య చిహ్నమే రాటమని గాంధిగారి మతము. మహాత్ముని యభిమతము ననుసరించి కాంగ్రెసు మహాసభ కూడా రాట్నచిహ్నితమైన ఆర్థిక పునరుద్ధరణనే భారత దేశమున కంతటికిని ప్రవర్తింపజేయవలె ననుచున్నది.

పారిశ్రామికాభివృద్ధికిని, దౌర్జన్యమునకును పరస్పర సంబంధ మెచ్చటను కన్పింపదు. పరిశ్రమలు స్వతస్సిద్ధముగ దోషసంకలితములు కావు. పాశ్చాత్య దేశములందు నేడు చెలరేగుచున్న దౌర్జన్య మంతయును ఆయా దేశములందలి సాంఘిక వ్యవస్థను బట్టియున్ని, ఆర్థికవిధానమును బట్టియున్ని ఏర్పడినదేగాని పారిశ్రామికాభ్యుదయమువలన కాదు. సోవియటు రషియా దేశమున పారిశ్రామికాభ్యుదయము దౌర్జన్యమునకు దారి తీసినదా? కావున భారతీయు లందరును గాంధిమహాత్మునివలె నిష్కామకర్మయోగు లైన నేతప్ప, సామాన్యమానవమాత్రులై ఇతర దేశముల ప్రజలతో బాటు సమస్త సుఖములను అనుభవింపవలె ననిన, భారత దేశము తక్కిన దేశములతో బాటును సర్వసంపదలతో తులతూగవలె నన్న మన దేశము కూడ పారిశ్రామిక విధానము ననుసరించుట తప్ప మార్గాంతరము లేదు.

పై విధముగ చర్చించినంతమాత్రమున గాంధి మహాత్ముని రాజకీయ నాయకత్వమునందు గాని, వారి ఆధ్యాత్మికశక్తిసంపన్నత్వమునందుగాని మాకు విశ్వాసము లేదని భావింపకుందురుగాక! శతాబ్దుల తరబడి పారతంత్ర్యమునందు మునిగిపోయి నిర్వీర్యమైన భారతజాతియందు స్వాతంత్ర్యభావమును, ఆత్మవిశ్వాసమును రగుల్కొల్పిన భారతనాయకులలో గాంధి మహాత్ము డగ్రగణ్యు డని మే మెన్నటికిని మరువజాలము. గత యిరువదేండ్లుగ భారతజాతి గాంధి మహాత్ముని యానతిని తలదాల్చి నడుచుకొనుచున్నది. భారతప్రజకు గాంధిమహాత్ముడు మకుటములేని మహీపతి యైయున్నాడు. గాంధిమాట వేదవాక్యమై పరగినది; పరగుచున్నది. ప్రాచీన భారతవర్షమందు విలసిల్లిన ఆధ్యాత్మికౌన్నత్యము గాంధిమహాత్మునియందు మూర్తీభవించుటంజేసి మహాత్ముని వాక్కు అమోఘముగ చలామణి యగుచున్నది. గాంధిమహాత్ముడు సూచించుమార్గము ముఖ్యముగ నిస్సహాయ స్థితియందున్న భారతీయులు రాజకీయ దాస్యబంధములను త్రెంపుకొనుటకు ఉత్తమ సాధనము కావచ్చును. గాని ఆర్థికసమస్యాపరిష్కారమున కీయుగమున అంతగా సరిపడదని మాసమ్మకము. గాంధిమహాత్ముడు మిశ్రమములేని, నూటికి నూరు పాళ్లు, సంపూర్ణ అహింసావాది. ఈసంపూర్ణ అహింసావాదమునందు మహాత్ముని యనుచరవర్గమునకే పూర్ణవిశ్వాసము లేదని పూనా తీర్మానమువలన ఈ వరకే స్పష్టమైనది. భారతవర్షము స్వపరిపాలనను సమకూర్చుకొనినపిమ్మట, కాంగ్రెసు ప్రభుత్వాధికార

మును వహించినయనంతర మైనను దేశమునందు శాంతి భద్రతలను నెలుకొల్పుటకుగాని, ఆత్మరక్షణకుగాని ఆయుధబలముపైనాధారపడకతప్పదు. ప్రపంచ మంతయు అస్త్ర సన్యాస మొనర్చిననే తప్ప భారత దేశము ననుసరింప జాలదు. కావున దేశకాలపాత్రముల ననుసరించీ, ప్రస్తుత దేశావసరములను గుర్తించీ, భారతసంపదభ్యుదయమునకు సాధనము లెన్నియున్నను వాని నన్నిటిని మన మవలంబించుట కాక్షేపణ యుండనక్కరలేదు.

అల్లకల్లోలముగ నున్న ప్రస్తుత ప్రపంచ పరిస్థితు లెటుల పరిణమించునో యని అన్ని దేశములును ఆతురత నందుచున్నవి. సంగ్రామజ్వాలలు ఐరోపా ఖండమునుమాత్రమే యాక్రమించి యంతటితో చల్లారునని తలంచుటకు అవకాశములు తొలగుచున్నవి. జపాను ఇటలీ జర్మనీలతో గావించుకొనిన యొడంబడిక వలన ఐరోపా సంగ్రామ మేక్షణమైనను ఇటు దూర ప్రాచ్యమువరకును, అటు అట్లాంటికును దాటి పశ్చిమార్ధగోళము నంతనుగూడ వ్యాపింప నుంకించుచున్నది. ప్రపంచ మంతయు నీవిధముగ నొక పెద్ద యగ్నిగుండముగ మారు సూచన లెల్లెడలను గన్పట్టుచున్నవి.

ఈ ప్రపంచసంగ్రామమున యెవరెవ రేపక్షము వహించిరో ఇప్పటికి స్పష్ట మగుచున్నది. ఒకవైపున జర్మనీ, ఇటలీ, జపానులు పూర్వార్ధగోళ దేశముల నన్నిటిని తమలో తాము పంచుకొనుటకు సంసిద్ధమై నిలిచియున్నవి. ప్రాచ్య దేశములు జపాను ఆధిపత్యమునందు అడగి మడగి యుండవలె ననియు, ఐరోపా ఆఫ్రికాలు జర్మను ఇటాలియను ఆధిపత్యమునం దుండవలె ననియు వా రిదివరకే నిర్ణయించుకొనిరి. వీరిలెక్కలో ఈ మూడు దేశములకు దప్ప, ఇతర దేశములకు స్వాతంత్ర్యమనునదిగాని, సమానప్రతిపత్తి గాని యుండరాదు. రెండవ వైపున, బ్రిటనును బ్రిటిషు సామ్రాజ్య దేశములును నిలిచియున్నవి. అమెరికా యునైటెడు స్టేట్సు స్వయముగ నిపుడు యుద్ధమున దిగకపోయినను, జర్మనీ ఇటలీ జపానుల నోడించుటకు బద్ధకంకణమై, బ్రిటను, చైనాలకు బాసటయై నిలిచి, సర్వవిధముల సహాయ మొనర్చుచున్నది. సోవియటురష్యా యేవైపునగాని బహిరంగముగ తన అభిమానమును ప్రకటింపక తటస్థముగనే యున్నను జర్మనీ కొనర్చుచున్న సహాయమును గమనింపకుండజాలము.

సంగ్రామానంతరము ప్రపంచపరిస్థితి పూర్తిగా మారిపోవు నని యుభయపక్షములవారును దెలుపుచున్నారు. నియంతలు విజయమందునెడల, ప్రపంచమున చిన్నజాతుల స్వాతంత్ర్య ప్రతిపత్తికి అవకాశ ముండదను విషయము నెల్లరు నూహించుకొనగలిగినదే. బ్రిటిషు మిత్రమండలి విజయమువలన చిన్న రాజ్యములకు రక్షణ లభించుననియు, మానవసంఘనిర్మాణము గూడ మారి, ధనికనిర్ధనవిచక్షణ లంతరించి సరిసమానత్వము నెలకొనుననియు బ్రిటిషునాయకులు దెలుపుచున్నారు. ఆంగ్లదేశమున ప్రజలకు సంబంధించినంత వర కిందు కొంత యథార్థముండిన నుండవచ్చును. కాని, భారత దేశమునకుగాని, ఇతరవలస దేశములకుగాని సంబంధించినంతవరకు, వాని ప్రతిపత్తియం దెక్కువమార్పులు జరుగుసూచనలు గనిపింపవు. అట్టిది జరుగబోవునెడల బ్రిటిషుప్రభుత్వమువారు తమ యుద్ధాశయములందు భారత దేశమునకు స్వాతంత్ర్యము నిచ్చుటయనునది ముఖ్యాంశముగ ప్రకటించి యుండుటయు, కాంగ్రెసువారి పూనాతీర్మానమును ఆమోదించుటయు జరిగియుండెడిది. మన దేశమున, రాజ్యాంగ ప్రతిష్టంభన మేర్పడి 18 నెల లగుచున్నది. ఇంతకాలమునుండియు 7 రాష్ట్రములయందును శాసనసభలను, మంత్రివర్గములను రద్దుచేసి, గవర్నరులు తమ తాబేదారుల సలహాతో పరిపాలనను సాగించుచున్నారు. కేంద్రప్రభుత్వము యథాపూర్వముగనే, నిరంకుశాధికారవర్గముచే నిర్వహింపబడుచున్నది. సంగ్రామానంతరము భారత దేశముయొక్క స్వాతంత్ర్యప్రతిపత్తి నంగీకరించెద మని బ్రిటిషుప్రభుత్వమువారు వాగ్దాన మొనర్ప నిరాకరిం

చిరి. దానికి బదులు, సంగ్రామానంతరము సాధ్యమైనంత త్వరలో రాజ్యాంగము సంస్కరింపబడు ననియు, అధినివేశప్రతిపత్తి యొసగబడు ననియు మాత్రము వాగ్దాన మొనర్చిరి. కేంద్రమున, ప్రస్తుతమున్న కార్యనిర్వాహకవర్గమునందు మరికొందరు ప్రజాప్రతినిధులు చేర్చుకొనబడుదురని రాజప్రతినిధి ప్రకటించెను గాని, భారతశాసనసభకు బాధ్యతవహించు కార్యనిర్వాహకవర్గమును నియమింపవలె నను కాంగ్రెసువారి కోరికను నిరాకరించిరి. భారతజాతీయ స్వాతంత్ర్య ప్రదానమునకు ముస్లింలీగు కాంగ్రెసు వివాదములను ప్రతిబంధకముగ తెలుపుచున్నారు. కేంద్రమున జాతీయ ప్రభుత్వము నేర్పరచిన యెడల యుద్ధ నిర్వహణ ప్రయత్నము ఇంకను ఉత్సాహముతో సాగింపబడు నని భారతజాతీయనాయకులు సూచించినను బ్రిటిషు ప్రభుత్వవైఖరియం దెట్టి మార్పును గలుగలేదు. ఇండో-బ్రిటిషు సహకారము శాశ్వతముగ నుండవలె ననుచుండిరే గాని బ్రిటిషునాయకులు భారతదేశ అంతస్సును, భారతదేశ జన్మస్వత్వమైన స్వాతంత్ర్యమును మాత్రము గుర్తించుటలేదు. అందుచే, దేశమునందు వ్యాపించియున్న రాజ్యాంగప్రతిష్టంభన ఇంతలో అంత మొందు సూచనలుగాని, సంగ్రామానంతరము బ్రిటిషుప్రభుత్వమువారు భారతదేశమునకు స్వపరిపాలనము నొసగెదరను ఆశకు అవకాశముగాని కనిపింపవు. ఇట్టి విషమ పరిస్థితియందుగూడ బ్రిటను భారతదేశముపై పట్టును సడలించు నుద్దేశమును వెల్లడింపకుండుటచే, బ్రిటనుతో సంబంధములు త్రెంచుకొని సంపూర్ణ స్వాతంత్ర్యముకొరకు కృషి సలుపవలెనను అభిప్రాయము ప్రజలందరిలోను నిదివరకుకంటె నెక్కుడుగా వ్యాపించుచున్నది.

భారతదేశమునకు స్వరాజ్య మెటులో, ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రమంత ముఖ్యమని వేరుగ చెప్పనక్కరలేదు. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమము ప్రారంభమై ఇరువదియేడు సంవత్సరములు దాటినను ఆంధ్రరాష్ట్రసిద్ధి నాటి కెంతదూరమున నున్నదో నేటికిని అట్లే యున్నది. ఈస్థితి ప్రజలలో నిస్పృహను, ఆంధ్రరాష్ట్ర మసలు సిద్ధించదేమో యను నిరాశనుగూడ కలుగజేయుచున్నది. కాని, పరిస్థితుల నన్నిటిని అవలోకించినచో ఈనిరాశ కెంతమాత్రము ఆధారము కన్పింపదు. భారతదేశమునకు స్వరాజ్యమువలెనే ఆంధ్రులకు స్వరాష్ట్రముకూడ నేడు గాకున్న రేపైనను వచ్చితీరు ననుట కెట్టి సందియమును లేదు.

కాని ఒకవైపున బ్రిటిషుప్రభుత్వము యుద్ధమున నిమగ్నమైయుండ మరియొకవైపున దేశములో కాంగ్రెసువారు మంత్రిపదవులను వదలి సత్యాగ్రహోద్యమమును సాగించుచున్న సమయమున, నిపుడు ఆంధ్రరాష్ట్రమునకై యాందోళనను సాగించుట ఉచితమా, యుక్తియుక్తమా యని యనుమానించుటలో విపరీతమేమియు లేదు. దీనికి తోడు రాయలసీమ జిల్లాలను, సర్కారుప్రాంతములను నైజామున కొసగవలె నను సూచనలుగూడ అటనట బయలుదేరుచున్నవి. పాకిస్థాన్ వాదులు భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణోద్యమమును తాము గోరు భారతదేశ విభజనోద్యమముతో పోల్చుకొనుచున్నారు. తాత్కాలికముగ ఇన్ని చిక్కులు మనల నెదుర్కొనుచున్ననుగూడ ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రాశయము నేమాత్రమును మరువరాదు. తదీయస్ఫూర్తికై చేయుప్రయత్నముల నెంతమాత్రము సడలింపరాదు. రాష్ట్రనిర్మాణ మేర్పడులోపుగ ప్రజలు తమంత దా మిపుడు చేసుకొనగల ప్రయత్నములనేకములు గలవు. రాష్ట్రనిర్మాణ మనగా ప్రత్యేకశాసనసభ, గవర్నరు ప్రభుత్వము యేర్పరచుకొనుటయే యని తలంపరాదు. అట్లెంచినయెడల, ఆంధ్రప్రజాభ్యుదయమునకు ఆంధ్ర విశ్వవిద్యాలయము యెంత సహాయపడినదో, ఆంధ్రరాష్ట్ర నిర్మాణముగూడ అంతియే తోడ్పడగలదు. ఆంధ్రాభ్యున్నతికి ప్రత్యేకరాష్ట్ర మొక సాధనముగాని అదియే పరమలక్ష్యము గాదు. ఇపుడు రాజకీయముగ ప్రత్యేక

రాష్ట్రమేర్పడుసూచన లేకపోయినను, ఆంధ్ర దేశమును ఆర్థికముగను అభివృద్ధిచెందునట్లు ప్రయత్నించవలయును. రాష్ట్రము వచ్చినతరువాత నీ ప్రయత్నములు ఎక్కువగ సఫలముగునను విషయమున నేమియు చేయజాలమని చెప్పుటకు వీలులేదు. హిందూదేశమున మిగిలిన ప్రాంతములతో పోల్చినయెడల ఆంధ్రప్రాంతము పరిశ్రమలలో చాల వెనుకబడియున్నది. ఇతరప్రాంతములనుండి వచ్చెడు వస్తుసామగ్రిని మనదేశమునందే తయారుచేసుకొనుట కెంతయో అవకాశమున్నది. కాని ఆవైపున కెవరును దృష్టిని మరల్చుటలేదు. మనది యని చెప్పుకొనుటకు ఆంధ్రుల కొకబట్టలమిల్లు లేదు. ఒక కాగితపుమిల్లు లేదు. ఒకఖనిజపరిశ్రమ లేదు. చివరకు సబ్బులపరిశ్రమకు గూడ మనము నోచుకొనలేదు. తెల్లవారి లేచినది మొదలు ప్రతివస్తువునకును మనమితరరాష్ట్రములపై నాధారపడవలసిన యవస్థలో నున్నాము. రాష్ట్రము సిద్ధించువరకీ స్థితి యిటులే యుండనక్కరలేదు. ఆంధ్రరాష్ట్రము వచ్చువరకు వేచియుండకొనుటకంటె, స్వప్రయత్నముచేత నీపరిశ్రమల నిప్పటినుండియు మనదేశమున నెలకొల్పుకొని పోషించుకొనుచుండు టవసరము.

ఆంధ్రోద్యమవ్యాప్తికొరకు అచ్చటచ్చట విద్యార్థిబృందములు, ఆంధ్రవారోత్సవములు జరుపుచుండుట శుభసూచకము. రాష్ట్రనిర్మాణము, రాష్ట్రాభ్యుదయము ముందుముందు ఈ విద్యార్థులమీదనే ఆధారపడి యున్నది. అందుచే, ఆంధ్రదేశమును గురించియు, ఆంధ్రవిజ్ఞాన, సంప్రదాయములనుగురించియు విద్యార్థులయందు ప్రబోధము జరుగవలసియున్నది. ఇపుడు తెలుగుజిల్లాలలో ఒక ప్రాంతమువారినిగురించి మరియొకప్రాంతమువారికి తెలియకున్నది. ఇట్టి పరిస్థితి మారవలెను. ఆంధ్రరాష్ట్రమును సుస్థిరమగు పునాదులపై నిర్మించుటకు నాయకులును, యువకులును ఇప్పటినుండియును గూడ సత్వరప్రయత్నము చేయవలసియున్నది.

మే మడుగుటయే తడవుగా మా కోరికను మన్నించి వ్యాసములు చిత్రములు పద్యములు పంపి ఈ సంచిక ప్రచురణకు తోడ్పడిన కళాభిజ్ఞు లందరికిని మా కృతజ్ఞతాభివందనముల నందజేయుచున్నాము. ఇకముందు కూడ యిప్పటివలెనే మాప్రయత్నములకు తోడ్పడెదరని ఆశించుచున్నాము. ఈ వృషసంవత్సరము విశ్వమానవకల్యాణప్రదమై భారతజాతీయాభీష్టసిద్ధి సంధాయకమై, ఆంధ్రరాష్ట్రనిర్మాణానుకూలమై మా పాఠకులకు, ఆంధ్రమహాజనులకు ఆనందప్రదమై విలసిల్లుగాక.





# 'వృష' ప్రశంస

శ్రీ వక్కలంక శ్రీనివాసరావు

స్వాగతం బోయి "వృష" నామ, స్వర్గధామ
ధాత్రిగతసోమ, పూతాత్మ, ధర్మధామ,
శాంతియుతరామ, విశ్వాసశక్తిభీమ
మనుజకల్యాణసౌధామ, మా, రమామ!

చైత్రవైశాఖ మాదిగఁ జెన్నమీఱు-మాసములఁ గూడి సంతస మతిశయింప
భారతావని శాంతిని బాదుకొల్ప-వేడ్క నరుదెంచు నీ "వృష"
వివిధగతుల పాడిపంటల భాగ్యాన బరపుత ప్రజ!!

అరువదివత్సరంబులకు నారయవచ్చితె యో వృషాబ్దమా,
కరుణను ధాత్రి శాంతి నెఱిఁగప్పఁగ దీవనలిచ్చు వాగ్ధ్వని౯
భరతతనూజుల౯ గనుచుఁ బాలనసేసెద నంచు బాసల౯
మురిపెముతోడ సల్పు మిష ముగ్ధులుగాఁగ ధరామరుల్ మది౯.

వృషనామవత్సరము, ప్రజ-కృషిఁ జేయుచు శాంతి భువిని గూర్చెదునటుల౯
మిషఁ బూని మెలఁగుఁగావుత-వృషభాధిపుకృపను మెఱసి, వేవెలుఁగువలె౯!

అమరవరుల్ నుతింప భరతావనిఁ జల్లగఁ జూచి, దీక్షతో
సమరజయాభిలాషపరిషత్తు లనేకముఁ గూర్చి, గాంధిజీ
విమలవచస్సుల౯ మగుడ విశ్రుత మానటు చక్కదిద్ది, శ్ర
సములగు భారతాంగనల సత్పథగాములఁ జేయుమా వృషా!

నీవు వసంత మాదిగల నిండునెలల్ బచరింపఁగాఁ దమి౯
భావి శుభాశుభంబులను భారతవీరుల కెల్లఁ జూప, మా
కీవె శరణ్య మంచు నిను నెల్లరు ప్రీతి నుతింత్రు, వారల౯
బ్రోవవె ఆయువు౯సిరిని బాల్పుగ నిచ్చుచు నో వృషాబ్దమా!

విషునామవత్సరం బని
వృషనామాబ్దం బటంచు, వివిధగతి జనుల్
మిషఁ బూని యెటుల పిలచిన
"వృష" బాపురె, కినియఁబోక వృష్టి నొసఁగుమా!



# నన్నయకు పూర్వము ఆంధ్రభాష

## పూర్వపు తెనుగు శాసనములు

మన వాఙ్మయచరిత్రమున మొట్టమొదటి ప్రకరణమే సమస్యాబహుళమయిన పెద్దఘట్టము. మనభాష పుట్టుపూర్వోత్తరము లింకను దురవబోధములుగనే యున్నవి. అసలు మనభాష పేర్లనుగురించియే ఇంకను ఎన్నో తికమకలు పడుచున్నాము. వానిని గురించి యింతవరకు ఒక నిశ్చితమయిన సిద్ధాంతమే కుదరలేదు.





### ఆంధ్రము : తెలుగు

ఆంధ్రము, తెలుగు అను రెండుపదములను మనభాషకు పర్యాయపదములుగా వాడుచున్నాము. ఒకటేభాష కింతటి పరస్పరభిన్నములైన యిపి పర్యాయపదములుగ నేర్పడుట ఎట్లు సంభవించిన దను ప్రశ్న ప్రప్రథమము ననే కలుగుచున్నది. తెలుగేమిటి, ఆంధ్రమేమిటి అను జిజ్ఞాస పెక్కువాదములకు కారణమయినది. నిర్ణయమునకు తోడ్పడు నికరములయిన యాధారములు లేకపోవుటవలన యుక్తికి బలము దొరకి వాదములు బహుళము లయినవి. ఎన్నోవిధముల ఎందరో యీవాదమును పరిష్కరించినారు. కాని ఏపరిష్కారమునకును ఇంతవరకు సర్వజనాంగీకారము లభింపలేదు; లభించుటయు కష్టమే. ఈ పదములకు గల భేదమును పురస్కరించుకొని అసలు తెలుగువారు వేరు, ఆంధ్రులు వేరు అను వాదములును పుట్టినవి. ఆంధ్రులు అసలు ఇచ్చటివారు కారని, ఇతరప్రాంతములనుండి యిచ్చటికి వచ్చినారని, ఇచట మొదటినుంచి నివసించుచున్న జనులు తెలుగువారని, ఇది అసలు తెలుగుదేశమని, ఆంధ్రులిచటికి వచ్చి తెలుగులతో కలిసిపోయి ఆ రెండు తెగలవారికి గల భేదమంతరించిన పిదప ఆంధ్ర, తెలుగుపదములు పర్యాయపదములుగ నేర్పడినవని కొందరివాదము. ఇప్పటి రాయలసీమ అసలు తెలుగుదేశమని, సముద్రతీరస్థదేశము ఆంధ్రమని మరికొందరి యభిప్రాయము. ఇట్లే వాదములలో ఇంకను భేదములున్నవి. వానినన్నిటిని ఇచట నుటంకించుట యనవసరము.

ప్రబల ప్రమాణములుగ ఎన్నదగిన శాసనములను బరిశీలించినచో ప్రాచీనకాలమున ఆంధ్రులు అంధ్రులుగనే వ్యవహారింపబడినట్లు తెలియగలదు. పురాణములుసయితము ఆంధ్రులను అంధ్రులనియే వ్యవహారించియున్నవి. క్రీస్తుశకము అయిదారు శతాబ్దులనాటినుండి అంధ్రపదమును, అంతకుపూర్వము అంధపదమును శాసనములందు గానవచ్చును. అంధపదము క్రీస్తుశకము మొదటిశతాబ్దులలోని ప్రాకృత శాసనములలో గానవచ్చును. ప్రాకృతమున అంధ్ర అంధయైనది. ప్రాచీన బౌద్ధత్రిపిటక వాఙ్మయమునందును, ప్రాచీన జైనవాఙ్మయమునందును అంధ్రులు అంధులని,


రచయిత:



శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ



అంధకులని వ్యవహరింపబడియున్నారు. తెలుగుపదము శాసనములలో పది, పదునొకండవశతాబ్దులనుంచి కాని కానరాదు. తెలుగు, తెలుంగు, తిలంగ, తిలింగ రూపములతో శాసనవాఙ్మయమున అది కనబడుచున్నది. అప్పటికే తెలుగు, అంధ్రములు దేశనామములుగను, జాతివాచకములుగను పర్యాయపదము లయినవి. పది, పదునొకండవ శతాబ్దులకు పూర్వము పురాణములందు కాని, శాసనములందుకాని, జైన బౌద్ధవాఙ్మయము లందుకాని దేశనామముగగాని, జాతివాచకముగగాని తెలుగుపదమే కానరాదు. దీని ననుసరించి తెలుగుజాతి వేరుగ నొకటి యుండె ననుటకుగాని, తెలుగుదేశము వేరొకటి యుండె ననుటకుగాని ఆధారములు లేవు.

అంధ్రపదము జాతివాచక మని పురాణములను బట్టియు, బౌద్ధ జైన వాఙ్మయములనుబట్టియు స్పష్టమగుచున్నది. అంధ్రజాతి బహుపురాతనమయినదని ఐతరేయ బ్రాహ్మణమునుబట్టి మనకు దెలియుచున్నది. ఈ బ్రాహ్మణమునాటికి ఆంధ్రులు ఆర్యావర్త సీమావధులందు నివసించుచుండిరి. వీ రొకప్పుడు ఇప్పటి సంయుక్తరాష్ట్రములం దుండినట్లు అనుమానింప నవకాశము కలదు. అంధవన మనుపేర నొకవనము ఉత్తరకోసలమున నుండినట్లు విదేశబౌద్ధయాత్రికుల గ్రంథముల వలన దెలియుచున్నది. ఇది బౌద్ధవాఙ్మయమున ప్రసిద్ధమైన జేతవనమునకు వాయవ్యదిశ నుండెను. ఇక్ష్వాకు వంశజుల కాణాచియైన ఉత్తరకోసలమునకు బుద్ధునికాలమున శ్రావస్తి రాజధాని. అంధవన, జేతవనములు రెండును ఆనగరము పరిసరములందలివే. అంధ్రుల ననుసరించియే ఆవనమునకు అంధవన మనుపేరు కలిగినదని నాయూహ. అంధ్రజనపదము నంటియున్న యరణ్యప్రదేశము అంధవన మనుపేర వ్యవహరింపబడియుండును. శ్రావస్తికిని, అంధ్రులకును కొంత సంబంధ ముండినట్లు అంధవనము ననుసరించియేకాక పురాణప్రమాణము ననుసరించియు సంశయింపదగియున్నది. శ్రావస్తీనగర నిర్మాతయైన శ్రావస్త, లేక శ్రావస్తక మహారాజు ఇక్ష్వాకువంశజుడయిన వికుక్షికి ఆఱవతరమువాడని, అతని తండ్రిపేరు అంధ్రుడని వాయుపురాణము తెలుపుచున్నది (వాయు పు. అ, ౮౮, ౨౮-౨౯; విష్ణు పు. అ. ౪, ౨-౧౨). కాని మత్స్య, బ్రహ్మపురాణములు అతడు యువనాశ్వకసూనుజుడని, ఆర్ధమహీపతి మనుమడని చెప్పుచున్నవి. వాయుపురాణోక్త అంధ్రుడే యీ ఆర్ధుడు. ఇతనినే భాగవతపురాణము, పొరపాటున కావచ్చును, చంద్రుడని పేర్కొనుచున్నది. ఈ శ్రావస్తి సంయుక్తరాష్ట్రములయందలి అయోధ్య (Oudh) జిల్లాయం దుండెను.

దక్షిణకోసలము కళింగదేశముపొరుగున నున్నది. ఇక్ష్వాకువంశజులు కొందరు దక్షిణమునకు వలసవచ్చి యచ్చట స్థిరనివాసము కుదుర్చుకొనుటచేతనే దక్షిణకోసల మిచట ఏర్పడుట సంభవించియుండును.

ఇక్ష్వాకులకును అంధ్రదేశమునకును సంబంధము కలదనుటను నాగార్జునునికొండ, జగ్గయ్యపేట శాసనములు రూఢిపరుచుచున్నవి. వీనిననుసరించి చూడగా అంధ్రులు ఉత్తరకురుభూములనుండి క్రమముగా దక్షిణమునకు వచ్చి కృష్ణా గోదావరీ తీరప్రదేశములను తమ జన్మదేశములుగ జేసికొనిరని విదితముకాగలదు. అంధ్రులు ఇక్ష్వాకువంశజులయినను, విశ్వామిత్ర సంతతివారయినను ఉత్తరదేశమునుండి దక్షిణమునకు వచ్చిన యార్యజాతివారనుట స్పష్టము. ఇచ్చటికి వచ్చినపిదప అంధ్రులకు ఇరుగుపొరుగులనుండు జాతులవారితో సంపర్కము హెచ్చినది: ప్రాంతీయభాషా సంసర్గమున వారిభాషయు చాలమార్పుచెందినది. ఉత్తరదేశస్థ ఆర్య జనపదములతో సంబంధము తెగిపోయినది. కాగా, ఆంధ్రులలో దాక్షిణాత్యభాషాచార సంప్రదాయములు వెలసి బలపడినవి. ఆంధ్రులు చివరకు పంచద్రావిడుల లోనివారయినారు. ఆంధ్రు లిచ్చటికి వచ్చినపిదప దాక్షిణాత్యభాషల సంసర్గ, సంమిశ్రణమున పరిణతి చెందిన వారిభాషయే తెలుగైనదని నాయూహ. ఆంధ్రము జాతివాచకమని, తెలుగు వారి భాషాసంకేతమని నాతలంపు. ఈకారణముననే కావచ్చును దాక్షిణాత్య భాషలలోని కెల్ల తెలుగే పరిపూర్ణత నందుటకు కట్టకడపటి దయినది. తెలుగు రూపొంది కావ్యత్వసిద్ధి నందుటకు చాల కాలము పట్టుటకును ఇదియే హేతువై యుండవచ్చును. క్రమాభివృద్ధి పరిణామముల నొంది తెలుగు చక్కగ పరిణతిచెందునాటికి ఆంధ్ర, తెలుగుపదములు జాతిక్షిని

భాషకునుగూడ పర్యాయవాచకములుగ రూఢములయి నవి. తెలుగుపదము శాసనములందుకాని, పురాణము లందుకాని క్రీస్తుశకము పదిశతాబ్దులవరకు కానరాక పోవుట ననుసరించి యీయూహయందు కొంత సత్య ముండవచ్చు ననిపించుచున్నది. కాని యిది రాయిగ్రుద్ది నట్లు చెప్పదగిన సిద్ధాంతముకాదనియు, ఊహమాత్రమే యనియు, ప్రస్తుతము మనకు దొరకిన యాకరముల ననుసరించి యిట్లూహింప ననువైనదనియు జ్ఞాపకముంచు కొనవలసియున్నది.

ఇక తెలుగు ప్రాచీన స్వరూప మెట్లుండె నన్నది విచారింపవలసియున్నది. నన్నయభట్టారకుని నాటి నుండి మన తెలుగుభాష ఎట్టెట్లు మార్పుచెందుచు వచ్చినదియు, ఏయేరీతుల వృద్ధిచెందినదియు దెలిసికొను టకు గ్రంథజాలము కావలసినంత యున్నది. నన్నయ భట్టారకునికి పూర్వము, అనగా పదునొకండవ శతాబ్దికి మునుపు తెలుగుభాష తీర్పుతీరువ లెట్లుండినదియు తెలిసికొనుటకు గ్రంథములులేవు. అందువలన మనకు శాసనములే శరణ్యము.

ప్రాచీన శాసనములు: తెలుగు

శాసనములను గురించి ముఖ్యముగా జ్ఞాపక ముంచుకొనవలసిన విషయములు ఒకటి రెండు కలవు. శాసనములలోని భాష కడుపరిమితమయినది; పరిమిత ప్రయోజనమును కలది. చేసిన భూదానమును కాని, మరియొక దానమును కాని తెలుపుటకే శాసనములు పుట్టినవి. అందువలన ఆయక్కర కెంతభాష యవస రమో అంతవరకే శాసనము లందు దొరకును. దానాను పాలనాదులవలన గలుగు మంచిచెడ్డలు కూడ శాసనము లందు వివరింపబడుటవలన దానమును దెలుపుట కవస రమైనవేకాక ఈ సంబంధమైనవి కూడ మరికొన్ని పద ములు దొరకును. ఎన్ని దొరికినను అవి లెక్కపెట్టదగి నవేకాని అపరిగణనీయములు కావు.

నన్నయకు పూర్వపుకాలమును స్థూలముగ రెండు విభాగములు చేయవచ్చును. క్రీస్తుశకారంభము నాలుగవ శతాబ్దినుండి పదునొకండువరకు సంస్కృత శాసన కాలము. అటుతరువాతిది శిలా శాసనకాలము; శిలా శాసనము లన్నియు శిలలమీద చెక్కినవి; సంస్కృతభాషా శాసనములన్నియు తామ్ర ఫలకముల పై చెక్కినవి. సంస్కృత తామ్రశాసనయుగ మయిన పిదప ఒకవిధముగ శిలా శాసనయుగమని నుడువ వచ్చును. అట్లని తామ్రశాసనయుగమున శిలాశాసనము లసలే లేవని యూహింపరాదు; ఉన్నవికాని తామ్రశాస నములవలె విరివిగా గానరావు. శిలా శాసనములు కొల దిగా దొరకినను అవి మన కెక్కువ యుపకారకములు. మన దేశమున దొరకిన ఈ శిలా శాసనములలోని భాష తెలుగు.

తామ్రశాసనములు తెలుగు శిలాశాసనములకు ముందునుండియు నున్నవి. వానిలో ఎక్కడ ఏ తెలుగు పదమయినను కనబడుట సంభవించినయెడల మనకు పెన్నిధి దొరకినట్లే. తామ్రశాసనయుగమున ఆంధ్ర దేశము ఒక్కొక శతాబ్ది గడచినకొద్ది తెలుగు మీరి నది. తెలుగుకు రూపురేఖ లమరి అది క్రమముగా ప్రబల మయినది. ఈ ప్రాబల్యముననే శిలాశాసనములు సొంత ముగ తెలుగుననే వెలసినవి. తెలుగునకు దేశమున క్రమముగా దొరకుచువచ్చిన యాదరాభిమానముల వలన ఒక్కొక శతాబ్ది గడచినకొద్ది ఏ రూపముననో ఒక రూపమున తెలుగుపదములు తామ్రశాసనములలో గూడ దూరినవి.

తామ్రశాసనములలో మొట్ట మొదట దానమిచ్చిన గ్రామనామము మాత్రమే తెలుగునకు సంకేతముగ నుండుచువచ్చెను. అటుతరువాత కొంత కాలమునకు దానమిచ్చిన గ్రామమునకు సీమావధులు (సరిహద్దులు) పేర్కొనబడుచు వచ్చుటచేత మరికొన్ని ఆంధ్ర పదములు తామ్రశాసనములలో నుదాహృతము లయినవి. ఇట్లు దాన మిచ్చిన భూమికికాని, గ్రామము నకుగాని సరిహద్దులను దెలుపుట ఆచారముకాగా నాడాంధ్రదేశమున వ్యవహారమునందుండిన క్షేత్రనామ ములు, గ్రామనామములు తామ్రశాసనములలోని కెక్కినవి. ఇదయినను సంస్కృత వేషమును ధరించియే; సంస్కృత వర్ణక్రమముననే. ఉదాహరణమునకు చూడు డు: 'ముణ్డూర గ్రామే'; 'కమ్బురాఞ్చేరువే'; 'ప్రాలూర గ్రామే'; 'గొల్ల తెంకిః'; 'చెఱుకుమఱ్ఱుళ్ళ'; 'పోతుశా యుః'. సంస్కృత వర్ణక్రమముననుసరించి, విభక్తి

ప్రత్యయమో, విభక్తి రూపమో, విసర్గమో తగిలించు కొన్నచో ఊరిపేరులును, క్షేత్రముపేరులును సంస్కృత తామ్రశాసనములలోని కెక్కుటకు యోగ్యతగడించు కొన్నవన్న మాటే.

దేశమున తెలుగు ఎన్నికకాంచిన కొద్ది తామ్ర శాసనములయం దవి యున్నవి యున్నయట్లు సంస్కృత ప్రత్యయముల తగులుబడి లేకయే నిలబడుటకు బలము కలిగినది.

పైని చెప్పిన విషయముల ననుసరించి మనకు ప్రాచీన శాసనములలోగానవచ్చు మొదటి తెలుగుపేరులు గ్రామ నామములవే యని తెలియగలదు. తామ్ర శాసనముల లోను, శిలాశాసనములలోను గానవచ్చు తెలుగును బట్టి మనము తెలుగుబాస ప్రాచీన స్వరూపమును దెలిసి కొనవలసియుండును.

శాసనములలో గానవచ్చిన మొట్టమొదటి తెలుగు పదము 'నాగబు.' ఇది అమరావతీ స్తూపశాసనములలో కానవచ్చినది. అందువలన ఏ మూడవ, నాలుగవ శతాబ్దినాటిదో కావచ్చును. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దీనిని భారతిలో ప్రకటించినారు. మహా నాగ ప్రతిమ క్రింద ఈ శాసనమును జెక్కియుందురని వా రన్నారు. కావచ్చును. ఇప్పుడా నాగ ప్రతిమ శిథిల మగుటచేతనో, త్రవ్వినపుడు పగిలిపోవుటచేతనో ఈ 'నాగబు' శాసన మొక్కటియే మనకు దక్కినది. 'నా గబు' అనగా 'నాగంబు-నాగము' అన్నమాట. ఈ శాసనము ననుసరించి క్రీస్తుశకము మూడవ శతాబ్ది నాటికే తెలుగునకు ఒకరూప మేర్పడెనని యూహింప వచ్చును.

గ్రామనామ వాచకములు:

ప్రాచీన తామ్రశాసనములలో ఆంధ్ర దేశ గ్రామ ము లనేకము లుదాహృతములయినవి అప్పటి యూరి పేళ్ల ననుసరించి మన ప్రాచీన భాషాస్వరూపము కొంత బోధపడగలదు. అదియునుగాక ఆ పూర్వపుపేరు లిపు డెట్లు మారినవో తెలిసినచో భాషమారుచు వచ్చుట లో నేసూత్రముల ననుసరించినదియు గొంత తెలియ గలదు. సాధారణముగ మన గ్రామనామములు పట్టు, కుఱ్ఱు, దొఱ్ఱు, ఊరు, ప్రోలు, వాడ, వాటి, కొలను, చెఱువు, పల్లి, పూండి మొదలైనవాటితో నంతమైనవి. పేర్ల చివర సాధారణముగ నివి కనబడును. చూడుడు: ఉదాహరణము.

| | | |
|---|---|---|
| పాంబఱ్ఱు | దొంతికుఱ్ఱు | తాండివాడ |
| కొంబఱ్ఱు | మండదొఱ్ఱు | కాకండివాడ |
| నిడుంబఱ్ఱు | మ్రోంతుకూరు | గుద్దవాడి |
| మొనంబఱ్ఱు | శాంతలూరు | ద్రోణవాడి |
| దిగుంబఱ్ఱు | క్రానూరు | ఒడ్డవాడి |
| కలుచువుంబఱ్ఱు | మల్లప్రోలు | కొరుకొలను |
| పొలకుంబఱ్ఱు | కొల్లిప్రోలు | మాంగొలను |
| పసపుంబఱ్ఱు | చేంబ్రోలు | రాంగొలను |

| | |
|---|---|
| కలుచెఱువుల | చెఱకుంబల్లి |
| రొంపిచెఱువుల | పెసరుంబల్లి |
| మహాదేవిచెఱువుల | నారికెడంబల్లి |
| జక్కనచెఱువుల | పెనుంబూండి |
| పోకనచెఱువు: | వడ్లంబూండి |

ఈ పై ప్రత్యయములలో పఱ్ఱు పఱితిగను, కుఱ్ఱు కుఱితి గను, దొఱ్ఱు దొఱితిగను కూడ వ్యవహరింపబడుట కలదు. ప్రో లన్న పట్టణము. వాడ, వాటి- నివాసప్రదే శము. వాటి వాడుకలో వాడియైనది. వాడిలోని 'డి' 'ది'గ నుచ్చరించుటయు, వ్రాయుటయు కూడ గలదు. అందువలన 'వాడి' 'వాది' యైనది. పూండి యన్నది శి వారు గ్రామము. పూర్వము బ్రాహ్మణుల కగ్రహారము దాన మిచ్చునపుడు గ్రామగ్రాసముగ నొక చిన్నపల్లె నిచ్చుటకూడ ఆచారము; ఏలన, బ్రాహ్మణులు వ్యవ సాయముచేయుట ధర్మశాస్త్రముల ననుసరించి కూడదు గనుక వ్యవసాయముచేయు రైతాంగ ముండుటకీ గ్రామ గ్రాసము నిచ్చువారు. గ్రామగ్రాసపు పల్లెకే పూండి యన్న నామము తొలుదొల్త చెల్లుచువచ్చినది. కాని కాలక్రమమున దాని విశిష్టత పోయి సామాన్యగ్రామ వాచకమైనది. గ్రామగ్రాసపు బల్లెలు పదునాలుగవ శతాబ్దిని కూడ నుండెననుటకు,

> "మూఁడు గ్రామగ్రాసములతోడఁ గూడంగ
> మోపూరు పాలించె ములికినాట"

అని క్రీడాభిరామమున వినుకొండ వల్లభరాయఁడు,

పై గ్రామనామములను పరిశీలించినచో కను, పెను, మొన, నిడు, దగ్గు, దిగు, పాము, కోము— వీనికి పట్టును, చెఱకు, పెసరు, పసపులకు పల్లియును, పెను, వర్ణపదములకు పూండిని చేర్చిన పైరూపము లేర్పడిన వనుట స్పష్టమగును. వానికి సరియైన యిప్పటిరూపములు దిగువ నిచ్చుచున్నాను.

కనుం + పట్టు = కనుంబట్టు = కనుమట్టు
పెనుం + పట్టు = పెనుంబట్టు = పెనుమట్టు
మొనం + పట్టు = మొనంబట్టు = మొనమట్టు
నిడుం + పట్టు = నిడుంబట్టు = నిడుమట్టు
దగ్గుం + పట్టు = దగ్గుంబట్టు = దగ్గుమట్టు
దిగుం + పట్టు = దిగుంబట్టు = దిగుమట్టు
పాము + పట్టు = పాంబట్టు = పామట్టు
కోము + పట్టు = కోంబట్టు = కోమట్టు
చెఱకు + పల్లి = చెఱకుంబల్లి = చెఱకుమల్లి = చెఱకుమిల్లి
పెసరు + పల్లి = పెసరుంబల్లి = పెసరుమల్లి = పెసరుమిల్లి
పసపు + పఱ్ఱు } పసపుంబఱ్ఱు = పసుంబఱ్ఱు = పసుమఱ్ఱు
పసు + పఱ్ఱు }
కలుచువు + పట్టు = కలుచువుంబట్టు = కల్చుంబట్టు = కంచుమట్టు

మన గ్రామనామములలోని కొలను, చెఱువుల పదము లిపుడు కొల్లు, చెర్లలుగా మారినవి.

కోరుకొలను = కోరుకొల్లు
మాంగొలను = మాంగొల్లు
రాంగొలను = రాంగొల్లు = రాగోలు
కలుచెఱువుల = కలుచెర్ల
రొంపిచెఱువుల = రొంపిచెర్ల
మహాదేవి చెఱువుల = మాదేవిచెర్ల = మాచెర్ల
జక్కన చెఱువుల = జక్కంచెర్ల
పోకనచెఱువుల = పోకంచెర్ల.

ఇట్లే మల్ల + ప్రోలు = మల్లప్రోలు = మల్లవోలు
బిక్కి + ప్రోలు = బిక్కిప్రోలు = బిక్కివోలు = బిక్కవోలు
చేం + ప్రోలు = చేంబ్రోలు = చేబోలు

మాపుంపూరు మాముడూరు; మావిండిపల్లి మామిడిపల్లి అయినది.

తామర + వాడ = తామరవాడ = తామరాడ
ద్రోణ + వాడి = ద్రోణవాది = ద్రోణాది
ఒడ్డ + వాడి = ఒడ్డవాది = ఒడ్డాదియైనది.

ఈ పై మార్పుల ననుసరించి మనము కొన్నిసూత్రములను గమనింపవచ్చును. ఆగమముగావచ్చిన అనుస్వారమునకు పరమైన పట్టు, పల్లి, పూండులు ప్రాచీనాంధ్రమున బట్టు, బల్లి బూండిగా వ్యవహరింపబడి నేడు మట్టు, మల్లి- మిల్లి, మూండి మూడిగా మారినవని నిశ్చయింపవచ్చును. ఈసూత్రము ననుసరించి అర్వాచీన రూపములకు ప్రాచీన రూపములును, ప్రాచీనరూపములకు అర్వాచీనరూపములును కనుగొనవచ్చును. ఇట్లే ప్రాచీనాంధ్రమున అనుస్వారపూర్వక 'డి' వర్ణము నేడు 'ణి' -'ని' గా మారినది: ఉదా: కాకాండి - కాకాణి - కాకాని; కాకండివాడ - కాకణివాడ - కాకణాడ - కాకనాడ. పండిదం = పణిదం; కొండికి = కొణికి.

అరియేడు, ఇడియూరు, ఎలియేరు- ఈ ప్రాచీనాంధ్రమునందలి రూపములు అర్వాచీనాంధ్రమున ఆరేడు, ఈడూరు, ఏలేరుగా మారినవి. ఈయుదాహరణముల ననుసరించి ప్రాచీనాంధ్రస్వరూపము కొంత గోచరింపగలదు.

మనుష్య నామములు

ఇక మనుష్యులపేర్లు చూతము. దోచిశర్మ, అగ్గిశర్మ, కుండిశర్మ, నన్నిశర్మ, కాటిశర్మ మొదలయిన ఇకారాంత పదములన్నియు శర్మపదము వాడని సందర్భములందు దోచియ, అగ్గియ, కుండియ, నన్నియ, కాటియ అని యకారాంతములుగా వ్యవహరింపబడెను. 'ఇయ'తో అంతములయిన ఇట్టి పదములు దోచె, అగ్గె, కాటె, కుండె, నన్నె అను రూపాంతరములను బొందుచువచ్చినవి. ఇట్టి రూపములను పదవ, పదునొకండవ శతాబ్దినాటి శాసనములో ఎన్నిటినైన చూడవచ్చును. ఉదా: ప్రోలె-ప్రోలియ; కేతె- కేతియ; బాదె—బాదియ మొదలైనవి. 'ఇయ' కాలక్రమమున 'అయ'గా మారగా నేటి దోచయ, అగ్గయ, కుండయ, నన్నయ, కాటయరూపములు సిద్ధించినవి.

నన్నయకు పూర్వము కానవచ్చు శాసనములలో మనము ప్రధానముగ గమనింపవలసినవి మూడు పదములుకలవు. ( ) భోజక; (2) రట్టకుడి; (3) గామకుడి.

(1) భోజకులనగా ఊరిపెద్దలు; గ్రామప్రముఖులు. బ్రౌన్సు పాలీనిఘంటువునందు భోజక పదమునకు VillageHeadman అని యర్థముచెప్పబడినది. గ్రామ భోజకులు రాజాధికార పురుషులలో ఒకరు. శాసనములందు గ్రామ భోజకులు పేర్కొనబడినారు. భోజ, భోజక పదములు రెండును ఏకార్థ ప్రతిపాదకములు. భోజశబ్ద వికృతి బోయ. పూర్వము బ్రాహ్మణులు గ్రామ భోజకులుగ నుండినట్లు శాసనములవలన మనకు దెలియగలదు. ఉదా: ముదుగొండ్లబోయ దుగ్గశర్మర్; ఇక్లేచేయూరోబ్బోయ; పొన్నఘూరోబ్బోయ; రాంపూరోబ్బోయ మొదలయినవి. బోయ, భోజ, భోజక పదములు నేడు బ్రాహ్మణులకు చెల్లుట కానరాదు; కాని నేడు వ్యవహారమునన్న బుగత, భుక్త పదములు భోజక శబ్ద భవములుకాని, తత్సంబంధులుకాని యైయుండునని నా యుద్దేశము. ప్రాచీనాంధ్ర శాసనములలో కానవచ్చు 'బోండు' పదము 'బోయండు' అనుదాని రూపాంతరము. ప్రథమ ఏకవచనరూపము బోండు, బోఁడు, బోడు; బహువచనరూపము బోలు. ఉదా : 'బోలు నల్వురాయుతోఁట'. బోలుపదము గౌరవ వాచకముగ ప్రయోగించుటయు కలదు. ఉదా: 'బాదెబోల పన్నస'. 'బోని'యన్నది ద్వితీయ, షష్ఠి ఏకవచన రూపము. ఉదా : 'మండెబోనిచేను.'

(2) ఇప్పటి రెడ్డిపదమునకు ప్రాథమికరూపము రట్టకుడి. రట్టకుడి రట్టోడి, రడ్డోడి, రద్దోడి, రట్టడి, రడ్డి అని పరిణామమున రూపాంతరములను పొంది తుదకిపుడు రెడ్డి యైనది. రాష్ట్రకూట యనునది రట్టకుడిపదము యొక్క సంస్కృతరూపము. అదికూడ రాష్ట్రోడ, రాష్ట్రోఢ, రాఠోడ, రాఢ యని రూపాంతరములను పొందినది. రట్టకుడి, రాష్ట్రకూటపదములు పొందిన రూపాంతరముల నన్నిటిని మనము ప్రాచీన శాసనముల లోను, తరువాత వాఙ్మయమునను జూడగలము.

(3) రట్టకుడి వంటిదే గామకుడి. గామకుడి సంస్కృతమున గ్రామకూట మైనది. గ్రామప్రముఖులని ఆ పదమున కర్థము. గామకుడి (గ్రామకూట) గామోడ, గాముండ, గావుండ, గౌండ అయి నేడు గౌడు అయినది. ఉచ్చారణ సౌకర్యము ననుసరించి పదము అనేక వికృతులను పొందు ననుట కివి యుదాహరణములు. ఎన్నిరూపాంతరములను పొందినను ఒక పద్ధతికి, ఒక సూత్రమునకు కట్టువడియే అది మారుచుండు నన్న విషయము మనము గమనింపవలసి యుండును.

ఇతర విశేషములు

తెలుగుమాటల కాదినుండియు సంస్కృత వర్ణక్రమపద్ధతియే యేర్పడినదని యిదివరలో చెప్పియున్నాను. ఈ కారణమున నన్నయకాలమునకు చాల పూర్వమునకు బోయిన కొలది తెలుగుపదములలో అనుస్వారము కానబడదు. అనుస్వారమునకు బదులు వర్గాంత్యను నాసికములే వాడుకయందుండెను. కాలక్రమమున అనునాసికము లోపింపగా దాని స్థానమున అనుస్వారము వచ్చినది. అర్ధానుస్వార మసలులేదు. దేశీకవితనుగాని, మార్గకవితనుగాని సందర్భానుసారముగ అనుస్వారము నూది, తేల్చి పలుకువారు. ఊది పలికినది(సిద్ధము) పూర్ణానుస్వారమును, తేల్చి పలికినది (సాధ్యము) అర్ధానుస్వారముగను పరిణమించెను.

కడు ప్రాచీన కాలమునకు బోయిన కొలది తెలుగుపదములు పరుషబహుళములుగ నుండినట్లు కన్పట్టును ఉదా: అకుఁ—(అగును), కరుసు ; కర్త.

కొను, తిను మొదలయిన తెలుగుపదములు ప్రాచీన కాలమున ణజంతములుగ గనబడును; ఉదా: పణి, కొణు.

తెలుగుపదములలోని క, చ, ట, త, పలకు పూర్వము రేఫసంశ్లేషమయిన అది లోపించి,పరవర్ణము ద్విత్వముంజెందును. ఉదా: వర్చు—వచ్చు; పెర్గడ—పెగ్గడ; ఉర్పుటూరు—ఉప్పుటూరు; అర్క—అక్క.

పరస్థరేఫము వ్యతిపాతవిధి నొంది ప్రథమాక్షర సంయోగము చెందుటయు కలదు. ఉదా: పఱికి—ప్రిక్క

ప్రక్కి; పుళోలు—ప్రోలు; పెర్గడ — ప్రెగ్గడ; పఱంతూరు—ప్రాంతూరు—పాతూరు.

పూర్వపు తెలుగు శాసనములను బరిశీలించినచో నముచ్చయ ప్రత్యయ మిప్పటివలె 'ను' గా గాక అఱవమునందువలె 'ఉమ్'గ నుండినట్లు తెలియగలదు. వాడుకయందిది 'ఉము' గను, 'నుము' గను ప్రయుక్తమయినది. ఉదా: వేగుళ్ళము వేసెఱుపుళుము'; 'మాత్పిడుగునుము, చోటియరట్టగుడ్యాకునుము, ఉత్తమాదిత్యరట్టగుడ్యాకునుము.'

రాజులయొక్క యనునర్థమున పూర్వపు తెలుగున షష్ఠీ విభక్తి 'కు' ప్రత్యయము ప్రయుక్తమగుచువచ్చినది. 'కు'కు పూర్వపు అచ్చు దీర్ఘమగుటయు కలదు. ఉదా: "జయసింహవల్లభమహారాజులాకుఱ్ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్"; "(శ్రీ) విష్ణువర్ధన మహారాజులాకు ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరంబుళ్", "మహారాజాధిరాజ పరమేశ్వర భటారళాకు విజయరాజ్య సంవత్సరంబుళ్", "పోర్ముఖ రామపుణ్యకుమార ప్రిథివీవల్లభచోల మహారాజులాకు ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుళ్". ఇవి ఏకవచనరూపములు. ఈ బహువచనరూపము గమనింపదగినది: "తోంటళాయు పడువారంబు" — (తోంటళు + అయు + పడువారంబు). "యొక్క" అనుషష్ఠ్యర్థమున అరవమున "ఉడయ", వచ్చును. ఉదా: ఎన్నుడయ; అవరుడయ". ప్రాచీన కన్నడమున నిది "అయ", "అ"గా మారినది. ఉదా: 'ఎన్నయ' (నాయొక్క); 'ఎన్న' (నా). ప్రాచీన కన్నడమునందలి "అయ" ప్రత్యయమే "తోంటళాయు పడువారంబు" లోని "అయ". "అ", "అయ" ప్రత్యయములు రెంటిని ప్రాచీనాంధ్రమున జూడగలము."అ" ప్రత్యయమున కుదాహరణములు: మాటలు + అ + పొందిక=మాటల పొందిక (మాటలయొక్క పొందిక). ఇట్లే పదముల కూర్పు, తమ్ముల ప్రేమ మొదలైనవి.

కడు ప్రాచీనకాలమున షష్ఠీ విభక్తి ప్రత్యయమయిన 'కు' పరంబగునపుడు అకారాంత పదముల మీది తుదియచ్చును, నగాగమముమీది తుది అకారమును దీర్ఘమగుచుండెను. ఉదా: "నిప్పసోముళాకు"; "ఉబిలీశ్వర భటారళాకు"; "చోళియరట్టగుడ్యాకు"; "విన్నశర్మళాకు"; పల్లెయూరియనంబునాకు"; గంగ రాజ్యంబునాకు"; సమూద్రరంబునాకు"; "వసంతీశ్వరంబునాకు" మొదలైనవి.

షష్ఠీవిభక్తి రూపములందలి యీ దీర్ఘములు కడు ప్రాచీనశాసనములందు మాత్రమే కానవచ్చును. కాలము గడచినకొద్ది ఈ దీర్ఘములు హ్రస్వములై "రాజులకు", "గంగరాజ్యంబునకు", "ఉబిలీశ్వర భటారళకు" అను అర్వాచీనరూపములు ఏర్పడినవి. స్థూలదృష్టిని శాసన ప్రాచీనతను గుర్తించుటకీ రూపములు కొంతవఱకు తోడ్పడగలవు. దీర్ఘరూపములు ఆఱవ, ఏడవ శతాబ్దులనాటి శాసనములలో కనబడును. ఎనిమిదవశతాబ్ది యీ రూపములకు మార్పుకాలము. అందువలన నాటిశాసనములలో ఉభయరూపములను గాంచగలము.

చతుర్థి, షష్ఠీ విభక్తులు రెంటను 'కు' ప్రత్యయమే వచ్చును.

ఇప్పటి తృతీయావిభక్తి ప్రత్యయము 'తోడ' ప్రాచీనరూపము 'తోఱ' ఉదా: "రామనిభుతోఱ." 'తోడు'తోడిదే యీ 'తోఱ'. ఇది సహార్థమున తొలుదొల్త ప్రయుక్తమయి తుదకు తృతీయావిభక్తి ప్రత్యయముగ రూఢమయినది. చూడు డీ యుదాహరణము: "నల్వురాయుతోఱ"; (నల్వురు + అయు + తోఱ).

ఇక ద్వితీయా విభక్తి రూపమయిన 'దీని' గుఱించి కొంత చెప్పవలసియున్నది. నన్నయకాలమునుండి ఒక్కొక శతాబ్ది వెనుకకు పూర్వపు తెలుగు శాసనములను బరిశీలించుచు పోగా 'దీని' రూపమున మార్పులు కనబడును. 'దీని' అన్నది కొంత పూర్వమునకు బోయినయెడల 'దేని' గాను, ఇంకను పూర్వమునకు బోయిన 'తేని'గాను పరిణమించును. ఇట్లగుట, 'దీని' ప్రాచీన ప్రాథమిక రూపము 'తేని'. ఈ యుదాహరణములు చూడుడు.

| | |
|---|---|
| 'దీని చెఱిచ్చినవారు' | 'దేనిం గాచినవారు' |
| 'దీని రక్షిఇచ్చినవారు' | 'దేనికి సక్కి'(దేనికి సాక్షి) |
| 'దీనిటచ్చినవాని' | 'దేనికి వక్రంబువచ్చువాన్డు' |

'దీనికి వక్రంబువచ్చినవారు' 'దేని నిల్పినవానికి'
'దీనికి అడ్డమయినవారు' 'దేని ఱచ్చువాన్ఱు'

'తేని ఱచ్చినవారికి'
'తేని ఱచ్చినవాన్ఱు'
'తేని ఱచ్చువారు'

స్థూలదృష్టిని ఈ రూపముల యునికిని బట్టికూడ మనము తెలుగుశాసనముల ప్రాచీనతను గుర్తింపవచ్చును. నేను చూచినంతవఱకు, నాకు తెలిసినంత వఱకు క్రీస్తుశకము ఏడవ శతాబ్దికి పూర్వమే శాసనములలో 'తేని' దొరకును.

తొలుదొలుత తెలుగుపదములు సాధారణముగ పరుషాన్వితములుగ నుండెననుట కిదియొక దృష్టాంతము. ఇట్లే నేటి 'గరుసు'—"ఏకభోగంబుగాగ నేలేరు గరుసు కడలి సీమయు గౌతమీ గంగమేర"—ఈ 'గరుసు' ప్రాచీనకాలమున 'కరుసే. ఉదా: 'పులకరుసు.'

'దీని' ప్రాచీన రూపమయిన 'దేని' ('దేన్') అన్నది 'దే+ని'(దే+న్') అనుదాని సమాహారము. మన 'దేన్' రూపము ప్రాచీన కన్నడమున 'ఇదాన్' అయినది. ప్రాచీన కన్నడ శాసనములను జూచిన నిది తేటపడగలదు. ఉదా : 'ఇదాన్ అఱివోన్; 'ఇదానఱిదోన్'. "ఇదాన్", "దేన్" అనురూపములలోని "ఆ" "ఏ" లభేదము కన్నడులకు, మనకు ప్రాచీన కాలముననుండియు సంప్రదాయ సిద్ధముగ వచ్చుచున్నదే. ఈ విషయము అరవము, కన్నడము, తెలుగు భాషలయందలి సర్వనామములను పరిశోధించి స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు ఇదివరకు నిరూపించియే యున్నారు (చూడుడు: లక్ష్మణరాయ వ్యాసావళి: ద్రావిడభాషల యందలి సర్వనామములు). పోలికకు 'నేను' విభక్తులు చూడుడు:

| తెలుగు | అరవము | ప్రాచీన కన్నడము |
|---|---|---|
| నేను; ఏను | యాన్ | ఆన్ |
| నన్ను | ఎన్నై | ఎన్నం |
| నాకు | ఎన్నుడైయ | ఎన్న, ఎన్నయ |
| నాకై | ఎనక్కు | ఎనగె |

ఈ యుదాహరణములనుబట్టి 'ఆన్', 'ఏన్' సంప్రదాయములన్న దానిలోని యర్థము గ్రహింపవచ్చును. ప్రథమా విభక్తియందు తెలుగువారికి 'ఏన్', 'నేన్' రూపములు రాగా కన్నడులకు, అరవలకు 'ఆన్', 'యాన్' రూపములు వచ్చినవి. కన్నడులు 'ఆన్' సంప్రదాయమువారు; తెలుగులు 'ఏన్' సంప్రదాయమువారు. ఈ సంప్రదాయమే 'దీని' తెలుగు, కన్నడ ప్రాచీన రూపములందు పొడకట్టుచున్నది. పూర్వపు తెలుగు శాసనములందు 'తేని' దొరకినట్లే ప్రాచీన కన్నడ శాసనములయందు 'ఇతాన్' రూపము కనబడవచ్చును.

'తేని'లోని 'త'యును, అతను, ఇతను, ఎతనుల లోని 'త'యును ఏకైక శబ్దములు. అతను, ఇతను, ఎతను, అతడు, ఇతడు, ఎతడు, అది, ఇది, ఎది రూపములలో 'తను', 'తడు', 'ది'లు సామాన్యములు. కాగా, అ, ఇ, ఎలు విశిష్టములైనవి. ఇవి నిర్దేశక ప్రత్యయములు: వస్తువు ఫలానది అని నిరూపించి చూపునవి. అతను, ఇతను, ఎతను రూపముల పరిచ్ఛేద మిది: అ+త+ను; ఇ+త+ను; ఎ+త+ను. ఇట్లే అ+త+డు; ఇ+త+డు; ఎ+త+డు. అది, ఇది, ఎదిలలో ని'ది'కిని, 'త'కును పైకి పోలిక లేనట్టు కనిపించుచున్నను ఉన్నదను విషయము 'తేని' రూపమే స్పష్టపఱుచుచున్నది. 'ఇది' యొక్క ద్వితీయరూపము 'దీని'. 'దీని' ప్రాథమికరూపము 'తేని'. ఈ రూపమెట్లు కలిగినది ఇక తేల్చవలసియున్నది.

అది, ఇది, ఎది అనువాని విభక్తి రూపములు చూచినచో ద్వితీయారూపములకు మిగిలిన విభక్తి ప్రత్యయములు చేర్చినయెడల మిగిలిన విభక్తి రూపము లేర్పడుచున్నవని తెలియగలదు.

| ప్ర. | అది | ఇది | ఎది |
|---|---|---|---|
| ద్వి. | దాని | దీని | దేని |
| తృ. | దానిచే | దీనిచే | దేనిచే |
| చ. ష. | దానికి | దీనికి | దేనికి |
| పం. | దానివలన | దీనివలన | దేనివలన |
| స. | దానియందు | దీనియందు | దేనియందు |

'ఇది' ద్వితీయారూపము 'దేని'గ నుండినట్లు శాసనముల వలన దెలియవచ్చుటచేత మనము 'దాని' 'దేని' రూపనిష్పత్తిని గుఱించియే యరయవలసియుండును. 'దేని' ప్రాచీన రూపము 'తేని' యని శాసన ప్రమాణ ముండుటచేత 'దాని' ప్రాచీనరూపము 'తాని' యైయుండవలెను. ఇవి కూడ ఎప్పుడో ఎక్కడో దొరకవచ్చునేమో. నిర్దేశార్థక ప్రత్యయములయిన అ, ఇ, ఎలు తాని, తేనిలో కూడ నుండియుండవలెను — అవి లేనియెడల వస్తునిర్దేశముకాదు గనుక.

'తాని' 'తేని' లలోని 'ని' ద్వితీయా విభక్తి ప్రత్యయము. ఇది పోగా మిగిలినది 'తా', 'తే'లు. అతడు, ఇతడు, ఎతడు, అతను, ఇతను, ఎతను లలోని ప్రధాన శబ్దము 'త' యని ఇదివరకు తెలిపినాను. అదియే యీ రూపములందును ప్రధానమైనది. చూడుడు:

త + అ = తా (జలజ + అక్షి = జలజాక్షివలె)
త + ఇ = తే (తరుణ + ఇందు = తరుణేందువలె)

అందువలన ద్వితీయావిభక్తి రూపములివి:

త + అ + ని = తాని — తాని.
త + ఇ + ని = తేని — తేని.

ఇది 'తేని' రూపనిష్పత్తి.

'తేని' ని గుఱించి శ్రీగిడుగు వేంకట రామమూర్తిపంతులుగారి సంపుటమున వ్రాసినది అవిచార మూలకము.

పూర్వపు తెలుగు శాసనములయందలి సమాస పద్ధతి ఈ క్రింది యుదాహరణముల ననుసరించి చక్కగ తెలియగలదు. ఉదా:

'ఈందని చెఱువు'
'వేల్పు జేని తూర్పునపన్నస'
'కోఱబోయు తటాకము'
'కల్వకురి ఎవ్వోక చేనిసీమ'
'నొఱంబితోటి కయ్యంబు'
'ఉత్తమగండనియిచ్చిన'
'పుల్గొట్టునగాణంబు'
'అశ్వమేధంబున ఫలంబు'
'ఉత్తరంబునపులొంబున'
'తూర్పునదిశ'
'తూర్పునకోటి'
'నిట్టసోముళపడసిన'
'రాచమానంబున'
'పోర్మళ రామ'

'మండయారి పొలగరుసున యిసుపకట్టలచెఱువు క్రడిమి దూబ- (ఇసుపకట్ట).

వాక్యరచన

ప్రాచీనాంధ్ర శాసనములను జూచినచో పూర్వపు తెలుగున వాక్యనిర్మాణమున కొన్ని వింత తీరులు కనబడును. నేటి వాక్యనిర్మాణపద్ధతికి భిన్నముగ గనిపించు నుదాహరణములు కొన్నిటిని శాసనముల నుండి గ్రహించి యీ దిగువ నిచ్చుచున్నాను.

(౧) "దుజయరాజుల ముతురాజులు నవప్రియ ముత్తురాజులు వల్లవ దుకరజులు సాక్షికను ఇచ్చిన పన్నస కొట్టంబునపాఱకు కుణ్డికాడ్లు ళో ఇచ్చిన పన్నస ఇరువదియాడినాల్కు మఱుత్తుఌ నేల."

దుకరజు, సాక్షికను, నాల్కురూపములు గమనింపదగినవి. ఆడి ధాన్యవిశేషము. అఌ, బహువచన రూపము. మఱుత్తు అన్నది ఎకరములవంటి మానవిశేషము. 'ఇరువది'కి 'నాల్కు'కు నడుమ 'ఆడి' వచ్చినది. ఇప్పుడు మన మి ట్లనము.

(౨) "పుద్దణకాలు ఇచ్చిన పన్నస పెన్పాతె ఇశెజేనికి"

(3) "తిరువుళ కయ్యంబునం బొడిచిపడియె తొజ్కుళకు."

(౪) "కుఱ్ఱుమడు వేళువాన్ఱు గగుడ్ల కాడమ్మ శ్రీమెట్టి సోరమడిని కయ్యంబునం బొడిచిపడియె విన్ఱి నాయకున్ఱు."

(౫) "ఎరిగల్ల దుగరాజుల్ ఇచ్చిన పన్నస కొచ్చియ పాఱ రేవసర్మారికి."

ప్రాకృత రూపములు

పూర్వపు తెలుగు పదములలో ప్రాకృత సంప్రదాయము ఎక్కువగ గనబడును చూడుడు :

సక్కి బసర గద్దె; గద్దిన ఆణతి
గోయిద జోయకొట్టంబులు దమ్మువులు
బెజెయిత్త బెజెయరాజు బెజెయేశ్వరంబు
చంద్రాయిత్తకాలము పరియారువు కంద
(స్కంద) అగరము (అగ్రహారము) ;

పహింఁడి (పసిడి) - పయిండి - పయిడి -
పైడి ;
[నాహిండు - నాయిండు - నాఇండు -
నేడు].

కొన్ని వర్ణ పద విశేషములు

ప్రాచీనాంధ్రమున వింతవర్ణములు రెండు కలవు. అందొకటి అడ్డుగీటులేని బండిఱను పోలిన (ఴ) వర్ణము. దీనిని 'ష్జ' యందురు. ఇది ప్రాచీనాంధ్రముననే కలదు. నన్నయ తరువాతికాలమున ఴ, ల, డ, హ, ష గమారి, మనభాషలో లోపించి పోయినది. ఈవర్ణముతో గూడిన పదము లనేకములు కలవు. ఉదా :

పొగఴు ఏఴువేలు తోఴ
పఴుమఴి లేట్టికోఴు పుఴోలి
అఴిసిన కొఴొచ్చు కొఴల్చుము॥

వీనిలో 'కొఴొచ్చు' పదమురూపాంతరము 'క్ఴోచు'. ఈపదమునందలి 'ఴ' వర్ణము తరువాత 'ఱ' గ మారినది. అప్పు డివి 'కొఱొచ్చు', 'క్ఱోచు'- 'కొఱొచ్చు', 'క్రోచు' యగును. దీర్ఘము హ్రస్వము కాగా 'క్రొచ్చు' యైనది. 'క్రొచ్చు' 'గ్రొచ్చు' అయినది.

"గ్రొచ్చి కోరాడి త్రవ్వరి కుతలమెల్ల"
—భాగవతము.

'క్రొచ్చు', 'గ్రొచ్చు'ల ప్రేరణరూపము 'క్రొప్పించు', 'గ్రొప్పించు'.

"పెంచెం జట్టలనెల్లఁ బేర్మివెలయం
బెట్టించె సత్రంబు గ
ట్టించెం భక్తి శివాలయంబు లిలఁ ద్రొ
ఢిం దాల్చి యొప్పంగఁ గ్రొ
ప్పించెం బూర్ణతటాకముల్ ......"

రెండవ వింతవర్ణము 'వాన్ఱు'లోని "ఱ". ఇది కేవలము 'ఱ' కాదు. నాలుక మడతవేసి పలికినప్పటి 'ఱ' రూపము. ఇది సగము 'ట'గను, సగము 'ఱ' గను పలుకును. ఇది ప్రాచీనాంధ్రశాసనములలో 'వాన్ఱు', 'మగన్ఱు', 'మూన్ఱు', విన్ఱి నాయకున్ఱు' అనుపదాదులలో గనబడును. ఈ 'న్ఱు' చివరికి 'ండు' గా మారిన దందురు. 'వాన్ఱు' అను దాని కిప్పుడు 'వాడు', 'మూన్ఱు' అనుదానికి 'మూడు' అని ఈవిధమున ఆపదముల పరిణామమును దెలిసికొనవచ్చును. దీనినిగురించి ముందు విపులముగా భారతిలో వ్రాసెదను. ఈ వింతవర్ణము 'ఈఴ్లు' అనుదానిలోకూడ గనబడును. 'ఈఴ్లు' అన్నది 'ఈఴు' రూపాంతరమని నేను భావించుచున్నాను.' 'ఴు' బహువచన ప్రత్యయము. 'పాఴ' లోని 'ఴ' యును బహువచన ప్రత్యయమే అందురు. 'పాఴ' అనగా బ్రాహ్మణులు : దీని ఏకవచనము 'పాడు'. చూడు డీ యుదాహరణము :

"దేని నిల్పినవానికి వేగుఴ్ఴుము వేసెఴువుళు వేవాన్ఱూఴ్ఴు నిల్పిన పుణ్యంబు."

'వే' యన వేయి. 'వేవాన్ఱూఴ్ఴు' = వేయి పాండూఢ్ళు - వేయిపాండూళ్లు - వేయిపాఁడూళ్లు అనగా వేయి బ్రాహ్మణాగ్రహారములు. పాఁడు అనగా బ్రాహ్మణాగ్రహారమని ప్రప్రథమమున గుర్తించినవారు, 'వేవాన్ఱూఴ్ఴు' అనగా వేయి బ్రాహ్మణాగ్రహారములని చెప్పినవారు పూజ్యశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. 'పాఴ' వంటిదే 'చూపఴ'. చూపఴ యన చూచువారు అని యర్థము.

'ఇఴ్లి' అనుదానిలోకూడ నీ వర్ణము వచ్చును. 'ఇట్లు' అగునేమో యని నే నూహించుచున్నాను. 'ఇఴ్లి కానుఎవెఴుఴ్గువారు', 'ఇఴ్లికావెఴుగువారు' అను వాక్యము కడు ప్రాచీన శాసనములు కొన్నిట గానవచ్చును. ఇది యానాటి నుడికారపు పొందికయేమో. 'ఇట్లనియే యెఴుగువారు' అని దాని యర్థమై యుండునని నా యూహ.

పూర్వపు తెలుగు

నా కింతవఴకు లభించిన మొట్టమొదటి సంపూర్ణాంధ్రభాషా శాసనము ఆఴవ శతాబ్ది నాటిది. దీనిని నే నిదివరలో స్వర్గీయ శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి 'కమ్మెమొరేషన్' సంపుటములో ప్రకటించినాను. దానిని మగల ఈక్రింద నిచ్చుచున్నాను:

"స్వస్తి [।*] శ్రీ సోఴమహారాజు ల్లొళన ఇన్పుఴోలి అఴపోతులు రేవణకాలు పుద్దణకాల్ఴు

ఇచ్చిన పన్నస పెన్నాతె ఇశెజేనికిన్ [|*] తేని టిచ్చిన వాన్డు పఞ్చమహాపాతకు న్డకున్[||*]"

మఱియొక శాసనము :

"మణయ శమ్మణ గణయ శమ్మణ వృద్ధ శమ్మణ ఇ మువ్వుర ఒకాడుబోళచేత శవణ గొణిరి [||*] ఇఙ్ల కావెలుగువారు[||*] సమతిబోళుము విసబోళుము పట్టి ముకున రట్టొల్లు పుణ్యసాల్లు వన్దిబోళుము ఇన్ధొఱు దినికి సక్షి [||*] అళుగరాలన్వారు విషయబోళ కొణిరి [||*]

క్రిందిగీటుమీఁది యక్షరములలోని 'అ' వింత యక్షరముగ చెప్పబడిన 'అ'. ఇది తరువాతి కాలమున 'డ'గ మారినది.

ముగింపు

నన్నయకు పూర్వము తెలుగు ఎట్లుండెడిది అను విషయమును దెలిసికొనుటకు ఈ వ్యాసము ఒక దిఙ్మాత్ర సూచన. నన్నయకు పూర్వపు తెలుగు శాసనములను మననము చేసి మథించి తీయవలసిన అమూల్య రత్నాదికము లెన్నో యున్నవి. ఇప్పటికి ప్రకటితము లయిన నన్నయకు పూర్వపు తెలుఁగు శాసనములు చాలకొద్ది. రాయలసీమలోను, నెల్లూరు మండలములోను పర్యటనముచేసి సేకరింపవలసినవి చాల కలవు. ఈ శాసనము లన్నిటిని అవలోడనము చేసి, చక్కఁగ పరిశోధక దృష్టితోచదివి మననము చేసినచో నన్నయకు పూర్వము తెలుగు స్వరూపమును బాగుగ తెలిసికొనుట కవకాశము కలుగునని నా విశ్వాసము. అంత సమగ్రమయినది కాకపోయినను ఆభాష కొక వ్యాకరణము వ్రాయుటకును వీలగునని నాయభిప్రాయము.

చెప్పవలసిన విశేషము లింకను అనేకము లున్నను గ్రంథవిస్తరభీతిచేత ఈ వ్యాసము నింతటితో ముగించుచున్నాను.



భద్రాచలములో స్వామి యూరేగింపు

ద్రావిడభాషలలో

# అఱవము పురాతనమైనదా?

## తెనుఁగు అఱవమునుండి పుట్టినదా?

—కానేకాదు, కానేకాదు, కానేకాదు—

విమర్శకాగ్రేసరులైన కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి అముద్రిత రచనలలో దాగి మూలపడియుండిన ఇటువంటి ఉత్తమవ్యాసమును ప్రకటనార్థము దయతో మాకు పంపిన శ్రీ సోమశేఖరశర్మగారికి మే మెంతయు కృతజ్ఞులము.

—సంపాదకుడు.

ద్రావిడ భాషలలో మిక్కిలి పురాతన మైనది యేది? ఈ ప్రశ్నయే విచిత్రమైనది. ఒక మూలపురుషుని సంతతివారైన పదికుటుంబముల వారిలో ఎవరి కుటుంబము ఆధునికము అని అడిగిన నేమైన అర్థము కలదా? అన్ని కుటుంబములవారిలోను మూలపురుషుని రక్త ముండుటచే నన్ని కుటుంబములును మూలపురుషుఁ డెంత పురాతనుఁడో అంత పురాతనములని చెప్పవలెను. అంతియగాని ఒక కుటుంబముకంటె వేఱొక కుటుంబము పురాతన మనుటకు వీలులేదు. అట్లే యొక కుటుంబమందలి భాషలను గుఱించియు నెఱుంగునది. ఒక నదీప్రవాహము రెండు పాయలుగాఁ జీలినప్పు డందలి యొక పాయ మాత్రము మూలనదియనియు, రెండవది కాదనియుఁ జెప్పవచ్చునా? ఒకదానికి మూల నదీనామ ముండుటయు, రెండవదానికి వేఱు నామ ముండుటయు వ్యావహారికము కాని పారమార్థికము కాదు. కావున నిప్పుడు వాడుకలోనున్న ద్రావిడ భాషలన్నియు మూల ద్రావిడభాష యెంత పురాతనమో అంత పురాతనములే. ఒక దానికంటె మఱి యొకటి ప్రాఁతదియనుటకు వీలులేదు. అట్లే అన్నియు మూలభాషనుండి పుట్టినవియే. పైతృకముపై నన్నిటికిని సమానమైన హక్కుండును. కావున అఱవభాష పురాతన మైనదనియు, నితర భాషలు దానికంటె నిటీవలివనియుఁ జెప్పుట సరికాదు.

అఱవభాష యితర భాషలకంటె మూల ద్రావిడ భాషలకు నెక్కుడు సంబంధము కలదియనియు, మూలభాషా స్వరూప మిందు నెక్కుడు కనఁబడుచున్నదనియు కాల్డ్వెల్ మొదలయినవారు మొదట వ్రాసిరి. కాని యిటీవలి శాస్త్రశోధకు లామతము నంగీకరింపలేదు. ఇందును గుఱించి హిందూదేశమందలి లింగ్విష్టిక్ సర్వేకు నాయకుఁడైన గ్రియర్సన్ ఇట్లు వ్రాసియున్నాఁడు:

“అన్ని ద్రావిడ భాషలకు జననియైన మూల ద్రావిడ భాషయొక్క పూర్వ స్వరూపము నందలి చాలయంశములను పోనీక పట్టుకొని వచ్చిన భాష అఱవమని సాధారణముగ నందురు. ఈ మాట నిజముకాదని కొన్నించినపట్ల ఈ గ్రంథముయొక్క ఆయా పుటలలోఁ జూపఁబడును. తెలుఁగు మొదలయిన యితర ద్రావిడ భాషలలో నఱవమునందుకంటె నెక్కుడు పురాతనములైన పూర్వకాలపు విశేషరూపములు కలవు. ఆ భాషలింకను అధిక పురాతనకాలమందలి మూల ద్రావిడ భాషాభివృద్ధియొక్క స్థితిని దెల్పును. కావున నఱవ మితర భాషలవలెనే యొక ఉపభాషయనియు, ఇతర భాషలకంటెను తాను ముసలిదాననుటకు దానికి హక్కు లేదనియుఁ జెప్పవలెను.”[1]

ఇట్లన్ని ద్రావిడ భాషలలోను మూల భాషయందుఁ గల పురాతన రూపములు కలవు. కొన్నిటియందుఁ గొన్ని విశేషములు కలవు. మఱికొన్నిటియందు మఱికొన్ని విశేషములు కలవు. కొన్ని పురాతన రూపములు కొన్ని భాషలలో మిగిలియున్నవి; మఱికొన్ని మఱికొన్ని భాషలలో మిగిలియున్నవి. ఇంతియ భేదము. అఱవభాషలో

1. *“Tamil has usually been considered to be the Dravidian language which has preserved most traces of the original form of speech from which all other Dravidian dialects are derived. Some points will be drawn attention to in the ensuing pages where this does not appear to be the case, and in many peculiarities other Dravidian languages such as Telugu have preserved older forms and represent a more ancient state of developement. It would therefore be more correct to describe Tamil as a dialect like the other ones, without any special claim to antiquity.”*

*—Linguistic Survey of India, Vol. IV, p. 283.*

లేనట్టివియు, నాంధ్రభాషయం దున్నట్టి వియు నగు కొన్ని పురాతనరూపము లచ్చటచ్చటఁ జూపెదనని గ్రియర్సన్ చెప్పెను గాని, తరువాత నెచ్చటను * జూపినవాఁడు కాఁడు. కావున నట్టివి నేను కొన్ని చూపెదను. ఈ క్రింది శబ్దములను జూడుఁడు :

| [తెలుఁగు] | [అఱవము] | [కన్నడము] |
|---|---|---|
| మ్రాను | మఱమ్ | మర |
| వ్రేలు | విరల్ | |
| ప్రొద్దు | పొడుదు | పొద్దు |
| వ్రత్తు | ఉరత్తు | |
| త్రిప్పు | తిరుప్పు | తిరుపు |
| ప్రత్తి | పరుత్తి | |
| వ్యాజ్యము | వియాజ్జియం | |
| ప్రోలు | పొఢ | పొసల్ |
| క్రొత్తళము | కొత్తళై | కొత్తళ |
| త్రుళ్లు | తుళ్లు | తుళ్లు |
| త్రుప్పు | తురు | |
| మ్రోగు | ముఱుంగు | |
| క్రుంగు | కురుంగు | |
| క్రఁగు | కరంగు | |
| ప్రబ్బు | పరవు | పర్బు |
| గ్రుడ్డి | కురుడన్ | |
| క్రొవ్వు | కొడుప్పు | |

ఈ పట్టికలో నీయంబడిన శబ్దములు తెలుఁగున సంయుక్తాక్షరయుతములుగను, అఱవమున సంయుక్తాక్షరములు విడిపోయి నవిగను ఉన్నవి. సంయుక్తాక్షరములు గల శబ్దములు మొదటివిగ నుండుననియు, తరువాత నందుండి వికృతిశబ్దములు పుట్టు నప్పుడు ఉచ్చారణ సౌకర్యార్థమై సంయుక్తాక్షరములు విడఁదీయఁబడుననియు నందఱకుఁ దెలిసిన విషయమే. ప్రాకృత వ్యాకరణములఁ జూచిన ఈ విషయము స్పష్టపడఁ గలదు. కావున,సంయుక్తాక్షరముతోఁ గూడు కొనిన శబ్దమొకటియు, అందలి యక్షరములు విడిపోయి అయిన యదే యర్థమిచ్చు శబ్ద మొకటియు నుండెనేని మొదటిది ప్రకృతి యనియు, అనఁగా మూలశబ్ద మనియు, రెండవది వికృతియనియు మనము నిశ్చయింప వచ్చును. మ్రాన్ శబ్దమందలి మకార రకారము లుచ్చారణ సౌకర్యార్థము చీలి అఱవము కన్నడములందలి 'మఱ' మయ్యె ననుకొనుట సహజముకాని, అఱవమునందలి మకార అకారములు కలిసి తెలుఁగున 'మ్రా'నయ్యె ననుకొనుట స్వభావ విరుద్ధము. వికృతి యెప్పుడును శబ్దోచ్చారణము సులభము చేయునేకాని కఠిన పఱచదు. ఇట్లే 'వ్రెల్' మొదటి రూపము. 'విరల్' అందుండి పుట్టిన తద్భవము. ఈ పట్టికయందలి తెనుఁగు పదముల రూపములు మూల ద్రావిడభాషలోనివియనియు, ఇతర భాషలలోని రూపములు వానినుండి పుట్టిన వనియు మనము నిశ్చయపఱచుకొన వచ్చును. తాత్పర్యమేమనఁ దెనుఁగు మొదలైన భాషలలోఁగూడ అఱవమునందు కంటెఁ గొన్ని పురాతన శబ్దములు కలవు. తెనుఁగునఁగూడ వ్యావహారిక భాషలలో నీ సంయుక్తాక్షరములలోనుండి రేఫము జారినది. వ్యవహారమందు మాను, వేలు, పొద్దు, వత్తు, తిప్పు, పత్తి అను రూపములే గాన వచ్చుచున్నవి. కావున రేఫయుక్త రూపములు మిక్కిలి పురాతనములనుటకు సందేహము లేదు.

> శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణ రావు పంతులుగారు ఆంధ్రభాషా చరిత్రము విషయమున గొప్ప పరిశోధన చేసినారు. శ్రీ శేషగిరి శాస్త్రిగారి తరువాత ఆంధ్రభాషను గుఱించి ఎక్కువగా పరిశోధన చేసినవారు శ్రీ లక్ష్మణరావుగారే. కాని ఆంధ్రుల దురదృష్ట వశమున ఈ విషయము దేశమునకు తెలియ రాకుండ పోయినది. ఈ చిన్న వ్యాసము వారి భాషావిషయక కృషిలో ఒకచాలిక.
>
> —మల్లంపల్లి సోమశేఖరశర్మ.

ఇంకఁ గొన్ని శబ్దములఁ జూడనగును. తెనుఁగు 'గ్రుడ్డి' అఱవమున 'కురుడన్'. గ్రుడ్డి,గురుడి,కురడన్ అని మారుట సహజము గాని, దానికిఁ దలక్రిందుగ మారుట స్వాభావికముకాదు. తెలుఁగు – ప్రా; అఱవము – పఱ (ఉదా: ప్రాయిల్లు. పఱయిల్). ఇచ్చట ప్రా, పర, పఱ అని మారి యుండవలెను. తెలుఁగు – క్రీ; అఱవము — కీఱ్ (ఉదా: క్రీఁగాలు, కీఱ్కాల్). క్రీ, కిర్, కీఱ్ అని మారియుండవలెను. ఱకారము రకారముగను, రకారము ఱకారముగను మారుట ద్రావిడభాషలలోఁ గలదు.

ద్రావిడ భాషలలో 'ఱ' – శకటరేఫ ముండుట అందఱకుఁ దెలియును. దీని విశేష మేమనఁ బూర్వము దీనికి స్వతంత్రోచ్చారణ ముండి, యది క్రమముగ నశించి, రేఫయొక్క యుచ్చారణమును, దీని యుచ్చారణమును సమములయినవి. ఉచ్చారణ లోపించిన కొలఁదిని పూర్వము 'ఱ'—బండి రాగఁ బల్కఁబడిన శబ్దములు క్రమముగ రేఫయుతములుగఁ బల్కఁబడఁజొచ్చె. ఒక భాషలోఁ గొన్ని శబ్దములు 'ఱ'యుతములుగను, మఱియొక భాషలో 'ర'యుతములుగను ఉన్నయెడల బండి ఱ యుత రూపములు పురాతనములని నిశ్చయింప వచ్చును. ఈ క్రింది శబ్దములు తెలుఁగున 'ఱ'తోను,అఱవమున 'ర'తోను వ్రాయఁబడును. కావున తెనుఁగు రూపములు అఱవరూపములకంటె నెక్కుడు పురాతనములని చెప్ప వలెను.

| [తెలుఁగు] | [అఱవము] |
|---|---|
| వఱపు | వరై |
| తీఱు(ముగియు) | తీర్ |
| ఎఱుపు | ఎరుపై |
| తేఱు | తేర్ |
| తెఱవ | తెరివై |

ఈ క్రింది శబ్దముల రూపములఁ జూడ నగును:

| [తెనుఁగు] | [అఱవము] |
|---|---|
| రెప్ప | ఇరప్పై |
| రెక్క | ఇరగు |
| ఱెక్క | ఇఱక్కై |

| | |
|---|---|
| రేయి | ఇరవు |
| రోలు | ఉరల్ |
| రేకు | ఇరెక్కు |
| రేడు | ఇఱైయన్ |

రకార లకారములతోఁ బ్రారంభమైన యక్షరములను ఉచ్చరింపలేక యఱవవారు వానికిఁ బూర్వ మొక యచ్చును చేర్చుకొని పలుకుదురన్నమాట అందఱకు విశదమే. ఉదా: రామ, ఇరామన్; లోక, ఇలోకం; లోహ, ఉలోహం — ఇత్యాది. అట్లే పైని ఉదాహరించిన శబ్దములలో రకారముతోఁ బ్రారంభమగు రూపము మొదటిది యనియు, అచ్చుచేర్పఁబడిన రూపము తరువాతది యనియు మన మూహింపవలెను. అట్లుగాక ఇరవ్పై అను రూపములే మొదటివి యనియు,వానిలోని మొదటి యచ్చులు కప్పగంతువేసి రకారమందలి అచ్చులోఁ గలిసి తెప్పమొదలైన రూపములు సిద్ధించెననియు చెప్పు లాక్షణికులు కొందఱు కలరు. కాని యది స్వభావ విరుద్ధమని నా తాత్పర్యము. 'ఇరవు'నుండి 'రేయి' అయిన దనినయెడల 'ఇరాత్రి'నుండి సంస్కృతమందలి 'రాత్రి' పుట్టినదని యేల చెప్పరాదు ? అచ్చు పూర్వమందుఁగల రేఫ ముచ్చారణకు సులభము. అట్టి సులభశబ్దమును కఠిన శబ్దముగా మార్చుట యస్వాభావికము. కావున నిందలి తెలుఁగు రూపములు పురాతనము లనియు, నఱవ రూపములు ఆధునికము లనియుఁ జెప్పవలెను.

ఈ విధముగనే సంయుక్తాక్షరములులేని కొన్ని శబ్దములయొక్క నేఁటి తెలుఁగురూపములు నేఁటి అఱవ రూపములకంటెఁ బురాతనపువి యైనట్లు కానవచ్చుచున్నది. ఉదాహరణమునకై నాల్క(నాలుక)శబ్దముఁ దీసికొనుఁడు.అఱవమునదాన్ని(నాక్కు)అందురు. కాని మిక్కిలి పురాతనకాలపు అఱవమునందు 'నాల్కు' అన్న రూప ముండెను. కరికాలచోళుని వర్ణించిన పొరునర్ ఆత్తుపడై అనుకావ్యమున ఈశబ్దము కలదు.[1] ఇందువలన ఈరూపమే మూలద్రావిడ భాషయందు నుండెననియు, ఆంధ్ర తమిళ భాషలు విడిన తరువాతఁ గొంతకాల మారూపము తమిళ భాషలో నుండెను కాని తరువాత మాఱినదనియు, ఆంధ్రభాషమాత్ర మారూపమునే పోషించుచుండఁబట్టుకొని వచ్చుచున్న దనియుఁ దెలియుచున్నది.

ఇట్లే కొన్ని శబ్దముల మూలార్థములు తెలుఁగున నిలిచియున్నవి; ఇతరభాషలలో మాఱినవి. 'మగఁడు' శబ్దము తీసికొండు. దీనికిఁ బూర్వపు టర్థము మగవాఁడు, పురుషుఁడు, మనుష్యుఁడు. ఈయర్థము దీనికిఁ దెనుఁగున నేఁటివఱకు నున్నది. తిక్కన కాలమువఱకు బాగుగనుండెను. కాని అఱవమునను, కన్నడమునను ఈ రూపమునకు కుమారుఁ డన్న యర్థము కలిగినది. కాని మూలార్థము దీనికిఁ దెనుఁగులో నున్నదియే యనుటకుఁ బ్రాఁతయఱవమునందు నీపద మీయర్థమునం దున్నది. ఇదియుఁగాక ద్రావిడభాషలలో మనుష్యుఁ డన్న యర్థము గల పద మింకొకటి లేదు.

ఇన్ను, అన్ను మొదలయినవి తెలుఁగులో స్థలవాచకములు; కన్నడమునఁ గాలవాచకములు. తెలుఁగులోనువలె నివి మొదట స్థలవాచకములుగనే ఉండెననుటకు దృష్టాంతము పురాతనపు అఱవమున 'ఇన్ను' అనఁగా ఇక్కడ అను అర్థమునసే వాడఁబడియున్నది.

ఇట్లే యితరభాషలలో లోపించిన కొన్ని వ్యాకరణరూపములు కూడ నాంధ్రమునఁ గానవచ్చుచున్నవి. తెనుఁగున, తద్ధర్మమునందు నుత్తమపురుష బహువచనము 'పోదుము' అని కలదు. ఇప్పటి అఱవమున ఈ రూపము కనఁబడదు. కాని పురాతన గ్రంథములలో అఱవమున 'పోదుమ్' అన్న రూపము అఱుదుగఁ గానవచ్చెడిని.[2] ఇందువల్ల మన మేమి గ్రహింపవచ్చును? పూర్వద్రావిడమునందలి రూపము తెలుఁగున ఉండిపోయినది; అఱవమున మాఱిపోయినది.

## అఱవమునుండి తెనుఁగు పుట్టినదా ?

కొంద ఱఱవమునుండి తెనుఁగు పుట్టినదని చెప్పెదరు. అఱవమునకును, తెనుఁగునకును సంబంధముకలదని యీ చెప్పువారి భావమని మన మిందుకు నర్థముచేసికొనవలెను. ఈ యర్థమునందు నఱవమునుండి తెనుఁగు పుట్టినదన్నను, తెనుఁగునుండి అఱవము పుట్టినదన్నను ఒక్కటియే. కాని యిప్పుడున్న అఱవమునుండి యిప్పటి తెనుఁగు పుట్టినదన్న నమ్మఁదగినమాట కాదు. ఇప్పుడు వాడుకలోనున్న యీరెండు భాషలును ఒకదానిలో నుండి మఱియొకటి పుట్టియుండుట యసంభవము. అవి మొదటినుండియు వేఱువేఱుగ నైనను ఉండవలయును. లేదా మఱియొక భాషనుండియైనను పుట్టియుండవలెను. వ్యవహారమునందున్న భాష యెప్పుడును మాఱుచుండును. రెండువేల యేనూ ఱేండ్లక్రింద నఱవమును, ఆంధ్రమును చీలిన వనుకొందము. అప్పటిమూలభాష యేదియో దానినిఅఱవము అని అనవలయునా?ఆంధ్రము అనఁగూడదా? అది రెండిటికి సమానమేకావున నిప్పటి అఱవమునుండి యిప్పటి తెనుఁగు పుట్టినదనుట తప్పు. అప్పటి అఱవము ఇప్పటి అఱవము కాదు. అప్పటితెనుఁగు ఇప్పటితెనుఁగు కాదు. కొంతవఱకుఁ గాకపోలేదు. కావున నఱవమునందలి'నీన్దు'లోనుండి'ఈఁదు'పుట్టిన దనఁగనే అఱవమునుండి తెనుఁగు పుట్టినదని అనుకొననక్కఱలేదు. మూలద్రావిడభాషలోని నీన్దు ధాతువు నఱవ మట్లే ఉంచుకొనె ననియు, తెలుఁగు 'ఈఁదు'గా మార్చుకొనె ననియు నర్థము చేసికొనవలెను.

1. *Purnalingam pillai's Tamil Literature*, P. 30

2. *Beschi's Shen-Tamil grammar.*

# రామకృష్ణుని 'పాండురంగ' కృతి

నాలుగైదు గంటముపోట్లతో మాటలకు జీవముపోసి
సచేతనమైన వ్యక్తిని దృగ్గోచరము చేయించు మహిమ
ఇతని కావ్యకళయందుఁ గానవచ్చుచున్నది

శ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్య

రామకృష్ణకవి విరచితములైన కావ్యములలో పాండురంగ కృతి సర్వవిధముల ప్రశంసనీయము. అది రసాస్వాదన పరాయణులగు విమర్శకుల యాదరమున కన్నియుగములందును గురియై, కావ్యప్రియులకుఁ బోలె భక్తజనులకుఁ బఠనీయగ్రంథ మైనది. "ఏ గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా" యను చేమకూరవారి నిశ్వాసోక్తు లీ కవికావ్యములకు—ముఖ్యముగాఁ బాండురంగ కృతి కన్వయింపవు. క్రీ. శ. 16-వ శతాబ్దోత్తరార్ధమున నుండిన కాకమానిమూర్తి, సగర్వముగ

"అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగవిభుని పదగుంభనంబును
గాకమానిరాయ నీకెతగుర."

యని తన్నుఁ బ్రశంసించుకొనియె. నాఁటి నుండి నేఁటివఱకుఁ బండితులు, కవులు, విమర్శకులు నేక గ్రీవముగ నీకావ్యరత్నము నిగ్గున కబ్బురమంది మెచ్చుకొనిరి. వీరేశలింగమువంటి మడిగట్టుకొనిన విమర్శకుఁడు సహితము రామకృష్ణుని శీలమును దెగనాడినను కవిత్వమును మెచ్చుకొనెను.

"ఇతఁడు రచియించిన పుస్తకము పాండురంగ మాహాత్మ్య మను స్థలపురాణము. ఇందు గొన్ని వర్ణనలు విలక్షణముగానుండును. "పాండురంగవిభుని పదగుంభనంబును" అన్నట్లీతని కవిత్వము పదముల కూర్పుచేత మేలిమిగన్నది. అందునిరర్థకములైన పదము లెక్కడనో కాని కానఁబడవు.... మొత్తము మీఁదఁ బదసందర్భ మితనికిఁ గుదిరినట్లు మఱియొక కవికిఁ గుదిరిన దని చెప్ప వలనుపడదు"1

పాండురంగమాహాత్మ్యమును వీరేశలింగముగారు స్థలపురాణమనిరి. నిక్కమే. కాని పాండురంగక్షేత్ర మాహాత్మ్యమును గొనియాడుచున్నను దీనిఁ గేవలస్థల పురాణముగఁ బరిగణింప వలనుపడదు. రామకృష్ణుఁడే తన కావ్య స్వభావము నిట్లు సూచించి యున్నాఁడు:

ఉ. "స్కాందపురాణనీరనిధి
కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోద్యమము
నవ్యకవిత్వకళా కలాపమున్
కుందనమున్ ఘటించి కడు
గ్రొత్తగు సొమ్మొనరించి విష్ణుసే
వం దిలకించు నప్పరమ వైష్ణవ
కోటి నలంకరింపుమా."2

అనఁగా, కథావస్తువును స్కాందపురాణమునుండి కొని, దానికి నవ్యకళా కలాపముచేఁ గ్రొత్తరూపముఁగల్పించి, సర్వాలంకార యుక్తమైన నూతనకావ్య నిర్మాణమునకుఁ గడంగెనని విశదమగుచున్నది. ఇట్టి కావ్యమునే రామరాజభూషణుఁడు మిశ్రకావ్యమని పేర్కొన్నాఁడు.

ఉ. "కేవల కల్పనాకథలు
కృత్రిమరత్నము లాద్యసత్కథ
ల్వావిరిపుట్టురత్నము లవారిత
సత్కవికల్పనా విభూ
షావహ పూర్వవృత్తములు
సానలఁదీసిన జాతిరత్నముల్"'

మిశ్రకావ్యరచన ప్రబంధ పగమేశ్వరుని దినములందు మొలకయెత్తి, యాంధ్రకవితాపితామహునికాలమునకు సంపూర్ణ పరిణామమునంది ప్రబంధమై మార్పుజెందెనని కాశీ పిపాసకు లొక్కరు వ్రాక్రుచ్చిరి.3 ఇది నిరాధారమైన వ్రాఁత. రామరాజభూషణునిచే నిరూపింపఁబడిన స్వభావముగల మిశ్రకావ్యము క్రీ. శ. 16-వ శతాబ్దమునకుఁ బూర్వము రచింపఁబడినది యొక్కటియేనియు నేఁటివఱకు బయల్పడలేదు. మఱి సాళువగుండ నరసింగరాయని కాలమునకు ముందు మిశ్రకావ్య మను పే రాంధ్రవాఙ్మయమున నెచ్చటను గానరాదు. నా యెఱింగినంతవఱకు మిశ్రకావ్యమునుమొదట పేర్కొనినవాఁడు పినవీరభద్రుఁడు. కావ్యములు త్రివిధము లనియు, అందు మిశ్ర కావ్యమొకటియనియుఁ దెల్పినాఁడు.

శా. "ప్రఖ్యాతంబన మిశ్రబంధమన ను
త్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగు వస్తువందు మఱి య
ధ్యాహారముం జేయఁగాఁ

---

1. ఆంధ్రకవుల చరిత్రము, పుట 272.
2. పాండు. ఆ. 1 : 26.
3. కవిత్వవేది: ఆంధ్రవాఙ్మయ సంగ్రహము, పుట 120.

"ప్రఖ్యాతం బని వృత్తమైన కృతి చె
ప్పన్వ్యక్తకు న్నొసగితగుణ్
విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమ
న్విశ్వంభ రామండలిన్."

మఱియు నిట్టి కావ్యమునకు,

క. "శృంగారము ముఖ్యంబగు
సంగియు నంగములు దలంప నష్టరసములు
న్సాంగమగు నేని దంకము[వొంగున్."
బంగారముతోడి యొరప్రబంధము

అని నిర్వచించి,

గీ. "భారతప్రోక్తకథమూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీవహింప". 4

"మిశ్రబంధంబుగా శాకుంతలం బను ప్రబంధంబు బంధురప్రీతిం జెప్పఁబూనితి" నని చెప్పియున్నాఁడు. కావున వాఙ్మయ చరిత్రయందు మనకుఁ బ్రస్తుతమునఁ గల జ్ఞానము ననుసరించి పినవీరభద్రుఁడే మొదటి మిశ్ర ప్రబంధ కర్త యని తాత్కాలికముగ సిద్ధాంతీకరించవచ్చును. తత్పూర్వము పై త్రివిధకావ్యవిభజనయు, మిశ్రబంధములును చిరపరిచితములై యుండవచ్చును. కాని యిదమిత్థ మనుట కాధారము లెవ్వియుఁ గానరావు.

మిశ్రకావ్యస్వరూపము నిచ్చట నిర్వచించుటకుఁ గారణము లేకపోలేదు. కవి చెప్పినట్లు పాండురంగకృతి పరమభాగవత చరిత్రయే యైనను మిశ్రకావ్యపుఁబోకడ లిం దెన్నేనియుఁ గలవు. మిశ్రకావ్యములఁ బోలి దీనికిని శృంగారము ముఖ్యంబగు నంగి. ఇందలి పరమభాగవతులయం దెవ్వరు నిసుప కచ్చడా ల్గట్టుకొనినవారు కారు. కావ్యము యొక్క సత్తా కనుఁగొనఁదలఁచువారికి కావ్యకర్త యే యాదర్శములను దృష్టియం దుంచుకొని కావ్యరచనకుఁ గడంగెనో తెలిసికొనుట ప్రథమ కర్తవ్యము. వాని నెఱుఁగక కావ్యవిమర్శనకుఁ బూనుకొనుట చుక్కానిని విడిచి యోడ నడుపఁ బ్రయత్నించినట్లగును. రామకృష్ణుఁడు రచించినది మిశ్ర కావ్యము. ఇందు కథా కల్పన ప్రధానము కాదు. బుద్ధిబలముచేఁ బేనఁబడిన కథ లాకాలపు రసికుల యాదరమునకుఁ బాత్రములు కావయ్యెను. కళాపూర్ణోదయమువంటి కల్పనాకథలు 'కృత్రిమ రత్నము' లని నిరసింపఁబడెను. అఖండ ప్రతిభాశాలి యని నేటియాంగ్ల విద్యాపారీణులచే నాంధ్ర వాఙ్మయ విమర్శక మహాశయులచేఁ గొనియాడఁబడు పింగళిసూరన "ఊహించి తెలియ రాకుండ సూరపరాజు భ్రమఁ గళాపూర్ణోదయము రచించె"నని పరిహసింపఁబడెను. నాఁటికవుల ముఖ్యోద్దేశము, గ్రహించిన ఇతివృత్తమును నానావిధాలంకారములతోడను, వర్ణనలతోడను గై సేయుటయే. వర్ణనలయందును, శబ్దార్థాలంకారములయందును వారు యావచ్ఛక్తిని వినియోగించిరి. ఇతివృత్తములు వర్ణనాదులకు దగిలించుట కనువులగు మేకులాయెను. వర్ణనాదులతోఁగూడ కథను సహితము కొందఱు పోషించిరి. వీరి సంఖ్య యల్పము. కావున పాండురంగ మాహాత్మ్యమునేకాక రాయల కాలమున వెలువడిన కావ్యముల గుణావగుణములను పరామర్శింపఁ బూనినపు డీవిషయమును దృక్పథమున నెల్లప్పు డుంచుకొనవలయును. ఆంగ్లేయ విద్యాకర్మాగారముల రూపొందిన సులోచనములను ధీచక్షువుల ధరించి యాంధ్రకవిత్వ తత్త్వవిచారముఁ జేయఁగడంగినచో పూర్వకవుల యెడల నపచారము నేయుటయేకాక విమర్శకులు స్వయము పరిహాసమునకుఁ బాత్రు లగుదురు.

పదగుంభనమునకు రామకృష్ణుఁడు పేరెక్కిన కవియని పెద్దల సిద్ధాంతము. నిరర్థకపద ప్రయోగ మరుదు. సంస్కృత సమాసముల క్రొత్తపోయగమునను, వింత దనమునను, సీసముల తూగునందును, పద్యముల కూర్పు నేర్పునను ఇతఁడు పంచకావ్య కర్తల యుద్దికాఁడని యాధునికుల యాదేశము. నాలుగైదుగంటముపోట్లతో మాటలకు జీవము పోసి సచేతనమైన వ్యక్తిని దృగ్గోచరము జేయించు మహిమ ఇతనికావ్యకళయందుఁ గానవచ్చెడిని. దీనికిఁ దార్కాణ యయాతని యుత చరిత్రయందలి చానున్న ముసలియావు వర్ణన యొకటిచాలును:

సీ. "ఉద్యదుత్థానస ముద్యోగమాత్రావ
శిష్టచేతస్సార దష్టదర్భ
క్షుతికృద్గృధ్యాంక్షు తతినివారణవిధా
త్వరమాణవాలాగ్రదంశపిహిత
నాదృతాధశ్మయ నారంభ విస్రంభ
గళకంబళాభోగఁ గాతరాక్షి
నేకపార్శ్వస్థితి స్వీకారనిర్భగ్న
చర మోరుకరశల్య సాంద్రబాష్ప

తే. దుగ్ధసేవా సమయబోధ ముగ్ధవత్స
పీడితాపీన పర్యంతపృథులదామ
వేష్టితగ్రీవ నట చూచె విప్రుఁడొక్క
యర్జుని నిజోటజప్రఘాణాంతరమున"
—పాండు. ౫; 232.

రూపము నొందిన యిట్టిమాటల చిత్తరువు వాఙ్మయమునఁ దఱుచుగఁ గానరాదు. పాండురంగకృతిని పఠించినవారీయావు నెన్నటికిని మరువఁజాలరు. ఆ హృదయమును నీరు సేయు ధేను వంతశ్చక్షువున కెల్లపుడును బొడకట్టుచునే యుండును.

ఇతని వర్ణనలు విలక్షణములన్నారు వీరేశలింగం పంతులుగారు. స్వభావ సిద్ధములును, ననుభవైకవేద్యము లనుట యొప్పారును. తృతీయాశ్వాసమున జాతరకు బామర కాంతలు కై సేయుఁదెఱఁగు నెట్లు వర్ణించెనో చూడుఁడు:

సీ. "గోర్వెచ్చచము రంటుకొనిరి మస్తకముల
జలకమాడిరి నిశామిళితవారి
కట్టిరి చిరుతచౌకముల క్రొంబట్టముల్
కాటుకఁ దీర్చిరి కన్నుఁగవల
దిద్దిరి సిందూర తిలకంబు బటువుగా
నిక్కుగొప్పుల విరుల్ ప్రుక్కి రర్థి
నింబప్రవాళమాల్యంబులు వైచిరి
చిట్టిపొట్టె ధరించి రిట్టునట్టు

4. శకుంతలాపరిణయము, పుట 4.

తే. తరుణ ధావళధగధగద్దశనమణుల
హత్తుకొలిపిరి లేత పీడ్యములడాలు
పర్వదినములఁ బామర ప్రమద లుదిత
నియమసంభావనారంభనిభృతబుద్ధి."

—పాండు. 3:74.

పంచమాశ్వాసములోని వేటకాని బారిఁ దలఁగి. ఫాలు,

"మెడ మలఁగింపలేక తన
మేపాడ లొండును రెండు నేకమై
పొడమఁగ బీదకన్నవడి
బూడిదపండును బోలె బూఁదుపా
రెడునొకదుప్పి..."ని గనఁడు.

తే. "ఆచమూరువు యూథంబుఁ ద్రోచిపఱచె
వింటనమ్మేర్చి బోయ వెన్వెంటఁ దఱుమ
లోలజిహ్వాక రాళవిశాలముఖత
మో విభీతేందు మృగశాబమోయనంగ."[5]

రామకృష్ణునియొక్క వర్ణనాస్వభావము చతుర్థాశ్వాసములోని ఋతువర్ణన చక్కఁగ వెల్లడిసేయుచున్నది. ఇందు ముఖ్యముగ 'ఛళుఛళుక్కన', 'పెరిగిసూచీముఖాభేద్యంబు', 'ఇంద్రచాపంబుగాదిది', 'కలకనీరెంతయు', 'కలుగకుండినసేమి', 'రక్షగట్టెరి' అను పద్యములు పాఠకుల హృదయములను చూఱగొనకమానవు. ఆముక్తమాల్యద నారసింహపురాణములవంటి యొండురెండు గ్రంథములయందుఁ దక్క నిట్టి సహజవర్ణన లెందును గానరావు. కాని యాముక్తకవికిఁ బ్రకృతినిరీక్షణయును, వస్తుస్వరూపానుకరణమును కరము ప్రియములు. నారసింహపురాణకర్తయం దివి యంతగఁ గన్పించవు. పాండురంగకవి ప్రకృతినిరీక్షణోపలబ్ధాంశములను కవితారసముతో సక్షేశనముగావించి స్వశిల్పాతిశయమును వెల్లడిజేసినాఁడు.

పాండురంగమాహాత్మ్యమున సహజసౌందర్యవిభ్రాజితములగు వర్ణన లెన్నియేని యుఁ గలవు. వాని నెన్నుట కిది యదనుకాదు.

పాండురంగమాహాత్మ్యము పరమభాగవతచరిత్ర మని కవియే చెప్పియున్నాఁడు. ఇందు హరవిలాస, శివలీలావిలాసాదులఁబోలి పెక్కు కథలుకలవు. ఈ కథలమూలమున జనుల హృదయమున భక్తిబీజమును బాదుకొల్పుటయే కవియొక్క ప్రధానోద్దేశము. కాలానుగుణముగ నితఁడు మిశ్రకావ్యపక్కి నవలంబించినను చింతితార్థమును మఱువలేదు. స్వయము కథకుఁడ ననియుఁ, గథను హృదయంగమముగ నడపుట స్వశిల్పధర్మమనియు నాతఁ డెఱిఁగి కథాకలాపము నిడేర్చెను. ఇతని కథానిర్మాణ కౌశలము నిగమశర్మోపాఖ్యానముచే సువ్యక్తమగుచున్నది.

5. పాండు. 5:14-15 'తనూవిభీతేందు' అని యచ్చుప్రతి. 'తనూవిభీతే'కు అర్థము కుదురదు. కీ. శే. కళాప్రపూర్ణ వేదము వెంకటరాయశాస్త్రిలవారు ప్రసంగవశమున నొకానొకప్పుడు పైరీతి సవరించి యందలి స్వారస్యమును వెల్లడించిరి.

# సినిమా సింహావలోకనం:

# తెలుగుఫిలిం పరిశ్రమదారులకు

# కొన్ని సూచనలు

'రా రా జు'

ఒక మోస్తరు జరుగుబాటున్న కుటుంబంలో పెండ్లి జరుగుతుందంటే ఎంత సన్నాహం చేస్తారో చూడండి. ఇల్లంతా పాదట్టు దులిపిస్తారు. గోడలకు సున్నం కొట్టిస్తారు. ఇంటిముందు పందిళ్లు వేయిస్తారు. నగానట్రా చేయిస్తారు. ఇంటిల్లిపాదీ కొత్త బట్టలు కొనుక్కుంటారు. ఐదురోజుల పెండ్లికి ఏమేమి సామాను ఎంతెంత అవసరమో ముందుగా పట్టీ రాయిస్తారు. ఇంగువదగ్గిర నుంచి, విస్తళ్లకట్టల దగ్గిరనుంచి, పసుపుకొమ్ముల దగ్గిరనుంచి, పావుకోళ్ల దగ్గిరనుంచి ప్రతి చిన్నవస్తువూ మూడురోజులు ముందుగానే పేటనించి తెప్పించుకుంటారు. పేరుపేరునా శుభలేఖలురాసి బంధువులకు అంపుతారు. పెండ్లివారికి విడుదులు ఏర్పాటు చేస్తారు. పురోహితులు, వంటవాళ్లు, కంసాలులు,కుమ్మరులు, చాకళ్లు, మంగళ్లు- ఒకరేమిటి అన్నివృత్తులు చేసేవారూ ఎవరిపని వారు చేయటానికి అందరూ హాజరులో వుండవలిసిందే.

నెలరోజులకు ముందే పెండ్లిపనులు ప్రారంభం అవుతాయి. పెండ్లి అయిదురోజులూ ఆడా, మగా అంతా సతమత మవుతారు. అంపకాలై బంధువర్గమంతా ఎవరివూరికి వారు వెళ్లేంతవరకూ వూపిరిసలుపుకోటానికి వీలుండదు. పెండ్లి పూర్తయిన నెలరోజుల వరకూ ఇంట్లో ఆడవాళ్లకూ, పెండ్లిపెత్తనదార్లకూ బడలికలు తీరవు.

నాలుగైదువేలు ఖర్చుచేసే ఒకసామాన్యపు వివాహానికే ఇంతటి తంతూ, తతంగం, సరఫరా, సరంజామా అవసరమైతే ఇంతకు ఇరవై ముప్ఫయిరెట్లు ఎక్కువ ఖర్చుతినే ఒకఫిలిం తియ్యటానికి ఎంతఆలోచన, ఎంత అనుభవం, ఎంతటిదక్షత, ఎంతటిదూరదృష్టి అవసరమో వూహించండి! పెండ్లికిలాగానూ, పెండ్లికంటె అధికంగానూ ఫిలింకు కూడా శిల్పులు కావాలి, చిత్రకారులు కావాలి; గుడ్డలు కుట్టించాలి, నగలు చేయించాలి. అన్నివృత్తులలో వుండే మనుషులూ ఫిలింకు అవసరమే. పెండ్లిలో పెండ్లివారినీ, పెండ్లికి విచ్చేసిన బంధువులనీ సంతృప్తిపరిస్తే చాలు. ఫిలింతీసేవారో? దేశంలో వుండే ప్రజలందర్నీ—పండితులనీ—పామరులనీ—మెప్పించాలి. పెండ్లికి పెట్టే ఖర్చులో ఒక్కపైసా అయినా తిరిగి వస్తుందనే ఆశతో ఖర్చు చేసేది కాదు. ఫిలింకు ఖర్చు పెట్టే ప్రతికానీకూడా తిరిగి ఎంత సంపాయిస్తుందనే దృష్టితో ఖర్చుపెట్టాలి. వెనుకటిరోజుల్లో ఒకమనిషి ఏమాత్రం సమర్థుడో తెలుసుకోటానికి 'ఇల్లు కట్టి చూడు; పెండ్లి చేసి చూడు!' అనేవారు. ఇప్పుడనవలసిన మాటలు అవి కావు: 'ఫిలింస్టుడియో కట్టి చూడు. ఫిలిం తీసి చూడు' అనాలి.

ఒక్క వివాహం విషయంలో వహించేపాటి శ్రద్ధలో పదోవంతైనా లక్షలు ఆహుతి అయ్యే ఫిలింనిర్మాణంలో మన ప్రొడ్యూసరులు చూపటం లేదని నా ఫిర్యాదు. పెండ్లిపెత్తనం చెయ్యటానికి సమర్థతలేనివాడు సైతం ఫిలింప్రొడ్యూసరుగా తయారౌతున్నాడంటే నామాట అతిశయోక్తికింద తోసెయ్యకండి. మన తెలుగువారు ఈ ఫిలింవ్యాపారాన్ని ఏవిధంగా నిర్వహిస్తూవున్నారో కొన్నిసంవత్సరాలనించి కండ్లారా చూస్తూ, చెవులారా వింటూ ప్రత్యక్షానుభవంతో రాస్తున్నానంటే నమ్మండి.

గత సంవత్సరం 1940 లో విడుదలైన మొత్తం తెలుగుచిత్రాలసంఖ్య పన్నెండు: చండిక, సుమంగళి, ఇల్లాలు, విశ్వమోహిని, మీరాబాయి,మాలతీమాధవం, భూకైలాసం, బారిష్టరుపార్వతీశం, కాళిదాసు, జీవనజ్యోతి, చదువుకున్నపెండ్లాం, బొండాం పెళ్లి. ఈపన్నెండు చిత్రాలలోనూ ఏరెండు మూడు చిత్రాలకో పెట్టుబడిరాళ్లు వచ్చి వుండవచ్చు. లేదా ఇంకా కొంత కాలానికైనా రావచ్చుననే ఆశ వుండవచ్చు. తతిమ్మా తొమ్మిది పది చిత్రాలను గురించీ 'కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ' అనుకోవలిసిందే. మనకంటె తక్కువ జనసంఖ్య కలిగిన తమిళులు మనం తయారుచేసిన చిత్రాలకంటె మూడురెట్లు అధికంగా తయారుచేశారు (1940 లో తమిళచిత్రాల సంఖ్య 37). తెలుగుచిత్రాలు మొత్తం 12. అందులో రెండు చిన్నచిత్రాలు. ఆపదింటిలోనూ సగభాగమైనా జయప్రదమైనట్టు చెప్పలేము. 1939 సంవత్సరంకూడా ఇంతకంటె మెరుగ్గా లేదు.

గతసంవత్సరంలో ప్రొడ్యూసరులే కాక, తెలుగుదేశంలో దాదాపు అన్ని థియేటరులూ కొంచెమో గొప్పో దెబ్బ తిన్నవనే చెప్పవచ్చు. మరొక సంవత్సరంకూడా ఈ విధంగానే సంకురుమయ్యా తెలుగు సినిమా పరిశ్రమమీదుగా వెళ్లాడంటే అటుతర్వాత

తెలుగుఫిలిమే అపూర్వం అవుతుందేమో! నికరమైన పెట్టుబడిదార్లను ఫిలిం పరిశ్రమ ఇంతవరకూ ఆకర్షించలేదనే అపకర్ష వొకటి వుండనే వున్నది. ఈ వ్యాపారంలో వేలు పెట్టినవారంతా ఈవిధంగా చేతులుకాల్చుకుని బయటపడుతూంటే ఇక పెద్దపెద్ద పెట్టుబడిదార్లు ఈ వ్యాపారంలో దిగటానికి అవకాశం ఎక్కడ వుంటుంది? 'తెలుగుఫిలింపరిశ్రమ మీరు వర్ణించినంత అధ్వాన్నపుస్థితిలో వుంటే ఈ సంవత్సరం మళ్లీ ఫిలిములు ఎలా తయారౌతున్నవి?' అని ప్రశ్నించవొచ్చు. దానికి కారణం గత సంవత్సరంలో తీసిన చిత్రాలన్నిటికీ లాభాలు రావటం కాదు. పదివేలమంది గుఱ్ఱపుపందేలు ఆడితే అందులో ఏపది మందికో డబ్బు వస్తుంది. ఆ పదిమందిని చూసి తక్కిన తొమ్మిదివేలతొమ్మిదివందల తొంభైమందీ ఈసారైనా మనకు అదృష్టం కలిసిరాకపోతుందా అని మళ్లీ పందెం వేస్తారు. తెలుగుఫిలింవ్యాపారం కూడా ఇంచుమించు ఈపద్ధతికే వచ్చింది. ఇందుకు ఒకటే నిదర్శనం. ఇంతవరకు ఈ తెలుగు ఫిలింపరిశ్రమ ప్రారంభించింది మొదలుకొని వరసగా రెండుచిత్రాలు తీసినవారు ఇద్దరు ముగ్గురికంటె పైన లేరు. మూడుచిత్రాలు తీసినవారొక్కజయాఫిలిమ్సువారుమాత్రం కన్పిస్తున్నారు. అంతదాకా ఎందుకు? 1940 లో బయలుదేరిన పదిపన్నెండుగురు ప్రొడ్యూసరుల్లో ఏయిద్దరు ముగ్గురో తప్ప తక్కినవారంతా 1941 లో చతికిలబడ్డారా లేదా? తెలుగుఫిలింపరిశ్రమకు ఈస్థితి పట్టడానికి హేతు వేమిటి? యెత్తుబడిన ఈ పరిశ్రమను పైకి లేవనెత్తటానికి మార్గం ఏదైనావుందా? ఈవిషయం యోచించవలసిన బాధ్యత ఫిలిం ప్రొడ్యూసరులపైనే కాకుండా, ఫిలిం పరిశ్రమాభివృద్ధిని కాంక్షించే కళాభిమానులందరిపైనా వుంది. సాధ్యమైనంతమట్టుకు ఈవ్యాసంలో ఈరెండు అంశాలను గురించీ చర్చిస్తాను.

* * *

హిందూదేశం మొత్తంమీద ఫిలింపరిశ్రమకంతటికీ ప్రధానకేంద్రం బొంబయి అని చెప్పవచ్చు. 1940 లో వచ్చిన చిత్రాలనుబట్టి నూటికి యాభైవంతులుపైగా ఒక్క బొంబయిలోనే తయారైనవి. కాబట్టి బొంబయి స్టుడియోలసంగతి ముందు ఆలోచిద్దాం. బాంబేటాకీసు, నేషనల్ స్టుడియోస్ ఈ రెండుకంపెనీలవారూ తమకంపెనీలకు డబ్బు పెట్టుబడి పెట్టినవారి నమ్మకం సంపాదించారు. ప్రభాత్, రంజిత్ స్టుడియోల ప్రధాన భాగస్వాములు ఫిలింపరిశ్రమలో అనుభవం గడించినవారు. తమ పనితనంలో తమకు విశ్వాసం కలిగినవారు. ఈ నాలుగు కంపెనీలూ ఒక ప్రణాళికతో చిత్రాలు తయారుచేసి, నమ్మకంగా లాభాలు గణించగలుగుతున్నాయి. తక్కినవారంతా చాలినంత అర్థబలంగాని, అంగబలంగాని, ఆత్మవిశ్వాసంగాని లేనివారు. ఈ నాలుగు కంపెనీలకూ స్వంత స్టుడియోలు, స్వంత టెక్నీషియనులూ వున్నారు. మన తెలుగుప్రొడ్యూసరులలో ఒక్కరికైనా స్వంత స్టుడియో లేదు — మొన్నటివరకూ జయాఫిలిమ్సుగా వుండి ఇటీవల శోభనాచల పిక్చర్సుగా మారిన మీర్జాపురంకంపెనీని మినహాయిస్తే. స్టుడియో లేకపోయినా స్వంత టెక్నీషియనులు వున్న దొక్క వాహినీవారికి మాత్రమే. తక్కిన తెలుగు ప్రొడ్యూసరులు యావన్మందీ పరాయిస్టుడియోల్లో, పరాయి టెక్నీషియనులతో, దాదాపు సొంత పెట్టుబడి లేకుండా వ్యాపారం సాగిస్తుండేవారనే చెప్పవొచ్చు. అసలు మన కింతవరకూ ఫిలిం పరిశ్రమలో అనుభవం కలిగిన ప్రొడ్యూసరులంటూ బయలుదేరనే లేదు. ఒకరిద్దరు ఎవరైనా వుంటే వారే ప్రొడ్యూసరులూ, వారే డైరెక్టరులూ కావలిస్తే వారే ఆక్టరులు కూడాను. సొంత స్టుడియోలు, సొంత టెక్నీషియనులూ, అనుభవజ్ఞులైన ప్రొడ్యూసరులూ ఏర్పడేంతవరకూ ఎన్నో కంపెనీలు పుట్టుతూ గిట్టుతూ వుండవలసిందే గాని ఈ పరిశ్రమకు నిలకడ ఏర్పడుతుందనే ఆశ లేదు.

## డైరెక్టరు:

ప్రొడ్యూసరు తరువాత ఫిలిం నిర్మాణంలో డైరెక్టరుకు వున్నంత ప్రాముఖ్యం మరెవ్వరికీ లేదు. బొంబయి కాంగ్రెసు మంత్రివర్గంలో హోంమెంబరుగా పనిచేసిన శ్రీ కె. యం. మున్షీగారు ప్రఖ్యాత న్యాయవాది మాత్రమే కాక సుప్రసిద్ధ గ్రంథకర్తకూడాను. ఈయన వ్రాసిన కథలు కొన్ని సినిమా చిత్రాలుగా తయారు చేయబడినవి. హిందూదేశపు ఫిలిం పరిశ్రమలో డైరెక్టరును గురించి శ్రీమున్షీగారేమన్నారో చూడండి:—

"మన దేశపు ఫిలిం పరిశ్రమలో సాంకేతికశాస్త్రపరిజ్ఞానము, శిల్పములకంటే డైరెక్టరుల నైపుణ్యం చాలా కొరవడి వున్నది. గ్రంథకర్తయొక్క కలలన్నీ సినిమా తెర అనే వాస్తవికప్రపంచంలోకి తర్జుమా కావటానికి డైరెక్టరే ప్రధానకారకుడు, సూత్రధారుడు. గ్రంథకర్తలయొక్క రచనలను చక్కగా గ్రహించి సమన్వయించుకో గలిగిన విద్యావిశేషము, కళాకౌశలము డైరెక్టరులలో వుంటేనే తప్ప లేకపోతే ఒక పాత్రనుంచి వేరొకపాత్రను వేరుచేసే సూక్ష్మమైన, విశిష్టమైన పాత్రతత్వంగాని, కవిహృదయంగాని, నాటకంలో రావలసిన రసంగాని, సంభాషణల చక్కదనంగాని నాశనమవుతవి; అసంస్కారమైన సామాన్యాభిరుచులను ఉన్నత కళాప్రమాణాలకు లోబడజేసికొనదగిన వినమ్రత డైరెక్టరులలో వుండనంతవరకూ ఈ ఫిలిం పరిశ్రమ అసమర్థులతో తృప్తిపడి వుండక తప్పదు. ఈ కారణం చేతనే పరిశ్రమ అల్పాయుర్దాయం కలిగి వుండటము, ఆర్థిక సంపన్నత లోపించటము ఈ రెండు గండాలకూ లోబడి వుంటుంది. ఉత్తమమైన వాఙ్మయ, కళా ప్రాభవం డైరెక్టరుకు అత్యవసరం. అలాటి సాహిత్య వేత్తలను, అలాటి కళాకుశలులను ఎంత వెచ్చించి అయినా సరే ఈ పరిశ్రమ ఆకట్టుకోటం శ్రేయస్కరం."

శ్రీమున్షీ గారాడిన ఈ మాటలు మన తెలుగు డైరెక్టరులకంటె ఎంతో అనుభవం సంపాదించిన హిందీ డైరెక్టరులనుగురించి. హిందీ చిత్రాలు డైరెక్టు చేస్తున్నవారిలో ఏ కొందరో విద్యాధికులు వుండరనికాదు మున్షీగారి తాత్పర్యం. దరహంమీద డైరెక్టరునామకులలో అనేకమంది మున్షీగారి వర్ణనకు తగుదురనే. అలాగే తెలుగుచిత్రాలు డైరెక్టు చేసేవారిలో డైరెక్టరుపదవికి తగిన యోగ్యత కలిగినవారు బహు కొద్దిమంది వుండవచ్చునేమో! కాని, చాలామంది అర్హతను బట్టికాక, అదృష్టవశంచేత (లేక దురదృష్టమేమో!) డైరెక్టరుస్థాన మలంకరించినవారే.

న్యాయశాస్త్రం చదివితేగాని లాయరు కాడు. వైద్యవిద్యలో కృతార్థుడైనవాడుగాని డాక్టరు కాడు. ఇంజనీయరు కావాలంటే ఇంజనీరింగు చదవాలి. ఆఖరుకు బడిపంతులు కావాలంటేకూడా ట్రెయినింగు ప్యాసవాలి. ప్రతివృత్తికీ ఏదో వొక విద్య, ఒక పరీక్ష వుండనేవుంది. ఫిలిం డైరెక్టరు అవటానికి మాత్రం ఏచదువూ చదవనక్కరలేదు; ఏ పరీక్షా ప్యాసుకానక్కర్లేదు. ఈ సర్వజ్ఞత్వం అలవడటానికి ఫిలిం డైరెక్టర్లు పుట్టుకతోనే రెండు తలలతోనూ, నాలుగు చేతులతోనూ పుట్టుకవచ్చినవాళ్లయినా అయివుండాలి. లేదా ఫిలిం డైరెక్షను ఎలాంటి ప్రతిభాశూన్యుల చేతనైనా నిర్వహింపబడ కలిగిన తోలుబొమ్మలాటయినా కావాలి. ఫిలిండైరెక్టరులు అపరబ్రహ్మలూ కారు; ఫిలిం నిర్వహణం కేవలం తోలు బొమ్మలాటా కాదు. కాబట్టి ఫిలిం డైరెక్టరు కాగోరినవాడు సాహిత్యంలోనూ, కళలలోనూ, ఫిలిం టెక్నిక్‌లోనూ మంచి కృషిచేసినవాడైవుండటం చాలా అవసరం. ఉత్తమ సాహిత్యం ఏదో కనిపెట్టగలిగిన శక్తి డైరెక్టరుకు వుండితీరాలి. పాత్రోన్మీలన పరిజ్ఞానం వుండాలి. కనీసం భాషాసంప్రదాయమైనా తెలిసినవాడు కావాలి. సాహిత్యందాకా పోనక్కరలేదు, సామాన్యసంభాషణల్లో సుశబ్ద మేదో అపశబ్ద మేదో కనిపెట్టలేని 'తెలుగు' డైరెక్టరు మహాశయులను నేనెరుగుదును. ఈ మిడిమిడిజ్ఞానం వెలగబెట్టే ఆంధ్ర డైరెక్టరులకంటె ఆంధ్రేతరులే మే లనిపిస్తారు ఒక్కొక్కప్పుడు; తమకు తెలియనివిషయం కాబట్టి వీరు భాషచక్కగా తెలిసిన పండితులమీద ఆధారపడుతారు. డైరెక్టరు సంగీతశాస్త్ర పారంగతుడు కానక్కరలేదు. కాని కనీసం, ఏ భావానికి ఏ రసానికి ఏ రాగం అనుకూలిస్తుందో నిర్ణయించ గలిగి వుండాలి. కల్యాణికి, కాంభోజికి భేదం తెలియని డైరెక్టరులు లేకపోలేదు. ఇలాంటివారే మ్యూజికు డైరెక్షనులో తరుచూ వేలుపెట్టుతుంటారు. డైరెక్టరు స్వయంగా శిల్పి, చిత్రకారుడూ కానైతే కాకపోవచ్చుగాని సౌందర్యగ్రహణశక్తి లోపించినవాడుగా వుంటే ప్రయోజనం లేదు. డైరెక్టరు వాచికాంగికాభినయాల్లో ఆరితేరినవాడై వుండటం డైరెక్షనుకు ఎంతో ఉపకరిస్తుంది. శాంతారాం తాను డైరెక్టుచేసే చిత్రాలన్నిటిలోనూ అన్నిపాత్రలూ స్వయంగా అభినయించి చూపగలడు. అతని చిత్రాల్లో నటించిన ప్రఖ్యాత నటీనటులు చాలామంది శాంతారాంయొక్క సుశిక్షణను ప్రశంసించారు. ఒక్కతూరి శాంతారాం చిత్రంలోనటించి తారాపథాని కందుకున్న నటు లనేకు లున్నారు. ఇది శాంతారాంగాని, ప్రభాత్‌కంపెనీగాని సగర్వంగా చెప్పుకోదగిన విషయం, సందేహం లేదు. శాంతారాం డైరెక్షనులోనే కాక కెమెరా, సౌండు, ఎడిటింగు ఈ వివిధశాఖల్లోకూడా సమధికమైన ప్రజ్ఞ కలవాడు. అందుచేతనే అతని చిత్రాలు భావనాబలం కొంతలోపించినప్పటికీ శిల్పంలో భారతీయచిత్రకళ కంతటికీ శిరోభూషణంగా వుంటవి. నితిన్‌బోస్ కెమెరాతోనే కథంతా చెప్తాడు. అతని చేతిలో కెమెరా మాట్లాడుతుంది; అభినయిస్తుంది. కెమెరా ఆంగిల్ అంటే ముక్కూమొహం ఎరగని డైరెక్టరులు తెలుగుఫిలింపరిశ్రమలో వున్నారంటే నామాటనమ్మండి. తనకింద పనిచేసే కెమెరామనుకూ, స్క్రిప్టురచయితకూ, ఆర్టుడైరెక్టరుకూ, ఎడిటరుకూ తెలిసినపాటి డైరెక్షనుసైతం డైరెక్టరు అనిపేరు పెట్టుకున్న పెద్దమనిషికి తెలియనప్పుడు డైరెక్టరు అజాగళస్తనం కాక మరేం అవుతాడు? కెమెరామన్‌నుగాని, ఎడిటరునుగాని, సౌండురికార్డిస్టునుగాని 'నీకెంతవరకు తెలుసును' అని అడిగేవా రున్నారు. కాని, డైరెక్టరునుమాత్రం 'నీకు ఏ విషయం ఎంతవరకు తెలుసు' అని అడిగేవాడు లేడు. అందుచేత సర్వసాధారణంగా ఇలాంటి డైరెక్టరు చిత్రనిర్వహణానికి తోడ్పడటంకంటె, అడ్డురావటమే ఎక్కువగా సంభవిస్తుంటుంది. డైరెక్టరు కవీ, కథకుడూ, సినేరిస్టూ, సౌండురికార్డిస్టూ, కెమెరామనూ, మ్యూజిక్ డైరెక్టరూ తానే అయివుండవలెనని నా అభిప్రాయం ఎంతమాత్రం కాదు. ఆయాశాఖల్లో ప్రవీణులైనవారు ప్రత్యేకంగా వుండితీరవలసిందే. డైరెక్టరు వీరందరి సహాయం అవశ్యం తీసుకోవల్సిందే. కాని, తనకు కావలిసిం దేదో చెప్పి, ఒక్కొకరినించి తాను పనిపుచ్చుకో గలిగివుండాలి. ఇందుకు ఈవివిధ విషయపరిజ్ఞానం అవసరం. ఇందులో ఎవరికి లోకువైనా డైరెక్టరు చెవులకు తాటాకులు తప్పవు. తద్వారా చిత్రం చిత్రవధ కాకతప్పదు. డైరెక్టరులమని చెప్పుకునేవారిలో నూటికి తొంభైమందిఒక్క నాటకమైనా కండక్టు చెయ్యగలిగిన సమర్థతకూడా లేనివారు. కాని, క్లోజప్, లాంగ్‌షాట్, మిడ్‌షాటు అనే మూడుముక్కలతో కొమ్ములు తిరిగిన డైరెక్టరు ఐపోతున్నాడు. డైరెక్టరుయొక్క అజ్ఞానాన్ని మించింది అతడి అహంభావం వొక్కటే. లక్షలు కుమ్మరించిన ప్రొడ్యూసరులు ఇలాంటి నిరక్షరకుక్షులవల్ల ఎంతలేసి నష్టాల పాలు కాలేదు? అజ్ఞానంచేత కొంతా, అహంకారం చేత కొంతా ఒకటికి నాలుగు ఖర్చుచేసి, ఎందరు డైరెక్టరులు ఎన్నిఫిలిముల అధోగతికి కారకులు కాలేదు? డైరెక్టరు అస

మర్థతవల్ల ఒక ఫిలిం చెడితే, ఆనష్టం ఆ ఫిలింతో పోవటం లేదు. శైశవావస్థలో వున్న మొత్తం ఫిలింపరిశ్రమ మొహాన కొట్టి మరీ పోతున్నది. డైరెక్టరు లంటూ భేషజంగా తిరిగే ఇలాంటి ప్రబుద్ధులు కొందరుండేంతవరకూ ఎక్కడో వొహక్కడ, ఎవరో వొక పెట్టుబడిదారుడు దొరకకనూ పోడు. పెట్టినపెట్టుబడి కాస్తా నష్టమై, కట్టుబట్టలతో బయటపడకుండానూ పోడు. ఇందువల్ల డైరెక్టరు తాత్కాలికంగా తాను నష్టపడే దేమీ వుండదు. అందుచేతనే పరుల ధనంతో ఎక్స్‌పెరిమెంట్సు చెయ్యటానికి తా నెప్పుడూ తయారవుతూ వుంటాడు. వీటన్నిటినీ ఆలోచించి డైరెక్టరులను గురించి నేను చెయ్యబొయ్యే సూచన కొందరు డైరెక్టరులకు కంటకంగా కనిపించవచ్చు. మరి కొందరికి అసాధారణంగా తోచవచ్చు. అయినా, తెలుగుఫిలింపరిశ్రమయొక్క అభివృద్ధిని మనసారా ఆశించి నే నీసూచన చేస్తున్నాను, సహృదయంతో స్వీకరిస్తారని నమ్మి. డైరెక్టరులలో కొందరు సహజపాండితీ, ప్రతిభలు కలిగినవా రెవరైనా వుంటే వుండవచ్చు, కాదనను. కాని, అలాంటివారికైనా శాస్త్రజ్ఞానంతోబాటు అనుభవంకూడా అవసరమన్న మాటను మనం మరిచిపోరాదు.

అందుచేత డైరెక్టరు కాగోరిన ప్రతివాడూ సాహిత్యపరుడై వుండటంతోబాటు ఏ ఫిలిం స్టుడియోలోనైనా కనీసం ఐదుసంవత్సరాలు సమర్థుడైన డైరెక్టరుకింద తరిబీతుపొందినవాడై వుండాలి. ఈవిధమైన అప్రెంటిస్‌షిప్ పొందినవాడినే డైరెక్టరుగా నియమించుకోటానికి ప్రొడ్యూసరు లంతా చేరి కట్టుబాటు చేసుకోవాలి.

నటీనటులకుగాని, ఫిలిమ్స్లో పనిచేసే తక్కినపనివా రెవ్వరికిగాని లేని ఈనిబంధన డైరెక్టరుల విషయంలో మాత్రం ఎందుకు వర్తించేటట్టు చెయ్యాలని కొందరికి సందేహం కలగవచ్చు. డైరెక్టరు స్థితి వేరు; తక్కిన నటీనటులు, టెక్నీషియనులు వగైరా స్థితి వేరు. ఒక నటిగాని, నటుడుగాని అసమర్థుడైతే చిత్రం అంతవరకే లోపంగా వుంటుంది. డైరెక్టరు అసమర్థుడైతే మొత్తం యావత్తూ నాశన మౌతుంది. అదీ కాకుండా నటీనటులనుగాని, తక్కినపనివాళ్లనుగాని ఎన్నుకోటానికి (మనదేశంలో ప్రొడ్యూసరులు వేరే లేరు కనక) డైరెక్టరే బాధ్యు డవటంచేత ఆ డైరెక్టరు అనుభవజ్ఞుడూ, సమర్థుడూ ఐనప్పుడు తక్కినవా రందరినీ పనికి వచ్చే వారినే ఎన్నుకుంటాడు.

నా రెండవసలహా ఏమంటే; షూటింగు ప్రారంభించటానికి పూర్వమే ప్రతిడైరెక్టరూ సినేరియో రాయించికొని, తాను స్వయంగా రాసి కాని సినేరియో పూర్తిగా తయారు చేసి ప్రొడ్యూసరుల ముందు పెట్టాలి. తక్కిన టెక్నీషియనులకూ, ప్రధానపాత్రధారులకూ దానిని చూపించాలి. ఇందువల్ల ఫిలిం విజయవంతంగా తయారవటమే కాకుండా, దుబారాఖర్చు ఎంతో తగ్గుతుంది.

నామూడవ సలహా. మనఫిలింపరిశ్రమ పాశ్చాత్యదేశాలతో సమానంగా తులతూగేటప్పటిమాట చెప్పలేను కాని (పాశ్చాత్యుల్లో కూడా ఈఆచారం ఎక్కడో కాని లేదు) అంతవరకైనా, ఫిలింప్రొడ్యూసరూ, డైరెక్టరూ, నటుడూ ఒక్కడే అయివుండరాదు. దీనివల్ల అనేక చిక్కు లున్నట్టు అనుభవజ్ఞులందరికీ తెలిసేవుంది. సుప్రసిద్ధనటుడు చంద్రమోహన్ బొంబయి రేడియోలో మాట్లాడుతూ ఈ విషయాన్ని గురించి ఇలా అన్నాడు: "నన్ను ఇండియాకు చక్రవర్తిగా చేస్తే నేను ప్రొడ్యూసరులను డైరెక్టరులుగా వుండనీయను. డైరెక్టరులను ఆక్టరులుగా నిషేధిస్తాను." ఈ మూడుపనులూ ఒకరే నిర్వహించేవారు మనవారిలో లేకపోలేదు.

'చిత్రానికి కథ ఆత్మవంటిది'.
—శాంతారాం.

శాంతారాం ఈమాట అనడంలో విశేషం లేదు. అనకపోతేమాత్రం ఆశ్చర్యం వేసేది. నాటకానికిగాని, ఫిలిముకుగాని కథ ప్రాణ మన్నసంగతి ప్రతిడైరెక్టరూ అంగీకరించితీరాలి. అయినా, మంచి కథలను సంపాయించటానికి ఎందరు ఫిలింనిర్మాతలు తంటాలు పడుతున్నారు? స్టార్లను బుక్‌చేసుకునేందుకు పడేపాట్లల్లో పదోవంతైనా కథకోసం, కవికోసం ప్రయత్నిస్తున్నారా?

ఒకతారకు ఇచ్చే డబ్బులో నాలుగోవంతైనా కథకోసం ఖర్చుచేస్తున్నారా? ఒకరిద్దరు తారలను బుక్‌చేస్తే చాలు ఫిలిం సగంవరకు పూర్తి ఐనట్టే! కథగాని, డైరెక్షనుగాని, స్టుడియోగాని తక్కిన వేవీ అంత ముఖ్యం గావు ఈ ఫిలిం నిర్మాతలదృష్టిలో! స్టారుసిస్టం బాగా వేళ్లు పాదుకున్న అమెరికా మొదలైన పాశ్చాత్యదేశాల్లోకూడా ప్రొడ్యూసరులు కథకోసం ఎక్కువ పాటుపడతారు. ఎన్ని వేలైనా యిచ్చి, ఎన్ని తంటాలైనాపడి షా, వెల్సు లాంటి విశ్వవిఖ్యాతులైన రచయితల కథలను సంపాదిస్తారు. దేశంలో ఏ గ్రంథానికి ఎక్కువ ప్రచారం వుందో తెలుసుకొని, ఎంతడబ్బు పోసి అయినా సరే ఆ గ్రంథం తాలూకు స్క్రీను హక్కులు పొందటానికి ప్రతిప్రొడ్యూసరూ ప్రయత్నం చేస్తాడు. ముందు కథ నిర్ణయించుకొనిగాని కథనుపట్టి నటులను కుదుర్చుకోరు. కథనుబట్టి డైరెక్టరులనుకూడా ఏర్పరుచుకోటం కద్దు. మన దేశంలో ఇంకా నటీనటులకు తారాత్వం స్థిరంగా సిద్ధించనే లేదు. దేశంలో వీరికి అభిమానులంటూ ఎక్కువమంది ఇంకా ఏర్పడనే లేదు. ఐనా, మన ఫిలిం నిర్మాతలు మాత్రం తారలమీదనే పూర్తిగా ఆధారపడి పిక్చర్లు తీస్తున్నారు. ప్రధాన వేషాలన్నిటికీ తారలనే నియోగించిన చిత్రాలు సైతం ప్రజల నాకర్షించకపోవటం మనం

చూచేవున్నాం. నటీ నటులు వారు ధరించే పాత్రల కంతటికీ తగుదురా అనే యోచన కూడా లేకుండ, చూడ చక్కనివారైనంత మాత్రాన, పాడగలిగినంతమాత్రాన నాయికా నాయకుల పాత్రలు ధరింప జేస్తున్నారు. సమర్థుడైన డైరెక్టరు కథపైనా, తన డైరెక్షను పైనా ఆధారపడతాడు. తారల ప్రఖ్యాతి మీద ఆధారపడినంతవరకూ డైరెక్టరు తక్కువవాడే అని ఒప్పుకోవాలి. పాశ్చాత్యులలో ఫ్రాంకు కాప్రా, ఎర్నెస్టు లూబిస్చ్, జాన్ ఫోర్డు మొదలైన విఖ్యాత డైరెక్టరుల కింద పనిచేయటానికి గొప్ప గొప్ప నటులంతా ఉత్సాహంతో కాచుకుని వుంటారు. మన దేశంలో కాంచనమాలనో, కన్నాంబనో డైరెక్టు చెయ్యటం మహద్భాగ్యంగా పరిగణిస్తారు మహా మహా డైరెక్టరులందరూ. రషియాలోలాగా మన దేశంలోకూడా స్టారుపద్ధతి ఎంత తగ్గిపోతే పరిశ్రమకు అంత మేలు.

తారలకు పోసే డబ్బులో నాలుగో భాగమైనా కథకోసం, కవికోసం వినియోగించనప్పుడు మనచిత్రాలకు మంచికథలు రమ్మంటే ఎలా వస్తాయి? చిత్రాలు లాభించ లేదంటే ఎలా లాభిస్తాయి? కథ ఉత్తమశ్రేణికి చెందినదై, డైరెక్షన్ ప్రతిభావంతమైనప్పుడే తారలైనా ప్రకాశిస్తారు. అవి లేనప్పుడు తారల అప్రకాశత్వమే మిగులుతుంది. అందుచేత తమ భవిష్యత్తుకోసమైనా నటీనటులు మంచి కథా, మంచి డైరెక్టరూ లేనిదే పిక్చరులో పని చేయటానికి సమ్మతించరాదు.

దక్షిణదేశంలో అరవవారికంటె కథ లెన్నుకోటంలో తెలుగువారే విచక్షణనుగాని, ఉపజ్ఞనుగాని ప్రకటిస్తున్నారని నిశ్శంకంగా చెప్పవచ్చు. ఆమాటకొస్తే కొన్ని హిందీ చిత్రాలు తెలుగుచిత్రాలతోకూడా దీటురావటం లేదు. ఇందుకు తెలుగుసినిమా ప్రేక్షకుల అభిరుచే ముఖ్యకారణమని నా వుద్దేశం. నూతనంగా సినిమాకళ అవతరించినప్పుడు లవ-కుశ, సావిత్రి, కృష్ణలీలలలాంటి చిత్రాలను కొత్త ఒకవింతగా మనప్రజలు చూశారు. ఇంతలోనే మన ప్రొడ్యూసరులు పద్దెనిమిదిపురాణాలను పుక్కిట బెట్టేశారు. ఒక్కొక్క పౌరాణికచిత్రాన్ని ఇద్దరేసి ప్రొడ్యూసరులుకూడా తీయటం మనం చూశాం. ఇక తెర కెక్కించదగిన ప్రసిద్ధ పౌరాణికాలంతగా లేవనే చెప్పవచ్చు. పౌరాణికాలూ చారిత్రకాలంటే నాకు సరిపడనివికావు. కాని ఈకథలను నిర్దుష్టంగానూ, సర్వాంగసుందరంగానూ ఫిలింరూపంగా తయారుచేయటం సులభసాధ్యంకాదు. అంగబలం, అర్థబలం, బుద్ధిబలం ఈమూడూ వృద్ధి చేసుకున్న తరువాతనే తెలుగు ఫిలింనిర్మాతలు పౌరాణిక, చారిత్రకాలను ప్రయత్నించటం యుక్తియుక్తమని నా అభిమతం. పౌరాణికచిత్రాలను తీయదలిస్తే కనీసం తుకారాం, విద్యాపతి మొదలైన చిత్రాల కళాప్రమాణంలోనైనా తయారుచేయాలి. అంతవరకూ వాటిజోలికి పోకుండా వుండటం ఉత్తమం.

ఇచ్ఛాపూర్వకంగా కాకపోయినా, పౌరాణికాలమీద ప్రజలకు విసువు పుట్టినందుచేతనైనా మన ప్రొడ్యూసరులు విధిలేక సామాజికాలమీదికి దృష్టిబరపటం సంభవించింది. కాని, ఈ సామాజికచిత్రాల్లో నాయికానాయకుల ప్రణయమూ, స్త్రీపాతివ్రత్యం, పురుషుని అఘాయిత్యం తప్పితే మరొక సమస్య కనిపించదు. ఏ స్త్రీపాతివ్రత్యమహిమనో, ఏ సీతామ్మవారి చెరలనో సామాజిక గాథల్లోకూడా చొప్పిస్తేనే గాని నాలుగుడబ్బులు రాలవన్న ప్రొడ్యూసరుల భయమే ఇందుకు కారణం. అందుచేత పురాణప్రసిద్ధలైన సీతా, సావిత్రులు తప్పినా వారి ప్రతినిధులనుమాత్రం ప్రతి చిత్రంలోనూ మనం తప్పించుకోలేకుండా వున్నాం. పాతివ్రత్యం ఈ కాలానికి పనికిరాదనటం లేదు. కాని, ప్రణయంకంటేను, పాతివ్రత్యంకంటేనూ తెరమీద ప్రదర్శించదగిన సమస్యలింకా లేవా అని నేనడుగుతున్నాను.

ఈ సందర్భంలో మన ప్రొడ్యూసరు లందరిలోకీ శ్రీ గూడవల్లి రామబ్రహ్మం గారు కొంతవరకు మార్గదర్శకులని నేను అంగీకరిస్తున్నాను. వారు తీసిన 'మాలపిల్ల,' 'రైతుబిడ్డ' చిత్రాలు కొత్తదారి తొక్కిన సమస్యా చిత్రాలు. ఈ సమస్యలను చిత్రించటంలోనూ, పరిష్కరించటంలోనూ వారింకా కొంత సాహసం చూపించి వుండవచ్చు. కథా విధానంలోనూ, పాత్రచిత్రణంలోనూ లోపాలు లేకుండాచేసి వుండవొచ్చు. అది వేరేవిషయం. కాని, కొత్త పంథా తొక్కినందుకు రామబ్రహ్మంగారి సాహసంమాత్రం ప్రశంసార్హమే.

## ఖర్చులు తగ్గించాలి:

తెలుగుఫిలిం పరిశ్రమ క్షీణించిపోకుండా వుండాలంటే పైన సూచించిన సూచనలు పాటించటం ఎంత ముఖ్యమో ఫిలిం నిర్వహణలో ఖర్చులు తగ్గించటం కూడా అంత ముఖ్యమైన విషయమే. ఫిలిం నిర్మాణంలో అడుగడుగునా అనభవరాహిత్యంచేత మన ప్రొడ్యూసరు లేవిధంగా దుబారాఖర్చులు చేస్తున్నారో, వాటిని అరికట్టటం ఎలాగో ఆచర్యలోకి నేనిప్పుడు దిగటంలేదు (రాజు-రామబ్రహ్మంగార్ల వివాదలో చాలాభాగం మెదిగిన విషయమే అది). స్థూలంగా కొన్ని సూచనలు మాత్రం చేస్తున్నాను.

**మన ఫిలిములకు పదహారు వేలూ, పదిహేడు వేల అడుగుల పొడుగు. తగ్గించి పన్నెండు, పదమూడు వేలకు మించకుండా తయారు చేయాలి.**

ఇందుకు ఇదివరలో ఎలాంటి ఆక్షేపణలున్నా ప్రస్తుతం ఏ విధమైన అభ్యంతరాలూ వుండనక్కరలేదు. బొంబయి ప్రొడ్యూసరులు తమ చిత్రాలను పదమూడువేలల్లో పూర్తి చేస్తున్నారు. ప్రేక్షకులు ఇందువల్ల అసంతృప్తి చెందటంలేదు. తెలుగు ఫిలిములు కూడా అదేవిధంగా పదమూడువేలకు మించకుండా చేయటానికి ఆటంకం వుండరాదు. ఒకవేళ అవసరమైతే యుద్ధవార్తా చిత్రాలను టూ రీలర్ హాస్యచిత్రాలనూ, కార్టూన్ చిత్రాలనూ, ఇతరవార్తావిశేషాలనూ అసలు

చిత్రంతోబాటు ప్రదర్శించవచ్చు. వార్తా చిత్రాలూ, టూరీలరులూ వారం వారానికి మారుస్తూ వుండటంవల్ల పెద్దఫిలిములు ఎక్కువ వారాలు ఒకేథియేటరులో పోవటానికికూడా అవకాశం ఏర్పడుతుంది. చిత్రం చిన్నదవటంచేత ప్రేక్షకుడికి విసుపుట్టదు. పదిహేడు, పద్ధెనిమిదివేల అడుగులలో చెప్పవలసిన కథను పన్నెండు పదమూడువేల అడుగులలో చిత్రించటం కొంతకష్టం అయితే కావచ్చుగాని, డైరెక్టరు ప్రతిభ దానివల్లనే ప్రకటితమవుతుంది.

ఈవిధంగా ఫిలిములపొడుగు తగ్గించటంచేత విద్యావిషయకమైన చిన్నచిత్రాలూ, ప్రబోధాత్మకమైన పొట్టిచిత్రాలూ తయారుచేయటానికి గొప్పప్రోత్సాహం కలుగుతుంది. దేశానికి వీటిప్రయోజనాన్నిగురించీ, ఆవశ్యకతను గురించీ విపులంగా ఇక్కడ చర్చించ బూనుకోలేదు. కాని, చిన్నచిన్న డాక్యుమెంటరీ చిత్రాలు, వార్తాచిత్రాలు మొదలైనవి చక్కగా తయారుచేస్తే విదేశాలలోకూడా చలామణి అవటానికి వీలుందని చెప్తున్నాను. అదికాకుండా కుశాగ్రబుద్ధులైనవారు, కొత్త కొత్త అభిరుచులు కలవారు అనేకవిధాలైన ఎక్స్పెరిమెంట్సు చేయటానికి ఈ టూరీలర్‌చిత్రాలే అవకాశం కలగజేస్తాయి. ఒకవేళ ఈఫిలిములు అనుకున్నంతడబ్బును ఆర్జించ లేకపోయినా ప్రొడ్యూసరుకు కలిగేనష్టం ఎక్కువ వుండదు. పెద్దఫిలిం తీసినప్పుడు ప్రొడ్యూసరు దృష్టియావత్తూ దానిపై వెదజల్లినరూకలను జమచేసుకోటంమీదనే వుంటుంది. అందుచేత నూతనపద్ధతులు ప్రవేశపెట్టటానికి అంతగా అవకాశం వుండదు.

## తారలవేతనాలు తగ్గించాలి

స్టార్‌సిస్టంవల్ల మన కిప్పుడంతగా ఒనగూడే లాభం లేదని పైన చెప్పేవున్నాను. తెలుగుఫిలింపరిశ్రమలో కొందరు తారలకు హిందీతారల కివ్వని వేతనాలుకూడా యిస్తున్నారు. తారలవల్లనే ఫిలింకు డబ్బువస్తున్నదని భ్రమపడి ప్రొడ్యూసరులు ప్రఖ్యాతతారల కెగబడి, ఒకరిపై ఒకరు పోటీచేయటంవల్లనే ఈస్థితి ఏర్పడ్డది. హిందీ చిత్రపరిశ్రమతోనూ, వారి కుండే మార్కెట్టుతోనూ, వారి చిత్రాలకొచ్చే ఆదాయంతోనూ పోల్చి చూస్తే తెలుగుతారలకు ఇప్పుడిచ్చే వేతనాల్లో నాలుగోవంతుకూడా యివ్వటం న్యాయం కాదు. కాబట్టి నటీనటులవేతనాల్లో ఒక కనిష్ఠప్రమాణము, ఒక గరిష్ఠప్రమాణము నిర్ణయించుకొని, ప్రొడ్యూసరు లందరూ ఆ పద్ధతిని అనుసరించటం మంచిది. నెలకు రు 500లకంటె ఏతారకు గాని ఎక్కువ వేతనం యివ్వపనిలేదని నా వుద్దేశం. కాంగ్రెసుమంత్రులకు సైతం అంతకంటె ఎక్కువ జీతాలు లేవు. ఏవిధంగానైనా మన తెలుగుఫిలింపరిశ్రమ స్థిరపడి, ఎక్కువ ఆదాయం వస్తూన్నతర్వాత ఈ వేతనాలు కావలిస్తే వృద్ధిచేసుకోవచ్చు. అంతవరకూ నటులైనా ఆవుపాలకు ఆశించవలెనేగాని పొదుగుకోసి పాలు తాగటానికి ఆశపడరాదు.

మన తెలుగుచిత్ర పరిశ్రమ అభివృద్ధి పొందటానికి మరొక్క సూచన చేసి నా వ్యాసం ముగిస్తా. తెలుగు ప్రొడ్యూసర్లు తెలుగు చిత్రాలతోబాటు బెంగాలీలు, మహారాష్ట్రులవలె హిందీ నకళ్లను కూడా తయారు చేయటానికి పూనుకోవాలి. బయటవుండి చూసినప్పుడు ఈ ఆలోచన అసాధ్యంగా తోచ వచ్చుగాని పట్టుదలతో కార్యరంగంలో దిగినప్పుడు అడ్డువచ్చే ప్రతిబంధకాలేమీ వుండవు. మనకు కష్టం అనుకుంటే రోడ్డుమీదికెళ్లి బస్సు ఎక్కటం కూడా కష్టమనే తోస్తుంది. తమిళులమాటెలా వున్నా తెలుగు నటులకు హిందీచిత్రాల్లో నటించటం అసాధ్యమైనపనికాదు—లలితాదేవి, సురభి కమల మొదలైనవారిదివరకే హిందీ తెలుగుచిత్రాలు రెంటిలోనూ నటించారు. కన్నాంబ, వై. వి. రావు, నాగయ్య, రంగస్వామి, దొరస్వామి మొదలైన నటులందరూ తమిళచిత్రాల్లో వేషాలు ధరించినవారే. కాంచనమాలకూడా తమిళచిత్రాల్లో నటించబోతున్నది. పద్మావతీ సాలిగ్రాం, బాలసరస్వతి, రాజమ్మ, బేబీసరోజా, మొదలైన ఆంధ్రేతరనటీమణులు తెలుగుచిత్రాల్లో నటించారు. అంతే కాదు. ప్రఖ్యాత మహారాష్ట్రనటి శాంతా ఆప్టే అరవసావిత్రిలో పాత్రధారణ చేస్తున్నది. అలాంటప్పుడు తెలుగు నటీనటులు హిందీచిత్రాల్లో నటించలేరని చెప్పగలవారెవ్వరూ వుండరనే నేననుకుంటాను. తెలుగు నటులు హిందీచిత్రాల్లో నటించటంచేత మన తారలకు అఖిలభారతవిఖ్యాతి ఏర్పడుతుంది. ప్రస్తుతం మనతారలెంతటి సమర్థులైనా వారి కీర్తిచంద్రికలు వింధ్యపర్వతాలను అధిగమించి పోలేకుండా వున్నాయి. అంతే కాకుండా మనతారల కప్పుడు ఎక్కువపనీ, ఎక్కువ ఆదాయంకూడా ఏర్పడుతుంది. తెలుగు ప్రొడ్యూసరులు తయారుచేసే చిత్రాలకు మార్కెటు విశాలం అవటంచేత ఆదాయం వృద్ధి అవుతుంది. ఉత్తమజాతి హిందీఫిలిములతో పోటీ చేయవలసి రావటంచాత తెలుగు ఫిలిముల శిల్పంకూడా ఇప్పటికంటె ఎన్నోరెట్లు అభివృద్ధి చెందుతుంది.

శాంతారాంలాంటి సుప్రసిద్ధుడు వాహినీవారి సుమంగళిని చూసి మురుసుకున్నాడు. మన స్టుడియోలే ఇంతకంటె సర్వాంగసంపన్నంగా వుండి, మన చిత్రాలతాలూకు శిల్పం ఇప్పటికంటె వృద్ధిచెందితే ఉత్తరదేశంలో తయారయ్యే ఉత్తమోత్తమ చిత్రాలకు మనవారిచిత్రాలు ఎందునా కొరతపడవని నిర్ధారణగా చెప్పవచ్చు.

---

# శోభనాచల పిక్చర్సువారి దక్షయజ్ఞము

## "రామ రామ రామ" పాట

దక్షయజ్ఞమండీ - అందరు తప్పక చూడండీ
ధర్మయుద్ధ మండీ - భక్తులు ధన్యులగుదురండీ
ఆంధ్రకళలతో - ఆంధ్రదీప్తితో -
ఆంధ్ర శోభనాచల స్టూడియోలో
**ప్రభువు మీర్జాపూర్** - పరిరక్షణలో
అర్జాకృష్ణుని - ఆధ్వర్యములో
శిష్టదర్శకుల - శిష్యప్రాయుడు
సిద్ధహస్తుడు - చిత్రపువీరుడు
తయారుచేసిన - దక్షయజ్ఞము
నగ్నతత్వ - నారాయణాస్త్రము
వస్తున్నది మీ - పట్టణములకే
తేదీ వివరం - తెలుసుకోనండి॥ దక్ష॥

పురాణగాథల - తరాలు దాటిన
పరాకుకూతల - ప్రతికాదండీ
కృష్ణవేణి నవ - కోకిల స్వరము
గగ్గయ్య భయం - కర ధిక్కారము
రామకృష్ణుని - రమ్యగానము
కంపట్ల మనోహర - పరిహాసము
బి. టి. చార్యుల - భీకరపలుకులు
మోతీబాబు - పాటల కులుకులు
శాంతారాముని - చక్కని కుంచియ
చతురుడు వాల్కే - శబ్దగ్రహణము
విబుధుడు కిన్నీ - వేషధారణము
పొలుపగు చవాను - ఫోటోగ్రాఫీ
కుండలేశుని య - ఖండస్ఫురణము
బడసిన బంగరు - ప్రతిమారాజము
వస్తున్నది మీ - పట్టణములకే
తేదీ వివరము - తెలిసికొనండీ॥ దక్ష॥

బ్రహ్మకుమారుడు - బ్రహ్మసమానుడు
దక్షుడు ధర్మము - తప్పుట తగునా
ప్రళయరుద్రునిక్ - పగతుడుగా గొని
పరిభవింతు నని - పలుకగ నగునా
శాపగ్రస్తశ - శాంకుని గాచుట
శంకరునెడ దో - షము కాతగునా
పరమేశ్వరుడే - పతి యని నమ్మిన
భవ్యచిత్త సతి - పైపగ యగునా
శంకరు పిల్వక - సాగించిన యా
సతీస్వయంవర - సభ యేమైనదో
మహేశుశూలము - మార్కొను దక్షుని
మహితశూల మే - మంట గలిసెనో
సతీశివుల సం - సారసుఖంబులు
సాధుదేవతల - సరసప్రణయములు
దర్పోద్ధతుడగు - దక్షుడు మెచ్చక
దారుణవైరము - దాల్చి ధాత్రిలో
పాత వేదములు - పాతసూత్రములు
పాతమతమ్ములు - పాతధర్మములు
పనికిరావనుచు - బ్రహ్మపుత్రుడు
పట్టుపట్టె తన - పట్టణమంతట ॥ దక్ష॥

యజ్ఞయాగముల - యందును ఎందును
ఆయీశ్వరు నెవ - రాహ్వానించిన
"గట్టిశిక్ష" యని - కట్టడిచేసెను
కలిగ భూమిపై - కాటక మంతట
భరియింపలేక - పరమేశునితో
మొరలిడుకొని రా - మున్యాదిజనులు
శివునాజ్ఞ గొనుచు - చేరి వచించిన
శిష్టనారదుని - యిష్టముకొలదిన్
అఖండయజ్ఞము - నారంభించెను
ఆదిదేవు శివు - నారాధింపక
పుట్టింట జరుగు - పుణ్యయజ్ఞమును
పొలతి సతీమణి - పోయిచూడగ
అనుమతి నీయని - యామహేశునకు
ఆదిశక్తియై - అలరెసతీమణి
శివుడంతట భా - సిలుప్రేమముతో
నందితోడుగా - నాతని బంపెను.

దక్షుడు సైపక - తనసుత దిట్టెస
తనయ యోగదవ - దాహమునొందెను
ప్రళయరుద్రుడట - ప్రత్యక్షం బయి
పడతిని భుజముల - పైగొని యేగెను
వీరభద్రు డా - వెఱ్ఱియజ్ఞమును
దారుణగతి వి - ధ్వంసము చేసిన॥ దక్ష॥

# ఆంధ్రౌన్నత్యము

నుడికారమున సొంపు కడు వికాసము నింపు తెనుఁగునిగారంపుఘనత గలిగి,
నవరసోత్కర్షనానందసుధాతుందిలము లగు మేల్మికబ్బములు వెలసి,
భీషణాతపములు శోషింపఁ జాలని జీవత్తరంగిణీశ్రేణు లమరి,
నిత్యాభివృద్ధిని నెగడి రుచ్యక్షీరసంపన్న మగుచు గోచయము మించి,
నెఱమగంటిమి ననిమొన మెఱసి తనదు - బానిసతనమ్ము నవలీలఁ బాపికొనఁగ
వలఁతి యగు యోధవారమ్ము గలిగి తనర - వలయు మా యాంధ్రభూమి సత్
[ఫలద యగుచు.

ఉత్తమోద్యమముల నొగిఁ బాల్గొనఁగఁ బూన్చు సౌజన్యగౌరవోత్సాహశక్తి,
సర్వతోభద్రప్రశస్తి నింపెసలారి ధన్యతఁ గాంచు చిత్తప్రవృత్తి,
స్వార్థవైముఖ్యవిశంకటవ్రతదీక్ష గణ్యతఁ బొందు నిష్కపటవృత్తి,
ఆస్తికపథగామి యయి సద్గవేషణేచ్ఛాపరిష్కృత మైన సత్యదృష్టి,
కష్టసహన, మకారణకరుణ, నిత్య - తృప్తి, సౌశీల్యపోషణాదిక మనర్ఘ
భూషణపరశ్శతము తొచుఁ బొలుచుఁగాత - మాంధ్రులకు నుర్విపిశ్వవిఖ్యాతిగదుర.

ప్రకృతిమతల్లికిఁ బసదనంబును గూర్చు వివిధఫలారామవితతితోడ,
జీవనోపాధి కుజ్జీవన మ్మొసఁగెడు లలితకళాలయావళులతోడ,
వివిధధాన్యసమృద్ధి వెలసి యింపును గూర్చు బహుళకుసూలసంపదలతోడ,
వాణిజ్య మేవేళ రాణించి తామరతంపర యగు సిరి పెంపుతోడ,
నిత్యసాహిత్యసౌశీల్య సత్యనిరతి - నాంధ్రసీమానివాసు లవ్యాజకరుణ
నొగి సుధాశుభ్రకీర్తిని నెగడవలయు - నాణ్యమున కిక్క యగు తెన్గునాటియందు.



శ్రీ కేసరి
ఆదినారాయణ శర్మ



క్షోణి "సర్వే జనా స్సుఖినో భవం" తను ప్రాఁబలు కింటింటఁ బ్రతిరవింప,
భువి "నహింసా పరమో ధర్మ" యనుమాట నిఖిలగేహాళుల ధ్వనించుచుండ,
అవని "యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోష"యనెడు నుక్తి తోడుపడఁగ,
రహిని "బరోపకారార్థ మిదం శరీర" మ్మనియెడు భాషితమ్ము వెలయ
"ఆత్మవ త్సర్వభూతాని" యనెడునుడియు-నాంధ్రులకుఁ జిరపరిచిత మగుచు వఱలి
నిత్యసౌజన్యభవ్యమై నెగడవలయుఁ-బుణ్యములపంట యగు నాంధ్రభూమియందు.

తమ యీలువున రక్షణము చేసికొను సతీతిలకమ్ము లూరూరఁ గలుగునాఁడు,
తమ జీవికల జగత్సౌఖ్యాప్తి కెలయించి పొలుపొందు ధన్యులు పొదలునాఁడు,
తమ వదాన్యత మహీతలమున గుప్తంబుగా నిల్పు ఘను లెందుఁ గలుగునాఁడు,
తమ శౌర్యసాహసోద్భాసితపథముల యువకులఁ ద్రిప్పువా రొదవునాఁడు,
సిరులు సౌఖ్యమ్ములును వెల్లివిరియఁగలవు-ఆయురారోగ్యములు చెలువారఁగలవు
నిత్యసౌజన్యసంపదల్ నెగడఁగలవు - ధైర్యమున మించు నీయాంధ్రధరణియందు.

తనవారు, పెఱవార లను పక్షపాతమ్ము లధికారులం దడుగంటవలయు,
"లంచగొండి"తనమ్ము మించనీక సమూలవిచ్ఛేదనమ్ము గావింపవలయు,
"ఆకాశరామా"ఖ్యు లాతిథేయసపర్య లిడెడువారి నడంపఁ గడఁగవలయు,
జంకు గొంకును లేక బొంకి కొంపలఁ గూల్ప నెమకువారలఁ గూల్చు నియతి వలయు,
దుండగీంద్రును జూదరుల్ ధూర్తు లనృత-వ్యాక్రియులు పశ్యతోహరుల్ వ్యాప్తిఁ జెంది,
సత్య, సౌహార్ద, సౌశీల్య సంపదలకు - నేడ నడ్డంకు లిడకుండఁ జూడవలయు.

గ్రంథాలయముల సంఖ్యయుఁ దెల్లునాటను నిత్యప్రవృద్ధమై నెగడునపుడు,
పఠననికేతనప్రాముఖ్యమును జనతాభిమానోన్నతి నమరునపుడు,
ఆంధ్రదైనికపత్రికావళుల్ తెనుఁగువారలకుఁ జేదోడవులై చెలఁగునపుడు,
అతిథినిరాసనవ్యతిరేకమతి నాంధ్రగార్హస్థ్య మురుకీర్తిఁ గాంచునపుడు,
"నుత్తమర్ణాధమర్ణుల కుపకరించు - తెఱఁగునను "వార్ధుషిక" మ్మురివ్వ వఱలునపుడు
నిత్యకల్యాణసౌభాగ్యనిబిడ మగుచు - నెగడకుండునె యాంధ్రోర్వి నిత్యవృద్ధి ?

ప్రాజ్యాంధ్రసామ్రాజ్యభరణదక్షుం డగు "శ్రీకృష్ణరాయఁ" డేక్షితిని బొడమె ?
దానసింహాసనాధ్యాసి, యశస్వి "భాస్కరమంత్రి" యెవ్వీట జనన మందె ?
తన ధీప్రతిభ జగజ్జనవంద్యుఁ డైన "తిమ్మరుసు" గాంచిన పుణ్యధరణి యెద్ది ?
మధ్యందినార్కునిమాడ్కి దుస్సహతేజుఁ డయి "పలనాటి"యుద్ధాంగణమున
నరులఁ దునుమాడి, వీరశయ్యను బరున్న-"బాలచంద్రుండు"పొడమె నేభవ్యభూమి?
శూరులకు నిక్క, సత్కవీవారమునకుఁ-దావలము, పట్టుకొమ్మ వదాన్యులకును

సంస్కరణముల కిల్లు ప్రాజ్ఞ మా జనత కిరవు-ధృతికిఁ బెనువీడు నదియ మా తెలుఁగు
[నాడు.

"విద్యానగర"పూర్వవిభవమ్ము స్మరియించి ప్రకృతస్థితికి విన్నఁబాటు నంది
వంచకసంచయావాస మ్మయిన "పెనుగొండ"కోటను గాంచి కొంత యడలి,
దండిమగలఁ గన్న "కొండవీ"ట్సామ్రాజ్యపతన మ్మరసి దుఃఖభరము నాఁపి
పాడువారిన కోటగోడల పూర్వంపుచరితమ్ములను "చంద్రగిరి" నెఱింగి,
యశ్రువుల రాల్చనట్టిఁ డీయాంధ్రధరను-గలఁడె ? కాలవిపర్యయగ్రస్త మయిన
తెనుఁగుదేశమ్ము నావరించినది నేఁడు-చిమ్మచీఁకటి, ధైర్యశౌర్యమ్ము లడఁప.

ప్రజ్ఞచే "ఢిల్లీసురత్రాణుఁ" బట్టి తెచ్చిన "యుగంధరమంత్రి"ఘనత నరసి,
"మనుమసిద్ధీశ"క్షమాపాలమౌళికి యశము గూర్చిన "తిక్కయజ్వ" నెంచి,
తనదు భాగవత సుధామాధురిని నాంధ్రులను దన్పినట్టి "పోతన"ను దలఁచి
రణరంగమున శత్రుగణములఁ దునిమిన "రెడ్డినాగమ"శౌర్యరీతి నెఱిఁగి
వెలమమన్నీల యుద్ధకౌశలము గాంచి - క్షాత్త్రతేజఃప్రభావప్రశస్తిఁ దెలిసి
సునిశితావేశసౌఖ్యమ్ము ననుభవించు-పుణ్య మెఱుఁగనియాంధ్రుఁ డీభువిని గలఁడె?

దేశభాషలయందుఁ "దెలుఁగు లెస్స"గఁ జేసి "కృష్ణరాయఁడు" కళాతృష్ణఁ దెలిపె
ఆంధ్రజాతీయతావ్యాప్తికై సర్వస్వ మొసఁగి "నాగేశ్వరుఁ" డసము గాంచె,
ఆంధ్రవాఙ్మయలత కాలవాల మ్మయి "భారతి" మొనలేని సౌరుఁ గనియె
భ"వ్యాంధ్రసాహిత్యపరిష"న్నియంతయై పీఠికాపురపతి పేరువడసె,
"ఆంధ్రతేజము" నిఖిలాశ లావరించి-తొంటియౌన్నత్యపుంబ్రభాద్యుతుల మెఱసె,
నవయుగోపక్రమణమున కవసర మగు-యత్నముల నాంధ్రసుతులు చేయంగవలయు.





# జీవుడియిష్టము

[ కథానిక ]

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

౧

ఒక మారుమూల సముద్రంలో ఒక ద్వీపం ఉంది. ఆద్వీపంకూడా యెక్కడనో మారుమూల ఉంది. ఓడలమీద సముద్రాలను నాగరకులు గాలించారు. అంత గాలించిన ఆద్వీపం ఒక పట్టాన కనిపించలేదు. నాగరకులు సర్వప్రపంచము, సముద్రపునీళ్లలో తేలిన ప్రతిమంటిగడ్డ తాము సాధించామని అనుకొన్న తరువాత ఆద్వీపం ఉన్నదని తెలుసుకునేందుకే కొన్ని వేలయేండ్లు పట్టినవి. తెలుసుకోటమే ఆలస్యము. మతాలు, వర్తకులు, తుపాకులు అక్కడికి చేరినవి. ఆద్వీపంకూడా డిటో ప్రకారం అయింది.

అయితే ఆద్వీపంలో వాళ్లు ఇతరప్రపంచంలో లొంగిపోయిన యితర ద్వీపనివాసులకంటె కొన్ని వేల సంవత్సరాలు ఎక్కువస్వాతంత్ర్యం అనుభవించారు. అందుచేత వాళ్లు బానిసతనం అంత తేలికగా అలవాటు చేసికోలేకపోయినారు. ఇతరచోట్లకు మల్లేనే అక్కడా తిరుగుబాట్లు, మరఫిరంగులు, కాల్పులు.

ఒక నాగరకజాతి సేనానాయకుడు ఆద్వీపానికి సైనిక నియంత. అతడు బ్రహ్మచారి. అనగా అవివాహితుడన్న మాట. ఆద్వీపము శీతమండలాల్లో ఉండటం మూలంగా అక్కడిజనులు తెల్లనివాళ్లు. చర్మము తెల్లన. ఇతర ఖండములలోని అనాగరకులవంటివారు. అనగా కోట్ల కొలది సంవత్సరాలు బ్రతికిన జాతి అన్నమాట. చెట్టులో - పుట్టలో, సూర్యునిలో-చంద్రునిలో, కాలువలో-కొండలో, మెరుపులో-మేఘములో నేదో దివ్యశక్తి యున్నదని దాని నారాధించినవాళ్లు. మెరుమును చూస్తే జేజేలు పెడతారు. మిణుగురు పురుగులనుచూచి తొలగిపోతారు. ప్రాణశక్తివంటిది వాళ్లకు మహాగౌరవము. ప్రాణాన్ని నేలక్రింద పడవేసి రాయరు. జీవుణ్ణి కాలిక్రింద పెట్టి త్రొక్కరు. బంగారము నాణెముగా వాడుకోరు. దానియందు తేజశ్శక్తి ఉన్నదని ఆరాధిస్తారు. కుండపెంకులలో వండుకొని తింటారు. లోహపాత్రలు నాగరకత అని యెరుగరు. శరీరావయవములు కావలసినంత మాత్రము కప్పుగొంటారు. నాగరకులై ఒళ్లంతయు కప్పుకోరు. ఈ యనాగరకులు నాగరకులయ్యే రోజులు వచ్చి ఆ ద్వీపం నాగరకుల కంట బడ్డది.

సైనిక నియంత ఒక స్త్రీని చూచాడు. ఆమె అతనికళ్లు పట్టరాకండా ఉండిపోయింది. ఆ సాయంత్రం ఆవిడ మొగుడికి కబురు పంపించాడు- నీ భార్యని నాకు తోలిపెట్టమని. ఆజీవుడు యేమి చేస్తాడూ? ఇదివరకే తమ ద్వీపంలో జరిగిన ఘోరాలు అతనికి తెలుసు. అయినా జీవుడు పెనగులాడటం స్వభావం. అది అన్యాయ మని, తన ప్రాణము పోయినా తాను తన భార్యను వదలిపెట్ట నని కబు రంపించాడు. నియంతకు కోపం వచ్చింది. పదిమంది సైనికులు, తుపాకులతో వాని యింటికి వెళ్లాడు. అతడు వీళ్లు వస్తారని తెలిసి పొయ్యిలో పెట్టుకొనే పొడుగాటి పుల్లలు తానొకటి, తన పెద్దకొడు కొకటి చేతులలో పుచ్చుకొని, తమ గుడిసెముందర నిలుచున్నారు. వారి యాయుధాలను, వాళ్లను చూస్తే నియంతకు నవ్వు వచ్చింది. అతడు "ఎందుకు నవ్వుతావు" అని యడిగాడు. నియంత యిట్లా అన్నాడు: "ఓరి మూర్ఖుడా! మా తుపాకులముందు నీ కట్టెపుల్లలు నిలుస్తావా?" అని. అత డన్నాడు కదా— "నా కట్టె పుల్లలు నీ తుపాకులకు సమాధానము చెపుత వని గాదు నే నీ కర్రలు పుచ్చుకొన్నది. నా మనస్సు నీ మనస్సుకు సమాధానం చెప్పవలెనని కాని మఱొకదానికి గాదు." అని.

నియంతకు కోపమువచ్చింది. ఒక్క కత్తివిసరుతో తండ్రికొడుకుల తలలు తెగిపోయినవి. నియంత ఆ గుడిసెలో ప్రవేశించి అతని భార్యను తీసుకురాబోయినాడు. ఆరేండ్లమొదలు చనుబాలు త్రాగే శిశువువరకు నలుగురుపిల్లలు గుడిసెలో ఏడవ మొదలుపెట్టారు. ఆ స్త్రీ తనపిల్లలను వదలి రాలేకపోయింది. భర్త శవం, కొడుకు శవంమీదబడి యేడవటం మొదలుపెట్టింది. సైనికులు శవాలను తీసికొనిపోయి సముద్రంలో పారవేశారు. ఆమె యింక పిల్లలను పట్టుకొని యేడవటం మొదలు పెట్టింది. సైనికులు నియంతఆజ్ఞతో పెద్దపిల్లలను ముగ్గురినీ తల్లిచేతులలోంచి లాక్కొని పదిపదకొండుసార్లు విదలించి వేయగా వేయగా వాళ్లు దెబ్బలుతగిలి, ఉస్సురని ప్రాణాలు కడవట్టి చనిపోయినారు. ఆ స్త్రీ పాలుత్రాగుపిల్లతో నియంతయింటికి వెళ్లింది.

## 2

ఈ కథ జరిగి అయిదేళ్లయింది. పాలుత్రాగే పిల్లకు అయిదేండ్లు వచ్చినవి. ఆ స్త్రీ ఆపిల్లతో కాలం పుచ్చుతోంది. ఒక రోజున నియంత వచ్చాడు.

నియంత— ఆపిల్లకూడ పోతేగాని నీవు నాతో సరిగా ఉండవు.

స్త్రీ— నీకన్న కర్కోటకుడవు నీవే! నీవు మనుష్యుడవు కావు. ఈ పసిపిల్ల ప్రాణములుకూడా తీస్తావా?

నియంత— నిన్ను తీసుకువచ్చినప్పుడు ఇది పసిపిల్ల. ఇప్పుడు పసిపిల్ల కాదే! దీని యీడు పిల్లలను అప్పుడు నీదగ్గరనుండి లాగివేయలేదా? అట్లాగే యిప్పుడును.

ఆ స్త్రీకి అతనితో అయిదేండ్లున్న తరువాత అతని యేమాటకు ఎంతఅర్థమో తెలిసినది. తనబిడ్డ తనకు మిగులదని ఆమెకు తెలిసింది. ఆపిల్లను తీసుకువెళ్లి అతనిచేతిలోపెట్టి "యిదిగో, పిల్లను చంపివేయి. ఈ పిల్ల ఉన్నన్నాళ్లు నేను దానిని వదలిపెట్టలేను." అన్నది. అతడు ఆపిల్లను ఆమెయెదుటనే కత్తితో రెండుగా నరికాడు. ఆమె యేడుస్తూ వెళ్లిపోయింది.

## 3

ఆమె కొన్ని రాత్రులు ఉరి పోసికొందా మనుకుంది. పోసికోలేదు.

ఆమె కొన్ని రాత్రులు సముద్రములో బడి చద్దామనుకుంది. చావలేదు.

ఆమె కొన్ని రాత్రులు కిరసనాయిలు మీద పోసికొని నిప్పు ముట్టించుకుందా మనుకుంది. ముట్టించుకోలేదు.

ఇల్లా యెన్నో అనుకుంది. ఏమీ చేయలేదు. తరువాత కొన్నాళ్లకు ఒకరాత్రి నియంత తప్ప త్రాగి మదించిన కళ్లతో ఆమె వున్న గదిలోనికి వచ్చాడు. "తనకు దుఃఖానికి భేదము లేదు" అన్నట్లుగా ఉన్న ఆమెను చూచాడు. ఇట్లా అన్నాడు:

"నీ మగడు, నీ పిల్లలు పోయి పదేళ్లయింది. నీ పసిపిల్లపోయి అయిదేళ్లయింది."

స్త్రీ—నా ద్వీపపు స్వాతంత్ర్యం పోయి పాతిక యేండ్లయింది.

నియంత—(వికారముగా నవ్వి) ఇంకా యెన్నాళ్లీ దుఃఖం?

స్త్రీ — ఈ శరీరం వున్నన్నాళ్లు.

నియంత— నీకు ఏమి తక్కువగా ఉంది? పూర్వంకన్న మంచిదుస్తులు ధరిస్తున్నావు. పూర్వంకన్న మంచియింట్లో నివసిస్తున్నావు. పూర్వంకన్న మంచిభోజనం చేస్తున్నావు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీజాతికన్న నాజాతి గొప్పది. నీభర్తకన్న నేను గొప్పవాడను.

స్త్రీ—నీవు నా భర్తకన్న గొప్పవాడవు కావు.

నియంత— (కోపముతో) కానా! ఎట్లు కానో చెప్పుము.

స్త్రీ—మీకు తుపాకులున్నవి. కత్తులున్నవి. అతనికి యేమీలేవు. అయినా తన భార్యలను, పిల్లలను రక్షించుకునేందుకు కర్రపుచ్చుకొని నిలబడ్డాడు. రక్షించలేనని తనకు తెలుసు. అయినా తనధర్మం తాను చేశాడు. తాను చచ్చినతరువాతగాని నిన్ను నాదగ్గరకు రానీయలేదు. నేను నిజముగా నీభార్యనై ఉంటే నీకన్న బలవంతుడు నాకోసం వస్తే, నీవు పారిపోయేవాడవు. నీవు వట్టి పిరికిపందవు.

నియంత— (కోపముతో) నేను పిరికి పందను కాదు.

స్త్రీ—నీవు పిరికిపంద వని నా కానాడే తెలియును. నీవు ధైర్యస్థుడ వైనచో నింకొక కర్ర పుచ్చుకొని అతని నెదిరించెడి వాడవు. అంత మంది సైనికుల నేల తెత్తువు?

నియంత—(నవ్వి) అయినచో ఆ చచ్చు వెధవను నేను కర్ర పుచ్చుకొని యెదిరించలేకపోతి ననియా నీ యుద్దేశ్యం?

స్త్రీ— అతను చచ్చిపోయినాడు. నీ మాటకు రుజువు ఏమున్నది? ఇప్పుడు నీధైర్యాన్ని నీవు నాకు రుజువు పరచలేవు. నిజంగా నీవు ధైర్యస్థుడవే అయితే అప్పు డలా చేసియుండవు.

నియంత—నాకు ధైర్యము లేకపోవుట కాదు. నా కప్పు డీ తెలివి. లేకపోయింది.

స్త్రీ—మాజాతిలో తెలివికి ధైర్యానికి యెక్కువ భేదంలేదు. న్యాయానికి తెలివికి యెక్కువ భేదంలేదు. మాకు న్యాయమే తెలివి. తెలివే ధైర్యం.

నియంత—మఱి యిటువంటివాడితో, నాతో నీవు సంసార మెందుకు చేస్తున్నావు ?

స్త్రీ—నేను నీతో సంసారము చేయుట లేదు.

నియంత—ఈ మాటలు వింటే యెవరైనా నిన్ను మూఢురాల వనుకొంటారు.

స్త్రీ—నేను వాళ్లని మూఢు లనుకొంటాను.

నియంత—అయితే నీకు నాతో ఉండటం యిష్టం లేదన్నమాట.

స్త్రీ—లేదని నీతో చెప్పుట యిది యెన్నిలక్షలోసారి.

నియంత—నీవు నన్ను ప్రేమించటంలేదని నాకు తెలుసు. నీ ప్రేమను నేను సాధుమార్గాన సంపాదించవలసింది. అప్పుడు ప్రేమించేదానవు.

స్త్రీ—నీ జాతి అంతా నశించిన తరువాత నిన్ను ప్రేమిస్తాను.

నియంత—నిన్ను చంపేస్తాను.

స్త్రీ—పదియేళ్లనుండి అల్లా చేస్తావేమోయని యెదురు చూస్తున్నాను.

నియంత—నీకు చావంటే అంత యిష్టమా ?

స్త్రీ—అంతాయింత యిష్టమా!

నియంత—అయితే చావటానికి మార్గాలు లేవా?

స్త్రీ—ఉన్నవి.

నియంత—అయితే ఎందుకు చావవు? సముద్రంలో పడి చావవచ్చు. ఉరిపోసికొని చావవచ్చు.

స్త్రీ—నా కట్లా చావటం యిష్టంలేదు.

నియంత—ఎట్లా చావటం యిష్టం?

స్త్రీ—నీకు కోపము తెప్పించి నువ్వు నన్ను చంపితే చావాలని.

నియంత—అంటే, నీకు నామీద ప్రేమ ఉన్న దన్నమాట.

స్త్రీ—అవును, ఉంది. ఆ ప్రేమ యెల్లాంటిదంటే? నాభర్త, నాపిల్లలు నీ చేతిమీదుగా చచ్చారు గనుక అల్లా నీ చేతిమీదుగానే చద్దామన్నంత ప్రేమ.

నియంత—ఈ మాటల కేమిగాని నీకు చావటాని కిష్టంలేదు.

స్త్రీ—చాలా పొరపాటు. చావటాని కిష్టం ఉన్నది. ఆ యిష్టముకూడా ఒళ్లంతా తగలబెడుతూ ఉన్నంత యిష్టం. కాని చావు రెండురకాలు. ఒకటి తనంతటతాను చచ్చే చావు. రెండవది యెదటివాళ్లు చంపితే చచ్చేచావు. నాకు రెండవచావే యిష్టం.

నియంత—అంటే నాతోకలిసి సుఖించడం యిష్ట మన్నమాట.

స్త్రీ – నిన్ను నేను పదేండ్లనుండి యెరుగుదును. నీవు పశువవు. నీ నాగరకత అంతా నీవుచేసే సురాపానంలో, నీవు ధరించే దుస్తుల్లో, నీచేతిలో నున్న తుపాకి మందులో ఉంది. నీ మనసులో లేదు. నీజాతిలో లేదు. నీ సృష్టిలోలేదు. నిన్ను నేను ప్రేమించటంలేదు. నీవు మనుష్యుడవేకాదు. నేనుబ్రతుకుచున్నానన్న విషయం నీకాశ్చర్యంగా ఉంది. నేను ఉరిపోసికునో, సముద్రంలో పడో చావటం నాజీవుడికి యిష్టంలేదు. నాజీవుడు ఈశరీరాన్ని పట్టుకున్నాడు. వాడంతట వాడు వదలిపోడు. ఆ నా చనిపోయిన భర్తకోసం, పిల్లలకోసం గుండె అటమటించి చావటం, మహాగ్నిజ్వాలలలో మ్రగ్గిపోవటం ఈ జీవుడికి యిష్టం. ఈ జీవుడికి యిది యొక అనుభవం. ఆ జీవుడు తనంతట తాను చచ్చిపోడు. చచ్చిపోవటానికి యిష్టపడడు. సౌఖ్య మనుభవిద్దామని కాదు. దుఃఖ మనుభవిద్దామని. సౌఖ్యమో, దుఃఖమో యీ శరీరంతో పుట్టి, యీ శరీరానికి సంబంధించిన అనుభవించటమే అతని కిష్టం. ఈ శరీరానికి, యీ జీవుడికి ఒక యెడతెగరాని లంకె. ఈ శరీరంతో ఈ జీవుడికి యిష్టమైన అనుభవము వాడు అనుభవమనుకొంటాడు. మరి యీశరీరంతో నేను నీతో సంసారము చేస్తున్నాను గనుక అదీ వాడి యిష్టమే అనుకుంటావు కాబోలు. అల్లాకాదు. నాఅంతట నేను చావటం నా కిష్టం లేదు. నీవు చంపితే చచ్చిపోవటం చాలా యిష్టం. మృత్యువు దానియంతట అది వస్తే చావటం యింకా యిష్టం. అట్లాగే ఈ జీవుడు ఈ శరీరంతో తన యిష్టం వచ్చిన సౌఖ్యాన్ని అనుభవించి సౌఖ్యం అనుభవించా ననుకుంటాడు. ఇతరులవల్ల బలవంతంగా చేయబడ్డ అనుభవం అది వాడికి సౌఖ్యం కాదు. అది దుఃఖమే. ఆ దుఃఖమైనా అనుభవించటం అతని కిష్టం.

నియంత—అయితే నీవు నా కక్కరలేదు.

స్త్రీ—నేను నిన్నడుగలేదు.

నియంత—నిన్ను చంపుతాను.

స్త్రీ—ఊరికే అనట మెందుకు?

నియంత ఆమెను చంపెను. చనిపోవుచున్న యామెపెదవిమీద సంతోషపు నవ్వు తాండవించెను. ఆమె కొనయూపిరితో నిట్లనెను: "నీవు నీ జన్మలో చేసిన మంచి పని యిది యొక్కటియే. నేను చనిపోవుచుంటిని గదా! నీవు తరువాత యేమి చేసెదవు?"

నియంత—మరల నింకొక స్త్రీనిసంపాదించెదను.

స్త్రీ—నీకు తగినమాట! నీజాతికి జీవునియిష్టము తెలియదు.

---



# ఆంధ్రోద్యమము, పూర్వాపరములు

శ్రీ భావరాజు
వెంకటకృష్ణరావు



౧౯౧౩-వ సంవత్సరములో ప్రారంభమయిన అంధ్రోద్యమము ౨౭ సంవత్సరము లయినను గిడస బారిపోయి 'మడగుజ్జు' రూపముతో నున్నది. ఎన్నటికైన నీ వామనావతారమును విరమించి అంధ్రోద్యమము త్రివిక్రమరూపమును దాల్చునా యని మాటిమాటికిని అంధ్రజాతికి తీరని ఆవేదన కలుగుచున్నది. ఆనాడెట్లు ప్రత్యేకాంధ్రరాష్ట్రము అవసర మగునా, కాదా యని ప్రశ్నలు పుట్టి అభిప్రాయభేదములు కలిగెనో, ఆ రీతిగనే యీ నాడును అట్టి అభిప్రాయభేదములు సమస్యారూపమును దాల్చి చెలరేగుచుండుట మిక్కిలి సంతాపకరము. ఉద్యమము సాగుట లేదు; సమస్యలు నానాటికిని ఎక్కువయగుచున్నవి. ప్రతివిషయమును కలహములతోను, అభిప్రాయభేదములతోను నింపి, మన నాయకు లూరక షాణ్మాస చేయుచు కాలహరణము చేయుచున్నారు.

## అంధ్రులపై అపవాదు

అంధ్రజాతియందు ఐకమత్యము, సంఘీభావముపు లేవన్నమాట లోకోక్తిగా పరిణమించెను. అంధ్రు లుత్సాహవంతులేగాని అనుకరణాభిలాషులుగాని స్వతంత్రముగా దేనినైన చేయగల ప్రజ్ఞాకౌశలములు గలవారు కారని అపఖ్యాతి వచ్చెను. అంధ్రు లారంభశూరులును, వాక్శూరులును గాని కార్యనిర్వహణదక్షుత లేనివారని లోకమున అపవాదు జనించెను. అంధ్రులును, అంధ్రోద్యమమునుగూడ నేడు పరిహాసపాత్రము లయ్యెను.

## ఓఢ్రుల జాతీయగుణసంపద

ప్రక్కనున్న ఓఢ్రులు మనకంటె ఎంతో వెనుక ప్రత్యేకరాష్ట్రము కావలె నని ఆందోళనము ప్రారంభించిరి. కాని, వారు సంఘీభావముతో తమ శక్తి సామర్థ్యములను ఉత్సాహోద్రిక్తులై ప్రయోగించి ప్రత్యేకరాష్ట్రరథమును, చూచుచుండగనే మన కాశ్చర్యము కలుగునటుల తరలించుకొని రాగల్గిరి. అసలు కదలదుకాని కదలుట ప్రారంభించినతరువాత గమ్యస్థానమును చేరువఱకును నిలువదు పూరీ జగన్నాథుని మహారథము. ఓఢ్రుల జాతీయ గుణసంపద అట్టిది. అంధ్రోద్యమరథము ఇరువదియేడుసంవత్సరము లయినను బయలుదేరిన స్థలమందే, ఊబిలో చిక్కుకొనినట్లు కదలలేక నిలబడియున్నది. ఎందరో నాయకులు, మహామేధావంతులు, మహాబలసత్త్వసంపన్నులు సారథ్యము చేయుటకై నడుము కట్టి, ముందుకువచ్చి రథమును ఇసుమంతయును గదల్పజాలక విఫలమనోరథు లయి వెనుకకు మరలినారు. వారిలో కొందరు నిరుత్సాహము జెంది స్వర్గస్థు లయినారు. ఆశోపహతు డయ్యును, ఉత్సాహమును వీడలేక నిస్పృహతో దిక్కులు పరికించుచు, వృద్ధ వతి కొండ వెంకటప్పయ్యపంతు లొక్కడు జీవించియున్నాడు.

---

* ఈ శీర్షికలో అందరూ వాడేరీతిగా 'ఆంధ్ర' అని కాక 'అంధ్ర' అని ఉండటం చూచి పాఠకులు ఆశ్చర్యపడవచ్చును. శ్రీ కృష్ణరావుగారు ఈ వ్యాసంలో మొదటినుండి చివరిదాకా 'అంధ్ర' అనే వాడియున్నారు. అసలు అంధ్ర అనునదే సరియయినదని వీరి వాదము. ఆసంగతి ఈ వ్యాసంలో చర్చించినారుకూడాను. —సంపాదకుడు.

## ఆంధ్రోద్యమ స్థితి

ఆంధ్రోద్యమరథమునకు సరియైన చక్రములుగూడ లేవు. ఇపు డమర్చినవి తాత్కాలికముగా పెట్టినట్లున్నవి. నడకను సాగనీయకున్నవి. అం దొకటి పెద్దది; రెండవది చిన్నది. ఈ ఆంధ్రోద్యమ రథమును సగము దూరమయినను చక్రములతో నీడ్చుకొని పోవుటకు ఐకమత్యము గలిగించి, ఒక్క లక్ష్యమును కలిగి ఉత్సాహము చూపింపగల దక్షులయిన నాయకులు ముగ్గురుకూడ ఆంధ్రావనియందు కనబడరు. రాజకీయ రంగమున బాటయు సరిగా కన్పట్టదు. అది సందుగొందులతో, ముండ్లకంచెలతో, గండ్లతో, రొంపితో నిండి దగ్గమముగా నున్నది. ఇపు డాంధ్రోద్యమమును నడిపింతుమని ముందుకు వచ్చినవారికి త్రోవయు, తెన్నును గూడ కనబడుట లేదు.

ఉన్మాదస్థితియం దున్న రోగివలె నున్నది యీ ఆంధ్రజాతి. తెలివిసంధివలె నున్నది ఆంధ్రుని దుస్థితి. ఉన్మాదము కొంచెము వదలినపుడు ప్రత్యేకాంధ్రరాష్ట్రము కావలెనని ఊరంత బొబ్బపెట్టి చిందులు త్రొక్కును. మరల ఏదో విపరీతము పుట్టును. అతడంతట మరల తెలివిసంధిలో కూలిపోయి, నిద్రావస్థను జెందును.

## ఆంధ్రనౌక మెట్టపట్టిపోవుటకు కారణములు

"ఇది ఆంధ్రరాష్ట్ర సాధనమునకు సమయము కాదు. ఆంధ్రరాష్ట్రమును వాంఛించుట కూడ నింద్యము" అని, పాకిస్థానమును పట్టుకొని ముస్లింసోదరునితో కలసి పరవళ్లు త్రొక్కుచున్న రామలింగారెడ్డిని జూచి పట్టాభిసీతారామయ్య త్రాచుపామువలె బుసకొట్టుచున్నాడు. రామలింగారెడ్డి మహామతిమంతుడు; వ్యుత్పన్న ప్రజ్ఞ కలవాడు; సమయానుకూలముగ రాజనీతిని చూపి వీలును బట్టి పతాకమును మార్చి శ్రోతలను తన వాగ్ఝరీ మాధుర్యముచే సమ్మోహితులను చేయగల మనీషి; అఘటనఘటనాసమర్థుడు. అప్పుడప్పుడు రాజకీయ వాతావరణము జీమూతముగా నున్న వేళలందు దీపస్తంభము వెలుగునీయగల మహాప్రతిభాశాలి. కాని దూరదృష్టి తక్కువ. శ్రీ రామలింగారెడ్డిగంటి నాయకు లుండుటబట్టి, ఇంతకు ముం దనేకపర్యాయములు ఆంధ్రనౌక మెట్టపట్టి పోవలసివచ్చెను. తెఱచాపలు విప్పుకొని యథేచ్ఛగా సుఖప్రయాణము చేసి గమ్యస్థానమును చేరజాలకపోయెను. ఆంధ్రోద్యమనౌక అప్పుడప్పుడు మెట్టపట్టుచువచ్చెను గాని, కొద్దిపాటి మరమ్మత్తులతో మరల యానయోగ్య మగుచుండెను. కాని ఎప్పటికప్పుడు పతకమును మార్చు ఐంద్రజాలిక రాజనీతిజ్ఞులు కర్ణధార్యము చేయబూనినపుడు ఆంధ్రోద్యమనౌక తప్పక కొండలకు దాకొని భగ్నము కాగలదు. అట్టి విపత్తు ఏనాటికిని కలుగకుండునుగాక.

## జస్టిసునాయకుల ఉపకారము

జస్టిసుపార్టీ ఆంధ్రనాయకుల చేతులలో నుండిననాడు తలచుకొని యుండినచో ఆంధ్రరాష్ట్రము ఒక్కత్రుటిలో వేరుపడవలసియుండెను. ఆ యవకాశము దాటిపోయెను. జస్టిసునాయకులు ఉపేక్ష చేసిరి. కాని రామారాయణింగారు మాత్రము విశేష దూరదృష్టిగల నీతిజ్ఞుడుకావున కొంతయుపకారమును చేయబూనుకొనెను. అందుల కాతని అనుచరుడు పరశురామపాత్రుడు దోడ్పడియెను. రాబోవు కాలమును గుర్తించి రామారాయణింగారు విశాఖపట్టణమున ఆంధ్రజిల్లాలకు ఒక మెడికలుకాలేజీని ప్రతిష్ఠించెను. సకలాంధ్రావనికిని ఒక విశ్వకళాపరిషత్తును పరశురామపాత్రుడు నెలకొల్పెను. భవిష్యదాంధ్రరాష్ట్ర నిర్మాణమున కివి రెండును మూలస్తంభాయమానములుగ నుండు నని రామారాయణింగారు ఆశించెను. కాని రామలింగారెడ్డిగారు ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు ఉపాధ్యక్షుడయిన నాడే ఆంధ్రరాష్ట్రభవనమునకు సరిగా ఉపాయ మేర్పడకమునుపే, మూలస్తంభములు పాతిన పునాదులు బీటలు వారెను. నాటినుండి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు కలహబీజమయ్యెను. ఆసంస్థ ఆంధ్రులలో సంఘీభావమును పెంపొందించి ఆంధ్రసంస్కృతికి ఉత్తేజమిచ్చుటకు మారుగా కలతలకును, వైమనస్యములకును మూలకారణమయ్యెను.

## కలహబీజమైన కళాపరిషత్తు

ఆంధ్రవిశ్వకళాపరిషత్కార్యస్థానమును ఏక కేంద్రమును ఏనాడాతడు విశాఖపట్టణమునకు గొనిపోయెనో, ఆనాడు ఆంధ్రోద్యమవృక్షముపై పిడుగుపడినట్లయ్యెను. ఆంధ్రోద్యమమువలె ఆంధ్రవిశ్వకళాపరిషత్తు గూడ గిడసబారిపోయినది. దానిపై ప్రజకు పూజ్యభావము లేదు. ప్రభుత్వమునకు గూడ అభిమానాదరణలు లేవు. అతడు చేసినదానికి ఫలితముగా ఆంధ్రరాష్ట్రముగా నేర్పడవలసిన తెలుగుజిల్లాలు రెండు చీలికలుగా విడిపోయెను. రాయలసీమవారికి నిష్కారణముగా తూర్పుజిల్లాలవారిపై అవిశ్వాసము గలిగెను. ఆంధ్రవిశ్వ కళాపరిషత్తుపై జుగుప్స కలిగెను. నాటినుండి ప్రత్యేకాంధ్రరాష్ట్రసాధనకు రాయలసీమ ప్రతిఘటింపసాగెను. ఆసీమయందు ప్రత్యేకాంధ్రరాష్ట్రము వలదని ఘోషించు మానిసి ఒక్కడైనను ఉన్నంతకాలము ఆంధ్రజాతి వాంఛ లీడేరవు; ఆంధ్రోద్యమము ఫలింపదు. కాలువిరిగిన అదుకుకొనును. కాని మనసు విరిగిన అదుకుకొనుట కష్టతరము.

## శ్రీబాగు ఒడంబడిక

కొంతకాలముక్రిందట ఆంధ్రరాష్ట్రము నేర్పఱుపగల శక్తి కాంగ్రెసుచేతులలో నున్నదను ఆశ యుండెను. కాంగ్రెసు తన రాజ్యాంగ విభజనయందు ఇదివఱకే ఆంధ్రరాష్ట్రమును విడదీసి యుండెను. ఇదియు కొంత మేలనిపించును. ౧౯౩౭-వ సంవత్సరమునందు నంద్యాలలో ఆంధ్రరాష్ట్రీయ

మహాసభ సమావేశమయ్యెను. మదరాసు శాసనసభలోని ఆంధ్రసభ్యులు వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రయత్నమును శాసనసభలలో చేయవలసిన దని హెచ్చరించుచు చేసిన ఒక తీర్మానము ఆమోదింపబడెను. తరువాత చిత్తూరులో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు కూడ ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సత్వరముగా జరుగవలసిన దని అఖిల భారత కాంగ్రెసు సంఘమువారిని కోరుచు తీర్మానమును గావించిరి. కాని వైమనస్యమును వృద్ధిచేసుకొనుచుండుటవలన రాయలసీమ వారితో కథ మరల మొదటికి వచ్చెను. రాయలసీమవారి అవిశ్వాసమును తొలగించి సౌమనస్యము నేర్పడునట్లు చేయుట కాయా సీమలయందు మారుమూలలకు దిరిగి పట్టాభి సీతారామయ్య ప్రచారము గావించెను. ఆ మహనీయుని ప్రచార ఫలితముగ ఆంధ్రోద్యమము మరల మొలకలెత్తెను. కాని ఆ సంవత్సరము జరిగిన ఆంధ్రోద్యమ రజతోత్సవ మహాంధ్ర సభయందు రాయలసీమ నాయకులు తప్పంతయు తూర్పుతీరపుజిల్లాలవారిదే యని, ఆంధ్ర విశ్వకళాపరిషత్తుయొక్క కార్యస్థానకేంద్రములను నిర్ణయించుసందర్భమున తమకు గలిగిన అన్యాయమును, అభిప్రాయభేదములను, అవిశ్వాసమును, అసంతృప్తిని మొగమోటము విడిచి వెల్లడించిరి. ఆ యభిప్రాయభేదములను, అసంతృప్తిని తొలగించుటకును, ఎట్లయినను ఆంధ్రైక్యత చేకూర్చుటకును ఒక ఉపసంఘము ఏర్పాటు కావింపబడెను. ఆ యుపసంఘమువారి కృషియొక్క ఫలితము శ్రీబాగు ఒడంబడిక. అది నవంబరు ౧౬-వ తేదిని ౧౯౩౭-వ సంవత్సరమున జరిగెను.

శ్రీభాగు ఒడంబడిక కథను మరల మొదటికి తెచ్చెను. ఆ యొడంబడిక ఏ యుద్దేశములు నెరవేరుటకు జరిగెనో అవి యింతవఱకు జరుగలేదు. ఆ యుద్దేశములు ఎన్నటికిని నెరవేరజాలవు. ఆంధ్రైక్యత ఎన్నడును గలుగకుండచేయు విషబీజములండే గలవు. వాటిని నాయకులు ఉత్సాహవశమున గ్రహింపలేకపోయిరి. వారు అతుకులమారిబొంత నొకదానిని సుట్టుకొని కప్పుకొని విశ్రమింపగల మని ఆశపడిరి. వారి ఆశ వృథాయైనది.

శ్రీబాగు ఒడంబడికలోని మొదటి నిబంధన యిట్లున్నది: "ఆంధ్రులలో సంస్కృతిని, సాంఘికఐకమత్యమును పెంపొందించుటకును, వైజ్ఞానిక కేంద్రములను ఆంధ్రదేశమున కంతటికిని ఉపయోగపడచేయుటకును ఆంధ్ర విశ్వవిద్యాలయమును వాల్తేరులో నొక కేంద్రమును, అనంతపురములో నొక కేంద్రమును అభివృద్ధిపఱచవలెను. ఇతర కళాశాలలను తత్సంబంధములగు విషయ పరిజ్ఞానమున కనుకూలమగు చోట్ల నెలకొల్పవలెను." ఈ నిబంధనయందు ఇదివరకు కలిగిన దుస్థితిని నిర్మూలింపజేయు ఉద్దేశము కాన్పింపదు. ఉన్నదానిని బాగుచేసికొని, దానిని సర్వజనాదరణీయము చేసుకొనగల శక్తిని మన నాయకులు ఆ నిబంధనయందు కనబఱచలేకపోయిరి. గతముపట్ల చూపలేని సహనమును, వివేకమును భావికాల పరిస్థితులపట్ల చూపగల రనుట హాస్యాస్పదము. ఆంధ్రవిశ్వకళాపరిషత్తుయొక్క కార్యస్థానము కదా ఈ అభిప్రాయభేదములకును, అవిశ్వాసమునకును మూలకారణము? దానినేల కేంద్రముగానుండు స్థలమునకు తీసుకొని రాగూడదు? దానికై ఆంధ్రరాష్ట్రాభిమానము గలవారెల్ల ప్రయత్నము చేయదగును. అట్టిది చేయక, చేయుటకు భయపడి నాయకులు రాబోవు ఆంధ్రరాష్ట్రమునందు గంధర్వ నగరములను గట్ట నారంభించిరి.

శ్రీబాగు ఒడంబడికలోని రెండవ నిబంధన గూడ మొదటిదానిరీతిగా, అవిశ్వాసమను నీటిమీదనే వ్రాయబడినది. "తగాదాలు కలిగినపుడు రాయలసీమజిల్లాల అవసరమును మొదట తీర్చవలయును. ఈ విధానము నేటినుండియే ప్రభుత్వము అమలులోనికి దేవలయును." ఆంధ్రరాష్ట్రము వచ్చినపుడు తగాయిదాలు వచ్చు ననుకొనుటయు, ఎల్లప్పుడును రాయలసీమవారిని తూర్పుజిల్లాలవారు తడిగుడ్డలతో నిశ్శబ్దముగా కుత్తుక నుత్తరింతు రనియు ఊహించుట నీతి గాదు. అది పుట్టనిబిడ్డకు పేరులుపెట్టుటవంటిది. అవిశ్వాసముతో ప్రారంభించినపుడు అడుగడుగునకును విషమసందేహములే కనబడుచుండుట సహజము.

ఇక నాల్గవ నిబంధనను చూడుడు: "విశ్వవిద్యాలయము, హైకోర్టు, ముఖ్యపట్టణము—ఈ మూడును ఒక్కచోటనే చేర్చి, ఒక్క ప్రదేశమునకే ప్రాముఖ్యము నిచ్చుటకంటె వేరువేరు ప్రదేశములలో నుండుట మంచిదని తలంచుచు, విశ్వవిద్యాలయము ఉన్నచోటనే ఉండవచ్చు ననియు, హైకోర్టు, ముఖ్యనగరము కోస్తాజిల్లాలలోను, రాయలసీమలోను నుచిత ప్రదేశములలో నుండవలెననియు, ఇందులో ఏది రాయలసీమయం దుండవలెనో, దానిని రాయలసీమవారే కోరుకొనవలెను." ఇదికూడ సంశయములపై, అవిశ్వాసముపై కట్టబడిన ఒడంబడికయే. హైకోర్టు, ముఖ్యపట్టణము, విశ్వవిద్యాలయము-మూడు నొకచోట కేంద్రస్థానములో నుండుట శ్రేయస్కరము. సాంస్కృతిక, వైజ్ఞానిక, రాజ్యాంగ, న్యాయ, శాసనాది సంస్థలు అన్నియు నొక్కతావునందు కేంద్రము నొందియున్నప్పుడు కలిగెడి లాభములు అపారములు. ఆంధ్రులయొక్క సర్వతోముఖమైన ప్రతిభా పాండిత్యములు, ప్రజ్ఞాకౌశలములు మొదలగు ఉత్తమగుణముల సంపద యంతయు నొక్కచో జేరి ప్రకాశవంతమై, దేశము నాల్గుమూలలను వెలుగుతో నింపును. లేకున్న ఆంధ్రభూమి ఎప్పటిరీతిగా అంతఃకలహములతో నిండి అంధభూమి యగును. విద్యాస్థానము, రాజ్యాంగము, న్యాయస్థానము నొక్కచోట చేర్చినపుడు కలుగు భాగ్యసంపదకు మేర యుండదు. వర్తకము, పరిశ్రమలు, కళలు—వేయేల, నాగరిక లక్షణములయిన వన్నియు అహీనముగా స్వాభావముగా వర్ధిల్లును. వంగదేశమును దిలకింపవలెనన్న, ఒక కలకత్తానగరమును చూచిన చాలును. మహారాష్ట్రభూమిని గురించి

తెలుసుకొనవలెనన్న, ఒక్క పునహాపట్టణము చాలును. ఒకజాతియొక్క సర్వసంపదలును ఒక్కచోట కేంద్రీకరింపబడినపుడు, అవి అన్నియు నొకదాని కొకటి దోహదమునిచ్చి సర్వాంగసౌందర్యముతో, సమానపోషణతో పెరుగగలవు. నేర్వేరు తావులందు విద్యాపరిషత్తు, రాజ్యాంగము, న్యాయస్థానము లుంచబడినపుడు కలుగు ఇక్కట్లు ఇపు డూహింపజాలము. అడుగడుగునకును అన్నియు ఇబ్బందులే కలుగుచుండును. ఈ మూడు స్థానములను ఏది కావలయునో అదియే కోరుకొనుటకు హక్కు రాయలసీమవారికి ఉండవలయుననుట చూడ రాయలసీమవారి మనస్థితిని విమర్శించి పరిశీలించినపుడు వారికి వేంగి కళింగమండలములవా రేమి ఒసగినను, ఒసగుదుమని వాగ్దాన మిచ్చినను విశ్వాసము కుదురునట్లు లేదు.

ఈ నిబంధన లన్నియు నిట్లుండగా, నీ యొడంబడిక ఉభయుల అంగీకారముపై మార్చుకొనవచ్చునన్న షరతు ఒకటి చేర్చబడియెను. ఇట్టి ఒడంబడికను ఆచరణలో బెట్టుటకు అవకాశమును ఎవరును కలిగింపజాలకపోయిరి. పంపకము లయినతరువాత ఎవరైన వీలుచూచి గోడలు పెట్టుకొని, పెరళ్లు ఏర్పరుచుకొందురుగాని, పంపకము గాకమునుపే యెవ్వరును గోడలను త్రవ్వి మట్టి యివతల పారబోయరు. ఈ యొడంబడికను మన నాయకులు దూరదృష్టితో చేసుకున్నట్లు కనుపించదు. ఉత్తర సర్కారులవారికి అంధ్రరాష్ట్రము కావలయునని గట్టిగా కోర్కె యున్నది. రాయలసీమవారికి కోస్తాజిల్లాలవారిపై నమ్మకము లేదు. అంధ్రరాష్ట్రము వచ్చిన లాభమునంతయు వారే పంచుకొనిపోవుదు రన్న భీతి వెన్నాడుచున్నది. కావున "అంధ్రరాష్ట్ర సంపాదన విషయమై ఉత్తర సర్కారులవారికి అభిలాష యున్నయెడల, వారు మనలను కూడ గట్టుకొని రావలయునన్నచో, వారు మనకు కావలసిన సదుపాయములనన్నింటిని కలిగింపగలవారమని నేడే ఒడంబడికలు వ్రాసుకొని సంతకములు చేయవలెను. లేని యెడల వారితో మనము కలిసిపోరా" దన్న నిశ్చయము వారల మనసులో నెలవు కల్గించుకొనెను.

## మద్రాసు అంధ్రరాజధాని కావలె ననుట తెలివిమాలినపని

అంధ్రులందు సౌహార్దము శ్రీ బాగు ఒడంబడికవలన కలుగలేదు. కష్టములు కలిగినపుడు బంధువుల సాహాయ్యము కలుగవలయును. ఇతరసమయములందు అనవసరము. బంధువులు అప్పుడు బంధువులుగానైన కన్పట్టరు. కావుననే రాయలసీమవారు నడుమనడుమ తా మంధ్రులము గామని బెదరించుచున్నారు. శ్రీ బాగుఒడంబడికలో చేరనిది శ్రీ బాగు ఒడంబడికఫలితముగా మద్రాసు ముందు ఏర్పడబోవు అంధ్రరాష్ట్రమునకు రాజధానిగా నుండవలెనన్న ఉద్దేశము కలిగెను. మద్రాసు అంధ్రరాజధానిగా ఉండవలెనని కోరుటకన్న తెలివిహీనమైనది యింకొకటి లేదు. మదరాసు తమిళాంధ్రభూముల సంధియం దున్నది. అది యొక మహాసత్రము. అందు తమిళుల కెంత కాణాచి యున్నదో, అంధ్రులకుకూడ నంత కాణాచి యున్నది. కేరళ కర్ణాటకుల గొడవ నిపు డిందు తడవనక్కరలేదు. మదరాసును అంధ్రుల కిచ్చుటకు తమిళు లంగీకరింపరు. తమ సర్వస్వమును గూడ ఒడ్డి అట్టిస్థితి రాకుండ తమిళులు ప్రతిఘటింతురు. మదరాసు తమిళుల కిచ్చుటకు ప్రభుత్వమువా రంగీకరించినపుడు తేజోవిహీను లయి అంధ్రులు నిస్పృహతో చూచుచుండెదరు. అంధ్రరాష్ట్రములోనికి మదరాసు రాకపోవుటయేగాక, మదరాసు తమకు రాజధానీనగరముగా నుండవలెనని అంధ్రులు కోరుచుండునంతకాలము అంధ్రరాష్ట్రము కూడ లభించదు. మదరాసు అంధ్రులకు పోకుండ ప్రతిఘటించుటయే గాక, ఎప్పటికిని అంధ్రరాష్ట్రము గూడ రాకుండ తమిళసోదరులు కృషిసల్పుదురు. ఈనాడు కార్యనిర్వహణదక్షత అంధ్రులయందుకంటె తమిళులయందు ఎక్కువగా ప్రకటిత మగుచున్నది.

మదరాసు రాజధానీనగరముగా నుండుటకు ఇతర కారణములనబట్టికూడ తగదు. అయ్యది అంధ్రదేశాంతర్భాగమున లేదు. ఆనగర మాదిగా అంధ్రభూమి ఉత్తరమునకు సుమారు ఆరువందలమైళ్లు వ్యాపించియున్నది. అంధ్రదేశముయొక్క హృదయమునకును, జీవమునకును కృష్ణాగోదావరీనదులు ప్రవహించు సీమలు ఆటపట్లు. జీవరక్తము ప్రవహించెడి కేంద్రస్థలమునందు - అంధ్రజాతికి ప్రాణమున్న స్థలమందు రాజధానీనగరమును ఏర్పరిచి అంధ్రజాతీయ సంస్కృతికి, ప్రజ్ఞకు, ప్రతిభకు, చారిత్రకమైన సంప్రదాయమునకు అనుగుణముగా, నూతనముగ అంధ్రయుగమును ప్రారంభించుట పాడిగాని దేశాంతరసీమలందు ముఖ్యనగరమును నెలకొల్పుట నీతిగాదు. కర్షకుడు తన పొలమునకు గట్లువేసుకొని, క్షేత్రమును రక్షించుకొనుచు, సరిహద్దుసీమలనడుమ పంటపండించుకొని అనుభవించునుగాని, కంచెలందు పైరుచేసి తన వ్యవసాయఫలితమును పొందగోరడు. మదరాసు అంధ్రభూమికి కంచవంటిది. అయ్యది తమిళనాడుకు కూడ నట్టిదే. అది ఎప్పటికిని తమిళాంధ్రసంధిభూమిగా నుండదగినది గాని మరియొకటి కారాదు.

## కాంగ్రెసురాజ్యము అంధ్రజ్వాలపై నీళ్లుచల్లెను

ఈలోపుగా కాంగ్రెసుకు ఎన్నికలందు అపూర్వము, నద్వితీయము నగు జయము చేకూరెను. మంత్రివర్గనిర్ణయమునందు దేవాసురయుద్ధ మయ్యెను. మనవారిపై మనవారికి గల అసూయకారణమున అంధ్రులకు తీరని అన్యాయము జరిగెను. కాంగ్రెసుకు అధికారము పూర్తిగా లభించెను. కాంగ్రెసు రాజ్యాధికారమును వహించినపుడు ముందు

వెనుకటిచూడని ఆంధ్రనాయకులకును, ఆంధ్రప్రజకును ఆంధ్రరాష్ట్రవాంఛ బలీయమయ్యెను. శ్రీబాగుఒడంబడికవలన సర్వమును సిద్ధించునని ఎల్లరును పేరాశతో నుండిరి కాని, నాయకులుమాత్రము ఆంధ్రరాష్ట్రసమస్యను ఎదుర్కొనవలసిన రీతిగా నెదుర్కొనక పెడమార్గములను బోవసాగిరి. చివరకు కాంగ్రెసురాజ్యము రాజగోపాలాచారిగారి యాజమాన్యమున ఆంధ్రజ్వాలపై నీళ్లు చల్లినది. స్వరాజ్యము వచ్చువరకును ఆంధ్రరాష్ట్రము ఆగవచ్చునను మాట వినబడెను. కాంగ్రెసు స్వరాజ్యమును సంపాదించుట యెన్నడు, ఆంధ్రరాష్ట్రమును ప్రసాదించుటది యెన్నడు అని నిస్పృహ కూడ వెంటనే జనించెను. అంతేకాదు, కాంగ్రెసునకు ఏనాడు రాజ్యాధికారము హస్తగతమయ్యెనో, ఆ దినమునుండి ఆంధ్రజిల్లాలు అన్ని విధములుగను అంపపుకోతబడెను. అమాయకపు ఆంధ్రప్రజ మోసమెఱుగజాలకపోయెను. అమృతము ఆవిర్భవించెను. కాని అన్నిపన్నులును ఆంధ్రావనికిని, అన్ని సౌకర్యములును అరవనాడునకును సంక్రమించెను.

## ఆంధ్రులు చేజిక్కిన అవకాశములను జారవిడుచుకొనిరి

ఇంతవఱకు ఆంధ్రులు అలౌకికులై, అవ్యవహారికులై ప్రవర్తించిరి. చేతజిక్కిన సావకాశమును ప్రమత్తులై జారవిడిచిరి. మాయ గ్రహింపజాలక నాయకులు ఆకాశమువంక జూచుచు మీనమేషములు లెక్కింప సాగిరి. సైమనుకమిషను ఏతెంచిననాటనుండి యింతవఱకును ఆంధ్రరాష్ట్రసంపాదన కెన్నో అవకాశములు కల్గెను. వాటి నన్నింటిని ఆంధ్రులు బుద్ధిపూర్వకముగా విడచిపెట్టిరి. ఒక్క అవకాశమును జారవిడిచినతరువాత మరల నట్టి అవకాశము చిక్కదు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు స్థాపింపబడకపూర్వ మున్న పరిస్థితులు ఇపుడు ఆంధ్రభూమియందు కానరావు. ఈ రాజకీయ ప్రపంచమందు ఇంద్రజాలమట్లు దినదినమును క్రొత్తపరిస్థితులు విచిత్రముగ నేర్పడుచుండును. నేటి పరిస్థితులు రేపు ఏరీతిగా మారునో ఎవరును చెప్పజాలరు. ఏస్థితియును శాశ్వతముగా నిలువని యీ విపరీతసంక్షోభసమయమున కర్తవ్యమునెవ్వరును నిర్ణయింప జాలకున్నారు. ఈ సందిగ్ధస్థితియందు ఆంధ్రరాష్ట్రము కోరుటకు తరుణము కాదని రామలింగారెడ్డి వాదించుచున్నాడు. ఇకముందు ఎవ డెఱుగగలడు? ఇప్పటి పరిస్థితులందు ఆంధ్రరాష్ట్రమేర్పడగలదన్న ఆశ సన్నగిలి పోవుచున్నది.

## మరికొన్ని ఆటంకములు

దీనికి దోహదముగా నిజాంప్రభు సేవకులు, ఒకసారి ఉత్తరసర్కారులు మరల నిజాం పాలనలోనికి చేరవలయు ననియు, మరియొకసారి రాయలసీమ రావలయు ననియు ప్రచారము చేయుచున్నారు. పాకీస్థాన సమస్యతోపాటు ద్రావిడనాడుసమస్య యొకటి ఆంధ్రరాష్ట్రనిర్మాణము కాకుండ కాలుదన్నుచున్నది. వీటికి సాయముగా స్వల్పసంఖ్యాకుల సమస్య, నరేంద్రమండలి సమస్య, ఇతరమతముల సమస్యలు, ఇంకెన్నో సమస్యలు పుట్టపుట్టలుగా బయలుదేరుచున్నవి. రాజకీయవాతావరణము జీమూతముగా నున్నది. ఈ సంక్షోభసమయమున హాలాహలమే పుట్టునో, అమృతమే వెలికి వచ్చునో తెలియవచ్చుట లేదు. ఆంధ్రభాస్కరుడు ముస్లింలీగువలలో జిక్కి ఇపుడున్న స్థితిని గోల్పోయి రాహుగ్రస్తుడు కానున్నాడు కాబోలు. ద్రావిడస్థాన, పాకీస్థానముల నడుమ జిక్కి ఆంధ్రజాతి అనపేక్షాభావముతో, నిస్పృహతో దిశలు పరికించుచున్నట్లున్నది. కాంగ్రెసునాయకత్వమున ఆంధ్రజాతి గొఱ్ఱెలమందవలె నడచిపోవుచున్నది.

## కళాపరిషత్తు కార్యస్థానమును మార్చవలెను

బ్రిటిషుఆంధ్రజిల్లాలవారికంటె తెలంగాణపు ఆంధ్రులు ఎక్కువ దైన్యస్థితియందున్నారు. వారి మాట రాయలసీమవారు తలపెట్టుటలేదు. తాము మంచిస్థితికి వచ్చిన తనవాడుకూడ మంచిస్థితికి రాగలడన్నమాట ఆంధ్రజాతికి తోచుట లేదు. తూర్పుజిల్లాలవారు తమ్ము అన్నివిధముల వంచించుచున్నారనుభావము రాయలసీమవారిని విడచిపెట్టుట లేదు. ఏ ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సందర్భము ఈ వైమనస్యమునకు హేతువయినదో దాని నిపుడు సంస్కరింప ప్రయత్నమును పూని చేయవలయును. విశ్వకళాపరిషత్తు కార్యస్థానము ఉన్నతావునందే ఉండవంత కాలము ఆంధ్రుల కీదుస్థితి తొలగదు. ఆంధ్ర విశ్వ కళాపరిషత్తునకు తొలుత మూడు కేంద్రములు నిర్ణయింపబడెను. కేంద్రములు మూడును ఒకటిగా నుండుట మేలు. అట్టి ఏకైక కేంద్రము, కార్యస్థానము ఆంధ్రభూమికి జీవగడ్డ అయిన తావునందుండుట శ్రేయోదాయకము. ఇప్పుడయినను ఆంధ్రనాయకు లెల్లరును అంగీకరించి, విశ్వకళాపరిషత్తు కార్యస్థానమును ఆంధ్రసంస్కృతికి ఆటపట్టులయిన ఏ రాజమహేంద్రమునకో, లేక కేంద్రముగానున్న బెజవాడకో మార్పించ వలయును. బెజవాడనే ఆంధ్రరాష్ట్రమునకు ముఖ్యనగరముగా చేయవలెను. ఇది అసాధ్యముగాదు. దేశక్షేమమునకు, ఐక్యసాధనకు ఎట్టి త్యాగమునైనను చేయవలయును. ఎంత ధనమైన వెచ్చింపవలయును. నౌకాస్థానము కానున్న విశాఖపట్టణమునందలి భవనములకు మంచి ధరలు వచ్చును. ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా ఏ రాజ్యాంగముకూడ ప్రతిఘటించి నడువజాలదు. విభజననొందిన వంగరాష్ట్రము ప్రజాందోళనాఫలితముగా ఏకము గావింపబడినది. వంగరాష్ట్ర విభజనముకంటె విషమతరసమస్య గాదు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తుయొక్క కార్యస్థానము మార్చుట. ఆంధ్రజాతికి ఏ మార్పువలన ఇన్ని సంకటములు సంప్రాప్తమయ్యెనో, ఆ మార్పును ఆ విశ్వకళాపరిషత్తునందు మరల చేయుట

ఆవశ్యకము. ఆ దుస్థితి తొలగిననాడు ఆంధ్ర జాతి నేడున్న దౌర్భాగ్యస్థితిగూడ సూర్య కిరణప్రసారమున చీకటియట్లు మాయమై పోవును.

## ఆంధ్రులకు ఒక ఆంగ్లదైనిక పత్రిక ముఖ్యావసరము

ఒక్క తీరున, అవిచ్ఛిన్నముగా ఆందోళన చేయుచు ఉద్యమము సాగింపగల శక్తి ఆంధ్రజాతియందు నేడు లేదు. ఇందులకు మొదటిది, తమ మనసు తా మెరుగలేకున్న నాయకుల దోషము కారణము. రెండవది, ఆందోళనమును పూనికతో సాగింపగల పరిస్థితులు లేమి. పరిస్థితులు కల్పించుకొనిననాడు శక్తిసామర్థ్యములును కలుగును. ఆంధ్రపత్రికవంటి ఆంగ్లదైనికపత్రిక యొకటి కల్గినచో ఆంధ్రోద్యమ మీపాటికి ఫలించి యుండును. ఆంధ్రపత్రిక చేయవలసిన పనినంతయు ఇదివఱకే చేసియుండెను. అది ఆంధ్రలోకమునకు వెలుగు తెచ్చినది. కాని యింకముందు చేయు విధానము ఆంధ్రపత్రికవల్ల కాజాలదు. కాంగ్రెసుమతమును ప్రధాన లక్ష్యముగా పెట్టుకొని నడుచుచున్న ఆంధ్రపత్రిక ఆంధ్రోద్యమమునకు చేయవలసినంత సాహాయ్యము చేయజాలదు. అదిగాక ఇంతటనుండి ప్రచారము ఆంగ్లమునందు కావలయును. కాంగ్రెసుతో నిమిత్తముకల్గియు, కల్గనటులుండి, ఆంధ్రరాష్ట్ర సంపాదనమే ప్రధాన ఏకైకలక్ష్యముగా నుంచుకొని ఉద్యమమునకు ఎప్పటి కప్పుడు నీరు వోసి దోహదము చేయగల ఆంగ్లదైనిక పత్రిక యొకటి ఆంధ్రజాతి కిపు డత్యంతావశ్యకము. తెలంగాణమును విడిచిపెట్టిన ౧౭౦ లక్షల ప్రజలుగల బ్రిటిషు ఆంధ్ర రాష్ట్రమునకు ఒక ఆంగ్లదైనికపత్రిక లేమి సంతాపకరము. అది మిక్కిలి శోచనీయమైన కొఱత. ఒక్క పత్రికకైన నోచుకొనని ఆంధ్రుల దౌర్భాగ్యము ఇంతింత కాదు. ఆంధ్రదేశమునం దెందరు ధనికులు లేరు? ఎందరు ప్రజ్ఞానిధులు లేరు? ఎంద రుత్సాహోద్రేకులు లేరు? ఈ త్రితయమును సమకూర్చి కార్యదీక్షారతులను చేసి ఆంధ్రోద్యమమును నడిపింపగల కాలము ఇంకను ఆసన్నము కాలేదు. అమృతబజారుపత్రిక వంటి ఒకపత్రిక ఆంధ్రజాతికి నేడు కఱవై పోయినది. "దేశమంటే మట్టిగాదోయి, దేశమంటే మనుష్యులోయి" అన్న ప్రేమతో, అభిమానముతో, ఔదార్యముతో, త్యాగబుద్ధితో, సాహసముతో ఆంధ్రజాతి నుద్ధరించగల మహావీరులు ఇంకను జనించలేదు. ప్రజ్ఞాదురంధరులయిన ఆంధ్రపుత్రులు ఇతర రాష్ట్రములందు కొలువు చేయుచున్నారు. తమ మేధాశక్తిని, తమ ప్రతిభను ఆంధ్రాభ్యుదయమునకు వినియోగింపగల అదృష్టమును ఆంధ్రదేశముతోపాటు వారును నోచుకొని యుండలేదు.

ఆంధ్రోద్యమమును అవిచ్ఛిన్నముగా, అప్రతిహతముగా నడిపింపవలెనన్న సంకల్పము ఆంధ్ర జాతి కింకను కలుగలేదు. స్వరాజ్యము భరతఖండమునకు సంప్రాప్తమయిన అనుగాక, ఆంధ్రోద్యమమును లక్ష్యముగా పెట్టుకొని ఆంధ్రరాష్ట్రసిద్ధిని ప్రధానముగా నుంచుకొని దీక్షతో, దక్షతతో ప్రచారముసలుపగల ఆంగ్లదైనిక పత్రిక వెలసిననాడు ముస్లింలీగు ఎదుర్కొనినను, ద్రావిడస్థానవాదులు ప్రతిఘటించినను, పాకిస్థాన ప్రచారకులు అడ్డు తగిలినను ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము ఏర్పడి తీరును. ఆనాడు కాని ఆంధ్రజాతికోరిక సిద్ధింపదు.

## 'ఆంధ్ర' శబ్దము మృతాక్షరసంయోగము - 'అంధ్ర' పదమే శ్రేయస్కరము

మన జాతిపేరు అంధ్ర. మన దేశము పేరు అంధ్ర. మన భాషపేరు అంధ్ర. ఎందుచేతనో కాని వీరేశలింగము పంతులు చింతామణిపత్రిక ప్రారంభించినదాదిగా అంధ్రశబ్దము ఆంధ్రముగా పరిణమించెను. వీరేశలింగముపంతులు చారిత్రకముగా ఈ రెండు పదములకును భేదమును గుర్తింప లేకపోయెను. చిలుకూరి వీరభద్రరావు కూడ ఆంధ్రశబ్దము అసత్యపదమని చరిత్ర కారుడయ్యును గ్రహింపలేక పోయెను. వారి 'ఆంధ్రుల' చరిత్రము ఆదిలోనే అసంపూర్ణముగా, తగవుల కాలవాలమై వెలువడెను. ఆంధ్రోద్యమము ఆరంభమయినది మొదలు అది ఆంధ్రోద్యమ మనియే వ్యవహరింపబడుచున్నది. అందువలననే కాబోలు నేటివఱకు అది కొనసాగకున్నది. ఇంతవఱకు 'ఆంధ్ర' అను పేరు ముందు తగుల్చుకొన్న సంస్థగాని, ఉద్యమముగాని, పరిశ్రమగాని, వ్యాపారముగాని ఏదియుగూడ జయప్రదము కాలేదు. అది ఆ శబ్దమహత్త్వము కాబోలును తూర్పున బరంపురము మొదలుకొని పడుమట బళ్లారి, బెంగుళూరుల పర్యంతము ఆంధ్రశబ్దము ముందుగా వచ్చిన దేదియు కొనసాగక పోవుటకు ఆంధ్ర శబ్ద గత దోషమనుట సంగతము. మృతాక్షరముతో నారంభించిన 'ఆంధ్ర' వలన అన్నింటికి అపజయమును, అపయశస్సును, కలహప్రాప్తియు, అర్ధాంతరముగా నాగిపోవుటయు సంభవించుట సైజము. పేరులో నేమున్న దనుటకంటె శబ్దబ్రహ్మస్వరూపమైన పేరులోనే సర్వ మున్నదనుట నిజము. శ్రేయోదాయకములయిన మంత్రాక్షర సంయోగమును ఉచ్చరించుటవలన ఐశ్వర్యము, ఐకమత్యము, అభ్యుదయము, యశస్సును పరంపరగా లభ్యమగును. దుష్టబీజాక్షరముల నుచ్చరించినపుడు సర్వదా అరిష్టములే సంప్రాప్తము లగుచుండును. 'ఆంధ్ర' శబ్దము దుష్టబీజాక్షరసంయోగము, అశాస్త్రీయము, చరిత్రకు విరుద్ధము నైయున్నది. ఐతరేయ బ్రాహ్మణకాలమునుండి ఒకశతాబ్దము క్రిందటివరకును బ్రాహ్మణములందు, పురాణములందు, ప్రాచీన శిలాలేఖ్యములందు, తామ్రపట్టికలయందు, సారస్వతమందు, వేయేల ఎచ్చట చూచినను 'అంధ్ర' శబ్దమేగాని ఆంధ్ర అన్న పదము గానరాదు. అట్టియెడ చరిత్రజ్ఞానములేక మనము అంధ్రపదమును ఆంధ్ర

ముగా నుచ్చరించుచున్నారము, వ్రాయుచున్నాము, వ్యవహారమున సర్వత్ర నుపయోగించుచున్నాము.

అంధ్రదేశమని, అంధ్రభాషయని, అంధ్రప్రజయని వ్యవహరించిన నాడు అంధ్రదేశము అద్వితీయమైన ఐశ్వర్యవిభవములను అనుభవించి, చిరయశస్సును అనుభవింపగలిగినది. శ్రేయోదాయకమైన అంధ్రనామమును విడిచి యీనాడు అంధ్రజాతి దుష్టమృతాక్షరసంయోగమును, చరిత్రకు విరుద్ధమును, అసత్యమును నగు 'ఆంధ్ర' పదము నుచ్చరించుచు, వ్రాయుచు, విఫలమనోరథమై అల్లాడుచున్నది. ఈ నాటినుండి అంధ్రదేశమని, అంధ్రభాషయని, అంధ్రులని వ్యవహరించుకొన సంకల్పించుట కష్టసాధ్యము కాదు. ఒక్క త్రుటిలో సయాంప్రజలు తమ దేశమును 'థైలాండు' అని మార్చుకొనగల్గిరి. పారసీకులు పర్షియా అను తమ దేశపు పేరు మార్చి ఇరాన్ అని పిలుచుకొనుచున్నారు. అంతదూరము పోనక్కరలేదు. తిరునల్వేలి వాస్తవ్యులు తమ నగరనామమును టిన్నవెల్లి యని యుండరాదని నిశ్చయించుకొని సఫలమనోరథు లయిరి. కావున అంధ్రులు అంధ్రులని యింతటినుండి పిలుచుకొనుట శ్రేయస్కరము.

స్వరాజ్యముకంటె అంధ్రజాతికినిక్కముగా ప్రీతికరమైనది ప్రత్యేకాంధ్రరాష్ట్రము. ప్రత్యేకరాష్ట్రముగా నేర్పడకున్న అంధ్రావనికి భరతభూమికి స్వరాజ్యము వచ్చినను లాభ ముండదు. ఇది రాయలసీమవారొక్కరుమాత్రమే కాదు; సకలాంధ్రజాతియు గుర్తింపవలసిన విషయము. అభిప్రాయభేదములను పోగొట్టుకొని ఐక్యభావముతో తనకు మేలును, ఒరులకు కీడును కాకుండ అన్ని సీమలవారికిని మేలు కలుగునట్లు అంధ్రోద్యమమును సాగించుటది లెస్స. అది అంధ్రులకు కర్తవ్యము, సౌహార్దమును. కల్మషమును, అవిశ్వాసమును వీడి స్థాపించినగాని ఆ యభీష్టము నెరవేరదు. ఎంతకాలము అంధ్రులు ఐకమత్యము లేక సౌహార్దము లేక కలహములు కలిగించుకొనుచు, ఈర్ష్యతో మెలగుచుందురో అంతకాలము అంధ్రోద్యమము ఫలోన్ముఖము కాజాలదు. అంతకాలము అంధ్రులకు అంధ్రులే శత్రువు లయ్యెదరు. ఇంట గెల్చిగదా రచ్చ గెలువవలయులను? సౌహార్దమును, ఐకమత్యమును ఒడంబడిక వలన కలుగవు. సమానమైన విపత్తు అందరికిని సంభవమయినపుడు తన్నివారణార్థము ఐకమత్యమును, సౌహార్దమును ఆవిర్భవింపగలవు. అంధ్రజాతి తనవిశిష్టతను గోల్పోయి, తన ప్రాచీనచరిత్ర వైభవమును మరచిపోయి, తన సంస్కృతిని, నాగరికతను మంటగలిపి మరల అనాగరికప్రపంచమున తలదూర్చి నశించిపోవునో, లేక ముస్లింలీగు పాకిస్థానముల ఆందోళనమును ఎదుర్కొని, తాను సమసిపోకుండ ప్రాచీనవైభవమును తలపునకు దెచ్చుకొని శాశ్వతమైన లోకకల్యాణముతోపాటు తన జాతికికూడ అభ్యుదయమును చేకూర్చుకొనునో?

భవిష్యత్తు అంధ్రుల చేతిలో నున్నది. ఒకసారి సింహావలోకనము చేసి కర్జమునకు గడంగుదురుగాక. ఈ మహాసంగ్రామానంతరము నూతన మానవధర్మ మేర్పడి లోకకల్యాణమే యగుచో, అంధ్రులుకూడ నేటినుండి అప్రమత్తులైయుండి అభీష్టార్థసిద్ధిని బడయుదురుగాక!






హంససందేశము

# కూచిపూడి భాగవతులు



నేటి దినములలో నాట్యకళకు పునరుద్ధరణము జరుగుచున్నది. అఖిల భారత దేశమునందును 'నాట్య'శబ్దము విన్నంతనే ప్రజలు తండోపతండములుగ నాట్యశాలలకు మూగుచున్నారు. లలితకళలలో ఒకటై నాట్యము అగ్రస్థానము వహించుచున్నది.

"న తత్ శ్రుతం న తత్ శిల్పం న సా విద్యా న సా కళా,
నాసౌ యోగో న తత్కర్మ యన్నాట్యేఽస్మిన్న దృశ్యతే."

పై శ్లోకమునుబట్టి నాట్యమునందు ఇతర లలితకళ లన్నియు అంతర్భూతమై యున్నటుల తెలియుచున్నది. నాట్యము ముక్తిప్రద మనికూడ పెద్దలు చెప్పిరి.

అట్టి ఉత్కృష్టమైనటువంటి నాట్యకళకు నేటికి మరల మంచి దినములు వచ్చి తగిన స్థానము నది ఆక్రమించుకొనుచుండుట కళారాధకుల కందరికిని ముదావహమైన విషయము.

నాట్యకళ భారత దేశమం దన్ని ప్రాంతములలోను వెలసి వివిధ రూపములతో, వివిధ నామములతో నుండుచు వచ్చినది. భరతనాట్య మని యావద్భారత దేశమున నుగనికి వ్యవహారము గలదు. భరతముని ప్రోక్తమై ప్రచారము లోనికి వచ్చుటచే గాబోలు దీని కీ పేరు గలిగినది.

మలబారు దేశమున 'కథకళి' యనియు, అస్సాము దేశమున 'మణిపురినాట్య' మనియు, సంయుక్తరాష్ట్రమున 'కథక్' అనియు, తమిళనాడు ఆంధ్ర దేశములందు భరతనాట్య మనియు వ్యవహారము జరుగుచున్నది.

'కథకళి' నాట్యమున నాట్యకాండ్రు పాటపాడరు. వారికి నోట మాటలేదు. అది 'టాకీ'కాదు; 'మూకీ'. 'కథక్', 'మణిపురి' నాట్యములందు ఆటగాండ్రు పాటకూడ పాడుదురు. తమిళులును, మనవారును భరతనాట్యశాస్త్రమును,

"కంఠేనాలంబయేద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్,
చక్షుర్భ్యాం దర్శయే ద్భావం పాదాభ్యాం తాళ మాచరేత్."

అను శ్లోకము ననుసరించుచు తు, చ తప్పక ప్రవర్తించెదరు.

శ్రీ తాండవకృష్ణ

ఆంధ్రదేశమున 'కూచిపూడి' యను గ్రామమునుగాని, తద్గ్రామవాస్తవ్యులగు నాట్యకళారాధకులనుగాని ఎరుగనివారు లేరని చెప్పవలెను. పెద్ద 'కారు'లో అసలే లేరు. ఇప్పటి కుర్ర 'కారు'లోగూడ నాట్యకళాభివృద్ధి జరుగు నేటిదినములలో పై పేరు చాలమందికి పరిచయమే.

కాని ఆంధ్రేతర ప్రదేశములలో ఆంధ్రులలో నాట్యకళావేత్త లున్నా రన్నమాట చాలమందికి తెలియదనియే చెప్పవలెను. దీని కంతటికిని కారణము మనవారికి తగిన ప్రచార, ప్రకటనలు లేకపోవుటే. మనవారిలో ఒక్కరును ఒక 'బృందము' (Troop)గా ఏర్పడి పట్టణములలోను, నగరములలోను ప్రదర్శించినవారు లేరు. అంతేకాక నవీన సంఘమునకు సరిపడునట్లు సంస్కార మొనర్చి వారి రుచులకనుగుణముగ ఆటపాటలను అందిచ్చుటకూడ మనవారిలో తక్కువ. అందుచేత మన కూచిపూడినాట్యసంప్రదాయమునకు ప్రచారము తక్కువ.

'కూచిపూడి' బెజవాడకు నలువదిమైళ్ల దూరములో నున్నది. అది నూత్న గ్రామముగు 'అయ్యంకి'కి కను చూపు మేరలో నుండును. కూచిపూడి అగ్రహారము ప్రస్తుతమున 'కుశలపురి' యని వ్యవహరింపబడినటుల పెద్దలవలన వినికిడి. ఆ పేరు మారి కూచిపూడి యని ఇప్పటికి చాలకాలమునుండి వ్యవహారము. అసలు కూచిపూడి ఆంధ్రనాట్యము కు పుట్టినిల్లగుట యెట్లు సంభవించెనో కొంచెము వెనుకకు బోయి పరికించినచో తెలియగలదు.

తరంగకర్తయగు నారాయణతీర్థులవారి శిష్యుడు సిద్ధప్పనామధేయుడొకడుండెను. అతడు వారిశుశ్రూషచే ధన్యుడుగాదలచెను. నారాయణతీర్థులు శుద్ధివాడు. మహాభక్తుడగు తీర్థులవారికి బొజ్జ యుండెడిదట. ప్రతిదినమును లీలామానుష విగ్రహుడగు శ్రీకృష్ణపరమాత్మ భక్తుని బొజ్జను తన నాట్యవేదికగ నొనర్చుకొని నాట్యము సల్పుచుండెడివాడట. ఆనాట్యపు టడుగులకు తాళము తప్పకుండగ తీర్థుల

వారు తరంగము లల్లుచుండెడివారట. ఆ నాట్యమును, వీరి తరంగ కాలక్షేపమును చూచుచు, వినుచు సిద్దప్ప ఆనందాబ్ధి నోలలాడుచుండెడివాడట. ఒకనాడు సిద్దప్పకు ఇదంతయు చూచునప్పటికి కోపము వచ్చెను. "ఏమి! ఇతడు మనగురువగు తీర్థులవారి బొజ్జం తయు నొచ్చునట్లు నాట్యముచేయుచున్నాడే" అని తలపోసి, మరుసటిదినమున శ్రీకృష్ణులవారు నాట్యము చేయునపుడు "నీ వెవర"వని యడుగ నిశ్చయించుకొనెను.

ఈ విషయ మంతయు తీర్థులవారికి విన్నవించగా "నాతడు శ్రీకృష్ణు"డని యాయనగారు సెలవిచ్చి, నీవును నేనును ప్రపంచ మహాసముద్రమునుండి తరించు టెపుడో యడుగవలసిన దని చెప్పెను.

మరునాడు శ్రీకృష్ణు డష్టభార్యాసమేతుడై యథాప్రకారము తీర్థులవారి బొజ్జమీద నాట్యము సేయుచుండెను. అంత సిద్దప్ప భక్తి వినయములతో "మహానుభావా! మాగురువులవారును, నేనును తరించు టె"ట్లని పృచ్ఛించెను. అంతట శ్రీకృష్ణుడు పారిజాతాపహరణ గ్రంథమును శృంగారగ్రంథముగ వ్రాసి దానిని ప్రచారమొనర్చినచో సిద్దప్ప తరించునట్లును, నారాయణతీర్థులకు మరుజన్మమునగాని జన్మరాహిత్యము కలుగిదనియు చెప్పెను.

అంత పారిజాతాపహరణకథను రచించి, దాని నాడి పాడి ప్రచారమొనర్చుట కనువగు వారికొఱ కన్వేషించుచు సిద్దప్ప కృష్ణాతీరస్థమగు కుచేలపుర మను నొక గ్రామమును చేరెను. అచట నూరిబయట నొక చింతచెట్టుమీద కూనిరాగములను దీయుచు నిరువురు బాలురు సిద్దప్పకు గాన్పించిరట. అంత నా బాలురు తన ప్రచారమునకు అనువుగ నుందురను తలంపుతో సిద్దప్ప వారితలిదండ్రుల పేర్లడిగి తెలిసికొని వారింటి కేగి వారి తలిదండ్రులతో నీవిషయమును దెలిపెను. వారందుల కనుమానించుచు,నంగీకరింపక తప్పక పోవుటచే నంగీకరించిరి.

అంత సిద్దప్ప వారి కా పారిజాతాపహరణ కావ్యమును, నాట్యాభినయములను ఉపదేశించి వారి నారితేరినవారిని జేసి ధన్యత జెందితి నని తలంచెను. వా రా కథను తరతరముల నాడి పాడి ప్రచార మొనర్చునంతవరకు శుభము గలుగునని యాశీర్వదించెను.

ఇట్లు పూర్వులవలన వినవచ్చు ఈ కథ ప్రచారమం దున్నది. ఇంతే కాక సిద్దప్పను గూర్చియు, కూచిపూడి అగ్రహారమును గూర్చియు మరికొన్ని కథలు గలవు.



కూచిపూడి 'రాజు' వేషము
-ప్రాచీనాహార్యవిధానము-
[శ్రీ మహంకాళి సత్యనారాయణమూర్తి]

ఏ దెట్లున్నను కూచిపూడిమాగాణిమీద సిద్దప్ప యనునాతనివలననే నాట్యదేవత ప్రతిష్ఠింపబడినట్లు తెలియుచున్నది. కూచిపూడివారిచే నర్తింపబడు 'భామకలాప' మను శ్రీకృష్ణపారిజాతాపహరణము సిద్ధేంద్రయోగి వ్రాసినట్లు ప్రసిద్ధి.

ఈవిధముగ కూచిపూడిలో నాట్యకళాదేవతకు స్థానము లభించినది. నాట్యదేవత కూచిపూడి మాగాణిమీద నర్తించి చవినది. కూచిపూడిగ్రామములో నేటికిని ప్రత్యూషసమయములలో శిష్యుల లేతగొంతుకల సంగీతస్వరములు, కాళ్లగజ్జియల ఘలుఘల్లులు వినువారికి వీనులసొంపు గలుగజేయుచు ప్రాతవడిన ప్రాభవమును జ్ఞప్తికి తెచ్చుచుండును.

కూచిపూడి బ్రాహ్మణులను మూడు తెగలుగ విభజింపవచ్చును. (1) నాటకములాడువారు, (2) పగటివేషకులు, (3) అభినయదేశికులు.

నాటకము లాడువారు బృందములుగ నేర్పడి గ్రామమునుండి గ్రామమునకు ద్రిమ్మరుచు, తమ కళానైపుణ్యమును గ్రామజనులకు ప్రదర్శించుచు వారి నానందపరచుచుందురు. పగటివేషకులుగూడ గ్రామాంతరముల కేగి వివిధవేషములను ధరించి గ్రామస్థులను దిగ్భ్రమ చెందజేయుచుందురు. ఈ సందర్భమున పెద్దలవలన విన్న ఒక కథ స్ఫురణకు దెచ్చుకొనుట అసంగతము గాదేమో.

ఒకప్పుడు ఒక కూచిపూడి పగటివేషకులబృందము తూర్పుగోదావరిజిల్లాలో పర్యటనముచేయుచు నొకగ్రామమునకు జనిరట. ఆ గ్రామవాస్తవ్యు లందరును ఛాందసపు బ్రాహ్మణులు. వారు నాటకములనుగాని, వేషములనుగాని జూడకూడ దనువారి కక్షకు జెందుదురు. నటకులపాంక్తేయులు, అస్పృశ్యులు నని వారి మతము. కాన వారి ప్రదేశములో వీరికి తావు లేదు. కాని మనకూచిపూడివా రెంతయు ప్రాధేయపడి వేడుకొనిరి. "అయ్యా! మేము ధనాశతో నిచ్చటికిరాలేదు. పెద్దలును, విద్వాంసులును నగు మీ సన్నిధానమున మా విద్యా కౌశలమును ప్రకటించి మీ మెప్పులను బడయుటకు మాత్రమే వచ్చినాము" అని సవినయముగ విన్నవించుకొనిరి. కాని ఆ ఛాందసులు మాత్రము తమ పట్టుదలను వీడజాలరైరి.

అంత మన కూచిపూడివా రేమి చేసిరో యెరుగుదురా? ఆ నాటి రాత్రి మరాఠీదండు వేషములను ధరించి, కత్తులను, డాలును

పట్టుకొని, అశ్వారూఢులై ఆ గ్రామమును ముట్టడించిరి. ఆ వైదిక బ్రాహ్మణు లత్యంత భయాన్వితులై తలుపులు బిడాయించుకొని యెవరింట వారు కూర్చుండి మరాఠీసుబానును ఎంతయు ప్రార్థించిరట. అంత పగటి వేషకులు కొద్దికాల మా బ్రాహ్మణులను భయపెట్టి తదుపరి తమ నిజమైన వేసములను వెల్లడిచేయగా ఊరివారందరును ఆశ్చర్యాన్వితులై పగటివేషకుల నందరిని సన్మానించి పంపిరట.

ఈ కథ మన కూచిపూడివారు పగటి వేషధారణలో నెంత సమర్థులో తెలుపుటకుపయుక్తమగును.

కూచిపూడి పగటివేషకులు సుమారు ముప్పదిమూడు వేషములను ధరింతురు. అందులో ముఖ్యమైన కొన్నిటి నీ దిగువ నుదాహరించుచున్నాను. బుడబుక్కల వేషము, సోమయాజి- సోమిదేవి, శారద వేషము, కాశీకావిళ్ల వేషము, జంగంవేషాలు, కోమటి-లింగబలిజవేషము, బైరాగి-బాలకి వేషము ఇత్యాదులు.

ఇంక అభినయదేశికులు: వీరు కళావంతుల స్త్రీలకు అభినయోపదేశము చేయుదురు. చేటపట్టుసుందరి, అమలాపురం అన్నాబత్తులచిట్టి, మండపేట శ్రీ విరాజితము, రామచంద్రపురం వీరభద్రము మొదలగు పేరుమ్రోగిన ఆంధ్ర నాట్యకర్త్రులు కూచిపూడివారి శిష్యురాండ్రే. కూచిపూడి అభినయ దేశికులు తమ శిష్యురాండ్రగు కళావంతులస్త్రీలతో వెంటపాటకులుగను, హాస్యగాండ్రుగను పర్యటనముచేసి వారి యార్జనలో పాలు గొందురు. అభినయము చేయునపుడు అలయుట సామాన్యముగదా. అపుడు కూచిపూడి 'వంత' (వెంట?) పాటకులు హాస్యముచే సామాజికులను వినోదపరచుచుందురు. కూచిపూడి బ్రాహ్మణుల హాస్య మత్యంత వినోదకరముగను, విషయ పరిజ్ఞాన ప్రదముగను నుండి, సంఘ పరిస్థితులను, కుహనా సంస్కర్తల సమాచారములను దడవుచు ఉపయోగకరముగ నుండును. కాని కొందరు హాస్యము చెప్పునపుడు వెగటుగను, కొంత అసభ్యముగను నుండుటయు గలదు.

సాధారణముగ కూచిపూడివారు కళావంతుల స్త్రీలకు 'భామకలాపము', 'గొల్లకలాపము', తరంగములు, జావళీలు మొదలగునవి ఉపదేశముచేసి తరిబీతునిచ్చెదరు. భామకలాపమునందు పారిజాతాపహరణకథ వర్ణింపబడినది. దీనికర్త సిద్ధేంద్రయోగులు.



కూచిపూడి 'భామ'వేషము
[శ్రీ వెంపటి సత్యనారాయణమూర్తి]

ఇందు దూతికాలాలనము, సత్యభామా విరహాభినయము, దూతికారాయబారము, కృష్ణుని దక్షిణ నాయక భారనిర్వహణకౌశలము, సత్యభామా ప్రతిజ్ఞాపాలనము మొదలైనవి అత్యంత రసవంతమైన ఘట్టములు.

గోపికా విప్రసంవాదరూపమైన వేదాంత గ్రంథము గొల్లకలాపము. కూచిపూడి వాస్తవ్యులగు నవ్యులాకరు దీని కర్త. వారిపేరు భాగవతుల రామదాసుగారు. ఇందు పిండోత్పత్తికథ ముఖ్యమైన భాగము. గొల్ల జన్మ, బ్రాహ్మణజన్మ — ఈ రెండింట నేజన్మ శ్రేష్ఠతరము అని భామ బ్రాహ్మణునితో వాదము పెంచుకొని వేదాంతపరముగ బ్రాహ్మణాబ్రాహ్మణ జన్మల తారతమ్యగణనయొక్క సారహీనతను తడవి తుట్టతుదకు కర్మప్రాశస్త్యముచేత బ్రాహ్మణజన్మోత్కృష్టతనే స్థిరీకరించును.

ఇందు భామా బ్రాహ్మణ సంవాదము అతి మృదువును, ఉపదేశకరమును నై సహృదయానందకరముగ నుండును.

కూచిపూడి వైదికపు బ్రాహ్మణులు సంవత్సరమున కారుమాసములకు పైబడి సర్వసాధారణముగ నెపుడును బృందములతో పర్యటనము చేయుచునే యుందురు.

పూర్వము పర్యటనకు పోవునపుడు వారేమేమి 'సరంజాము'తో బోయెడివారో కొంచెము పరికించినచో సొంపుగ నుండును. 'గణీయపు పెట్టె' అను నొక పెట్టె వారి వెంట నుండెడిది. దానిలో వారి రంగులు, అలంకారములు మొదలగునవి యుండును. అది Make-up box అన్నమాట. ఒక ఎద్దుమీద పాత్రసామాను, వారితో నొక పాకశాస్త్రజ్ఞుడు నుండుచుండెను. బృందమువారెచటికి జనినను వారివంట వారే చేయించుకొనెడివారట! నిష్ఠా నియమములు గలిగిన సద్బ్రాహ్మణు లగుటచేత వారి కింకొకరియింట సరిపడెడిది కాదు గాబోలు. తమ వంటవానిచే వంట చేయించుకొని దినమున కొక్కమారే స్నానసంధ్యాద్యనుష్ఠానానంతర మే రెండు గంటలకో భోజన మొనర్చెడివారట.

అందుచేతనే వా రంత బలిష్ఠులై రాత్రియంతయు నాడి పాడినను అలయకయుందురు. భామ నాట్యరంగముమీద ప్రవేశించినచో తెల్లవారువఱకును ఆటపాటలచే సామాజికుల నందరిని అలరింపజేయును. ఇప్పటివారు అరగంటయరగంటకును కాఫీ మొదలగు నుద్రేక ద్రవములను త్రాగి గాని అభినయింపజాలకుండుట వారి నియమ



కూచిపూడి వాస్తవ్యులతో శ్రీ తాండవకృష్ణ
[ఇందు శ్రీ వెంపటి సత్యనారాయణమూర్తి, వేదాంతము జగన్నాథము, వేదాంతము రాఘవయ్య మొదలైనవారు కలరు]

రహితమైన జీవితముయొక్క ఫలితమే యని చెప్పవలెను.

ఈవిధముగ పర్యటన మొనర్చి వారు దేశమంతటను తమ కళానైదగ్ధ్యమును వెదజల్లి, కళారాధకులను తనియజేసి భుక్తిముక్తులను సంపాదించుకొనెడివారు.

కూచిపూడి భాగవతులు పర్యటన మొనర్చునపుడు సరిపడని దుండగీడులు వీరిమీద ప్రయోగములను చేయుచుండెడివారట. ఆ ప్రయోగములు తమకుదగులకుండ ద్రిప్పుకొను శక్తియేగాక ప్రతిప్రయోగములను జేయు నద్భుత శక్తిసామర్థ్యములు కూడ కూచిపూడి వారి బృందములలో ననేకుల కుండెడివట. ఈ సామర్థ్యములను దెలుపు నొక కథ పెద్దల వలన విన్నది ఇట నుటంకించుచున్నాను.

ఒకపుడు భాగవతుల దశరథరామయ్యగారనువా రొకరు కూచిపూడివారి బృందముతో మలయాళ దేశమునకు వెడలిరట. మలయాళ దేశము ప్రయోగములకు ప్రఖ్యాతి చెందిన దేశము. ఈ విషయము విదేశములలోగూడ విఖ్యాతి చెందినటుల నేనొక విదేశీయవనితవలన వింటిని. అటుల వెడలి వా రొక యూర విడిసిరట. ఆ యూర నొక విఖ్యాత మాయావి—ప్రయోగముల జేయువాడుండెను. ఆతని యనుమతి లేక ఆ యూర నే నాటకములును ప్రదర్శింపబడకుండినవి. ఆతనిని లెక్క చేయక కూచిపూడివారు తమ ప్రయత్నములు తాము చేసికొనుచుండిరట.

ఆ నాడుదయమున దశరథ రామయ్యగారు బహిర్భూమికి జనుచు చుట్ట కాల్చుకొనుట కా ప్రయోక్తభార్యను నిప్పునర్థించెనట. అంత నామె నిప్పును దోసిలిలో తీసికొని వచ్చి ఆయన కందిచ్చెనట. అంత నాయన నిప్పును తనపైనున్న 'కండువా'లో మూటకట్టినాడట. "అతనికంటెను ఘను డాచంటి మల్లన"

భర్తగృహమున కరుదెంచగా నామె యీ యద్భుత వృత్తాంతము నాయనకు దెల్పెనట. అంత భర్త మఱియు నీర్ష్యాగ్రస్తుడై వారిని తగినటుల శిక్షింపదలచి వారిపై 'ప్రయోగము'ను జేయ ప్రయత్నించెను. ఆ కూచిపూడివారు వారి నాట్యారంభమును చేయుసరికి మలయాళ ప్రయోక్త ఒక బావిలో దిగి నీటిని ద్రావ మొదలిడెను. అంత 'భామ' కడుపుబ్బ నారంభించెను. అటుల జేసి చివర కాతడు సామాజికులలోని కరుదెంచి యాసీనుడయ్యెనట. అంత మంత్రశాస్త్ర ప్రవీణుడగు దశరథరామయ్యగారు మంత్రపఠన పూర్వకముగ నొక గంటమును పందిరి స్తంభమున గ్రుచ్చిరట. అంత నత్యాశ్చర్యకరముగ నీరంతయు నా స్తంభములో నుండి కాఱిపోయెనట. అంత భామకు బరువు దిగిపోయెనట.

పిమ్మట ఆ మలయాళ బ్రాహ్మణునకు ప్రతీకారము జేయనెంచి దశరథరామయ్యగారు మంత్రప్రయోగము చేయగా నాయన అండము లభివృద్ధియయి చివరకు కూర్చున్న

కూచిపూడివారి ఆహార్యవిధానము
[ఏకాగ్రదృష్టితో దానిని పరికించుచు శ్రీ తాండవకృష్ణగారు ఎడమప్రక్క కానవచ్చుచున్నారు.]



# వాల్‌కార్టు బ్రదర్సు,

దిగుమతిదారులు, ఇంజనీరులు, ఎగుమతిదారులు,

**115 - 116,** ఆర్మీనియన్ వీధి, మద్రాసు.

| ఏజెన్సీలు:— | బ్రాంచీలు:— |
|---|---|
| బెంగుళూరు, తిరుచునాపల్లి, కోయంబత్తూరు | బొంబాయి, కలకత్తా, కరాచీ, లాహోర్, కొచ్చిన్ |



లిస్టర్ ఆయిల్ ఇంజనులు



బ్లాక్‌స్టోన్ ఆయిల్ ఇంజనులు




ఎలెక్ట్రిక్ పంపింగు సెట్టులు






ఆయిల్ ఎక్స్‌పెల్లరులు
(నూనెతీయు యంత్రములు)



బ్రౌన్‌బొవేరీ
ఎలెక్ట్రిక్ మోటారులు



ఎయిర్ కండిషనర్సు
(శీతోష్ణములను చక్కబెట్టు యంత్రములు)
డిలక్సు మోడల్ పోర్టబుల్



వ్యవసాయ పరిశ్రమకు ట్రాక్టరులు

ఇంకను మావద్ద దొరకునవి:— ఎలెక్ట్రిసిటీ మీటరులు, వెల్డింగు సెట్లు, డయిరీ పరికరములు, గింజలుతీయు యంత్రములు, ఎలెక్ట్రిక్ దీపములు, స్విచ్చిగేరులు, అన్నిరకముల మరబెల్టులు (పట్టాలు)


A WONDER
NARASIMHA
LEHAM
WITH GOLD
P.C.A.& CO.
AYURVEDIC SAMAJ
PERIDEPI.






EAST & WEST BUILDING

ప్రదేశమునుండి లేవలేకపోయెనట. సామాజికు లందరును లేచిపోయిరట! మలయాళ బ్రాహ్మణుడు మాత్రము లేవలేకుండెనట! అంత నాయన భార్య బ్రతిమాలగా దశరథ రామయ్యగారు దయదలచి యాతనిని విముక్తుని జేసెనట.

ఈ కథ కూచిపూడివా రెట్టి ప్రతిబంధకములనైన ఎదుర్కొనుటకు సమర్థులై యుండెడివా రనుట కుపయుక్త మగును.

ఇట్టి కథలు, గాథలు కూచిపూడివారిని గూర్చి యనేకములు గలవు. కేవలము కథలు గాథలే యొక గ్రంథమునకు సామగ్రి కాగలవు.

## కూచిపూడివారి ఆహార్యము

చతుర్విధాభినయములలో నొకటగు ఆహార్యాభినయమునకు గూడ మరవా రత్యంత శ్రద్ధ వహింతురు. వారి వేషములలో ముఖ్యము లీ క్రింద నుదాహరించుచున్నాను.

భామకలాపములో భామవేషమున కెన్నని నగలు నాణెముల నుపయోగింతురు. పేర్లుచెప్పుట మొదలిడిన అనేకములైన పేర్లు గలవు. మన పూర్వు లానగల నన్నిటిని ధరించెడివారు. నేటిదినములలోగూడ కొందరు రాజుల ఇండ్లలో కూచిపూడి భామవేషమంతయు బంగారు నగలు లభించగలవు.

పెద్దజడ, చిన్నజడ, శిఖ, రాగిడి, చంద్రవంక, సూర్యుడు, తమలపాకులు, మొగలిరేకులు, కేతకి, తురాయి, పాపటపింజినీలు, కమ్మలు, చేర్లు, జూకాలు, కర్ణపత్రములు, తాయెత్తులు, బాజుబందులు, దండకడియములు, మత్స్యములు, పోచీలు, కంకణములు, కడియములు, చిన్న పతకము, పెద్దపతకము, పట్టెడ, బిళ్లలమొలతాడు, అడ్డబాస, కట్టడపుబులాకి, ముక్కుపుల్ల మొదలయినవి కూచిపూడి భామకు ఉపయోగించెదరు.

ఇంక రాజువేషముయొక్క వివిధములైన నామములు— కిరీటము, దవురు లేక

కూచిపూడివారి బృందము

[నలువదియేండ్లనాటి ఈఛాయాచిత్రము తాండవకృష్ణగారి పరిశోధనల మూలమున బయటపడినది. చాల శిథిలమై పోయియున్నను ఆనాటి వారి పోకడలను తెలుపుటకు ఇది ఉన్నదున్నట్లుగానే ప్రకటింపబడినది. ఉషాపరిణయములోని పాత్ర లిందు కానవగును.]



## కూచిపూడి నాట్యరంగము

కూచిపూడి వారి నాట్యశాల ఆ నాటి సాయంకాలమే నిర్మింపబడును. అది బహుసులభ సాధ్యము. చిన్న తాటియాకు పందిరి. తెరలు ఉండవు. అట్టహాసము, ఆడంబరములు ఉండవు. తెరలు, తీగెలు లేకయే వారు తమ అభినయాది విశేషములచే సామాజికులను మంత్రముగ్ధులుగ జేయగలిగి యుండురు. వారి ఆహార్యము, ముద్రలు, అభినయము మొదలగునవన్నియు ఎంతయు రమ్యముగనుండి మనోరంజకముగ నుండును.

పూర్వము కూచిపూడినాట్యరంగములు కాగడాలచే వెలిగింపబడెడివి. కాని ఈమధ్య కాగడాలు కాలప్రవాహమున కలసిపోయినవి.

లంగా, నల్లకోటు, కాశికోక, కండువాలు, శంఖచక్రములు లేక భుజకీర్తులు, కర్ణపత్రములు, గండభేరుండము (పతకము) మొదలైనవి.

ఇతరములైన వేషములకు కొన్నిటికి 'కరాళములు' లేక 'ముసుగు' (Mask) లు ఉపయోగించెదరు. పాత్రానుగుణముగ ఆహార్యముల నుపయోగింతురు. చతుర్ముఖుడగు బ్రహ్మ, నరసింహావతారము, శక్తి, దితి, హనుమంతుడు మొదలగు పాత్రలకు 'కరాళము'ల నుపయోగింతురు. పాత్రశీలానుగుణముగను, పాత్రఆకారానుగుణముగను, కరాళములు ఉపయుక్తములగును. ఆయా పాత్రలకు కరాళము లుపయోగించకపోయినచో పాత్రానుగుణమగు రసస్ఫూర్తి గలుగనేరదు. అందుచే మిగుల నావశ్యకమగు పాత్రలకే 'ముసుగు'ల నుపయోగింతురు.

## కూచిపూడివారి ఆచార వ్యవహారములు

కూచిపూడివారి ఆచారములు కొన్ని కలవు. కూచిపూడి మాగాణిమీద పుట్టిన ప్రతివ్యక్తియు ముక్కు చెవులను కుట్టించుకొని గ్రామాంతరస్థిత నటరాజాలయమున నర్తించి నాట్యాధిదేవుడగు శివునకు జోహారులియ్యవలసినదే. ఈ ఆచారము నేటికి చాలమట్టుకు నశించిన దనియే చెప్పవలెను.

## కూచిపూడివారి మేళతాళములు

కూచిపూడివారి హంగునకు వంత (వెంట?) పాటగాడు, తాళము వేయువాడు, శ్రుతికి 'తిత్తి' నూదువాడు, మార్దంగికుడు నుందురు. ఇప్పుడు 'తిత్తి' ని దీసిపారవైచి హార్మోనియమును దగిలించిరి. హార్మోనియము భారతీయవాద్యము గాదని హాహాకారములు సేయుచున్న ఈ రోజులలో గూడ వీరింకను నద్దానినే యుపయుక్త మొనర్చుచున్నారు.

ఈ పై వాద్యములతో హంగుదారుల నేర్పరచుకొని, కూచిపూడి నాట్యకాండు తా నభినయించు పదములను తాను పాడుచు ముద్రలచేతను, భంగిమలవలనను, నేత్రాద్యవయవాభినయములవలనను రసస్ఫూర్తిని గలుగజేసి సామాజికుల నెంతయు రంజింపజేయును.

కూచిపూడివారు భామకలాపము, గొల్ల కలాపము, నాటకములు గాక తరంగములు, జయదేవుని అష్టపదులు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు, క్షేత్రయ మువ్వగోపాల పదములు మొదలైనవానినిగూడ నభిన



శ్రీ చింతా వెంకటరామయ్యగారు
[కూచిపూడి భరతనాట్యకళాకోవిదులు]

యించి వివిధములైన సామాజికులను రంజింపజేయ సమర్థులు.

## నేటి కూచిపూడి

కూచిపూడివారు మరి యే భారతీయేతర ప్రాంతముల నాట్యకాండ్రకును తీసిపోరు. కాని మనవారికి నేను పైని వివరించినటుల ప్రచారము తక్కువ. మన దేశములోనైనను కూచిపూడివారి నాదరించి, వారి ప్రదర్శనముల నేర్పాటు చేయువారు తక్కువ. అసలు సంగీతము, నాట్యము మొదలగు లలితకళలకే మన ప్రాంతముల ఆదరము తక్కువేమో యని యనుకొనవలసి వచ్చుచున్నది.

నేటికి పోగామిగిలినవారిలో వేదాంతము లక్ష్మీనారాయణగారు, చింతా వెంకటరామయ్యగారు కూచిపూడి భరతనాట్యశాస్త్ర ప్రవీణులు. కీ. శే. వెంపటి వెంకటనారాయణగారు భరతశాస్త్రప్రవీణు లని అఖిలభారత విఖ్యాతిని బడసిరి. వారి సంతతిలోగాని, వారి శిష్యులలో గాని వారిస్థానము నాక్రమించుకొనగలిగినవారు లేకపోవుట కడుంగడు విచారించదగిన విషయము.

జీర్ణించుచున్న కూచిపూడి నాట్యోద్ధరణమునకు కళారాధకులందరును కట్టుగట్టి కర్తవ్య మాలోచించుకొనినగాని కూచిపూడి నాట్యము కొద్దికాలములో రూపుమాసిపోవునేమో యనునూహ కవకాశము గలుగుచున్నది నేటి పరిస్థితులను బరికించినచో.

కాని నేడు ఉత్సాహవంతులగు కూచిపూడి యువకులు కొందఱు కలసి యొక బృందముగ నేర్పడి కొంత సంస్కరణము దీసికొని రాగలందులకు జేయు ప్రయత్నము లభినందనీయములే యగును. వారిలో ముఖ్యులు శ్రీ వెంపటి సత్యనారాయణమూర్తి, వేదాంతము రాఘవయ్యగార్లు ముఖ్యులు.

ఈ వ్యాసమునందు ప్రచురించిన పటములు ప్రత్యేకముగ కూచిపూడి వెడలి అచ్చట బూజుపట్టి పోవుచున్న భామవేషములను అటకలమీదనుండి దింపి బాగుచేయించి వేషము వేయించి ఛాయా చిత్రములను దీయించితిని.

ఈ ప్రాచీనాహార్యమును ధరించుటయే నేటి కూచిపూడివారికి మోపైపోయినది. అసలీవేషములను సంపాదించుటకే నాకు తలప్రాణము తోకకు వచ్చినది. వేషము వేయించుటకు గూడ ఎంతో ప్రయాసమైనది. ఇప్పటి కూచిపూడివారిట్టి స్థితిలో నున్నారు.

## కూచిపూడి భాగవతులు

ఇపుడు కూచిపూడివారు 'భామకలాపము'ను, 'గొల్లకలాపము'ను ఆడుట మాని వేసినారు. అవన్నియు మోటైనవట. ఏమి వైపరీత్యము!!

ఇప్పటికైనను పోయిన ప్రాభవమును పునఃప్రతిష్ఠాపన చేయవలెనన్నచో కూచిపూడి నాట్యకళాశాలను వెంటనే స్థాపించి ఆంధ్రదేశములో నున్న అభినయవేత్తలనందరి నొకచోట సమావేశ మొనర్చి, ఆంధ్రభరత నాట్యకళను కేంద్రీకృత మొనర్చి, సమర్థుల చేత కళాబీజములను విరివిగ జల్లించిన గాని మిక్కిలి భయంకరమగు పరిస్థితు లేర్పడు నటుల దోచుచున్నది.

సంపన్నులకు సంస్కారముతక్కువ, విపన్నులకు వివేక మెక్కువ.



# అమృత కణములు

శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

సంస్కృతాలంకారగ్రంథములం దచ్చటచ్చట నదాహృతములగు చాటుశ్లోకము లమృతతరంగములు. వాని కాకరము మృగ్యము. నా యీ తెలుఁగుపద్యము లాతరంగములయొక్క కణములు సుఁడీ!

కంటఁ గ్రాఁగినట్టి తుంటవిల్కానినిఁ - గంట బ్రతుకఁ జేయఁగలుగు దంట
లా త్రినేత్రు గెలుచు నాటోపము వహించు - వామనేత్రలకు నివాళు లిత్తు.

విలసిలు బావి యొందు వినువీథిని; నాపయిఁ బైఁడిమెట్లలో
మలఁచిన నింద్రనీలమయమార్గము గ్రాలుఁ; దదగ్రమందు వ
ర్తిలును గిరిద్వయం; బది సుకృజ్జనగమ్యముఁ జందనాంక మా
స్థలమున కేఁగ లభ్య మమృతంబు సుధానిధి యుంటఁ జెంగటన్.

తనహృదయంబును జీలిచి-కొని వచ్చిన కలికికటికగుబ్బలకవకుం
గనికర మనునది లేశం-బును గలదే? లాఁతిహృదయమును జీల్పంగన్.

కనఁబడుచు వచ్చె రాగము-మును నీకెమ్మోవియందె ముఖ్యంబుగఁ గ్రొ
న్ననఁబోఁడి! యిప్పు డయ్యది-కనఁబడు నీహృదయమునను గాఢతరంబై.

తలయెత్తి ఘయినిఁ గను చం-జలివ్రేళుల నెడమెడంబు జనుపుచుఁ, బాంథుం
డల జలము నానుకొలఁదిని-సలుపుఁ బ్రపాపాలికయును సన్నగ ధారన్.

కల దనురాగము సంధ్యకుఁ;-జెలువుండగు పవలు సతముఁ జెరలాడెడుఁ గ
న్నులముం; దైనను బొసఁగదు-కలయిక యెన్నఁటికి దైవగతి యెట్టిదొకా!

“తనరెడు నంచముక్కున క్షతంబగు మొగ్గలజంటతో సరో
జిని యిటుఁ; గ్రోలి కోయిల త్యజించిన కెందలిరాకుతోడఁ గ్రా
లును నెలమావి” యంచుఁ దమలోఁ దమ రాడఁ జెలుల్ సరస్తటిన్
విని చనుదోయిఁ బైఁటఁ, బెదవిం దనకేలను మూసె నింతియున్.

పొలయలుకను దొలఁగింపఁగఁ-జెలియడుగులయందు వ్రాలఁ జేరెడు నాకుం
గలిగింపఁగ నుపకారము-బలముగఁ గ్రొమ్మొగి లదృష్టవశమున నుఱిమెన్.

కాదు విసముచేతఁ; గాదు శస్త్రంబుచేఁ; - గాదు నిప్పుచేతఁ; గాదు మిత్తిఁ;
బ్రతికరింపరాని పరుసందనము గల్గు - స్త్రీలు స్త్రీలచే సృజింపఁబడిరి.

# "స్టార్ ఆఫ్ ఇండియా" పెన్సిలును

కొనుచో మీరు

నాణ్యమగు పెన్సిలును, మీ దేశములో తయారగువానిలో ఉత్తమమగుదానినియు కొన్నవారగుదురు.



"స్టార్ ఆఫ్ ఇండియా"

వైలెటు పెన్సిల్సు, నల్ల పెన్సిల్సు అనేక రకములుగాను, ఎరుపు, నీలము, ఆకుపచ్చ, గోధుమవర్ణము, ఎరుపు నీలములు కలిసియున్న రంగుపెన్సిల్సును మాచే తయారు చేయబడుచున్నవి.



## ది మద్రాస్ పెన్సిల్ ఫ్యాక్టరీ,

పోస్టు బాక్సు నం. **86** - - - మదరాసు.




## జండు

# అయొడైజడ్ సరసపరిల్లా

రక్తశుద్ధినికలుగజేయు దివ్యౌషధము. బొల్లి (సిఫిలిస్) యందును, దానివలనవచ్చు కీళ్ళనొప్పులు, కీళ్ళవాపులు, చర్మముమండుట మొదలగువాటియందును కడుశీఘ్రముగ గుణమునిచ్చును. చర్మముపైనుండు అన్ని విధములగు నల్లనిమచ్చలను పోగొట్టును. చెడురక్తమువలన సంభవించువ్యాధులన్నిటికిని నమ్మకమైనమందు. హిందూదేశపు సుగంధిపాలతో తయారుచేయబడినది. ప్రతిడ్రామునందును 2 గ్రైనులు పొటాసియం అయొడైడ్ చేరియున్నది. సీసా 1 కి రూ. **1-0-0.**

సబ్ ఏజంట్లు :—

బెజవాడ : చంద్రమౌళీశ్వర్ అండు కో.
మచిలీపట్నం : కె. వి. మాణిక్య రావు.
నెల్లూరు : ఆర్యన్ ఫార్మసీ.
తెనాలి : శ్రీకృష్ణా ఫాన్సీస్టోర్సు.
ఒంగోలు : తాతా జాలయ్య శ్రేష్ఠి
గుంటూరు : మెడికల్ అండ్ ఆప్టికల్ యంపోరియము.
పెద్దాపురము : వేలు మెడికల్ స్టోర్సు.
విశాఖపట్నం : నీలం అండు కో.
అనకాపల్లి : కె. యం. స్టోర్సు.
నంద్యాల: రాజా పెద్దసుబ్బారాయడు శెట్టి
రాజమండ్రి : ఈశ్వర్ దాస్ అండ్ కో.

లేనియెడల రాజధాని ఏజంట్లవద్ద దొరుకును { దామోదర్ అండ్ కో., 78, చైనాబజారు రోడ్డు, **మదరాసు.**

కటికరాలుదక్కఁ గనరావు కంటి కీ - పల్లకొంపలందు బాటసారి!
ఘనపయోధరములఁ గనుఁగొని నిలువంగఁ - దలఁచితేని నేఁడు నిలిచిపొమ్ము!

ఇది జడ గాదు కూర్చి మెలియిడ్డ కుఱుల్; గరళంపు బిందు గా
దిది గళమందుఁ గస్తురిసుమీ! తలపై నెలవంక గాదు పూ
మ్మిది విరిగాని; కా దిది మెయిన్ వెలిబూదెయు విప్రయోగమం
దొదవిన తెల్పు; నన్ భ్రమసితో హరుఁ డం చలయింతు వంగజా!

చూచుకొనుచు సతము లోచనయుగళంబు - మురిసిపోదు వేల? మోహనాంగి!
నలువలంకులందుఁ గల కొలంకులయందు - నిట్టి నల్లకలువ లెన్ని లేవు?

తన మిండని కతలెల్లను-వినుచుచుఁ జెలి యనుచు భ్రమసి వెలఁది మగనితో
మనమున నెతెంగి మగఁడని-"యనంతరము చే లుకొంటి నతివా!" యనియెన్.

'చనుదు'నని 'చన' ననియును-మనఃప్రియుం డాడ రెండుమాట, లపుడ జా
రెను మొదట ముందుగాజులు-వెనుకటి వట గుత్తమగుట ప్రీలె వెలఁదికిన్.

నలుఁగుడు నైఁపంగల పు - వ్వుల తీవలు లాఁతు లుండెఁ; బొమ్మ; చట మనం
బలరింపు; మేల యరజ-న్వలయగు విరజాజి మొగ్గఁ బడి చెఱతు వళీ!

"ఇది నపుంసకంబుగద"యంచుఁ బ్రియురాలి-ప్రాంతమునకు మనసుఁ బంపియుంటి
నది రమించుచుండె నటనె! హా! పాణిని-పలుకు నమ్మి గోఁతఁ బడితిఁ జెడితి.

పలునొక్కులు గల తన కో-మలిమోవినిఁ గాంచి యెవఁడు మండిపడఁడు? నే
వల దన్న మూరుకొంటివి-వలపుగొని నభృంగమైన పద్మమును జెలీ!

కలిగించెను సీత్కారము;-బలముగఁ గెమ్మోవిఁ బుండుపఱచెను; మేనిం
బులకించె; నాగరుఁడు నినుఁ-గలిసెనె? యది గాదు శీతగాలి యిది చెలీ!

చనుఁగవ తాండవింప, జడ సళ్లఁగ, నూఁగఁగ ముత్తెపున్ సరుల్,
గనకపుఁగమ్మ లాడఁ జెవులన్ మిఱుమిట్లుగఁ, జెమ్మగిల్ల నా
ననము, కరప్రహారము లొనర్చుచు మిక్కిలి యూర్చుకొంచు ని
వ్వనిత కరంగుఁ; గందుకమ! భాగ్య మనంగను నీదె పో భువిన్!

కనులన్ రాలిన పుప్పొడిఁ-దన వదనానిలముచేతఁ దలఁగింపఁగఁ జా
లని ప్రియునిఁ బొడిచెఁ బీన-స్తని యొకతె పయోధరమునఁ దద్వక్షమునన్.

చెదరిన ముంగురుల్ సరిగఁ జేర్పుము చెల్వుఁడ! బొట్టు దిద్దుమీ
నుదుట విలాసి! కూర్పుము చనుంగవఁ ద్రెస్సిన ముత్తెపున్ సరుల్

హృదయసఖుండ; యంచు వచియించి రతాంతమునందు వాని తాఁ
కుదల కొడల్ గగుర్పొడువఁ గోమలి క్రమ్మఱఁ బొందె మోహమున్.

కౌఁగిలింపఁబడుచుఁ గౌఁగిళ్ల నొసఁగుచు - ముద్దులాడఁబడుచు ముద్దులిడుచు
మోవికాట్లు వడుచు మోవినిం గఱచుచుఁ - జెలులు ప్రియుని దాసుఁ జేసికొంద్రు.

మగఁడా! ఊర్చినఁ బ్రేవు లెంచు; సవతుల్ మచ్చిత్తముం ద్రవ్వుచూ;
త్రగు నాయత్త గయాళి పట్టుఁ బసి; యేరాండ్రా! దృగంతంబులం
దగ భేదింతురు; నిష్ఫలంబు శ్రమ; కన్సన్నన్ వృథా పొమ్మిటన్
వగలాఁడా! యిదె దౌలనుండియె నమోవాకంబు నర్పించెదన్.

తలిరాకుచుట్టమగు నా-చెలికెమ్మోవినిఁ గనంగఁ జెలువుండు, కరం
బుల నున్న కంకణంబులు-గలగలమనె నేదొ బెడఁద గలిగినకరణిన్,

తనుఁ జూడంగను గ్రిందఁ జూచును; సమాధానంబు నీదేమి య
న్నను సెజ్జం బెడ మర్లి పండు; బలిమిం గౌఁగింటఁ జేర్పన్ వడం
కును; బోఁజూచుఁ జెలుల్ గదిన్ వెలువడన్; గూర్చుండదుం జెంత; నాం
కు నవోఢాంగన వామవృత్తముననే కూర్చెన్ మనఃప్రీతినిన్.



# కావ్యలక్షణములు

కావ్యస్వరూపము వీనివలన సుజ్ఞేయ మగును గాన వీనికిఁ గావ్యలక్షణము లని పేరు. భరతాదులు కావ్యలక్షణముల ననేకములఁ జెప్పినారు. జయదేవుఁడు పది కావ్యలక్షణములఁ బేర్కొనినాఁడు. అవియె యిచట విచారణీయములు. రాజచిహ్నము లనేకము లుండు నట్లు కావ్యచిహ్న(లక్షణ)ములు గూడ ననేకము లుండును.

1. అక్షరసంహతి, 2. శోభ, 3. అభిమానము, 4. హేతువు, 5. ప్రతిషేధము, 6. నిరుక్తము, 7. మిథ్యాధ్యవసాయము, 8. సిద్ధి, 9. యుక్తి, 10. కార్యము అను పదిలక్షణములు చంద్రాలోకమునఁ జెప్పఁబడినవి. ఈకావ్యలక్షణము లర్థాలంకారములకన్న భిన్నముగాఁ గన్పించుట లేదు. జయదేవుఁడు చెప్పిన యీలక్షణము లితరులచే నలంకారములుగనే పరిగణింపఁబడినవి. కాని జయదేవుఁ డలంకారముల కన్నఁ గావ్యలక్షణములను వేరుగాఁ జెప్పుటచే నీక్రిందియర్థము నూహింప నవకాశము కలుగుచున్నది. హారాదుల వలె నుండఁదగినవి యలంకారములు. ఈయూపమ్యమున - హారాదు లెట్లు శరీరబహిర్భూతములో అట్లే యలంకారములును గావ్యస్వరూపబహిర్భూతములు అను నర్థము పర్యవసన్న మగును. కాఁగా, నిష్పన్న స్వరూపమగు కావ్యమున కలంకారములు శోభాసంపాదకములు అను భావము పరిగ్రాహ్యము. కావ్యలక్షణములు కావ్యస్వరూప సంపాదకములు. కావ్యస్వరూప మక్షరసంహత్యాదికముచే సిద్ధమగును. అందువలననే వానికి లక్షణము లనునామ మర్థవంతము.



అలంకారములకన్న లక్షణము లంతరంగిములుగా గోచరించును. అలంకారముల లక్షణముల యుదాహరణములందు స్పష్టముగా భేదము కన్పింపదు. శబ్దప్రతిపాదితమైన యర్థమును భావింపఁగా నలంకారములు భాసించును. శబ్దపూర్వభావి యగు నర్థసంపద కవిహృదయనిహితమై యుండును గావున నట్టి యర్థమును విషయముగాఁ జేసికొనునవి లక్షణములు. సామాన్యముగాఁ గవిహృదయనిక్షిప్తభావమునకును(అర్థమునకు), శబ్దమువలనఁ బ్రతిపాదింపఁబడిన యర్థమువలన గోచరించిన భావమునకును భేదము లేదనవచ్చును. రెండవయర్థము సహృదయ హృదయ సంవాదము పొందియుండునది యని, మొదటిది కేవలకవిహృదయస్ఫురితమని భేదము నూహింపవలయును. మొదటి యర్థము సహృదయ హృదయ సంవాదము పొంద దని యన సాహసింపను. హృదయసంవాదము పొందని పూర్వావస్థలోని ప్రథమార్థమే యిటఁ బరిగ్రాహ్యము. అక్షరసంహత్యాదికము కర్తృత్వాభిమానమున నున్న కవీశ్వరుని కవితాసృష్టిభావనలో భాసించునది యని భావింపవచ్చును. ఈ యర్థము ప్రాకృతికసర్గాశ్రితము కాదు. ఇది కేవలము కవిహృదయ సమున్మిషితము. భావకుఁడు భావించు ద్వితీయార్థము ప్రాకృతిక విశేషసంబద్ధముగా నవభాసించును. సామరస్యమును, సంవాదమును బొందిన యర్థమును రసికుఁడు భావించును. ఇది యలంకారములకు విషయము. ఈ యర్థము కావ్యశోభా సంపాదకము. మొదటి యర్థము కవిహృదయదర్పణ ప్రతిభాసము; రెండవది సామాజికహృదయాదర్శ ప్రతిబింబితము.



వ్యాసకర్త:
శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మ



ఈవిధముగా భేదము నూహించి లక్షణాలంకారములకు వివేకము నూహించుట యుచితము.

ఇంతగా విప్రతిపత్తిగ్రస్తములైన యీకావ్యలక్షణములను సమీక్షచేయుట సముచితము. కావ్యకరణము నందుఁ గవిభావన యేయేమార్గములఁ బ్రసరింపవలయునో యివి సూచించును. సూత్రప్రాయముగా నున్న యీలక్షణములు నానావిధ సకలకవితా సంపత్సమున్మేష సంసిద్ధి సాధకములు. బీజరూపములగు వీని ననుసరించియే చిత్రవిచిత్రాలంకార ప్రపంచము స్వరూపశోభ గాంచుచున్నది.

### 1. అక్షరసంహతి

సూత్రప్రాయములగు నక్షరములతో విచిత్రార్థ ప్రకాశన మొనరించుట యక్షరసంహతి. కవి నిబంధించు నర్థము విశ్వవిహారము చేయును. ఆయర్థము చిత్రవిచిత్రమగుటయేకాక సుందరాతిసుందరము. అర్థభావిత హృదయుఁడైన కవి విశేషముగా శబ్దాన్వేషణ తత్పరుఁడు కాఁడు. స్ఫుటమానమగు నాయర్థము యత్కించిత్సూక్ష్మశబ్దసముపారూఢమై భాసించును. కవీశుని యలౌకికవిచ్ఛిత్తి ప్రథమమున నేకరూపమే యైనను శబ్దార్థములరూపమున ద్విధాకృత మైనట్లు గోచరించును.

### 2. శోభ

గుణప్రదర్శనముఖమునఁ బ్రసిద్ధదోష నివారణము చేయుట శోభ యను కావ్యలక్షణము. నిత్యము భౌతిక సంబంధముతో విహరించు కవికి హృదయసంభావిత రమణీయార్థమునందును దోషసంబంధశంక కలుగవచ్చును. కవికిఁ దనయర్థమునందు నిశ్చితబుద్ధి యున్నది. ఇతరు లా యర్థమునందు దోషసంభావన చేయుదురేమో యను సందేహ ముత్పన్నము కాఁగాఁ దత్వఖ్యాపనకై గుణప్రదర్శనము చేయుట కవికృత్యము. ఇట్లు గుణప్రకాస్తియే శోభ.

### 3. అభిమానము

ఊహించిన యర్థమును విచారణచేసి యుక్తిపూర్వకముగా నిషేధించుట యభిమానము. అర్థము సౌందర్యము ననేకవిధములఁ బ్రకాశింపఁజేయును. విధి నిషేధాద్యనంతరూపములను బ్రతిపాదకము స్వీకరించును. ప్రతిపాదకవైచిత్ర్యము ననుసరించి హేతుకథనము కూడఁ బ్రవేశము పొందును. వివక్షితార్థమును ప్రకాశింపఁజేయుటలో యుక్తియుత నిషేధమును గవి స్వీకరించుట సర్వతోఽభిమానమును సూచించును గాన నిది యభిమానపదవాచ్యము. నిషేధములందు వడపోఁత పోయఁబడిన సౌందర్యసారము భాసించును.

### 4. హేతువు

సంభావితానేక పక్షములను నిరసించి సోపపత్తికముగా సిద్ధాంతార్థవినిశ్చయము చేయుట హేతు వగును. తత్వవినిశ్చయమునకుఁ బ్రతిపక్షనిరాస ముపకరించునట్లు తత్వనిరూపకయుక్తిస్వీకారముకూడ బహూపకారకము. నిషేధకనిషేధమువలన యథార్థప్రకాశము జరుగును. అయిన నది వివక్షిత మైనట్లు విధేయముగా భాసింపక పోవచ్చును. సౌందర్యముద్రను విధేయముగా సాధ్యముగా నిరూపించుట కీహేతువు కవీశున కుపకరించును.

### 5. ప్రతిషేధము

ప్రసిద్ధకారణముల నాదరింపక అప్రసిద్ధ కారణాభిమానమును బ్రదర్శించుట ప్రతిషేధము. కవీశ్వరుని దృష్టి లోకవిలక్షణము. ప్రాకృతిక సర్గలోని కార్యకారణభావము లాతని కూర్పులో నుండు నను నియమము లేదు. కవితానిమగ్నుఁడయిన యాతఁడు ప్రాకృతాభిమతకారణవ్యూహము నతీతుఁడై సామాన్యదృష్టిలో నప్రసిద్ధములుగాఁ గన్పడు కారణముల నిర్దేశించును. కవిదృష్టిలో నిరూప్యాంశనిరూపణమే ప్రధానము. తదితరదృష్టిలో నవి యసంగతము లను బుద్ధి పొడమవచ్చును గాని కవివిలక్షణదృష్టిలో నసంగతిత్వము లేదు.

### 6. నిరుక్తము

సంజ్ఞాశబ్దమును సత్యాసత్యరూపమున నిర్వచించుట నిరుక్తము. శబ్దవ్యుత్పత్తి నిర్ణయమునందలి సత్యత వ్యాకరణస్మృత్యధీనము. అసత్యత తద్విపరీతము. కవి కారణశబ్దకారణాన్వేషకుఁడు. పరస్పర విరుద్ధము లాతని మార్గమున నేకకార్యసాధకము లగును. సత్యాసత్యముల వైరుధ్యమును గవి తిరోహితము చేయును. ఆ

యుభయసామరస్యమున విశిష్టసౌందర్యమును సాధించు కవి సత్యాసత్యపథాతీతుఁడై నిర్వచనమున కుపక్రమిం చును. అట్టి నిర్వివక్షతో నుండు కవికావ్యమునకు నిరుక్తము లక్షణము.

## 7. మిథ్యాధ్యవసాయము

సాధ్యసాధనముల మిథ్యాత్వ ప్రతిపాదనము మిథ్యాధ్యవసాయము. కవినిరూపితాంశములందు మిథ్యాత్వబుద్ధి లోకమున కుండును. లోకము పరిమితబుద్ధి; సంకుచితప్రజ్ఞము. లోకసంప్రతిపన్నతకు సాధ్యసాధన నిర్దేశ మొనరించునేకాని కవికి వానియం దాస్థ లేదు. నిమ్నోన్నతములు కన్పించని యాతని సమదృష్టిలో నాస్వాద్యప్రతిపాదనమే ప్రధానతను పొందును. అసత్యార్థమునఁ గూడ సత్యతేజమును నిరూపింపఁదలఁచిన కవి మిథ్యాధ్యవసాయమును స్వీకరించుట యుచితము.

## 8. సిద్ధి

తుల్యతను ద్యోతనము చేయుటకుఁ బ్రసిద్ధపదార్థ సాహచర్యమును నిరూపించుట సిద్ధిలక్షణము. కవి ప్రతిపాదింపఁదలఁచిన యర్థమును బుద్ధ్యారూఢము చేయుటకై ప్రయతించును. లోకప్రసిద్ధ పదార్థకథన మాతనికి కేవల ముపాయము. అప్రసిద్ధమునఁ బ్రసిద్ధ ప్రతిబింబనము చేసి కవితకు రూపసంపాదన చేయును. ప్రసిద్ధాప్రసిద్ధ కథనమునఁ గవి సిద్ధిని బొందఁగలుగుచున్నాఁడు. సాదృశ్యసిద్ధి కవివివక్షితము. కల్పనాకోటిలో లోకద్వయమును నిర్మించి రెండిటి నేకముచేసి కావ్య స్వరూపసిద్ధిచేఁ గృతహస్తుఁ డగుచున్నాఁడు.

## 9. యుక్తి

చమత్కారాధానము చేయు విచిత్రార్థసంబంధమునఁ బ్రకృతమునందు విశేషార్థమును సాధించుట యుక్తి. కవిసృష్టి యంతయుఁ జమత్కారమయము. చమత్కృతిపరిపూర్ణమగు నొక తత్త్వమును గల్పించి యంతకన్నను దాను నిరూపించు నర్థ మధికచమత్కారి యగుట కీయుక్తిని పరిగ్రహించును. ఆతని దృష్టిలో నన్నియు నేకవిధములె యైనను సంబంధమును బొదుపుటలో విశేషత నాపాదించి కావ్యమును రమణీయము చేయును.

## 10. కార్యము

స్వాభావికవ్యాపారమునఁగాని, యస్వాభావిక వ్యాపారమునఁగాని ఫలప్రాప్తిని నిరూపించుట కార్యమను లక్షణము. కవి నిరూపణముచేయు ఫలమునందు నియతకారణ మపేక్షితము కాదు. విషామృతములు రెండిటియందును దృప్తిఫలము ప్రదర్శింపఁబడును. నిశిత బుద్ధిప్రకల్పితమహాప్రపంచ మంతయుఁ దన ఫలప్రాప్త్యనుకూలము కావలసినదే. కార్యకారణభావమే యాతని కనియతము. అట్టిసమయమున నెట్టికారణ మయినను బ్రకృతఫలనిష్పాదక మగును. ఫలము స్వరసతచే నిష్పన్న మవుఁగాక, అన్యదీయవ్యాపారమున సిద్ధ మవుఁగాక-ఎట్లయినను నిష్పత్తిపర్యంత మాతఁడు నిద్రాణుఁడు కాఁడు.

కవితాపూర్వభావి యయిన కవిభావనలో నిట్లు కావ్యలక్షణవిమర్శ యుండవచ్చు నను నూహాత్రోఁవైరచన ప్రసక్తమైనది. ఇట్టి సమీక్ష యలంకారవిషయమునఁ బ్రసరింపకపోదు. కారణమె కార్యరూపముగా భాసించు ననుట నిర్వివాదము. సహృదయులు కార్యకారణైక్యమును హృదయసంవాదమున నాస్వాదింతురు. ఈకావ్యలక్షణములకుఁ గారణరూపాపన్నత నాపాదించుకొని వేరుగాఁ బరిగణించుటలోని భావమును బైవిధమున నూహించుట సముచితము కాకపోదు.



[ నాటిక ]

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి

శంకరం — అల్లుడు ; పున్నమ్మ — అత్త ; శర్మ — మామ ;
రత్నం — బావమరది ; బాల — కూతురు.

[పూర్వకాలపుభవంతి. గుమ్మానికి రెండుపక్కలా, సమపాళం ఎత్తున విశాలమైన గచ్చుఅరుగులు, ఎడమ అరుగుమీద చిరిచాప, కుడి అరుగుమీద కేన్వాస్‌పడకకుర్చీ, ఒక చిన్న స్టూల్ ఉంటవి.

మెట్లకు అంటి గుమ్మం. ఎడమవైపున కిటికీ.

శంకరం, రత్తయ్య—

శంకరం టెన్నిస్‌ఆటకు పోయే మదరాసీ కుఱ్ఱవాడి వేషంలో ఉంటాడు.

రత్తయ్య — 20 సం.ల శాస్త్రవిద్యార్థి.

రత్తయ్య ముందు దోవతీస్తూ ఉంటాడు. శంకరం ఒక అడుగు వేసి, ఆగి, యింటివంక పరకాయించి చూసి, పేంట్ జేబులోనుంచి కర్చీఫ్ తీసుకుని...అంటీ అంటనట్టుగా ముఖం తుడుచుకుంటాడు.]

రత్తయ్య

(పక్కవాలుగా) దయచేయండి ... సందేహిస్తారేం ?

శంకరం

(మెట్లు ఎక్కి, కుర్చీ అరుగు వేపు ఓమారు చూసి, రుమాలుతో చాపదులుపుతాడు)

రత్తం

(గుమ్మంలో అడుగు వేసినవాడల్లా ఆగి ఆదుర్దాగా) ఆఁ...ఆఁ... అదేమిటి ? — అక్కడ కూర్చుంటున్నారేం ? రండి లోపలికి.

శంకరం

ఫరవాలేదు. ఇక్కడ చాలా బాగున్నది.

రత్తం

అలా కాదు. జామాత విష్ణుసము డని శాస్త్రం.

శంకరం

అయితే - పూజాపునస్కారాలు మొదలు పెడుతావా ఏం ? చెప్పు - ఏ మాటా ! ఉడాయించేస్తాను.

రత్తం

ఎంతమాట - ఎంతమాట ! (ఆగి) నా మనవి వినరూ ?

శంకరం

ఏమిటోయ్ ? ఊరికే సతాయించ మోక. ఎక్కడ కూర్చుంటేనేం ?

రత్తం

కాదు ... మమ్మల్ని అనుగ్రహించాలి. ఇవి కాళ్లు కాదు ... చేతులు. (తొందరలో ఒకటికి ఒకటి అనేసి, చేతులు పట్టుకుంటాడు)

శంకరం

(వింతమృగాన్ని చూసినట్టు చూసి, ఎకసక్కెంగా నవ్వుతూ) ఎలాగైనా, పండితుడవాయెను - మహా గొప్పవిషయం కనుక్కున్నావు ! ఇదివరకు నాకూ అనుమానంగానే ఉంది, ఇవి కాళ్లా, చేతులా అని.

రత్తం

పొరబాటు. ఇదిగో, కాళ్లే పట్టుకుంటున్నాను.

శంకరం

సైఁ.

రత్తం

(తెల్లబోతాడు)

శంకరం

పట్టుకో చూదాం అయినా, నీ తరమౌతుం దేమో.

(రత్తయ్య వంగి, బూడ్సు పట్టుకుంటాడు.)

శంకరం

'చరణములే—రామ - నీదు చరణములే గతి యని నమ్మినవాడను రా' ఊఁ ... పాడవేమోయ్, అందిచ్చినా ! ఓహోఁ—మరచిపోయినా, మీ వేదపాఠశాలలో సంగీతం నేర్పరు కాబోలు ! సరేకాని, కాలని, అనమం మోకాలన్నా కాకుండా బూట్ పట్టుకుంటావేం ?

రత్తం

(అమాయికంగా) లేదండీ—పొరబాటు—సంగీతం రాదండీ !

శంకరం

నామాట విని, ఇకనుంచైనా నేర్చుకో, ఇలాటప్పుడు అక్కరకు వస్తుందా మరి :

అథమం నాలుగు తలుపుదగ్గర పాటలన్నా రాకపోతే పేచీవస్తుంది చూడు: ఇప్పుడు ఇబ్బంది లేదనుకో—సమయానికి నేను ఆదుకున్నాను గనుక సరిపోయింది.

రత్తం

బావగారు—పరిహాసం చేస్తున్నారు!

శంకరం

మీసాలు లేని సనాతననిష్ఠతో పరిహాసం ఏమిటి? కావాలంటే అట్టహాసం చేస్తాను: (కుడికాలు జాపి) బూటు విప్పు. చూస్తావేం, విప్పూ—ముందర. (రత్తయ్య విప్పుతాడు. ఎడమకాలుకూడా అయినతరువాత) సాక్సు తీసేయి. జరఫ్గా పనిచేయకుండా అలా దిక్కులు చూస్తావేం? ఊఁ...ఏ కాలిది ఆబూట్లో పెట్టి, ఆమూల జాగ్రత్తగా ఉంచు. బస్. ఇలా రా, ఎదురుగుండా కూర్చో! అరె అదేమిటోయ్? బాసిపెట్టు వేసి, కొంచెం ధనాయించు. అదీ, రైట్! (కొంచెం ఉండి) ప్రతీది నేనే అందియ్యాలా? ఓ ఆశీర్వచనంపనస విసురూ!

రత్తయ్య

నాకు రావండి! కావాలంటే, శాకుంతలంలో శ్లోకాలు వినిపిస్తాను. చూశారూ, శకుంతలను అత్తవారింటికి పంపించబోతూ మహర్షి సెలవిస్తున్నాడు: (రాగం తీసి) శుశ్రూషస్వ...

శంకరం

(పతాకహస్తంతో) స్టాప్. ఆభాగోతమంతా మనకీ తెలుసునుకాని—జావళీలు ఏమన్నా వచ్చునా ఇంతకూ?

రత్తం

సానిదా న్ననుకున్నారా ఏం?

శంకరం

చాలాదాకా ఉందే శాస్త్రుల్లగారికి! పోనీ-సరసుడవైనా ఫరవాలేదు.

రత్తం

(లేచి నిలుచుని)లోపలికి వెళ్లి మావాళ్లతో చెప్పివస్తాను. (వెళ్లబోతాడు)

శంకరం

ఉండు. (కోటు విప్పుతూ) ఇది అలా ఆకుర్చీమీద విప్పివేయి. (రత్తం అలా చేస్తాడు) చూడు—ఇంతకూ, నీపంతం నీదేకాని—రాకరాక, ఎన్నడూ లేనిది, మన గృహం పావనంచేయబోతున్నాడుకదా, బావగారు, నోరు విడిచి అడిగాడుకూడాను, ఆతని మాట ఎందుకు తీసివేయాలి అనే అభిమానం, బంధుప్రేమ లేదేమోయ్ నీకు?

రత్తం

(ఆదుర్దాగా) ఏం-ఏంకావాలి చెప్పండి? అజ్ఞానంవల్ల, చిన్నతనంచేత, ఏమైనా అపరాధం చేసినట్టయితే మన్నించండి.

శంకరం

అయితే—కానీ.

రత్తం

ఏమిటి?

శంకరం

మళ్లా మొదలా?—పనస.

రత్తం

ఎబ్బే! ఒట్టండీ! నాకు రాదు. మాకు ఆ ప్రసక్తే లేదు చూడండి.

శంకరం

ఏమో, నాకు నమ్మకంలేదు.

రత్తం

నిజమేనండీ. పోనీ, శాంతిపన్నం చదవనా?

శంకరం

ఓ, నిరభ్యంతరంగా.

రత్తం

ఓం...ఆ—శన్నో అస్తు ద్విపదే—శం చతుష్పదే...(నవ్వుతాడు)

శంకరం

బలే. బాగుందోయ్! నన్నుకాకుండా నిన్నుకూడా కలుపుకున్నావేం? శహబాష్!

రత్తం

(లేస్తూ) మీరు బస్తీవారు, ఇంగ్లీషు చదువూ-మీకు జవాబుచెప్పగలమా? పోనీ, లోపలికి రాకపోతే మానె, ఆకుర్చీలోనైనా విశ్రమించండి. అమ్మనూ, నాన్ననూ పిలుచుకువస్తాను.

శంకరం

అంతేనా?

రత్తం

ఏం?

శంకరం

ఇంకా ఇంట్లో జనాభా ఎవరూ లేరూ?

రత్తం

అంతే...మామేనత్త శ్రీశైలం వెళ్లింది.

శంకరం

బతికించింది! ఐనా జ్ఞాపకం తెచ్చుకో.

రత్తం

ఎవరూ లేరండీ!

శంకరం

నిజం?

రత్తం

ఆహాఁ.

శంకరం

(చివాలున లేచి) అయితే నేను వెళుతున్నాను.

రత్తం

ఆఁ...ఆఁ...అదేమిటి?

శంకరం

ఇంట్లో మీఅమ్మా నాన్నా మాత్రమే ఉంటే నేను వెళుతున్నానన్నమాట.

రత్తం

మాచెల్లెలుకూడా ఉంది.

శంకరం

ఆమాట ముందర చెప్పవేం మరి? మీ అమ్మా నాన్నా లేక ఎక్కడికి వెళ్తారు? ఆమె వంటయింట్లో – ఆయన దేవతార్చ

దగ్గరా! నాకు తెలుసునులే. మరే - మీ చెల్లెలిని కొంచెం కాఫీచేసి తీసుకురమ్మను. అన్నట్టు...మీరు ఎవరూ కాఫీ త్రాగరు కాదూ?

రత్తం

మా చెల్లెలు త్రాగుతుంది. నాన్న అల వాటు చేసుకోమన్నాడు. ఏలాగూ మీ యింటికి వస్తే తాగాలికదా అని —

శంకరం

ఏలాగైనా — ముసలివాళ్లు — వీళ్ల తస్సాదియ్య ... అసాధ్యులోయ్!

రత్తం

ఓ క్షణంలో పట్టుకు వస్తాను.

శంకరం

నీ వెందుకు — బ్రహ్మచారివి — ఒంటి బ్రాహ్మడవు? మాగృహిణిని దయచేయమను. ఘోషా ఏం లేదుకా?

(రత్తం లోపలికి వెళుతాడు. శంకరం సిగరెట్ ముట్టించి, ఒకనిమిషం కాల్చిన తరువాత —)

[బాల ప్రవేశిస్తుంది కుడివైపునుంచి. సినిమావేషం - వయ్యారంతో —

అరుగుదగ్గరకు వచ్చి గొడుగు ముడిచి శంకరం ఉండటంవల్ల ముందు అడుగు వేయడానికి సందేహించి, చిరు దగ్గుతుంది. తరువాత, గొడుగు మడిమెతో నేల మీద టకటకమనిపిస్తుంది.]

శంకరం

(అంతవరకూ పరధ్యానంలో ఈమె రాక గమనించనందువల్ల, సందడికి ఉలికి పడి, లేచి నిలుచుని) ఆఁ ... ఆఁ ...

బాల

కొంచెం తప్పుకుంటారా?

శంకరం

ఓ. దయచెయ్యండి: మామామ — ఆఁ ... ఇంట్లో వారందరూ మడిగట్టుకుని లోపల ఉన్నారనుకుంటాను. కూర్చోండి. అలా, ఆ కుర్చీలో కూర్చోండి. నేను వెళ్లి ... మీరు వచ్చారని ... క్షమించాలి ... మీరు ఎవరో, నేను గుర్తుపట్టలేకుండా ఉన్నాను. మీ పరిచయభాగ్యం —

బాల

నన్ను ఎరిగె ఉండ రనుకుంటాను మీరు, మిమ్మల్ని కూడా —



శంకరం సిగరెట్ ముట్టించి కాలుస్తూ పరధ్యానంగా ఉంటాడు.

శంకరం

నేను వీరి అల్లుణ్ని.

బాల

ఓహోఁ! అలాగా? అయితే మీరు మాకు చాలా సన్నిహితులు —

శంకరం

ఆలాగా? ఇవాళ నిజంగా సుదినం.

బాల

అవును. ఆరు సంవత్సరము లాయె వివాహమై—అంతేకాదూ? నాటికి నేడు మీకు అత్తవారి యిల్లంటూ కనబడ్డది. మీరు ఎంత ఎమ్మేలు చదివినా—

శంకరం

మీలాటి చక్కని చుక్కలు పరుస లాడటం మహాభాగ్యం. కాని, బంధుత్వం తెలుసుకోండి—

బాల

సరదాగా కుశలప్రశ్నలు చేసుకునేందుకు బంధుత్వం కావాలా?—బావగారూ?

శంకరం

(గ్రహించినట్లుగా) ఏమిటే, మీరు — మాపినమామగారి —

బాల

కుమార్తెను అనుకుంటున్నారా?—కాదు.

శంకరం

అయితే—

బాల

మీ బాల,— మీ హిందువులలో భార్య పేరు పలుకరు కాబోలును—మీ గృహిణి నావద్ద చదువుకుంటూన్నది.

శంకరం

మీరు—

బాల

ఊఁ—నేను మీ భార్యకు ఇంగ్లీషు చెప్తున్నాను.

శంకరం

చాలా సంతోషం—శుభవార్త!

బాల

ఏం శుభవార్త! మీరు ఏమనుకున్నా సరే – మనసువిడిచి చెప్పుతున్నాను: బొత్తిగా అభం శుభం తెలియకుండా ఏం పెంపక మండీ, మీ అత్తమామలది ?

శంకరం

ఏమీ ?

బాల

ఇన్ని సంవత్సరాలనుంచి—నేను ఈ ఊరు వచ్చిమూడేళ్లయింది,ఇన్నాళ్లనుంచీ—తులసి పూజ మానిపించలేకపోయినాను.

శంకరం

పోనీయండి. పూర్వాచారాలు కూడా ఆదరించవలసిందే!

బాల

నేను కాదనను. కాని, నా బాధ్యత కూడా, చూడండి మరి: మీరు...ఏగొప్ప హోదాలోనో పట్నంలో ఉంటే—మీ యిల్లు దిద్దడానికి తగిపోయేటట్టు తయారు కావాలా, వద్దా? ఈతులసిపూజలు అక్కరకు వస్తాయా?

శంకరం

అవును.

బాల

ఇంగ్లీషుపాఠం చదవమంటే తలాయిస్తుందికాని...పూజలూ, కల్పాలూ బట్టీ పెట్టమంటే విసుగూ విరామం లేదు. నేనూ చూస్తున్నాను: ఇంకా నాలుగు రోజులు పోయినతరువాత, నావల్ల కాదని చెప్పేస్తాను.

శంకరం

అలాకాదు – నాకోసమని మీరు కొంచెం ఓర్పుతో ఉండండి. ఏమీ అంటక పోతే, ఆ అమ్మాయి దురదృష్టం.

బాల

లాభంలేదు.

శంకరం

అయితే, నాకూ లాభంలేదు.

బాల

అదేమిటి?

శంకరం

ఈపల్లెటూరిపైతును తీసుకువెళ్లి నేను ఏం చేసుకోను?

బాల

ఏంచేస్తారు? పువ్వుల్లో పెట్టి పూజించుకోండి?

శంకరం

పూజిస్తాను! (తటాలున ఆమెచేతులు పట్టుకుని) నన్ను అనుగ్రహిస్తే—

బాల

ఊఁ-వదలండి. (విదిలించుకుని) ఇదా మీమర్యాద?—పెద్దమనుష్యులుకదా, మా శిష్యురాలి పెనిమిటికదా అని—

శంకరం

దాని మాట ఇక ఎత్తవద్దు.

బాల

మీమాటలు విచిత్రంగా ఉన్నాయి. ఎవరన్నా వింటే—

శంకరం

విననీయండి, నాకేమీ భయం లేదు. మిమ్మల్ని ప్రేమిస్తున్నానని—

బాల

బలే! పదినిమిషాలముందు నేనెవరో తెలియదు. ఇప్పుడుమాత్రం... పోనీ, పేరైనా అడిగారు కాదేం?

శంకరం

ట్రూలవ్‌కు ఊరూ పేరూ, కులం గోత్రం—

బాల

అక్కరలేదేం? మీరు ప్రేమించే పిల్లకు పెళ్లి ఇదివరకే అయిఉంటే?

శంకరం

ఏమిటీ? ఆమాట ముందుగానే చెప్పారు కారేం?

బాల

మీరు వినిపించుకోందే ఏంచేయనూ? నన్ను మాటాడనిస్తేనా?

శంకరం

అయినా, నాకు అభ్యంతరం లేదు.

బాల

బాగుంది!



సినిమాస్టార్ వేషం- వయ్యారంతో బాల ప్రవేశించి, గొడుగు మడిమెత్తో నేల మీద టకటక మనిపిస్తుంది.

శంకరం

డార్లింగ్!

బాల

(సిగ్గును అభినయిస్తుంది)

శంకరం

మైడియర్...!(కౌగలించుకోబోతాడు)

బాల

వద్దు వద్దు, ఎవరన్నా చూస్తారు.

శంకరం

ఇంకా భయం ఎందుకూ?

బాల

ఏమన్నా ఉందా! నడివీధిలో-పట్టపగలు—

శంకరం

అయితేనేం?

బాల

ఏమీ లేదు. నాకు టైం అయిపోతూంది, ఇంటిదగ్గర కనిపెట్టుకుని ఉంటారు.

శంకరం

ఎవరు ?

బాల

ఎవరున్నారు? ఇంటాయనా, పిల్లలూ.

శంకరం

(ఆశ్చర్యంతో) పిల్లలా ?

బాల

అవును. ఎందు కంత ఆశ్చర్యం ?... ఒక ఆడపిల్ల, ఒక మొగపిల్లవాడూ.

శంకరం

(విభ్రమంతో) కాదు – కాదు. అంతా అబద్ధం.

బాల

(సమీపించి) అరవంలో కాదు అంటే(అతని చెవి పట్టుకుని) ప్రేమించినందుకు ప్రెజెంట్ (చెంపమీద అలా అంటుంది)

శంకరం

హాఁ ... ఏమిటి ఈ —

బాల

ఏమిటి ఈ ఆగడం ? ... ప్రేమంటే మరేమిటి ? ... అందులో పెళ్ళైన పిల్లను– పిల్లల తల్లిని — ప్రేమకు అడ్డులేదు కాదూ? అందుచేత మీ నోటికి కొంచెం అడ్డువేశాను.

(శంకరం దిగాలుపడి చూస్తుంటాడు)

ప్రేమించారు కాదూ పాపం!— అబ్బ! ధన్యాస్మి — నాకు మనసు నిలవడంలేదు. ఈ శుభవార్త మీ అత్త మామలకూ, మీ భార్యకూ చెప్పివేయనా ? తరువాత మన మిద్దరం – 'మల్లెపూల తెప్పమీద తేలి పోదాం' (పాడుతూ పరుగెత్తుకు పోతుంది)

శంకరం

చచ్చానురా భగవంతుడా !

[లేచి, కోటు తీసుకుని భుజం మీద వేసుకుని, గబ గబ సొక్కు తొడుక్కునే ప్రయత్నంలో ఉండగా పున్నమ్మ ప్రవేశిస్తుంది.]

పున్నమ్మ

ఏం నాయనా, అందరూ క్షేమమా ?

శంకరం

ఆఁ.

పున్నమ్మ

సెలవలు యిచ్చారా, కాలేజీకి ?

శంకరం

ఊఁ.

పున్నమ్మ

మా పుణ్యం బాగున్నది. ఏం పాపం చేశాం చెప్పు బాబూ – పెళ్ళైననాటినుంచీ మాగడప తొక్కావు కాదు ? మళ్ళా తిరి గన్నా చూడలేదు ?

శంకరం

తీరుబడి లేదండీ.

పున్నమ్మ

అవునులే ! ఇంతకూ—పిల్ల నిచ్చుకున్న తరువాత నీవు ఏమిచేసినా చెల్లుతుంది.

[శర్మ ప్రవేశం]

శర్మ

ఏమోయ్—

శంకరం

(లేచి నమస్కరిస్తాడు)

శర్మ

సూర్య నమస్కారాలు చేసుకుంటు న్నాను. అప్పుడే మొదలుపెట్టాను. ఇంత లో అబ్బిగాడు వచ్చి చెప్పాడు. ఇవాళ సుదినం నాయనా. కూర్చో, అదేమిటి, నుం చుంటా వెందుకు ?

శంకరం

క్షమించాలి: యింటిదగ్గిర తొందరపని ఉన్నది. మరచిపోయి వచ్చాను. వెళ్ళి మళ్ళా ఒకటి రెండు రోజులలో—

శర్మ

సరే నీ యిష్టం.

పున్నమ్మ

అదేమిటండీ, పండగపూటా వచ్చిన అత త్వారింటికి వెళ్ళమంటారు? బాగుంది పోయింది లెండి! ...అంత మించిపోయేపనేమొచ్చింది? ఉత్తరం వ్రాసి పెయ్యి.

శంకరం

వీలు లేదండీ. వెళ్లితీరాలి.

శర్మ

సరే, భోజనంచేసి తరువాత సంగతి చూసు కుందాము. ఇప్పుడు బస్ ఏలాగూ దొరకదు.

శంకరం

పోనీ, నడిచిపోతాను.

శర్మ

ఇరవైమైళ్లు!

శంకరం

అయితేనేం? వెళ్లక తప్పదు.

[రత్తం వస్తాడు]

రత్తం

ఎక్కడికండీ?

శర్మ

మీ బావ వెళ్లిపోవా లంటున్నాడు.

రత్తం

మహా బాగున్నది! వచ్చినంతసేపు పట్ట లేదు! మీరు ఎప్పుడు వస్తారా అని మేము కళ్లు కాయలుకాచేట్టు ఎదురుచూస్తున్నాం ఇన్నాళ్లనుంచీ. మావల్ల ఏం అపరాధం వచ్చింది, చెప్పండి?

శంకరం

లేదు, నాదే అపరాధం.

శర్మ

అదేమిటోయ్?

శంకరం

అవును, బుద్ధి తెలియకముందు పెళ్లిచేసుకోవడం.

పున్నమ్మ

ఆఁ ఆఁ!

శంకరం

ప్రేమించని పిల్లతో జీవిత మంతా గడపడం.

పున్నమ్మ

ఊరుకో నాయనా! ఎండపడివచ్చినట్టున్నావు, పైత్యంచింది. (వెనిమిటితో) కాస్త అల్లంరసం తీసియిస్తే?

శర్మ

తీసుకురా. (పున్నమ్మ వెళ్లిపోతుంది) కొంచెంసేపు పడుకుంటావా ఏమిటి?

రత్తం

కాఫీ చల్లారిపోతూన్నదేమో?

శంకరం

(ఆత్రుతతో) ఏదీ?

రత్తం

లోపలికి రండి. నేను తెస్తే పనికి రాదన్నారు కామా?

శంకరం

నేను రాను, నీవే తీసుకురా.

రత్తం

పోనీ, అమ్మాయినే ఇక్కడకు పట్టుకు రమ్మంటాను.

శంకరం

వద్దు. (లేచి నిలుచుని) మామగారూ — ఊహుఁ-మిమ్మల్ని అలా సంబోధించడానికి వీలులేదు, శర్మగారూ, నేను చెప్పే విషయం అపార్థం చేసుకోకుండా వినాలి.

శర్మ

అంతా వింతగా ఉంది నీ వాలకం!

శంకరం

ఉండవచ్చును. కాని, మీ అమ్మాయి మీద నాకు ప్రేమ లేదు.

శర్మ

ఎన్నాళ్లనుంచి?

రత్తం

ఇంతకు ముందుకూడా బాగానే మాటాడారండీ నాన్నగారూ! కాఫీ కావా లన్నారు. నేను లోపలికి వెళ్లివచ్చే అంతలో ఏదో మునిగింది.

శంకరం

నేను—నేను మరో అమ్మాయిని ప్రేమిస్తూన్నాను.

శర్మ

ఎక్కడ? (శంకరం ఊరుకుంటాడు) ఏ ఊళ్లో? ఆ అమ్మాయి పేరేమిటి?

శంకరం

అవన్నీ మీకు ఎందుకూ?

శర్మ

విని సంతోషిద్దామని. అల్లుడు యింత ఘనకార్యం చేస్తున్నప్పుడు—

శంకరం

క్షమించండి. నేను మీ అమ్మాయికి అన్యాయం చేయడం లేదు. ఆమె కూడా మరొకరిని వివాహమాడి—

శర్మ

(ఘాటుకుగా) ఏమన్నావు? — ఒళ్లు దగ్గర పెట్టుకునే మాట్లాడుతున్నావా? - అల్లుడవు కనుక ఏమన్నా చెల్లుతుందని యీ పుంనాకోర్ వేషం వేస్తున్నావేం? ఓహోఁ! ఇదా నీయింగ్లీషుచదువు? ఛా! సహస్ర గాయత్రి చేసుకుంటేనేకాని నిన్నుచూసిన పాపం పోదు. (వెళ్లిపోతాడు)

రత్తం

ఏం బావగారూ, ఏమిటి యీనాటకం?

శంకరం

నీకు అర్థం కాదోయ్.

పున్నమ్మ

(అల్లపురసం పట్టుకు దగ్గరకువచ్చి) ఇద నాయనా — కళ్లుమూసుకు ఒక్కగుక్క వేయి.

రత్తం

అక్కడ పెట్టి వెళ్లవమ్మా నీవు.

పున్నమ్మ

పోనీ - ఆచార్యులుగారికైనా పిలుచుకు రారా అబ్బాయి.

రత్తం

వెళ్లవమ్మా బాబూ —

పున్నమ్మ

సంగతేమీ కనుక్కోకుండా నన్ను వెళ్లమంటా వేమిటిరా? ఏ మందో మాకో—

రత్తం

ముందు వెళ్లవమ్మా —

పున్నమ్మ

సరే, నాకెందుకు నాయనా. మీ మీ యిష్టం. (వెళుతుంది)

రత్తం

ఏం బావగారూ, అరుగుమీద కూర్చుని అల్లపురసం తాగుతారా, లోపలికి వచ్చి—

[లోపలనుంచి బాల]

అన్నయ్యా! కాఫీ చల్లారిపోతున్నది.

రత్తం

ఇంకేం, అగుగో పిలుపుకూడా వచ్చింది- ఇక లేవండి. ఇప్పటి ఆడపిల్లలకు సిగ్గూ బిడియం లేదు బొత్తిగాను.

శంకరం

ఎవ రా పిలిచింది?

రత్తం

ఎవరో చెప్పుకోండి. లోపల మా అమ్మ, నాన్న, చెల్లెలు ఉన్నారు. వీరిలో ఎవరికి అన్నయ్యను నేను ?

శంకరం

ఇంకా ఎవరూ లేరూ ?

రత్తం

ఎవరు కావాలి ?

శంకరం

అది కాదోయ్ — మరి, మీ చెల్లెలు యింగ్లీషు చదువుకుంటున్నదా ?

రత్తం

తప్పుతుందా బాబూ మీ ఆజ్ఞ? యింగ్లీషేమిటి, వేలగొట్టేస్తూంటేను!

శంకరం

ఎవరు చెపుతున్నారు ?

రత్తం

అన్నీ కొత్తే మీకు. మొదటినుంచీ ఆ మిషినరీదొరసానే చెపుతూంది. ఏం ?

శంకరం

ఏమీ లేదులే. ఇంకో కొత్తమేస్టరుని పెట్టారేమోనని అడిగాను. దొరసానంటే -

రత్తం

దొరసానంటే, తెల్లదొరసాని—

శంకరం

నిజం!

రత్తం

వాళ్లయిల్లు బంగారంగానూ! తెల్ల వాళ్లు మహాతెలివైనవాళ్లండీ! మా అమ్మాయి ఎంత మారిపోయిం దనుకున్నారు? ఆ మాటలు, ఆ నడకలు, ఆ కట్టూ, ఆబొట్టూ, మీరు పట్నంనుంచి పంపిన — అవేమిటీ, పీలికలు, ఆఁ—రిబ్బన్లు—సినిమాలో వేషం లాగా ఉందండీ. అయినా తినబోతూ భక్ష్యాల రుచి అడిగినట్లు — మీ భార్య చక్కదనాన్ని నేను అభివర్ణించాలా? మాఘుడు చెప్పినట్లు —

శంకరం

ఉండవోయ్ గొడవ! అయితే, దొర సాని యిక్కడికి వచ్చి చెపుతుందా —

రత్తం

ఇంకా నయం! అమ్మా, నాన్నా మ్లేచ్ఛుల్ని యింట్లోకి రానిస్తారా? అమ్మాయి వెళ్లి చదువుకుని వస్తుంది.

(లోపలనుంచి మళ్లా) అన్నయ్యా!

శంకరం

ఎవరోయ్?

రత్తం

(నవ్వుతూ) చెప్పుకోండి.

శంకరం

ఇప్పుడు లోపలికి వెళ్లిన ఆమె గొంతు మాదిరిగా ఉంటే!

రత్తం

ఎప్పుడు?

శంకరం

ఇంతకుముందు.

రత్తం

ఇంతకుముందు ఎవరు వచ్చారు? ఆహా, అవును, (నవ్వుతూ) నిజమే.

శంకరం

నిజమే?

రత్తం

ఆఁ.

శంకరం

అయితే, మీ చెల్లెలు అంటావేం?

రత్తం

పోనీ, కాదులెండి, మీగృహిణి.

శంకరం

అబద్ధం.

రత్తం

నమ్మకపోతే మానిరి. ముందు కాఫీ తీసుకోరూ. ఈపాటికి చప్పగా చల్లారి పోయిఉంటుంది.

శంకరం

కాఫీ వద్దు, గీఫీవద్దు! అంతా గొడవగా ఉన్నది.

రత్తం

ఏమీ లేదు. (లోపలికి చూసి)అమ్మాయి, కాఫీ యిక్కడికే తీసుకురా అమ్మా! బావ గారు కూర్చున్నచోటునుంచి కదలడం లేదు. రా అమ్మా! పరవాలేదు. (తాను నిలుచుం టాడు)

[బాల ప్రవేశిస్తుంది]

శంకరం

(అదరిపడి) నీవా?

రత్తం

చూసి ఆరేళ్లయినా చప్పున గుర్తు పట్టే శారే బావగారు! ఎంతచెడ్డా, యింగ్లీషు చదువుకున్నవాళ్లాయెను!

శంకరం

ఊరుకో, వెఱ్ఱివాసుదు వాగక! ఆరేళ్లే మిటి నీ మొగం —

బాల

(నెమ్మదిగా) ఆరునిమిషాలు కాలేదు.

రత్తం

ఆరునిమిషాలా? దంపతు లిద్దరికీ మతి పోయినట్టుందే?

శంకరం

నీ బ్రహ్మచారిచేష్టలు —

రత్తం

నా కెందుకు బాబూ — పుణ్యమా పురు షార్థమా, మిమ్మల్ని కనిపెట్టుకు కూర్చుంటే — 'దంపత్యోర్మధ్యే న వచ' అన్నారు.




# మేలుకొలుపుడు

కామినియా ఆయిల్ (రిజస్టర్డు)

అనుదినమువాడి మాటుమణ
గియున్న మీకురుల యం
దమును మేల్కొలుపుడు.

ఈవిధమున మీ కేశసంపదను కాపాడు
కొన తెలిసికొనుడు. కామినియా
ఆయిల్ శిరోజములకు బలకారి
సారము. ఇది తలచర్మమునుండి స
త్సిద్ధముగజనించెడి తైలద్రవ్యములను
పెంపొందించి వెంట్రుకలను బల
పరచును, మెరయునట్లుగను చేయును.
ఇది తలచర్మమును ఆరోగ్యస్థితియం
దుంచి తన్మూలమున శిరోజములను పెం
పొందించును. కా॥ఆయిల్ వాడుచున్న
మాప్రి వెంట్రుకలురాలకుండచేయును.

1 సీసా రు.1/-
3 సీసా 2-10-0
వీ. పీ. చార్జి అదనము

శాంపిలు ఉచితము
పోస్టు ఖర్చులకు
ముక్కాని చీటిపంపవలెను.

## సువాసనలకు రాజు ఆట్టో దిల్బహార్ (రిజిస్టర్డు)

ఇది వలపుగొలుపు పరిమళమునకు పేరొందిన స్వదేశీ అత్తరువు. ప్రశస్తమగు 'మోగ్రా', మల్లెపువ్వులసారము. "**అత్తరవులకు రాజు**" అని ప్రసిద్ధిచెందినది. ప్రతివారికిని అందుబాటులో నుండునట్లు అనేకసైజులలో దొరకును.

పోస్టు ఖర్చుకుగాను 0-2-0 లు పంపి **ఉచితముగాపంపబడు శాంపిలును** వాడిచూడుడు.

½ ఔన్సు సీసా రు 1-4-0; 1 డ్రాం సీసా రు 0-12-0. వి. పి. ఖర్చులు ప్రత్యేకము.

## కామినియా చందనసబ్బు (రిజిస్టర్డు)

పరిశుద్ధమగు దినుసులతోను చందనతైలముతోను తయారు చేయబడినది. ఎంతో ఉల్లాసకరముగ చర్మమును చల్లగను పరిశుద్ధముగను ఉంచును. ఉష్ణదేశములకు ఆదర్శకమగుసబ్బు. 3 సబ్బులపెట్టె అ 14.లు. వి.పి. ఖర్చు అదనము. పోస్టుఖర్చులకు 3 కాన్ల బిల్లలుపంపిన. శాంపిలు ఉచితముగా పంపబడును.




## దిల్బహారు సబ్బు (రిజిస్టర్డు)

ఇది అద్భుతముగ క్రిములనుహరించి చర్మమునుశుద్ధపరచును. స్నానముచేయునెడల ఒక క్రొత్త ఆనందమును గూర్చును. శుద్ధమగు దీని పరిమళము ఎంతో హాయిగొలుపును. మూడు సబ్బులుగల పెట్టె రు 0-14-0లు. పోస్టు ఖర్చులకు మూడు కాన్ల బిళ్లలు పంపిన శాంపిలు ఉచితముగా పంపబడును.




**SOLE AGENTS: Anglo-Indian Drug & Chemical Co., Bombay, 2.**

పోయి, మాధ్యాహ్నికం చేసుకుంటాను. (నిష్క్రమణం)

శంకరం

దయచేయండి పంతులమ్మగారూ, యింగ్లీషు చదివినవారికి మొగమాటం ఎందుకూ? మీ పిల్లలు కులాసాగా ఉన్నారా?

బాల

ఉన్నారు.

శంకరం

ఏం చేస్తున్నారు?

బాల

(నవ్వుతూ) మొగపిల్లవాడు వేదపారాయణ చేసుకుంటున్నాడు. ఆడపిల్ల (విరగబడుతూ) పులుసులో తిరగబోత వేస్తున్నది.

శంకరం

యూ సిల్లీ డార్లింగ్!

బాల

పంతులమ్మను పిలుస్తాను. (రెండు అడుగులు వెనక్కు వేస్తుంది)

పున్నమ్మ

(గుమ్మంలోనుంచి) ఏమే అమ్మాయ్ – కాఫీ ... (తొంగిచూసి) సరి సరి. మీ యిల్లు బంగారంగానూ! (లోపలికి పోతుంది)

శంకరం

(బాలను చెయిపట్టుకు లాగుతాడు)

బాల

ఊఁ—మోటదనం.-

(శంకరం కౌగలించుకుని ఉండగా శర్మ బయటకి వస్తాడు: చూసి తలుపు పెడ్డేలున వేసుకుంటాడు)

బాల

అమ్మో! నాన్న చూశాడు బాబోయ్! (విదిలించుకుని, పక్కకు పరుగెత్తుతుంది)

రత్తం

(ప్రవేశించి) కాఫీ త్రాగినట్లు లేదే (అందిస్తూ) తీసుకోండి: అరె! చప్పగా చల్లారిపోయింది, మంచినీళ్లలాగ—

శంకరం

వద్దులేస్తూ.

రత్తం

అవును—కడుపునిండిన బేరం.

శంకరం

(కొట్టబోతూ) శతమర్కటః అనిపిస్తున్నావు!

రత్తం

(తప్పించుకుని) మీరు చివరకు యిచ్చేవి యివే కాదూ, బహుమతీలు! నాన్న కనిపెట్టుకుని ఉన్నాడు. రండి లోపలికి.

[తెర]





# న్యాయశాస్త్రచరిత్రము



శ్రీ వేరి లక్ష్మీనారాయణశాస్త్రి

దీని చరిత్రను బట్టి చూచుఁగా నీ శాస్త్రము రెండువిధములుగా నభివృద్ధి చెందినట్లు తెలియఁగలదు. మొదటినుండి 12-వ శతాబ్దము వరకును సూత్ర గ్రంథముల నాధారము చేసికొని ఈ శాస్త్రము వృద్ధినందినది. అప్పటినుండి సూత్రముల ఫక్కిని విడచి తత్త్వచింతామణి నాధారముగాఁ జేసికొని ఇది వ్యాప్తిచెందినది. ఈ భేదమును బట్టియే మొదటిదానికి ప్రాచీన న్యాయమనియు, రెండవదానికి నవీన న్యాయమనియు వ్యవహారము గలిగినది. కాలభేదమున వీటి శైలిలోఁగూడ భేదము గలదు.

---

హిందూమతమున కాధారభూతమగు వేద మపౌరుషేయము, స్వతఃప్రమాణము నని సార్వజనీనముగా వాడఁబడుచున్నది. సర్వజ్ఞుఁడగు నీశ్వరునిచే ప్రణీతమనియుఁ బక్షాంతరము గలదు. వేదము శబ్ద సముదాయరూప మగుటవలన దీనికిఁ బ్రామాణ్య మంగీకరించిన దర్శనముల కాస్తికదర్శనములని పేరు. పూర్వమీమాంసోత్తరమీమాంసాసాంఖ్యయోగన్యాయవైశేషికరూపమున దర్శనము లారువిధములు. వీనిని రచించినవారు క్రమముగా జైమిని, వ్యాసుఁడు, కపిలాచార్యుఁడు, పతంజలి, అక్షపాదుఁడను గౌతముఁడు, ఔలుక్యుఁడను నామాంతరము గల వైశేషికుఁడు నైయున్నారు.

ఈదర్శనములలో వేదవిచారణఁ జేయునవి పూర్వోత్తరమీమాంసలు. మిగిలినవి వేదవాక్యములను విషయవాక్యములనుగాఁ దీసికొనకపోయినను వేదార్థవిచారణయం దుపయోగించుటవలన నివికూడ ఆస్తిక దర్శనములుగాఁ బరిగణింపఁబడినవి.

సప్తపదార్థములను బోధించు వైశేషికశాస్త్రము న్యాయదర్శనమునకంటె ప్రాచీనమైనట్లు తెలియవచ్చును.

నాస్తికమతములను ఖండించి యీశ్వరస్థాపనఁ జేయుచుఁ బ్రమాణచతుష్టయమును స్థాపించినది న్యాయదర్శనము.

పతంజలిమహాభాష్యమందు న్యాయదర్శనమున నున్న విషయము కొంత విచారణచేయుటవలన నిది మిక్కిలి ప్రాచీనమైనట్లు తెలియుచున్నది. దీనినిఁబట్టి క్రీస్తు జన్మించుటకుపూర్వము మూఁడవశతాబ్దికంటె నవీనము కాదని చెప్పవచ్చును.

న్యాయవైశేషికపదములు భిన్నవిధముగా నిర్వచింపఁబడినవి.

ఇతరుల కర్థప్రతిపత్తిని గలుగఁజేయు పరామర్శప్రయోజకమగు ప్రతిజ్ఞాదిపంచావయవసముదాయము న్యాయమని చెప్పఁబడును. ఇట్టి న్యాయమును విమర్శించిన శాస్త్రము కాఁబట్టి దీనికి న్యాయశాస్త్రమని వ్యవహారము గలిగియుండవచ్చును. న్యాయ మనఁగా నుదాహరణముగూడ నగుటచే నుదాహరణముఖ్యావయవము గాఁగల యనుమానమునుగుఱించి విచారించుటచే నీశాస్త్రమునకు న్యాయశాస్త్ర మను వ్యవహారము గల్గెనని మఱికొందరు చెప్పుచున్నారు.

విశేష మను పదార్థాంతరము నంగీకరించునది వైశేషికమని మనవారు చెప్పుచున్నారు.

న్యాయసూత్రములకు భాష్యమును వ్రాసిన వాత్స్యాయనుని కాలము క్రీ.శ.350 ప్రాంతమైయుండును.

వైశేషికసూత్రములకు ప్రశస్తపాదుఁడు పదార్థసంగ్రహ మను భాష్యమును వ్రాసెను. ఈతఁడు ఉద్యోతకరునికంటె ప్రాచీనుఁ డగుటచే 5 వ శతాబ్దమువాఁడు కావచ్చును.

న్యాయవైశేషికభాష్యములకుఁ గొంత భేదము గలదు. వైశేషికభాష్యమున సూత్రములు యథాక్రమమున వ్యాఖ్యాతములు కాలేదు. అన్నిసూత్రములకు వ్యాఖ్యాన మగుపడదు. న్యాయభాష్యమున యథాక్రమముగా నన్నిసూత్రములు వివరింపఁబడియున్నవి. 6-వ శతాబ్దముచివర నుద్యోతకరుఁడు న్యాయభాష్యమునకు న్యాయవార్తికమను వ్యాఖ్యానమును రచించెను. బౌద్ధనైయాయికుల సిద్ధాంతములను ఖండించి హైందవన్యాయశాస్త్రమును స్థిరముగఁ జేయుటచే నితఁడు న్యాయశాస్త్రమునకు గొప్ప యుపకారము చేసినవాఁ డగుచున్నాఁడు.

ఉద్యోతకరునితరువాత వాచస్పతిమిశ్రుఁడు, భాసర్వజ్ఞుఁడు, ఉదయనుఁడు మొదలగువారు బౌద్ధవాదములను ఖండించి హైందవసిద్ధాంతములను స్థిరపరచిరి.

ఉద్యోతకరుని తరువాత సుమారు 2 శతాబ్దములు న్యాయశాస్త్రములో నుద్గ్రంథములేవియును వ్రాయఁబడినట్లు తోఁచదు. 9-వ శతాబ్దపు మధ్యకాలమున వాచస్పతిమిశ్రుఁడు జీవించియుండెను. న్యాయసూచీనిబంధనమున తా నాగ్రంథమును 841-వ సంవత్సరమున వ్రాసినట్లు చెప్పియున్నాఁడు. ఇతని న్యాయవార్తికతాత్పర్యటీక యింతకంటెను ముఖ్యమైన గ్రంథము. ఇది యుద్యోతకరుని న్యాయవార్తికమునకు వ్యాఖ్యానరూపమగు గ్రంథము. ఇం దీతఁడు న్యాయవార్తికములోని విషయములనేకాక న్యాయభాష్యములోని యనేకవిషయములనుగూడ విశదపరచెను. ఈగ్రంథమువలన నితనికి తాత్పర్యాచార్యుఁడని పేరు వచ్చెను. ఇతఁడు న్యాయశాస్త్రమందేకాక సాంఖ్యయోగవేదాంతమీమాంసాశాస్త్రములలోఁగూడ నుద్గ్రంథములను రచించెను.

10-వ శతాబ్దమున భాసర్వజ్ఞుఁడు న్యాయసార మను గ్రంథమును రచించెను. ఇది రెండధ్యాయముల గ్రంథము. ఇం దీతఁడు క్రొత్తరీతి నవలంబించెను. న్యాయసూత్రములు, వాని వ్యాఖ్యానములవలె పదార్థవిచారముతో గ్రంథమును ప్రారంభింపక ప్రత్యక్షానుమానశబ్దరూపములగు ప్రమాణవిచారముతో నారంభించి నవ్యన్యాయప్రవర్తకులకు మార్గదర్శకుఁ డాయెను. ఉపమానప్రమాణమును విడుచుట యీగ్రంథమునందు మఱియొక విశేషము.

సూత్రభాష్యముల మార్గమును విడిచి స్వతంత్రగ్రంథములను రచించినవారిలో నుదయనాచార్యుఁడు ముఖ్యుఁడు. ఇతఁడు, ప్రశస్తపాదభాష్యమునకు కిరణావళియను వ్యాఖ్యానమును, వాచస్పతిమిశ్రుని న్యాయవార్తికతాత్పర్యటీకకు న్యాయవార్తికతాత్పర్యపరిశుద్ధియను వ్యాఖ్యానమును, న్యాయపరిశిష్టమను నామాంతరముగల ప్రబోధసిద్ధియు, బౌద్ధధిక్కార మను నామాంతరము గల యాత్మతత్త్వవివేకమును, న్యాయకుసుమాంజలియు నను మూఁడు స్వతంత్రగ్రంథములను రచించెను. న్యాయపరిశిష్టమున జాతినిగ్రహస్థానముల విచారము గలదు.

ఆత్మతత్త్వవివేకమున శూన్యతావాదక్షణికవాదఖండనపురస్సరముగా నాత్మస్వరూపవివేచనము గలదు. వీనికంటె ముఖ్యమగు గ్రంథము న్యాయకుసుమాంజలి. ఇందు మీమాంసక-సాంఖ్య-బౌద్ధ-జైన-చార్వాకుల నిరీశ్వరవాదములను ఖండించి యుక్తిమూలమున నీశ్వరస్థాపనము చేయఁబడియున్నది.

ఈశ్వరస్థాపనము చేసి నాస్తికమతముల నణఁగఁద్రొక్కినవారిలో ముఖ్యుఁ డుదయనాచార్యుఁడు. ఇట్టి గ్రంథమును రచించుటచే నుదయనుఁడు న్యాయాచార్యుఁ డనిపించుకొనియున్నాఁడు. ఇతఁడు తన లక్షణావళిని 984-వ సంవత్సరమున రచించినట్లు వ్రాసికొనియున్నాఁడు. అందుచే నితఁడు 10-వ శతాబ్దమున జీవించియుండెను. ప్రాచీననైయాయికులలో నుదయనాచార్యుఁడు కడపటివాఁడని చెప్పవచ్చును.

ఉదయనాచార్యుని తరువాత లెక్కింపఁ దగిన నైయాయికుఁడు తత్త్వచింతామణికర్తయగు గంగేశోపాధ్యాయుఁడు. ఇతఁడు శ్రీహర్షునికంటె నవీనుఁడును, చింతామణివ్యాఖ్యాతయగు జయదేవునికంటె ప్రాచీనుఁడును నగుటచే 12-వ శతాబ్దమువాఁడు కావచ్చును.

సామాన్యముగా చింతామణి యని వ్యవహరింపఁబడు తత్త్వచింతామణి యనేకవిధముల ప్రాముఖ్యము వహించినది. ప్రాచీనన్యాయగ్రంథములరీతిని విడిచి ప్రమాణనిరూపణమున కిందు ముఖ్యస్థాన మీయఁబడినది. అందుచేఁ దత్త్వచింతామణి పదార్థవిచారప్రధానశాస్త్రముగా నుండిన న్యాయమును ప్రమాణవిచారప్రధానశాస్త్రముగా మార్చినదని చెప్పవచ్చును. ఇటీవల రచింపఁబడిన ముఖ్యములగు న్యాయగ్రంథములన్నియుఁ జింతామణి నాధారముగాఁ జేసికొనియే వ్రాయఁబడినవి. ప్రత్యక్షానుమానోపమానశబ్దరూపముల చింతామణి నాలుగుఖండములుగా నున్నది. చింతామణి మొదలగు నవీనగ్రంథములలోని విశేష మేమనఁగా అతిసూక్ష్మదృష్టితో లక్షణముల పరిష్కారము చేయఁబడియున్నది. ఇందుకొఱకై యవచ్ఛేద్యావచ్ఛేదక నిరూప్యనిరూపకప్రతియోగ్యనుయోగ్యాదిపారిభాషికపదములు పరిష్కరింపఁబడినవి. వీని యుపయోగమువలన నవీనన్యాయమున కార్యకారణభావప్రతిబధ్యప్రతిబంధకభావాదికము నిస్సందేహముగా నిరూపించుట కవకాశము కల్గినది.

గంగేశోపాధ్యాయుని చింతామణి సర్వోత్కృష్టమగు గ్రంథమగుటచే తరువాతి నైయాయికులు నూతనగ్రంథములను వ్రాయఁబూనక దానికి వ్యాఖ్యానము లు వ్రాయుటయందే ప్రవృత్తులైరి.

గంగేశుని కుమారుఁడగు వర్ధమానోపాధ్యాయుఁడు తన తండ్రిగారి గ్రంథమునకును, ఉదయనాచార్యుని గ్రంథములకును వ్యాఖ్యానములను వ్రాసెను. ఇవన్నియు ప్రకాశికపేరున వెలయుచున్నవి. జయదేవాపరనామముగల పక్షధరమిశ్రుఁడు చింతామణికి ఆలోక మను వ్యాఖ్యానమును వ్రాసెను. ఈజయదేవుని శిష్యుఁడగు రుచిదత్తుఁడు వర్ధమానుని కుసుమాంజలిప్రకాశమునకు కుసుమాంజలిమకరంద మను వ్యాఖ్యానమును వ్రాసెను.

16-వ శతాబ్దమున నవద్వీపమున న్యాయశాస్త్రప్రచారము చేసిన వాసుదేవసార్వభౌముని శిష్యుఁడు రఘునాథుఁ డను తార్కికశిరోమణి. గంగేశునితరువాత నితఁడే యెన్నఁదగిన నైయాయికుఁడు. ఇతఁడు గంగేశుని చింతామణికి దీధితియను వ్యాఖ్యను వ్రాసెను. చింతామణిలోని రెండుఖండములకే దీధితి యగుపడుచున్నది. రఘునాథుఁడు వైశేషికమతఖండనమగు పదార్థఖండనము మొదలగు మరికొన్ని గ్రంథములనుగూడ రచియించెను.

ఇతని శిష్యుఁడు మథురానాథుఁడు. ఈతఁడు చింతామణికిని, దీధితికినిగూడ వ్యాఖ్యానములు వ్రాసెను. ఇతఁడును, జగదీశుఁడును సమకాలికులు. జగదీశుఁడు దీధితికి వ్యాఖ్యానమును వ్రాసెను. ఇది జాగదీశి యనుపేరున వెలయుచున్నది. ఈతఁడు శబ్దశక్తిప్రకాశిక యను నార్థికగ్రంథమును, భాష్యసూక్తి యను ప్రశస్తపాదభాష్యవ్యాఖ్యానమును, తర్కామృత మను చిన్న ప్రకరణమునుగూడ రచించెను.

ఉత్తమమగు అలంకరణము

# హిమానీ స్నో

ఇండియాలో చేయబడిన మొదటి స్నో

నాణ్యమున ప్రశస్తమయినది.

మన దేశపు దినుసులతో, పెట్టుబడితో, పనివాండ్రతో, హైందవ మానేజిమెంటు క్రింద తయారు చేయబడినది.

---

ఎల్లపుడు హిమానీని కోరుడు

---

హిమానీ

గ్లిసరిను సబ్బు

పరిశుద్ధమగు దినుసులతో తయారు చేయబడినది, అతిస్నిగ్ధమయినది, లేత పరిమళముకలది.



సుప్రసిద్ధ భారతీయ సినీమాతారయగు

శ్రీమతి కన్నన్‌బాలాగారిట్లనుచున్నారు:

"...హిమానీ గ్లిసరిన్ సబ్బును వాడుట యన నాకొక యానందము. ఇది నిజముగా నొక చక్కని సబ్బు"






(1) మంగుళూరు డిస్ట్రిబ్యూటరులు:—

దికారొనేషన్ ట్రేడింగు కంపెనీ.

(2) కోయంబత్తూరు డిస్ట్రిబ్యూటరులు:—

దికోయంబత్తూర్ స్వదేశీస్ లిమిటెడ్.

(3) కాకినాడ డిస్ట్రిబ్యూటరులు:—

మెస్సర్సు పెదుళ్లపల్లి బ్రదర్సు.



*Sole Distributors:—*

**SHARMA BANERJI & Co., CALCUTTA & BOMBAY.**

## శ్రీ కృష్ణభగవానుని సాక్షాత్కారము నందుటకు ఒకేమార్గము



శ్రీ విరాట్ స్వరూపము

మూడు మాసములు మాత్రమే.

(పోస్టేజి ప్రత్యేకము)

**2 పటములుచేరి రు. 3-0-0**

(ఆర్డర్.తో అడ్వాన్సు పంపుడు.)

అడ్వాన్సు లేక పటములు పంపుటకు వీలుపడదు.

"20 × 28" అం॥ సైజున 12 రంగులలో దళసరి కాగితము మీద జర్మనీలో ముద్రించ బడిన శ్రీ గీతారహస్య చిత్రములతో మీ గృహముల పావనము గావించుకొని, భక్తి పారవశ్యములతో భగవత్కటాక్షము నందుడు. వేలకొలది భక్తుల గృహముల నలంకరించి యున్నవి. నేడే మీ గృహమును గూడ నలంకరించుకొనుడు.

ఆర్డరు యిచ్చువారు అడ్రస్సు పూర్తిగాను జిల్లా తపాలాఆఫీసు పేర్లు పల్లెలు పేర్లు వివరము తెలుపవలెను.

వలయువారు దిగువఅడ్రెసుకు వ్రాయండి:-



శ్రీ గీతా స్వరూపము

హెడ్ ఆఫీసు: ఎం. టి. శ్రేష్ఠి, ప్రొప్రైయిటరు, శ్రీ మద్గీతాలయం, 280, దేవరాజమొందలివీధి, మదరాసు.

---

లాల్‌జి గోధు & కంపెనీవారి

# ఎల్. జి. L. G.

# ఇంగువను కొనుడు

బజారులలో మీరు ఇంగువనుకొనునప్పుడు కృత్రిమ మార్కులను చూచి మోసపోక ఎల్. జి. మార్కు గమనించి శ్రేష్ఠమైన ఎల్. జి. ఇంగువనేకొనుడు. ఆహారపదార్థములకు రుచినికలిగించుటకు ఎల్. జి. ఇంగువకు సాటియైనది వేరొకటి లేదు.

లాల్‌జి గోధు అండ్ కంపెనీ,

**సావుకారవేట, మదరాసు**

---



# సిప్రా

వెజిటబిల్

సువాసన సబ్బు

పుష్కలమగు నురుగుచేతను, పరిమళముచేతను ఎంత సున్నితమైన మనస్సునైనను మెప్పించగలదు. పరిశుద్ధమగు దినుసులతో తయారు చేయబడినది. శరీరమును మృదువుగా నుంచును.

ఎంత లావణ్యమైన చర్మమునకైనను చెరుపుచేయదు.

## బెంగాల్ కెమికల్,

కలకత్తా : : బొంబాయి.

మద్రాసు ఏజంట్లు :-

**యం. దేశాయి గౌండర్ & కో., 41, బందరు వీధి.**

మధురానాథజగదీశులకు సమకాలికుఁడగు హరిరామతర్కాలంకారుని శిష్యుఁడు గదాధరుఁడు. అందుచే నితఁడు 17-వ శతాబ్దమువాఁడు కావచ్చును. ఈతఁడుకూడ దీధితికి వ్యాఖ్యానమును వ్రాసెను. ఇయ్యది గాదాధరి యని ప్రసిద్ధిచెందినది. మరియు నీతఁడు చింతామణిభాగములకుఁగూడ వ్యాఖ్యానము వ్రాసెను. ఇదియే మూలగాదాధరి యని వ్యవహరింపఁబడుచున్నది. ఇవిగాక వ్యుత్పత్తివాద-శక్తివాదము లను నార్థికగ్రంథములను, నుదయనాచార్యుని యాత్మతత్త్వవివేకమునకు వ్యాఖ్యానము మొదలగు ననేకగ్రంథ ములను ఈతఁడు రచియించెను.

17-వ శతాబ్దమున రఘుదేవుని శిష్యుఁడగు శంకరమిశ్రుఁడు దీధితి కొక వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతఁడే వైశేషికసూత్రముల కుపస్కార మను నొక వృత్తిని వ్రాసెను. ప్రశస్తపాదభాష్యము సర్వజనసౌలభ్య ము గాకుండుటచేత శంకరమిశ్రకృతమగు నుపస్కారరూపవృత్తినే యాధారముగా చేసికొని వైశేషికదర్శనము పఠనపాఠనములలో నున్నది.

16-వ శతాబ్దముననే విశ్వనాథపంచాననుఁడు న్యాయదర్శనములకు పూర్తిగా నొక వృత్తిని వ్రాసి యున్నాఁడు. అతఁడే నవ్యన్యాయపద్ధతి నవలంబించి కారికావళిని, దానికే ముక్తావళి యను వ్యాఖ్యను రచిం చెను. అది వైశేషికదర్శనము ననుసరించియే వ్రాసినట్లు గానవచ్చుచున్నది. న్యాయసూత్రములలోఁ జెప్పినరీతిని కొంత యనుసరించినను వాదజల్పవితండములను జాతినిగ్రహస్థానములను జెప్పకపోయినందున న్యాయసూత్రములను బూర్తిగా ననుసరించినట్లు కానరాదు. వైశేషికసూత్రములలోఁ జెప్పిన ప్రత్యక్షాను మానములకే ప్రామాణ్యమును విడనాడి న్యాయసూత్రములలోఁ జెప్పిన ప్రమాణచతుష్టయము నవలంబించుట వలన వైశేషికమతమును కొన్నిచోట్ల విడిచినట్లుగూడ కానవచ్చుచున్నది. ఈగ్రంథమునకు దినకరభట్టు దిన కరి యను వ్యాఖ్యను వ్రాసెను.

ఈదినకరికి రామరుద్రుఁడను నాంధ్రదేశీయుఁడు రామరుద్రీయ మను వ్యాఖ్యను వ్రాసెను. ప్రస్తుత మది నాలుగుఖండములకుమాత్రమే లభ్యమైనది. ఇతఁడు దీనికేకాక గదాధరకృతములగు వ్యుత్పత్తివాద, శక్తి వాదములకుఁగూడ వ్యాఖ్యానమును వ్రాసెను.

ఇటీవల ప్రాచీనప్రకరణముల సంగతులను విడనాడి అన్నంభట్టు నవ్యరీతి ననుసరించి సంగ్రహ మను స్వతంత్రగ్రంథమును వ్రాసెను. దాని కతఁడే దీపిక యను వ్యాఖ్యను వ్రాసెను.

దీపికాభిప్రాయములను పూర్తిగా తెలియఁజేయుటకు నీలకంఠుఁడు నీలకంఠీయ మను వ్యాఖ్యను వ్రాసెను. పైవానికి ప్రకరణము లని పేరు.

పై న్యాయశాస్త్రచరిత్రమునుబట్టి యీశాస్త్రము రెండువిధములుగా నభివృద్ధిచెందినట్లు తెలియఁగలదు. మొదటినుండి 12 వ శతాబ్దమువరకు సూత్రగ్రంథముల నాధారముచేసికొని ఈశాస్త్రము వికాసము బొందినది. అప్పటినుండి సూత్రముల ఫక్కిని విడచి తత్త్వచింతామణి నాధారముగాఁ జేసికొని వ్యాప్తినిజెందినది. ఈభేద మునుబట్టియే మొదటిదానికి ప్రాచీనన్యాయమనియు, రెండవదానికి నవీనన్యాయమనియు వ్యవహారముగలిగినది. కాలభేదమున వీటి శైలిలోఁగూడ భేదముగలదు.

గాదాధరి మొదలగు నుద్గ్రంథములు సంప్రదాయముగా చదివినను దర్శనములం దున్న యన్నివిషయ ములను తెలియనందున ప్రకరణజ్ఞాన మావశ్యకము. ప్రకరణజ్ఞాన మితరశాస్త్రముల కుపయోగించినట్లు ఉద్గ్రంథ పఠన మంత యుపయోగించదు. కాన శాస్త్ర మభ్యసించువారు ప్రకరణముల నభ్యసించుట యుక్తమని నా యాశయము.

---

# హైదరాబాదు రాష్ట్ర విద్యా సమస్యలు



1881 నుండి జరుగుచు వచ్చుచున్న విద్యావ్యాప్తి క్రమము - హిందువులకన్న ముసల్మానులలో మూడింతలహెచ్చు విద్యావ్యాప్తి - స్త్రీవిద్య అధ్వాన్నపుస్థితి - విద్యావ్యాప్తికి నిజాముప్రభుత్వమువారు తీసుకొనుచున్న శ్రద్ధ తగినంతగా ఫలించకపోవుటకు కారణములు - హిందువులలో విద్యావ్యాప్తి బొత్తిగా లేకపోవుటకు కారణములు-ఉర్దూ మాతృభాషగా కలవారికి మాత్రమే లాభకరమును, ఇతరులకు కష్టనష్టములకు కారణమును అయిన ప్రభుత్వవిద్యావిధానము - హిందీకి ఉర్దూ ప్రత్యామ్నాయమా ? - ఉర్దూవలన కలిగిన అపారనష్టము - ఖాస్గీబళ్లపై నిర్బంధాజ్ఞ - జాగీర్లలో విద్య వెనుకపాటు - మత విద్యాప్రాధాన్యము, తత్ఫలితములు - ఆశాభంగమును కలిగించిన మెకంజీవిధానము - దేశభాషలకు ప్రోత్సాహము కలిగించిన కొందరు మొగలాయి రాజులు

● శ్రీ సురవరము ప్రతాపరెడ్డి ●

హైదరాబాదు రాష్ట్రములోని విద్యాసమస్యలను గురించి బ్రిటిషిండియాలోని ఆంధ్రులు సరిగా తెలుసుకొనినవారు కారని తోచుచున్నది. ఎన్నియో మారులు అచ్చట ప్రకటింపబడు విమర్శలను జూచిన వారికీ సమస్యలు సరిగా తెలియలేదని స్పష్టపడినది. అందుచేత ఈ వ్యాసమందు నేను ఒక సమగ్రమైన సింహావలోకనచర్చ చేయుటకు ప్రయత్నింతును.

## కొన్ని అంకెలు.

హైద్రాబాదు రాష్ట్ర విద్యాసమస్యలను గ్రహించుటకు ముందు ఈ క్రింది అంకెలను దృష్టిలో నుంచుకొనవలెను:

| | |
|---|---|
| రాష్ట్ర జనసంఖ్య— | ౧,౪౪,౩౬,౧౪౮ |
| అందు, హిందువులు | ౧,౨౧,౭౬,౭౨౭ |
| ముసల్మానులు | ౧౫,౩౪,౬౬౬ |
| భాషావిభజనప్రకారము చూచిన— | |
| ఆంధ్రులు | ౯౨,౭౨,౫౩౪ |
| మహారాష్ట్రులు | ౩౭,౮౬,౮౩౮ |
| కర్ణాటకులు | ౧౬,౨౦,౦౯౪ |
| ఉర్దూ హిందీ మాట్లాడువారు | ౧౫,౦౭,౨౭౭ |

| | | |
|---|---|---|
| రాష్ట్రాదాయము (౧౯౩౮ లో) | | ౯,౧౫,౪౬,౦౦౦ రూ. |
| విద్యపై వ్యయము | ” | ౧,౨౪,౧౯,౦౭౨ రూ. |

విద్య వచ్చినవారిసంఖ్య (౧౯౩౧ జనాభాప్రకారము)

| | | |
|---|---|---|
| హిందువులలో | నూటికి | ౩. ౩ |
| ముసల్మానులలో | ,, | ౧౦. ౩ |
| మొత్తముపై | ,, | ౪. ౮ |

౧౮౮౧-వ సంవత్సరమునుండి విద్యావ్యాప్తి యేవిధముగా జరుగుచు వచ్చినదో యీక్రింది అంకెలు విశదముగా తెలుపుచున్నవి:

| సంవత్సరం | నూటికి విద్యవచ్చిన వారు | హిందువులలో నూటికి విద్య వచ్చినవారు | ముస్లిములలో నూటికి విద్య వచ్చినవారు | వ్యయము రూపాయీలు |
|---|---|---|---|---|
| ౧౮౮౧ | ౩. ౭ | ౨. ౯౮ | ౪. ౯ | ౨,౨౯,౨౨౦ |
| ౧౮౯౧ | ౪. ౭ | ౩. ౩౭ | ౬. ౬ | ౩,౦౩,౨౯౨ |
| ౧౯౦౧ | ౩. ౪ | ౨. ౫ | ౬. ౫ | ౭,౪౮,౬౬౫ |
| ౧౯౧౧ | ౩. ౨ | ౨. ౩ | ౫. ౯ | ౧౦,౧౯,౭౮౭ |
| ౧౯౨౧ | ౩. ౩ | ౨. ౬ | ౮. ౯ | ౬౮,౨౯,౯౦౭ |
| ౧౯౩౧ | ౪. ౮ | ౩. ౩ | ౧౨. ౪ | ౯౦,౭౭,౦౬౩ |

ఇందలి ఒకచిత్రమును గమనింపవలెను. ౧౮౯౧ లో, అనగా ౪౦ ఏండ్ల క్రిందట ౩ లక్షల చిల్లరరూపాయీలుమాత్రమే విద్యపై వ్యయముచేయగా నూటికి ౪.౬ (లేక ౧౦౦౦ కి ౪౬) మంది విద్య వచ్చినవారుండిరి. ౪౦ ఏండ్లతర్వాత ౯౦ లక్షల చిల్లరరూపాయీలు వ్యయముచేసినప్పటికిని విద్యవచ్చినవారి సంఖ్య ఇంచుమించు అంతే ఉండిపోయినది. ఈ ౪౦ ఏండ్లనుండి చేసిన ప్రయత్న మంతయు క్రీ. శ. ౧౮౯౧ లో స్థితికి వచ్చుటకేనా అని అనిపించును. ఇం దింకొక విశేష మేమనగా ముసల్మానులలో విద్య హిందువులకన్న ఇంచుమించు మూడింతలు హెచ్చుగా వ్యాపించినది. స్త్రీలవిద్యను చూచిన అది మరీ అధ్వాన్నముగా ఉన్నది. ఎట్లనగా, క్రీ. శ. ౧౯౨౧ లో—

| | | |
|---|---|---|
| హిందువులలో విద్యవచ్చిన స్త్రీలసంఖ్య మొత్తము | | ౧౬,౩౧౭ |
| ముసల్మానులలో | " | ౧౯,౫౯౯ |

క్రీ. శ. ౧౯౩౧ లో—

| | | |
|---|---|---|
| హిందువులలో విద్యవచ్చిన స్త్రీలసంఖ్య మొత్తము | | ౧౫,౫౦౨ |
| ముసల్మానులలో | " | ౨౭,౮౪౬ |
| హైద్రాబాదురాష్ట్రములో మొత్తం గ్రామాలసంఖ్య | | ౨౧,౮౩౦ |
| క్రీ.శ. ౧౯౩౮ లో రాష్ట్రములో మొత్తం పాఠశాలలు | | ౭,౧౮౯ |

వీటిపై ప్రభుత్వమువారు ౧,౨౪,౧౯,౦౬౨ రూ. వ్యయము చేసినారు.

## ప్రభుత్వమువారి ప్రయత్నాలు

నిజాంప్రభుత్వమువారు విద్యావ్యాప్తికై ఎక్కువ శ్రద్ధ తీసుకొనుచున్నారు. ప్రాథమికవిద్య, అనగా ప్రైమరీస్కూలువిద్య ఉచితముగా చెప్పింపబడుచున్నది. లోకల్ఫండు ప్రాథమిక పాఠశాలలలోను, సర్కారీ పాఠశాలలలోను బాలబాలికలనుండి జీతములు తీసుకొనరు. బళ్లసంఖ్యకూడ చాలా హెచ్చినది. ౨౦ ఏండ్లక్రిందట ఎంత వ్యయము చేయుచుండిరో అంతకు రెండింతలు ఇప్పుడు వ్యయము చేయుచున్నారు. వయోజనవిద్యకై రాత్రిపాఠశాలలను కూడ అచ్చటచ్చట ప్రారంభించినారు. ఈ విధముగా ప్రయత్నములు చేయుచున్నను విద్యావ్యాపకము తగినట్లుగా కాకపోవుటయేల యని యాశ్చర్యము కలుగవచ్చును. మరియు హిందువులలో విద్యావ్యాపకము బొత్తిగా కనిపించుటలేదు. దీనికి కారణము లెవ్వియో తెలుసుకొనవలసియుండును.

## విద్యావ్యాప్తి కాటంకములు

నిజాంరాష్ట్రములో విద్యావ్యాప్తి కానందులకు ముఖ్యకారణములను ప్రజానాయకులు పలుమారు చూపించియున్నారు. హైద్రాబాదు ప్రజావిద్యామహాసభ అనుపేరుతో ఇంతవరకు మూడు మహాసభలు జరిగినవి. అందలి తీర్మానములను గమనించిన ప్రజానాయకుల దృష్టిలో విద్యావ్యాప్తి కాటంకము లెవ్వియో విశదమగును. ఇచ్చట ఆ తీర్మానాల సారాంశమును మాత్రము వ్రాయుచున్నాను:

౧. రాష్ట్రములో విద్యావ్యాపకము కావలెననిన ఈ క్రింది ఏర్పాటులను ప్రభుత్వమువారు చేయవలెను:—

(అ) ప్రైవేటు బళ్లపై పెట్టిన నిర్బంధములను తొలగించవలెను.

(ఇ) గ్రంథాలయములపైనను, ప్రైవేటుబళ్లపైనను పోలీసువారు ఒకదృష్టి ఉంచవలెనని క్రీ. శ. ౧౯౧౧లో ప్రభుత్వమువారు కావించిన ఆజ్ఞను తీసివేయవలెను.

(ఉ) విద్యాసంబంధపు సభలపై కల నిర్బంధములను తీసివేయవలెను.

౨. సర్ఫెఖాసులోను, సంస్థానాలలోను, జాగీర్లలోను విద్యావ్యాపకము చేయవలెను.

(సర్ఫెఖాసు అనగా మహాఘనతవహించిన నిజాము ప్రభువుగారి సొంతవ్యయానికై ఒకజిల్లాయు, మరి కొన్ని తాలూకాలును ప్రత్యేకింపబడినట్టి భాగము)

౩. వయోజనవిద్యకై ఏర్పాట్లు చేయవలెను.

౪. నిర్బంధ ప్రారంభవిద్య ఉచితముగా చెప్పించు నేర్పాట్లు చేయవలెను.

౫. మాధ్యమిక పాఠశాలలలోను, ఉన్నత పాఠశాలలలోను ఉర్దూలో విద్య చెప్పించుచున్నారు. అట్లుకాక ఏజిల్లాలో ఏభాష ప్రధానభాషగా ఉండునో దానిలోనే విద్య చెప్పించవలెను.

నిజాంరాష్ట్రములో కొన్ని సంవత్సరములనుండి ఆంధ్ర మహాసభ ఏర్పడి ప్రజాభ్యుదయమునకై బాగుగా పనిచేయుచున్నది. ఇంతవరకు ఏడు మహాసభలు జరిగినవి. ఈ సభలలోను పై తీర్మానములు కావింపబడుటయే కాక ఈ క్రింది విశేష తీర్మానములు కావింపబడెను. వాటి సారాంశ మేమన—

౧. ఆంధ్రస్త్రీలకు ఆంధ్రభాషామూలమున విద్య చెప్పించుటకై కళాశాలలను స్థాపించవలెను.

ఉన్నతవిద్యను స్త్రీలకు తమ మాతృభాషలో ప్రభుత్వమువారు చెప్పించవలెను.

౨. ఉన్నతవిద్య జనుల మాతృభాషలోనే ఉండవలెను.

ఇదేవిధముగా హైద్రాబాదురాష్ట్రములోని మహిళాసభలును, కర్ణాటక మహారాష్ట్రసభలును, జిల్లాలసభలును తీర్మానములు చేసియున్నవి. ఈవిధముగా ప్రతి మహాసభలోను ఆంధ్రులు, మహారాష్ట్రులు, కర్ణాటకులు తీర్మానములు చేయుట యెందులకో తెలుసుకొనిన విషయము స్పష్టపడగలదు.

## ప్రభుత్వవిధానము

హైద్రాబాదు రాష్ట్రి ప్రభుత్వమువారు అవలంబించిన విద్యా విధానము కేవలము ఉర్దూ మాతృభాషగా కలవారికే లాభకారిగా ఉన్నది; ఇతరులకు నష్టకష్టములు కలిగించుచున్నది. ఈ రాష్ట్రిములో పూర్వము ఉర్దూకు ప్రాధాన్యత లేకుండెను. ౮౦ సంవత్సరాలకు ముందు ఇచ్చట ఫార్సీ రాజకీయభాషగా ఉండెను. కాని, జిల్లాకచ్చేరీలలోను, పాఠశాలలలోను జిల్లాభాషకే ప్రాధాన్యత నిచ్చియుండిరి. క్రీ. శ. ౧౮౩౪ లో మొట్టమొదట హైద్రాబాదు నగరములో ఒక ఇంగ్లీషుపాఠశాలను స్థాపించిరి. క్రీ. శ. ౧౮౫౯ లో ప్రతితాలూకాలోను రెండుపాఠశాలలు స్థాపించునట్లును, ఫార్సీ కొకటి, ముల్కీభాషకు (అనగా జిల్లాభాషకు) ఒకటివంతున స్థాపించునట్లును ప్రభుత్వమువా రాజ్ఞాపించిరి. క్రీ. శ. ౧౮౮౧ లో 'దేశభాషల' విద్యాబోధను విచారించుకొనుటకు ఒక విద్యాధికారిని ఏర్పాటుచేసిరి. క్రీ. శ. ౧౮౮౪ లో జిల్లాలలో మొత్తము ౧౨౫ ముల్కీభాషల పాఠశాలలను నెలకొల్పియుండిరి.

## ఉస్మానియావిద్యాపీఠస్థాపన

అటు తర్వాత మెల్ల మెల్లగా ఉర్దూ ప్రారంభమయ్యెను. కాని ౧౯౧౭-వ సంవత్సరమువరకు దానికి ప్రాధాన్యత లేక పోయెను. క్రీ. శ. ౧౯౧౭ లో సర్ అక్బర్ హైదరీగారు హైద్రాబాదురాష్ట్రి విద్యావిధానములో మార్పు కావించుటకై ప్రభుత్వమువారికిని, మ. ఘ. వ. శ్రీ నైజాం ప్రభువుగారికిని ఒక జ్ఞాపిక (Memorandum) పంపుకొనిరి. అందిట్లు సెలవిచ్చిరి:

"పరభాషలోని బోధవలన చాలా లోపములు కలుగును. విద్యార్థుల మెదడుపై అధికమైనట్టియు, అనవసరమైనట్టియు భారము కలుగును. పరభాషలో విద్య చెప్పించిన బాలురు విషయగ్రహణశక్తులుగా నుండరు. పరభాషలోని చిక్కులను స్వాధీనపరచుకొనుటలో వారి స్వతంత్రబుద్ధి నష్ట మగును. ఉర్దూలో విద్య నేర్పిన రెండు ఆక్షేపణలు కలుగ వచ్చును. రాష్ట్రిములో ప్రజాబాహుళ్యము ఇతర భాషలను మాట్లాడును. ఉర్దూలో పాఠ్యగ్రంథాలు లేవు. మొదటిదానికి సమాధాన మేమన ఉర్దూ మాతృభాషగా కలవారు అల్పసంఖ్యాకు లనుట నిజమే. అయినను ఉర్దూభాష రాష్ట్రముయొక్క విజ్ఞానసంబంధముకల భాష, మరియు కచ్చేరీభాషయు అయియున్నది. ఇంతే కాక ఉర్దూభాష శిష్టజనుల భాషయు అయి యున్నది.

**(Although it is true that those whose mother tongue is Urdu, are in a minority yet Urdu is the cultural and official language of the state and of polite society)."**

సర్ హైదరీగారి అభిప్రాయప్రకారము క్రీ. శ. ౧౯౧౮ లో ఉస్మానియావిద్యాపీఠము స్థాపింపబడెను. దాని స్థాపనతో మాధ్యమికోన్నత పాఠశాలలలోను, కళాశాలలలోను ఉర్దూలోనే విద్య చెప్పించుట మొదలయ్యెను. ప్రైమరీతరగతులలోను మూడవ తరగతినుండియే ఉర్దూబోధ మొదలయ్యెను. ముల్కీభాషలకు స్థానము లేకపోయెను. ఉర్దూద్వారా విద్యచెప్పుటకు పాఠ్యగ్రంథాలవసరమయ్యెను. అందుచేత ఒక తర్జుమాకచ్చేరీ ఏర్పాటుచేసిరి. దానిలో ౨౦ ఏండ్లు కష్టపడి ౨౦ లక్షలు ఖర్చుపెట్టి ౨౦౦ తర్జుమా గ్రంథాలను అచ్చుకొట్టిరి. క్రొత్త శబ్దజాలమును సృష్టించుటకై కొందరు విద్యాధికులు నియుక్తులైరి. వారు ఏటేట సుమారు ౫౦౦౦ నుండి ౧౦౦౦౦ వరకు ఇంగ్లీషుపదాలకు క్రొత్త ఉర్దూసాంకేతిక పదములను, ఇతరపదములను సృష్టిచేసిరి. ఈవిధముగా ఉర్దూవాఙ్మయము అభివృద్ధి అయ్యెను. ముల్కీభాషలలో ఒకగ్రంథమైనను అచ్చుకాలేదు; ఒక క్రొత్తపదమైనను సృష్టికాలేదు. ఈకారణము చేత ఉర్దూ మాతృభాషకానివారి విద్య పూర్తిగా వెనకబడెను.

## న్యాయమూర్తి నాయకుగారి విమర్శ

ఇట్టి విద్యావిధానమువలన హిందువుల కెట్టి నష్టముకలిగెనో, దానినిగురించి బ్యారిష్టర్ రామచంద్రనాయక్ గారు (ఇప్పుడు వీరు హైద్రాబాదు ప్రభుత్వపు హైకోర్టులో న్యాయమూర్తి (జస్టిస్) గా ఉద్యోగము చేయుచున్నారు.) క్రీ. శ. ౧౯౩౧ లో హైద్రాబాదులో రాజకీయసభ చేయుటకు ప్రభుత్వమువారు సెలవియ్య నందున, బీరారులోని అకోలా అను పట్టణములో జరిగిన హైద్రాబాదుసంస్థాన రాజకీయమహాసభకు అధ్యక్షత వహించి తమ ప్రారంభోపన్యాసములో ఈ విధముగా తమ అభిప్రాయమును ప్రకటించిరి:

"ప్రభుత్వమువారు ఏటేట ౭౦లక్షల రూపాయీలను విద్యకై వ్యయము చేసినను (ఇది ౧౯౩౧ నాటి మాట) విద్య వచ్చినవారు వేయింటికి ౩౫మంది మాత్రమే. అత్యధికసంఖ్యాక ప్రజల భాష ఉర్దూ కాకున్నను ఉర్దూద్వారా ఉస్మానియావిద్యాపీఠములో విద్య చెప్పించుటలో ఎక్కువద్రవ్యము వ్యయముచేయుచున్నారు. అందులోను ఎక్కువద్రవ్యము నగరములోనే పెద్దపెద్ద జీతాలకు, బంగ్లాల అద్దెలకు, గ్రంథాల తర్జుమాలకు, మున్నగువాటికై వ్యయము చేయుచున్నారు. బీదలకన్న ధనికుల పిల్లలకే ఉపకార వేతనాలు ఎక్కువగా ఇచ్చుచున్నారు. విదేశాలలో బ్యారిష్టరీలను మున్నగు వాటి నభ్యసించువారికి ద్రవ్యము ఎక్కువగా ఇచ్చుచున్నారు. ప్రాథమికపాఠశాలలలో మాతృభాషలలో సరిగా విద్యచెప్పించరు. ఇది యిట్లుండగా ప్రజలే ప్రైవేటుబళ్లను స్థాపించుకొనిన వాటిపై ఆంక్షలు, నిర్బంధాలు పెట్టి విద్యావ్యాప్తి కాటంకములు కలిగించుచున్నారు. ఉర్దూరాని బాలికలకు రాష్ట్రిములో ఒక్క ఉన్నత పాఠశాల యైనను లేదు. లార్డుఇర్విన్ వైస్రాయిగారు "విద్యను

# టి. సి. యన్. గోల్డెన్ నగలే

**స్త్రీల కన్నివిధాల అలంకారానికి తగియున్నవి.**

2 సంవత్సరములు గ్యారంటీ. కాంతిలోను వన్నెలోను బంగారునగలకు తీసిపోవు. నలుపెక్కవు.




**గాజుల జతలు.**

పెద్ద సైజు.

2 అం॥ మొదలు
పైబడినవి జత 1-కి రు. 3-0-0

మధ్యమ సైజు.

$1\frac{3}{4}$ అం॥ మొదలు
2 అం॥లకులోగా జత1-కి ,, 2-8-0

బేబీ సైజు.

$1\frac{3}{4}$ అం॥లకు లోబడినవి ,, 2-0-0
వి. పి. ఖర్చు 1 జత మొదలు
6 జతలవరకు 0-8-0

**మొడ గొలుసులు.**

పెద్ద సైజు.

| | | |
|---|---|---|
| 1 పేట 1-కి | రు. | 7-0-0 |
| 2 పేటలు | ,, | 14-0-0 |
| 3 పేటలు | ,, | 21-0-0 |
| 4 పేటలు | ,, | 28-0-0 |

చిన్న సైజు.

| | | |
|---|---|---|
| 1 పేట 1-కి | ,, | 5-0-0 |
| 2 పేటలు | ,, | 10-0-0 |
| వి. పి. ఖర్చులు | | 0-8-0 |




**మా చక్కని బొమ్మల కేటలాగు ఉచితము.**

షరా:—మీరు వ్రాసే ఆర్డర్లపై "ఆంధ్ర ఉగాదిసంచిక" పేరు ఉదహరించిన మా ధరలమీద రూ. కు 1 అణా తగ్గింపబడును.

## టి. సి. నాగలింగప్ప అండ్ కో.,

నెం. 280, వాల్టాక్సు రోడ్, పార్కు టౌన్ పోస్టు, మద్రాసు.

ఏజంట్లు: కె. వి. రమణమూర్తి, తెనాలి. ఎస్. ఎస్. గుప్త, జనరల్ ఏజంట్లు, మడకసిరా.

---

మీ జీవితమునకు,
మీ గృహమునకు,
మీ మోటారుకారుకు,
హామీ నిచ్చునది

# నేషనల్ ఇన్సురెన్సు కంపెనీ, లిమిటెడ్.

అండ్

# నేషనల్ ఫైర్ అండ్ జనరల్ ఇన్సురెన్సు

## కంపెనీ, లిమిటెడ్,

హెడ్డాఫీసు:— కలకత్తా.

నేషనల్ బిల్డింగ్సు: ఎస్ప్లనేడు, మదరాసు.

ప్రజలందరికిని ఉపయోగకారిగా ఉండునట్లు చేయవలెను" అని చెప్పి పోయిరి. కాని, యింతవరకు ప్రభుత్వమువా రేమియు చేయక పోయిరి."

బ్యారిస్టరులును, జాగీర్దారులును, ఉదారులును, ప్రజానాయకులలో ముఖ్యులుగా నుండినట్టివారును, ఇప్పుడు ఉన్నత న్యాయస్థాన న్యాయమూర్తులును అయిన శ్రీయుత రామచంద్రనాయక్ గారిచ్చిన పైఅభిప్రాయమువంటి అభిప్రాయములనే ప్రతిహిందూ నాయకుడును ప్రకటించుచు వచ్చినాడు. నూటికి ౧౦మంది మాతృభాషయైన ఉర్దూభాషను దాని నెరుగనట్టి నూటికి ౯౦మందిపై మోపుటవలన, ఎంతద్రవ్యము వ్యయముచేసినను విద్యావ్యాపకము కాకపోవుట కనబడుచునేయున్నది.

## కాంగ్రెసువాదము

బ్రిటిషుఇండియాలో కాంగ్రెసువారు హిందీకి ప్రాముఖ్యత ఇచ్చుచున్నారుకదా, మరి హైద్రాబాదు రాష్ట్రములోను హిందీకి ప్రత్యామ్నాయ మైన ఉర్దూను ప్రవేశపెట్టితే ఏల యాక్షేపించవలెను అని కొందరు తలపవచ్చును.

కాంగ్రెసువారి హిందీ సులభభాషగానుండు ఆదర్శభాష. ఇచ్చటి ఉర్దూలో ఫార్సీ, అరబ్బీ పదములు నూటికి ౭౫ కన్న హెచ్చుగా నుండి, అతికఠినభాష యైపోయినది. లిపికూడ నాగర లిపి కాదు. అది ఫార్సీలిపి యైయున్నది. హిందువులకును, నాగర లిపికిని సన్నిహితసంబంధ మున్నది. ఉర్దూలిపి నేర్చుకొనిన మరల నాగరలిపి నేర్చుకోవలసి వచ్చును. కాంగ్రెసువారు పాఠశాలలలో మాతృభాషల స్థానములో హిందీని పెట్టి మాతృభాషలకు ద్వితీయైచ్ఛికస్థానమో, లేక తదభావమో ఏర్పాటు చేయవలెనని ప్రచారము చేయలేదు. ప్రాథమిక పాఠశాలలలో రెండవ తరగతి పూర్తియగువరకు మాతృభాషలలో చదివి,మూడవతరగతిలో ఉర్దూ మొదలుపెట్టి,అనగా ఉర్దూకొరకు మరల 'అలిఫ్బే' తరగతి నుండి ప్రారంభించి తర్వాత అంతయు ఉర్దూలోనే చదువుటకై కాంగ్రెసువారు ప్రచారము చేయలేదు. చేసినచో వారిమాట యెవ్వరును వినరు. హిందీని నిర్బంధద్వితీయభాషగాను, అదియు ఉన్నత పాఠశాలలలోను, అదియు పరీక్షాపేక్ష లేకుండునట్లుగాను మద్రాసు రాజధానిలో కాంగ్రెసుమంత్రులు ప్రవేశపెట్టగా, దానికై ఆందోళనము జరిగినది మద్రాసీసోదరులకు నిన్నమొన్నటి యనుభవమే కదా. అయితే హైద్రాబాదులోని నాయకులు ఉర్దూను పూర్తిగా ఎత్తివేయుటకై ఆందోళనము చేయుటలేదు. ఉర్దూను ఉన్నతపాఠశాలలలో నిర్బంధ ద్వితీయభాషగా ఏర్పాటు చేయుట కంగీకరింతురు. అట్లంగీకరించినను ముల్కీభాషలకు స్థాన మేమియు లభింపనందున ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకుల భాషాసంస్కృతియు, మతసంస్కృతియు, విజ్ఞానసంపదయు దైనందినక్షైణ్యమును పొందుచున్న వని మా నాయకుల అభిప్రాయమై యున్నది.

## స్త్రీవిద్య

ఇదివరలో చూపిన అంకెలనుబట్టి ఉర్దూ మాతృభాషగా కల స్త్రీలలో చదువువచ్చినవారు ౨౬ వేలకుపైగా ఉండుటయు,ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక స్త్రీలలో ౧౫ వేల స్త్రీలే యుండుటయు చూచినచో ఈ ఉర్దూవిద్యావిధానమువలన హిందూస్త్రీల కెంతటి తీర్పరానినష్టము కలిగినదో తెలియగలదు. ముస్లింస్త్రీలకన్న హిందూస్త్రీల సంఖ్య ఇంచుమించు పదంతలైనను హిందూస్త్రీలలో విద్యావ్యాపకము ముస్లింస్త్రీలకన్న తక్కువగానే యున్నది. రామచంద్రనాయకుగా రన్నట్లుగా మొత్తము రాష్ట్రములో ముల్కీభాషలలో ఒక ఉన్నత పాఠశాలయైనను ప్రభుత్వమువారు స్థాపించకపోయిరి.

హిందూస్త్రీలకు ప్రాథమిక, మాధ్యమిక తరగతులలో ఉర్దూ బొత్తిగా అవసరము లేదు. వారికి హిందీని ద్వితీయైచ్ఛికభాషగా ఉన్నతతరగతులలో నేర్పిన నేర్పవచ్చును. కాని ఆందోళనము చేయగాచేయగా; ఇప్పుడు హైద్రాబాదు ప్రభుత్వమువారు మాధ్యమికతరగతులలో స్త్రీలకు మాతృభాషలలో చదువుచెప్పించుటకు ఒకదిక్కు సెలవిచ్చుచు, ఇంకొకదిక్కు వారికి ఉర్దూను నిర్బంధద్వితీయభాషగా నేర్పవలెనని శాసించినారు. అటుతర్వాత పైతరగతులలో అంతయు ఉర్దూలోనే విద్య చెప్పించుచున్నారు. వీరికి కలిగిన నిర్బంధద్వితీయపాండిత్యముతో పై ఉన్నతతరగతులలో సంపూర్ణ ఉర్దూబోధను వీ రేమి గ్రహించుకొనగలరో ఊహింప శక్యము కాదు.

## ఖాన్గీబళ్లు

సొంతబళ్లను, లేక ప్రైవేటుబళ్లనే ఖాన్గీబళ్లు అని యందురు. ఇంతవరకు ఉర్దూవలన కలిగిన అపారనష్టమునుగురించి చర్చింపబడెను. ఇక ఖాన్గీబళ్ల ముచ్చటను తెలిసికొనవలెను. ౧౩౩౮ ఫసలీలో, అనగా ౧౬ ఏండ్లక్రిందట విద్యాశాఖవా రొక విచిత్రమగు ఆజ్ఞను ప్రకటించిరి. అందలి ముఖ్యవిశేషము లేవనగా—

౧. విద్యాధికారుల సెలవు లేనిది ఇకముం దెవ్వరును ఖాన్గీబళ్లను స్థాపించగూడదు.

౨. సొంతముగా స్థాపించుకొన్న ఖాన్గీబళ్లలో అన్నికులాల వారియొక్కయు, అన్నిమతాలవారియొక్కయు పిల్లల కాటంకము లేకుండ ప్రవేశమునకు అధికార ముండును.

3. అధికారుల సెలవు లేక సొంతబళ్లను స్థాపించినట్లైన కలెక్టరుగాని, లేక పోలీసుకమిషనరుకాని వాటిని మూసివేయించగలరు.

ఇట్టి ఆజ్ఞవలన ఏమి ఫలితము తేలిన దనగా—౧౩౩౩ ఫసలీలో, అనగా యీ ఖాన్గీబళ్ల ఆజ్ఞ యనుట కొకసంవత్సరము ముందుండిన స్థితి ఆజ్ఞఅయిన తొమ్మిదేండ్లతర్వాత ఎట్లు పరిణమించెనో యీక్రింది అంకెలే తమ కథను వెల్లడించుచున్నవి:

| | ఖాన్గీబళ్లసంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| ౧౩౩౩ ఫసలీలో నిర్బంధాజ్ఞ కొకసంవత్సరము పూర్వము | ౪౦౫౩ | ౭౬౬౫౪ |
| ౧౩౪౨ ఫసలీలో ౯ ఏండ్లతర్వాత | ౭౭౬ | ౨౭౫౦౬ |

ఈ విధముగా విద్యావ్యాపకముపై గొప్ప నిరోధము కలుగునని నిర్బంధాజ్ఞ అయిన నాటినుండియు నేటివరకును ప్రజలును, నాయకులును ఆందోళనము చేయుచువచ్చినను, దాని నింతవరకు ఉపసంహరించుకొనకపోయిరి.

## జాగీర్లలో విద్య

హైద్రాబాదురాష్ట్రములో నూటికి ౪౨ పాళ్ల భూభాగము జాగీరులు, పాయిగాలు, సంస్థానములు అనువానిచే నిండియున్నవి. ఈ భాగములోని విద్యాస్థితి అత్యంత ఘోరముగా ఉన్నది. పాయిగాలు అనగా మిలిటరీ (సైన్య) భృతికై ప్రత్యేకింపబడి పూర్వపు నిజాంప్రభువుల బంధువుల కియ్యబడిన సంస్థానములు. పాయిగాలును, సంస్థానములును జాగీరువర్ణనలో చేరును. జాగీర్దారులు తమ ఇలాఖాలలో పన్నులను నిజాంయిలాఖాలోని పన్నులకన్న హెచ్చుగా విధించి వసూలు చేయుచుందురు. అనేక జాగీర్లలో అక్రమమైన పన్నులుకూడ వసూలు చేయబడుచున్నవి. ఈ విధముగా ఆదాయములో ఏ మాత్రమును లోపము లేకున్నను, వ్యయములో మాత్రము జాగీర్దారులలో ఉదారత ఏమియు కానరాదు.

పాయిగాలలో ఎచ్చటను ఒక ఉన్నత పాఠశాల లేదు. కొన్ని ప్రాథమిక పాఠశాలలుమాత్రమున్నవి. ఉపాధ్యాయులకు చాలామందికి నెలకు మూడు రూపాయీల జీతము లభించును. ఖుర్షీద్జాహీ పాయిగాలో ౩౮౭ గ్రామాలు కలవు. దాని సంవత్సరాదాయము ౨౧ లక్షలరూపాయీల కన్న హెచ్చు. అచ్చటి విద్యాలయా లన్నింటికిని ఏటేట కష్టపడి ౩౬౦ రూపాయీలు వ్యయము చేయుచున్నారు. ఈ మొత్తము కూడ పాయిగాలో కాక హైద్రాబాదులోని ఒక పాఠశాలకిచ్చుచున్నారు. ఈ పాయిగాలో లోకల్ఫండుపేర ౯౨ వేలకు పైగా వసూలు చేయుచున్నారు. కాని విద్యకై అందులోనుండి ౧౪ వేలు వ్యయము చేయుచున్నారు.

విఖారుల్ ఉమ్రా పాయిగా అనున దింకొకటి కలదు. అందును ౩౮౭ గ్రామాలు కలవు. దాని సంవత్సరాదాయము ౨౨ లక్షలు. లోకల్ఫండుపేర ౭౭ వేలు వసూలు చేయుచున్నారు. పన్నుల ఆదాయమునుండి విద్యకై ఒక దమ్మిడీకూడ ఇచ్చుటలేదు. లోకల్ఫండునుండిమాత్రము ౧౩ వేలు ఇచ్చుచున్నారు.

ఆస్మాన్జాహీ అనునది మూడవ పాయిగా. అందు ౩౯౫ గ్రామాలు కలవు. సంవత్సరాదాయము ఇంచుమించు తక్కిన రెండు పాయిగాలంత కలదు. ఇచ్చట ౧ లక్షకు మించిన లోకల్ఫండునుండి ౨౩ వేలు మాత్రమే విద్యకై వ్యయము చేయుచున్నారు.

గద్వాలసంస్థానములో ఇప్పుడొక ఉన్నతపాఠశాల కలదు. అచ్చట సంవత్సరానికి ఇంచుమించు ౧౦ వేల రూపాయీలు విద్యకై వ్యయము చేయుచున్నారు.

వనపర్తిసంస్థానములోను ఇప్పుడొక ఉన్నతపాఠశాల కలదు. అచ్చట ఇంచుమించు ౨౦ వేలు ప్రతిసంవత్సరము విద్యకై వ్యయము చేయుచున్నారు.

ఈరాష్ట్రములో చిన్నవి, పెద్దవి కలసి ౧౫౦౦ వరకు జాగీరులు కలవు. అనేకజాగీర్లలో జాగీర్దార్లచే నడిపింపబడు పాఠశాలలు లేవు. ఇట్టి జాగీర్లలోని పరిస్థితులమూలమున, మొత్తము రాష్ట్రములో విద్యావ్యాపకముయొక్క లెక్కలను గుణించునప్పుడు విద్యావ్యాప్తి తక్కువగా కనబడుచుండుటచే, రాష్ట్రమున కంతకును అపకీర్తి కలుగుచుండును. ఈయభిప్రాయమును ప్రభుత్వపు విద్యాశాఖవారే తమనివేదికలో వెల్లడించియున్నారు.

## మతవిద్య

ఉస్మానియా విద్యాపీఠ మేర్పడినతర్వాత ముసల్మానులలో సున్నీలకు ఇస్లాంమతవిద్య నిప్పించుటకును, షియాలకును, హిందువులకును, ఇతరమతస్థులకును నీతిబోధ చెప్పించుటకును ఏర్పాటు చేసిరి.

హిందూవిద్యార్థులలో దీనిపై అసమ్మతి యుండినట్లు కనుపించుచున్నది. అందుచేతనే రెండేండ్లక్రిందట వందేమాతరంగానమును ఉస్మానియాకళాశాలలోని హిందూవిద్యార్థులు తమకై ప్రత్యేకించిన హాలులో పాడుకొనగా, ప్రభుత్వమువారు దానిని నిషేధించుటచేత హిందూవిద్యార్థులు సమ్మెకట్టిరి. ఆసందర్భములో వారు తమకుండు యిబ్బందుల నిట్లు ప్రకటించిరి:

౧. కళాశాలయొక్క హాస్టలులో (ఛాత్రగృహములో) హిందూవిద్యార్థులు షేర్వానీలాగులతో భుజించవలె ననుట.

౨. కళాశాలలో హిందూవిద్యార్థులును యూనిఫారంపేర లాగు పచ్చషేర్వానీ ధరించవలె ననుట.

౩. హిందూవిద్యార్థులకు మతవిద్య చెప్పించు ఏర్పాట్లు లేకపోవుట.

౪. ఉర్దూ నిర్బంధము ఎక్కువై తమ మాతృభాషలకు స్థానము లేకపోవుట.

ఈ విషయాలననుసరించి వారు ఆందోళనముచేసి, నాగపూరు విద్యాపీఠ కళాశాలలలో చాలమంది చేరిరి. తుదకు ఏదో పరిష్కారము చేయుదు మని ప్రభుత్వమువారు నచ్చచెప్పిరి కాని యింతవరకు ౩, ౪ విషయములలో మార్పులేమియు చేయలేదు. ఉస్మానియావిద్యాపీఠములో ఇస్లాంమతమునకై బి.ఏ.,ఎం.ఏ. డిగ్రీలను ప్రత్యేకముగా ఏర్పాటుచేసినారు. దీనినే వారు Faculty of Theology అని యందురు. ఉస్మానియావిద్యాపీఠములో మతవిద్యకు ప్రాధాన్యత నిచ్చుట మంచిపరిణామమును కలిగించ దని తోచుచున్నది. హిందూముస్లిముల ఐకమత్యమునకు మారుగా వారిలో విభేదాలకు తావిచ్చును.

ఈపీఠములో ఇంకొక విశేష మేమనగా, విద్యార్థుల కేర్పాటు చేయు గ్రంథములలో ఇస్లాంమతమునకు విరుద్ధమగు నంశములేవియు లేవుకదా అని పరిశోధించుటకై ముస్లిముసభ్యులు కల ఒక వర్గము (బోర్డు) నియోగింపబడియున్నది. హిందూమత విరుద్ధముగా ఏమియు లేదుకదా అని పరిశోధించుట కేహిందూబోర్డును నిర్ణయింపబడలేదు.

## మెకంజీ విధానము

ఆరుసంవత్సరముల క్రిందట హైద్రాబాదు రాష్ట్రవిద్యా పద్ధతిలో మార్పులు చేయుటకై డాక్టర్ మెకంజీ అను ఇంగ్లీషుపండితులు నియమింపబడిరి. వారొక కమిటీని ఏర్పాటుచేసి హిందూ ముస్లిం ప్రజాప్రముఖుల అభిప్రాయములను, సాక్ష్యములను కైకొనిరి. ఆసందర్భములో వారు కొన్ని బహిరంగోపన్యాసము లిచ్చిరి. అందొక యుపన్యాసములో విద్యార్థులకు తమతమ మాతృభాషలలో (వర్నాక్యులర్ లో) విద్య చెప్పించవలెనని వా రభిప్రాయ మిచ్చిరి.

ఈయభిప్రాయములను వినినవెంటనే హిందువులలో ఒక గొప్ప సంచలనము కలిగెను. మెకంజీదొరవారు చేయనున్న మార్పులో ఇదొక ముఖ్యమైన మార్పుగా ఉండుననియు, ఇకముందు హిందువులకును విద్యాలాభమును పొందుటకు మంచి అవకాశములు కలుగ నున్నవనియు, విద్యాసంబంధమున కల ఆటంకము లన్నియు తొలగిపోవు ననియు హిందువు లభిప్రాయపడిరి.

మెకంజీ కమిటీ విచారణ పూర్తియయ్యెను. ఆ నివేదిక పూర్తిగా ఆశాభంగమును కలిగించెను. జనుల మాతృభాషలకు పూర్వముండిన స్థితిలో మార్పేమియు కలుగకపోయెను. గతసంవత్సరము నుండియు మెకంజీ (స్కీము) విధానమును రాష్ట్రములో ప్రవేశపెట్టుచున్నారు. పల్లెటూరిబళ్లు, పట్టణవాసముబళ్లు అను భేదము తప్ప మరే విశిష్టతయును ఇందు కానరాదు. ముల్కీ భాషలలో ఉన్నతవిద్య చెప్పించుటకై ప్రత్యేకముగా బళ్ల నేర్పాటు చేయుటకు ప్రభుత్వకోశములో ద్రవ్యము లేదని, ఆవిధానమును నిరాకరించిరి. మెకంజీ విధానమును గురించి ప్రత్యేకముగా చర్చించవలసియుండును. అందుచేత ఇచ్చట సూచనమాత్రము చేయబడినది.

## నిజాముకాలేజీ

హైద్రాబాదు నగరములో నిజాము కాలేజీ అనునది కలదు. అది ఉస్మానియా విద్యాపీఠము ఏర్పడిన కాలమునకన్న పూర్వము బహుకాలమునుండి పనిచేయుచున్నది. అది మద్రాసు విద్యాపీఠముతో సంబంధము కలిగి, అచ్చటి విద్యాపద్ధతి ననుసరించుచున్నది. దానిని తీసివేయవలె నని మెకంజీవిధానము ఏర్పడుకాలములో కొన్ని ఆలోచనలు జరిగెను. ఆసందర్భములో పెక్కుమంది దానిని తీసివేయకూడ దని అభిప్రాయ మిచ్చిరి. ఎట్లైతేనేమి అది తీసివేయబడలేదు. ఈ నిజాముకాలేజీ పరిస్థితులనుండి కొన్ని విశేషములు తెలుసుకొనవచ్చును. జనవరి ౧౯౪౧ లో దాని వార్షికోత్సవసందర్భములో ప్రిన్సిపాలుగారు కొన్ని అంకెలను వెలిబుచ్చిరి.

అందిపుడు మొత్తము ౩౪౦ మంది విద్యార్థులు ఉన్నారు. వారిలో హిందువులు ౨౦౩ మందియును, ముసల్మానులు ౧౩౭ మందియును, ఇతరులు ౪౫ మందియును ఉన్నారు. ఉస్మానియా విద్యాపీఠములోని కళాశాలలో ముసల్మానువిద్యార్థు లెక్కువగాను, హిందూవిద్యార్థులు తక్కువగాను ఉన్నారు. కాని నిజాము కాలేజీలో హిందూవిద్యార్థు లెక్కువగాను, ముసల్మాను విద్యార్థులు తక్కువగాను ఉన్నారు. ఇంకను ఏటేట సుమారు ౨౦౦ మందికి తావు లేదని నిరాకరించుచున్నారు. నిజాంకాలేజీలో ౩౦౦ మందికన్న ఎక్కువమందిని చేర్చుకొనరాదని విద్యాశాఖవారు శాసించియున్నారు. ఇంకొకవిశేష మేమన హిందూ క్రైస్తవ స్త్రీలే విశేషముగా నిజాము కాలేజీలో చదువుచున్నారు. స్త్రీలకై ప్రత్యేకముగా ఉస్మానియా విద్యాపీఠమువారు కళాశాలను స్థాపించినారు. అందు హిందూస్త్రీలు కానరారు. మెకంజీవిధానము ఏర్పాటైనతర్వాత ఇంగ్లీషులో ప్రధానముగా బోధించుచుండిన ఉన్నతపాఠశాలల సంఖ్యయు తగ్గించబడు చున్నది. అందుచేత రానురాను నిజాముకాలేజీకి విద్యార్థులు పోవుటయు తక్కువ కావచ్చును.

## ముగింపు

ఈ చర్చయంతయు ఉస్మానియావిద్యాపీఠమును నిరసించుటకుగాని, లేక దాని ప్రతిష్ఠకు భంగము కలిగించుటకుగాని చేసినట్టిది కాదు. నిరసనము పొందిన ముల్కీభాషలకును స్థాన ముండవలెననియు, అట్లుండినచే విద్యావ్యాపకము కలిగి జనులు వృద్ధికి వత్తురనియు, ప్రాచీనములైన ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక భాషలకును చరిత్ర, సంస్కృతి, విజ్ఞానములు కలవనియు, పైమూడింటికి విద్యావిధానములో స్థానము లేకుండిన వాటి మూలసంస్కృతికే ముప్పు

వాటిల్లుననియు ఎత్తిచూపించుటయే దీని ముఖ్యోద్దేశము. ఉర్దూను ప్రతిఘటించు హిందువులు నిజాంరాష్ట్రములో లేరు. తమ మాతృభాషలను ప్రేమించుట ఉర్దూవారికివలెనే ఇతర మూడుభాషల వారికిని సహజ మనుట గమనించవలసియుండును. మరి మాతృభాషలలో బాలబాలికలకు విద్యచెప్పించుట ప్రపంచమందంతటను ప్రకృతిసిద్ధమైన పద్ధతిగా ఉన్నది. ముస్లింవిద్యార్థికి ఉర్దూ ఒకటి మాత్రము నేర్చుకొనవలసియుండును. అది అతని మాతృభాషయే యగుటచేత కష్టరహితమైనది. హిందూవిద్యార్థికి తన మాతృభాషను నేర్చుకొనవలెను. తనకు మతవిద్య చెప్పించనందున సంస్కృతలిపిని, భాషను నేర్చుకొని మతవిద్యను తానే తనకు తోచినట్లు నేర్చుకొనవలెను. సర్కారీభాష కావున ఉర్దూ నేర్చుకొనవలెను. తన కిష్టమున్నను, లేకపోయినను సర్కారీబళ్లలో అదే చదువవలసి వచ్చును. అవే సర్కారీబళ్లలో ఇంగ్లీషుకూడా బోధించుచున్నారు. కావున అదియు నేర్చుకొనవలెను. లేతవయస్సులోనే ప్రాథమిక తరగతులనుండియే ఇన్నియిబ్బందులకులోనై అమాయకులైనట్టియు, అజ్ఞులైనట్టియు హిందూబాలబాలికలు పరభాషలలో ఏమి తెలివి సంపాదించగలరు? ఏమి అర్థము చేసుకొనగలరు? అందుచేత సహజముగా వారిలో విద్యావ్యాప్తి యేమాత్రమును అగుటలేదు.

పూర్వము మొగలాయీరాజు లెందరో ఈ దేశములో రాజ్యాలు చేసినారు. వారి కాలములో దేశభాషలకు పలుతావుల ప్రోత్సాహము కలిగెను. బెంగాలులో బెంగాలీ సాహిత్యమునకు బెంగాలు నవాబులు దోహదమిచ్చిరి. జాన్పూరునవాబులు అవధీ భాషను (అయోధ్యాభాషను) ప్రోత్సహించుటయే కాక మలిక్ మహమ్మద్ జయాసీ అనునతడు ఆ భాషలో మొదటి ప్రామాణిక కవి యని పేరుకొంచినాడు. క్రీ. శ. ౧౫-వ శతాబ్దములోని ఒక జాన్పూరు నవాబు మహాభారతమును, భాగవతమును సంస్కృతము నుండి బెంగాలీభాషలోనికి తర్జుమా చేయించి బెంగాలీభాషను పోషించెను.

బిజాపూరుసుల్తాను అయిన యూసఫ్ ఆదిల్షా తనకచ్చేరిలో అంతవర కుండిన ఫార్సీని తీసివేసి, తనరాజ్యములోని బహుళ జనులచే మాట్లాడబడు మరాటీభాషను తనకచ్చేరీభాషగా నిర్ణయించెను. గోల్కొండ కుతుబ్షాలు కొందరు తెనుగును బాగుగా ప్రోత్సహించిరి. వారును, వారి ముసల్మాను సేనానులును తెనుగుకవులను పోషించిరి. కొందరు కృతుల నందిరి. ఇబ్రహీంకుతుబ్షాకు అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యానమును అంకిత మిచ్చెను. ఇబ్రహీంకుతుబ్షా స్వయముగా తెనుగు బాగా మాట్లాడి, తెనుగుకవితను స్వయముగా అర్థము చేసుకొను విజ్ఞానము కలవాడై యుండెను. అతడు తెనుగుకవిత్వముకూడ చేసె నందురు. వారిపద్యమొక్కటైనను ఇప్పుడు దొరకినచో అదెంతటి సాధారణపద్యమైనను, ఆంధ్రులు దాని కెంతటి అగ్రస్థాన మిత్తురో ఆ విషయము ఆంధ్రహృదయమునకే యెరుక. హైదరలీ సుల్తాను కన్నడములో బాగుగా మాట్లాడుచుండెను.

ఈ విధముగా పూర్వము ముస్లింసుల్తానులు దేశభాషలకు ప్రాముఖ్యత నిచ్చి ప్రజాప్రేమను చూరగొనిన నిదర్శనములు పరిశోధకులకు వెతికినకొలదియు దొరకగలవు.

మ. ఘ. వ. నిజాము ప్రభుత్వమువారును ప్రజానురంజకముగా పాలించు అభిమానము కలవా రనుటలో సందేహము లేదు. కాని ప్రభుత్వమునకు ఆలోచనలు చెప్పువారిలో భావపరివర్తన మవసరముగా ఉన్నట్లు తోచుచున్నది. హైద్రాబాదుప్రభుత్వమువారితో హిందువులు లార్డు ఇర్విన్ వైస్రాయిగారు చెప్పిన యీ వాక్యమునే మనవి చేసుకొనుచున్నారు:

"ఉస్మానియావిద్యాపీఠముపై ముసల్మానుప్రజల కెంతటి గాఢమగు అభిమానము కలదో, అంతటి అభిమానము హిందూప్రజలకును కలుగునట్లు చేయుటయే ఉత్తమరాజనీతియై యుండును.

(It will be a task of mature statesmanship, so as to shape the policy of the Osmania University that it may have as strong an appeal to the Hindu as to the Mohammadan subjects of your state)"



## నెలకు రూ॥ 100 సంపాదించుడు.



అందమైన క్రొత్త ఆకారము రు. 4/4 స్విట్జర్లెండునుండి నేరుగా తెప్పించినందున ఇతరులచే రు 9 లకు అమ్మబడువాటిని మేము 4/4 కు సప్లయి చేయగల్గుచున్నాము. ఆశాభంగము కలుగకుండుటకు త్వరగా ఆర్డరు పంపుడు. 3 సం॥ గ్యారంటీ. ఒకేసారి మూడు కొనిన పోస్టేజి ఉచితము.

H. DAVID & CO.,
Post Box No. 11424, Calcutta.

## లివర్ రిస్టు వాచ్ రు. 3-12-0



10 సం॥ గ్యారంటీ. గట్టిది, గుండ్రనిది, చదరము 3/12 మంచిది 4/4 బొమ్మలో ఉన్నమాదిరిది 4/12 గోల్డ్ 5/0. రేడియం 5/8, రోల్డుగోల్డు 6/8, మేలరకములు రు. 8-8-0, రు. 10-8-0, పోస్టేజి ప్యాకింగు అ. 10 3 గడియారములు కొనిన పోస్టేజి ఉచితము.

PIONEER WATCH CO.,
Post Box No. 11428, Calcutta.

## బాక్సు, మడత కెమేరా.



ఎక్కువపవగున్న లెన్సు. సెకండులో క్రొత్తవారు కూడ అందమైన చిత్రములను తీయవచ్చును. నిరుద్యోగులు దినమునకు 5 రూ॥ సంపాదించుకొనవచ్చును. పూర్తిపరికరములు ఫిల్ము, కార్డ్సు, ప్రింటింగు ఫ్రేము, డెవలపింగు కెమికల్సు, డిషెస్, వాడేవిధానము ఉచితము. బాక్సు కెమేరా నం. 2 ఖరీదు 2/4, నం. 1 రు. 3. మడతకెమేరా నం. 2 ఖరీదు రు. 3-12-0, నం. 1 రు. 4/8. ప్యాకింగు పోస్టేజి అదనము.

RELIABLE CAMERA STORES,
14-4 A, Maniktolla Street, Calcutta.

# సాధన ఔషధాలయము, ఢాకా. (బెంగాల్)



## శారిబాదిసరస (Regd) (విషనెత్తురును శుభ్రపరచు రసాయనము)

గనోరియా, సవామేహము, మూత్రకృచ్ఛ వ్యాధులు, కుష్ఠు, కామెర్లు, శ్వేతప్రదరము మొదలగు సమస్త వ్యాధులు దీనిని సేవించుటవలన కుదురును. విషనెత్తురును శుభ్రపరచి, ఆకలిని కలిగించును. సాటిలేనిదివ్యమైన ఔషధరాజము.

ఖరీదు సీసా 1-కి రు. 0-12-0.

ఆధ్యక్ష: జోగేష్ చంద్రఘోష్ (ఆయుర్వేద శాస్త్రి) ఎం. ఏ., ఎఫ్. సి. యస్., (లండన్). ఎం. సి. యస్., (అమెరికా), పూర్వము బగల్పూరు కాలేజీలో రసాయన శాస్త్రవేత్త.

మద్రాసు కేంద్రము:—
**7-A బ్రాడ్వే, మద్రాసు.**

ఆంధ్ర, నైజాము, దత్తమండలములకు సోల్ ఏజెంట్లు:—శ్రీనివాస మెడికల్ అండు ఫాన్సీమార్టు, రేపల్లె.

## ఒకనెలవరకు మాత్రమే — గడియారము 1-కి రు 4—8—0 లు.



సరిక్రొత్తమాదిరీలు, అందమగుఆకారము. ప్రతిచేతిగడియారమును 5 సం॥ గ్యారంటీ చేయబడినది. సరియగుటైమునుచూపును. ఏగడియారమైనను క్రోమియంకేసుతో రు 4-8-0. 10 సం॥ గ్యారంటీచేయబడిన రోల్డుగోల్డుకేసుతో, 4 రాళ్లుకలవి రు 6-8-0. పోస్టేజి, ప్యాకింగు ఖర్చులు అ. 10. ఏ 3 గడియారములనైన ఒకేమారు ఆర్డరుచేయుచో పోస్టుఖర్చులుచితము. ఒకేమారు ఆరింటికి ఆర్డరుచేయుచో ఒక చేతిగడియారము ఉచితము. మీరుఆర్డరుచేయు గడియారము నంబరువ్రాయండి. నచ్చకపోయిన 7 దినములలో నయినచో ధర వాపసుచేయబడును.

PARKER WATCH CO., 166, Harrison Road, CALCUTTA.

## బాక్సు, మడతకెమేరా



ఎక్కువపవగున్న లెన్సు. సెకండులో క్రొత్తవారుకూడ అందమైన చిత్రములను తీయవచ్చును. నిరుద్యోగులు దినమునకు 5 రూ॥ సంపాదించుకొనవచ్చును. పూర్తిపరికరములు, ఫిల్ము, కార్డ్సు, ప్రింటింగుఫ్రేము, డెవలపింగుకెమికల్సు, డిషెస్, వాడేవిధానము ఉచితము. బాక్సుకెమేరా నం. 2, ఖరీదు రు. 2-4-0 లు. నం. 1 రు 3-0-0లు. మడతకెమేరా నం. 2 రు 3-12-0 లు. నం. 1. రు. 4-8-0. ప్యాకింగు, పోస్టేజి అదనము.

NATIONAL TRADING CO.,
P. O. Beadon Street, Calcutta

# కాకతీయులు - దక్షిణదేశ పాలకులు



శ్రీ డా. మారేమండ రామారా



మైసూరు సమీపమున సోమనాథపుర దేవాలయము

కాకతీయాంధ్రరాజవంశము క్రీ. శ. 10 - వ శతాబ్ది అంత్యభాగమున ప్రాముఖ్యము నంది 14-వ శతాబ్ది మొదటి పాదమువరకును నాంధ్రదేశమును పరిపాలించెను. ఈవంశపురాజు లనేకసమయములలో దక్షిణదేశపరిపాలకులగు చోళ, పాండ్యవంశీయులతో యుద్ధములు చేసినట్లు వారివారి శాసనములవలన తెలియనగుచున్నది. ఆంధ్ర ద్రవిడపాలకుల ఈసామ్రాజ్యవిస్తరణప్రయత్నములలో నెల్లూరుపాలకులగు తెలుగుచోడ రాజులును ముఖ్యపాత్రను నిర్వహించిరి. ఈ కాకతీయరాజులకును, దక్షిణదేశపాలకులకును జరిగిన సంఘర్షణములను పరిశీలించుట ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

కాకతిరాజులలో మొదటివాడగు మొదటి బేతరాజు "చోళరాజుయొక్క సైన్య మను సముద్రమును మథించుటవలన సంపాదింపబడిన గొప్పఐశ్వర్యముగలవా" డని వర్ణింపబడియున్నాడు. (1) ఈరాజు వరంగల్లు జిల్లాలోని కొరవిప్రాంతమును పాలించుచుండిన ఒక చిన్న స్వతంత్రరాజు. ఇట్టి యితడు దక్షిణదేశమున కేగి చోళులతో పోరాడుట కవకాశము గన్పింపదు. అయినను ఈపోరాటుమాత్రము జరిగె ననియే చెప్పవచ్చును. క్రీ. శ. 1008 లో చోళరాజగు రాజేంద్రచోళుడు పశ్చిమచాళుక్యరాజ్యముపై దండెత్తి వచ్చి కొల్లిపాకవద్ద చాళుక్యసైన్యముల నోడించెనని యితరప్రమాణములవలన తెలియుచున్నది. (2) ఈకొల్లిపాక బేతరాజుయొక్క రాజ్యమునకు బహుదగ్గరలో నున్నది. అందువలన నీత డీకొల్లిపాక యుద్ధమున పాల్గొనియుండునని యూహింపవచ్చును. బేతరాజు కుమారుడగు మొదటి ప్రోలరాజుసామంతు డొకడు కాంచీనగ మును ముట్టడించెననియు,చోళులను జయిం ననియు రెండుశాసనములలో చెప్పబ యున్నది. (3) ఇతని సామంతుడగు రేచ బమ్మసేనాని కాంచీనగరద్వారకవాటము తీసికొనిపోయెనట. ఈ ప్రోలరాజు త యేలికయగు చాళుక్యరాజుచే అనుమకొం విషయమును బడసెను. దీనినిబట్టి చాళుక సామంతుడగు నీకాకతీయరాజు చాళుక చోళయుద్ధములలో పాల్గొని యుం నని యూహింపవచ్చును. క్రీ. శ. 1052 ల చోళులు చాళుక్య రాజ్యముపై దండె వచ్చిరి. ఆ సందర్భమున కొప్పం అ చోట జరగిన యుద్ధమునందు రాజాధిరా చోళుడు చంపబడెను. ఈ యుద్ధానంతర స్వదేశమునకు బోవుచుండిన చోళసైన మును తరుముచుబోయి చాళుక్యసేన కాంచీనగరమును ముట్టడించెను. (4) కాక ప్రోలరాజును, బమ్మసేనానియు నీచాళుక సైన్యముతో బోయి కాంచీముట్టడిల ప్రధానపాత్రను వహించి యుందురు. రాజు చక్రకూటవిషయమును నిర్వ మొనర్చెనట. క్రీ. శ. 1068 లో చోళరా వీరరాజేంద్రుడు చక్రకూటమును ముట్టడిం చాళుక్యసేనలతో పోరెను. (5) బహు ప్రోలరా జీ చోళుల దాడిని ప్రతిఘటిం

1. కాకతీయ సంచిక — అనుబంధము : శాసనము నం. 1
2. *K. A. Nilakanta Sastry — The Colas I, p. 236*
3. *Hyd. Arch. Ser. No. 3. verse 11 and Tel. Ins. Kak. No. 11*
4. *Sewell-Hist. Ins. South India, p. 75*
5. *MER. 182 of 1915*

చక్రకూటవిషయమును తిరిగి తన యేలిక యగు చాళుక్యరాజునకు వశపరచియుండును.

అటుపిమ్మట రెండవ బేతరాజును, రెండవ ప్రోలరాజును కాకతీయ సింహాసనము నధిష్ఠించిరి. ఇందు ప్రోలరాజు పరిసర ప్రాంతముల నుండిన రాజులను జయించి, చాళుక్యులను ధిక్కరించి స్వతంత్రుడయ్యెను. పిమ్మట రుద్రదేవుడు నేటి నైజాంరాజ్యమునందలి యాంధ్రప్రాంతము నంతటిని జయించి కాకతీయరాజ్యమును విస్తరించెను. అంతియగాక ఇతడు తూర్పుతీరమున వేంగీరాజ్యమున జేరియుండిన ద్రాక్షారామమును గూడ జయించెను. కాకతీయ రాజ్య మీవిధమున విస్తరించుచుండ దక్షిణదేశమున పెక్కు మార్పులు జరిగెను చోళసింహాసనము ఖాళీయగుటచే వేంగీచాళుక్య రాజపుత్రుడగు రాజేంద్రుడు దౌహిత్రరీత్యా తనకు చెందు చోళరాజ్యమున కధిపతియై కులోత్తుంగుడను పేరుతో ఆంధ్రద్రవిడ దేశములను క్రీ. శ. 1070 నుండి పరిపాలింప సాగెను. కొంతకాల మాంధ్రదేశము నతనిపుత్రులు రాజప్రతినిధులుగ నేలిరి గాని యనంతరము వెలనాటి రాజులీస్థానమున నియోగింపబడిరి. ఈయదనున ప్రాగాంధ్రదేశమునం దెన్నియో చిల్లర రాజవంశములు తలయెత్తినవి. వానికి ఫలితముగ నీప్రాంతమున వైషమ్యములును, సంఘర్షణములును ప్రబలసాగినవి. క్రీ. శ. 1199 లో గణపతిదేవుడు కాకతీయ రాజ్యమున కేలికయై బలహీనముగనున్న ప్రాక్తీరమును జయింపసాగెను. ఈ ప్రాంతము కులోత్తుంగుని సంతతివారగు చాళుక్యచోళుల దగుటవలన గణపతిదేవుని విజయములు అతనికిని దక్షిణదేశ పాలకులకును వైషమ్య మేర్పడుటకు మొదటికారణ మయ్యెను.

క్రీ. శ. 1178_1218 నడుమ రాజ్యమేలిన మూడవ కులోత్తుంగచోళుడు బలహీనుడుగ నుండుటవలన నతని సామంతు లెందరో అతని యాధికారమును ధిక్కరించిరి. నెల్లూరి శాఖకు జెందిన తెలుగుచోళు లతని సామంతులుగ నెల్లూరు, కడప, చెంగల్పట్టు జిల్లాల నేలుచుండిరి. (6) ఈ చోళరాజుయొక్క శాసనములనుబట్టి యితడు వడుగు, వేంగీదేశములను జయించెననియు, కాంచీనగరమును మరల వశపరచుకొనెననియు దెలియుచున్నది. (7) ఈవృత్తాంతము క్రీ.శ.1212 ప్రాంతమున జరిగె నని యాశాసనములే తెలుపుచున్నవి. నెల్లూరి రాజపుత్రుడగు చోళతిక్కరాజు క్రీ. శ. 1211 లో కంచిలో నొకశాసనమును వేయించుటనుబట్టి(8) చోళరాజీతనినుండియే ఆనగరమును వశపరచుకొనెనని తెలియనగుచున్నది. ప్రాగాంధ్రతీరమునందలి వెలనాటిలోనికి క్రీ. శ. 1209 నాటికే కాకతీయ గణపతిదేవుడు తన రాజ్యమును విస్తరించియుండుటచే (9) పై చోళుల వేంగీవిజయము జరగియుండుట కవకాశము లేదు. అంతియ కాక క్రీ. శ. 1213 నాటి యొకశాసనములో గణపతిదేవుని మంత్రియగు భీమనాయకుడు 'కంచీ చూరకార' యను బిరుదముతో పేర్కొనబడియున్నాడు. (10) మరియొక శాసనమున నెల్లూరిరాజగు చోళతిక్కరాజు కుమారుడు మనుమసిద్ధి గణపతిదేవునికి గోదావరీతీరమున జరగిన యుద్ధములో సహాయము చేసెనని చెప్పబడియున్నది. (11) ఈయంశములను సమన్వయించి చూడగా గణపతిదేవుడు తాను తూర్పుతీరమునందలి చోళచాళుక్యభూముల నాక్రమించుచుండుటచే చోళు లాప్రాంతముపై దండెత్తివత్తురని యూహించి, అందులకు బ్రతిగ నెల్లూరి చోళులను మార్గమునసే చోళుల నరికట్టుటకై నియోగించి, వారితో మైత్రి చేసికొనె



[ కృష్ణగిరిదుర్గము - జింజి ]

---

6. *Nilakantan — The Colas II, pt i, p 107*

7. *Pudukotah Ins. 163 and 165; S. I. I. III, 87; MER. 346 & 361 of 1919*

8 *Nel. Dist Ins. p. 1254*

9. *MER. 803 of 1922*

10 *Ibid 47 of 1923.30*

11. *Ibid 580 of 1907*



[రాజగిరి దుర్గము - జింజి]

ననియు, క్రీ. శ. 1211 లో నితని సహాయమున నే యీ తెలుగుచోళులు కంచి నాక్రమించి రనియు నూహింపవచ్చును.

13-వ శతాబ్దిమధ్యభాగమున దక్షిణదేశపు రాజకీయపరిస్థితి క్లిష్టముగనుండెను. పాండ్యులును, కొప్పెరుంజింగడను పల్లవరాజును విజృంభించి తమయేలికయగు చోళరాజును ఓడించి, బందీకృతుని జేసిరి. హొయసలులు నీకలహములలో జేరి యొక్కొకసారి యొక్కొకరికి తోడ్పడుచుండిరి. క్రీ. శ. 1223 లో అధికారమునకు వచ్చిన తిక్కరాజు నీ యొడుదుడుకులలోనికి దుమికి, చోళరాజు పక్షమున కంచి నాక్రమించి యతని ప్రత్యర్థులతో బోరజొచ్చెను.(12) కడకీయుద్ధములలో పాండ్యులు జయమునందిరి.

చోళులను, హొయసలులను, కొప్పెరుంజింగని ఓడించినపిమ్మట నుత్తరమున ప్రబలురుగ నుండిన తెలుగుచోళులపై సుందరపాండ్యుడు తనదృష్టిని మరల్చెను. ఇతని బహుశాసనములనుండి యితడు తనను చుట్టుముట్టిన తెలుగువారి నోడించెననియు, ముదుగూరువద్ద జరగిన యుద్ధములో వారిని దరిమివేసె ననియు, గణపతిని జయించి, కంచిని వశపరచుకొని, నెల్లూరులో వీరాభిషేక మొనర్చె ననియు గండగోపాలుని చంపె ననియు దెలియుచున్నది. (13) ఈయంశముల నీవిధమున సమన్వయింపవచ్చును. పాండ్యుల విజృంభణమును గాంచి భయపడి గండగోపాలబిరుదాంచితుడగు తిక్కరాజు కాకతీయుల సహాయముతో పాండ్యరాజ్యముపై దండెత్తిపోయియుండును. చిత్తూరు జిల్లాలోని ముదుగూరువద్ద నొకయుద్ధము జరిగె, అందు తిక్కరాజు సైన్యము లోడిపోయెను. అంతట వీరు కంచికి పారిపోయిరి. సుందరపాండ్యుడు వీరిని దరుముచువచ్చి, కంచిని ముట్టడించి, యందు తిక్కరాజును చంపెను. పిమ్మట నాంధ్రసైన్యములు నెల్లూరుకు బలాయనమయ్యెను. పాండ్యరాజచటికి గూడ వచ్చి, మరియొకసారి యీ సైనికుల నోడించి, నెల్లూరుపురమున వీరాభిషేక మొనర్చెను. ఇతరశాసనములనుండి తిక్కరాజు క్రీ. శ. 1249 లో మరణించె నని తెలియుచున్నది. అందువలన పైయుద్ధము లా సంవత్సరారంభమున జరగెనని యూహింపవచ్చును. ఈవార్తను విని కాకతీయగణపతిదేవుడు సామంతభోజు డను తనసేనానినిందులకు ప్రతీకారము చేయుటకై దక్షిణమునకంపెను. ఈ కాకతీయ సేనాని మొదట నెల్లూరును వశపరచుకొని, యందు తిక్కరాజుకుమారుడగు మనుమసిద్ధిని ప్రతిష్ఠించి, యటుపిమ్మట కంచిని బట్టుకొని యందు గూడ తెలుగుచోడుల యధికారమును నెలకొల్పెను. ఇతడు క్రీ. శ. 1249-వ సంవత్సరమున కంచిని ప్రవేశించి, మరుసటిసంవత్సరము మధ్యభాగమున స్వస్థానమునకు మరలెను. (14)

అయినను కాంచీనగరము చిరకాలము వరకును అలజడులకు లోనయ్యెను. క్రీ. శ. 1253 లో కొప్పెరుంజింగడు మనుమసిద్ధిని బారదోలి యానగరము నాక్రమించెను. (15) అటుపిమ్మట పాండ్యులును, హొయసలులును దాని నాక్రమించిరి. మనుమసిద్ధి తన మిత్రులగు కాకతీయులసహాయముతో ద్రవిడ, కర్ణాటరాజులతోడను, విజయగాండగోపాల రాయనితోడను పోరి, యటుపై కొప్పెరుంజింగని దరిమివేసి (16) క్రీ. శ. 1254 లో దిరిగి కంచిని వశపరచుకొనెను.

క్రీ. శ. 1260 ప్రాంతమున మరియొకసారి దక్షిణదేశమున సంక్షోభము గలిగెను. సుందరపాండ్యుడు హొయసలుల నణచి,

12. తిక్కన నిర్వచనోత్తరరామాయణము–అవతారిక, 33, 34 పద్యములు
13. *MER. 340, 354 and 361 of 1913*
14. *Ind. Ant. XV, p. 122 and MER. 2 of 1893*
15. *Sewell HISI. p. 150*
16. తిక్కన నిర్వచనోత్తరరామాయణము–అవతారిక, 39-వ పద్యము.

కొప్పెరుంజింగని స్వస్థానమునుండి తరిమివేసెను. అంతట నీపల్లవరాజు కంచికి బారిపోయి యానగరము నాక్రమించెను. పాండ్యరాజాతని రాజ్యము నలజడిపరచి, తెలుగు చోడుల రాజ్యములో బ్రవేశించి నెల్లూరువరకును వచ్చి, యానగరమునం దభిషిక్తుడై, పిమ్మట స్వదేశమునకు మరలెను.(17) పోవునప్పు డీతడు క్రీ. శ. 1261 లో కంచిని ముట్టడించెను. దీనికి తాళజాలక కొప్పెరుంజింగడు ప్రాగాంధ్రతీరమును బట్టి ద్రాక్షారామము వరకును చొచ్చుకొని వచ్చెను. (18) మనుమసిద్ధిప్రశంస చెంగల్పట్టుజిల్లాలో క్రీ. శ. 1263 లోను, కంచిలో క్రీ.శ. 1265 లోను గన్పించుచుండుటచే (19) నీకాలమునం దాతడును పదచ్యుతుడై కాకతీయ సామ్రాజ్యమునం దెచ్చటనో తలదాచుకొని యుండెనని చెప్పవచ్చును. ఈ పాండ్యుల విజృంభణమునకు బ్రతికృతి చేయుట కాతనికి శక్తి లేకుండెను. అతని మిత్రుడగు కాకతీయ గణపతిదేవు డీసమయమున మిక్కిలి వృద్ధుడైయుండి, తనయనంతరము తన విశాలసామ్రాజ్యము సురక్షితముగ నుండుటకు వలయునేర్పాట్లను జేయుచుండుటచే మనుమసిద్ధికి వెంటనే సహాయము చేయజాలకపోయెను. అయినను ద్రాక్షారామమువరకును వచ్చిన కొప్పెరుంజింగని మాత్ర మచటి కాకతీయ సామంతులు పరిభవించి, యతడు గణపతిదేవుని స్వామిత్వము నంగీకరించునట్లొనర్చిరి.

క్రీ. శ. 1262 లో గణపతిదేవుడు మరణింప నతని కుమార్తెయగు రుద్రాంబ యాంధ్రదేశమున కేలిక యయ్యెను. ఈయవకాశమును బురస్కరించుకొని శత్రురాజులును, సామంతులు నెందరో కల్లోలములను గలిగించిరి. కాకతీయసామ్రాజ్యపు దక్షిణదిశనున్న త్రిపురాంతకముపై చోళరాజగు రాజేంద్రుడును, అపుడే పరాభూతుడై యాంధ్రదేశమునుండి యావలికివచ్చిన కొప్పెరుంజింగడును దండెత్తివచ్చిరి. రుద్రాంబిక సామంతు లీయిర్వురు శత్రువులను ఎదుర్కొనిరి. కాయస్థసామంతుడగు అంబదేవుడు కొప్పెరుంజింగని ఓడించి పారదోలెను. (20) వర్ధమానపుర పాలకుడగు గోనగన్నయరెడ్డి చోళరాజును దరిమివేసెను. (21)



[బేలూరు దేవాలయములోని హొయిసల శిల్పము]

రుద్రాంబరాజ్యకాలమున జరిగిన క్రీ. శ. 1285-90 నడుమ మరియొకసారి భయంకరమగు కల్లోలము జరగెను. ఈకాలమున విక్రమ పాండ్యుడును, సుందరపాండ్యుడును కాకతీయులకును, తెలుగు చోడులకును ప్రబల శత్రువులుగ నుండిరి. క్రీ. శ. 1288 లో సుందర పాండ్యుడు విజృంభించి, తెలుగు చోడరాజ్యము నాక్రమించి మనుమసిద్ధిని దరిమివేసెను. (22) అంతట రుద్రాంబ తనకాయస్థ సామంతుల నిందులకు దగిన ప్రతీకారము చేయ నియోగించెను. త్రిపురాంతకు డనునతడు కంచిని జయించి, యటనుండి సముద్రము వరకును గల ప్రదేశము నాక్రమించెను. అతని సోదరుడగు అంబదేవుడు నెల్లూరిపై దండెత్తిపోయి, యానగరమును జయించి, అందు మనుమగండగోపాలబిరుదాంచితుడగు మనుమసిద్ధిని తిరిగి ప్రతిష్ఠించెను. ఈవిధమున పాండ్యులు గల్పించిన కల్లోలము లణగిపోయెను. ఇది క్రీ. శ. 1290 లో జరగియుండును.

క్రీ. శ. 1296 లో ప్రతాపరుద్రదేవుడు కాకతీయసామ్రాజ్యమున కేలిక యయ్యెను.

---

17. *Sewell-HISI. pp. 154-155.*

18. *S.I.I. IV Nos. 1341*, 1342 *and* 1342 *B*

19. *MER. 230 of* 1922; *27, 35and 36 of* 1890 *and Nel. Dist. Ins. p. 442.*

20. *MER. 268 of* 1905. ఇతని "కాడవరాయనిస్తారక" అను బిరుదమును చూచునది.

21. కాకతీయ సంచికానుబంధములోని రాయమూరు శాసనమున బేర్కొనబడిన "చోళజగజాళవీర" అను నీ సామంతుని బిరుదమును చూచునది.

22. క్రీ. శ. 1288-90 నడుమ మనుమసిద్ధి శాసనములు దత్తమండలములలోగాని, కాంచీప్రాంతమునగాని గన్పించుట లేదు.



# మీ సంసార సౌఖ్యమునకు




43 ఏండ్ల ప్రఖ్యాతికాంచిన పండిత డి. గోపాలాచార్లుగారి 3 ఔషధరత్నములు.

## జీవామృతము

తరుగులేని ఆరోగ్యంతో, తరుగులేని దేహదార్ఢ్యంతో, పౌరుష తేజాన్ని ప్రసరింపచేస్తూ యావజ్జీవం హాయిగా వెళ్లబుచ్చాలనే ప్రతివారూ కోరుతారు అన్ని అనారోగ్యాలనూ పారద్రోలి హాయినీ, ఆనందాన్ని చేకూర్చగల రసాయనం జీవామృతము ఒక్కటే.

## అరుణ

అందమూ, ఆరోగ్యమూ, సౌఖ్యమూ, సంతానమూ ప్రతీ స్త్రీకి జన్మహక్కు. అయితే స్త్రీలకు సహజమయిన ఋతు దోషాలవల్ల ఆ హక్కులకు భంగం కలుగుతుంటుంది. అన్ని దోషాలనూ హరించి ఆనందమయ జీవితాన్ని అందించగల వరప్రసాదం 'అరుణ.'

## బాలప్రాశ

పసిబిడ్డలంటే ప్రతివారికి గారాబమే. అతి గారాబానికిపోతే ఆరోగ్యం చెడుతుంది. పోషణ సరిగా లేకపోతే శిశువు నలతపడి కృశించిపోవడం తప్పక జరుగుతుంది. ఆహార దోషాలనూ అనారోగ్యాన్నీ తొలగించి బాలసూర్యుని కాంతులతో బాలపాపలను తులతూగించగల మధుర రసాయనం 'బాలప్రాశ.'










ఆయుర్వేదాశ్రమము,

స్థాపితము 1898 మద్రాసు.

మరికొద్దికాలముననే పాండ్యరాజవంశమునం దంతఃకలహములు బయల్వెడలెను. అందు మూలమున కాకతీయులకును, తెలుగుచోడులకును దక్షిణదిశనుండి యేయుపద్రవములును లేకుండెను. క్రీ. శ. 1311 లో ఢిల్లీసుల్తానగు అల్లా ఉద్దీనుఖిల్జీసేనానియగు మాలిక్ కాఫరు దక్షిణదేశముపై దండెత్తి, దానిని సంక్షుభితమొనర్చెను. ఈ యదనును గ్రహించి కేరళదేశపురాజగు రవివర్మ పాండ్యదేశమును దోచి, కంచిని ముట్టడించి, తెలుగుచోళులనటనుండి పారదోలి, యానగరము నాక్రమించెను.(23) ఇది క్రీ. శ. 1313 లో జరగెను. ఇంతలో పాండ్యరాజులు దమ కలహములను మానుకొని, కేరళదేశమును చీకాకుపరచుటచే, రవివర్మ కంచిని వదలి స్వదేశమునకు బోవలసివచ్చెను. పాండ్యు లంతట నానగరము నాక్రమించిరి. ఈవార్త నాలకించి ప్రతాపరుద్రదేవు డొక ప్రబలమగు దండయాత్రను సాగించెను. నెల్లూరుప్రాంతమునం దతని ప్రతినిధిగ నుండిన ముప్పిడినాయకుడు కాంచీనగరముపై దండెత్తెను. (24)

ఇంతలో నెల్లూరులో రంగడను తెలుగుచోడవంశజుడు హొయసలులయొక్కయు, మరికొందరు పరిసరపాలకులయొక్కయు తోడ్పాటుతో నొక తిరుగుబాటును బయల్వెడలించెను. అంతట ప్రతాపరుద్రచక్రవర్తి పెద్దరుద్రుడు, (25) ప్రోలయవేమన, దేవరినాయనింగారు, ఎఱ్ఱదాబానాయడు (26)నను సేనానుల నిచటికి బంపి, ఇందులూరి అన్నయదేవ రుద్రదేవులతో దానును దక్షిణదిశ కరిగెను. పెద్దరుద్రుడు మున్నుగ వారు హొయసలులను జయించి, నెల్లూరును వశపరచుకొని మనుమగండగోపాలుని అందు ప్రతిష్ఠించిరి. ఇంతలో నెల్లూరు జిల్లాలోని జింజికోటనుండి కొందరు సామంతులు పాండ్యులకు సహాయమును బంపుచుండిరని తెలియవచ్చుటవలన నీకాకతీయసేనానులు జింజిని ముట్టడించిరి. ఇచట ప్రోలయవేమన బహుపరాక్రమమును జూపి యీసహాయము పాండ్యులకు జేరకుండగ నడ్డగించెను.(27) అచ్చట ముప్పిడినాయకుడు కాంచిని ముట్టడించెను. చక్రవర్తియు ద్వరలో నచటికి జేరెను. ఈముట్టడిలో ఇందులూరి అన్నయదేవుడును, రుద్రదేవుడును పాండ్యసైన్యములను చిందరవందరగావించిరి. (28) అందువలన పాండ్యులు నగరమును వీడి పారిపోయిరి. దేవరినాయనింగారను సేనాని (29) దారిలో వీరి నడ్డగించి విక్రమపాండ్యుని, వీరపాండ్యునికూడ మరియొకసారి నోడించెను. వీరశిఖామణు లగు సేనానులతో గూడి చక్రవర్తి జయజయధ్వానములతో కాంచీనగరమును బ్రవేశించెను. ఈ వృత్తాంతము క్రీ. శ. 1318 లో జరగెను.

పైవృత్తాంతములు జరగిన కొలదికాలముననే మహమ్మదీయులు కాకతీయసామ్రాజ్యముపై దండెత్తివచ్చిరి. ఆంధ్రుల శక్తియంతయు వారి నెదుర్కొనుటకే కేంద్రీకరింపబడెను. ఈమహాసామ్రాజ్యము క్రీ. శ. 1328 లో నస్తమించెను. మరికొన్నియేండ్లకే మిగిలిన హిందూరాజ్యములును దురుష్కాక్రాంతము లయ్యెను.

ఇంతవరకును చర్చింపబడిన విషయములనుండి గణపతిదేవుని కాలమునుండియు కాకతీయరాజులు తమకును, దక్షిణదేశపాలకులకును నడుమ తెలుగుచోడుల నొక యడ్డుగ నెలకొల్పి, చోళపాండ్యాదులవలన నుపద్రవములు గలిగినపుడెల్ల దాము వారికి దోడ్పడుచు, అవసరమగునపుడు దక్షిణదేశముపై దండెత్తుచు, కాంచీనగరమును వశము దప్పకుండునట్లు రక్షించుచుండిరని స్పష్టమగుచున్నది. ఈనూతనాంశము కాకతీయుల చరిత్రమునకు మిక్కిలి ముఖ్యమైనది.

---

23. *MER*. 34 *of* 1890.
24. *Ep. Ind VII*, *pp*. 128-32.
25. *Jour. Or. Res. XII*, *pp*. 213-16.
26. *Mack. Mss*. 15-4-40 *p*. 37.
27. "చెంజిమలచూఱకాఱ" అను నితనిబిరుదమును చూచునది.
28. కాకతీయ సంచికానుబంధములోని శివయోగసారావతారిక యందలి 44, 45 పద్యములను చూచునది.
29. *S. I. I. IV. No. 432*.



# 'రాచవారు'



శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

ప్రాచీనకావ్యములలోని జాతీయము లనేకము లిటీవలి పరిష్కర్తలయొక్కయు, వ్యాఖ్యాతలయొక్కయు, అవిమృశ్యకారితవలన రూపములు మాఱి, అర్థములు చెడి ఛిన్నభిన్న మయినవి. అట్టివానిలో 'రాచవారు' అనునది యొకటి.

ఈ జాతీయమును నిఘంటుకర్తలును గ్రహించలేదు. బ్రౌను పండితుడు "రాచ=of or belonging to the caste of రాచవారు (Rachawaru); High landers, క్షత్రియులు" అన్నాడు. బ. సీతారామాచార్యులవారు శ. ర. లో "రాచవాఁడు = క్షత్రియుఁడు" అని యేకవచనముగా చెప్పినారు. ఏకవచనముగా చెప్పినను బహువచనముగా చెప్పినను మొత్తముమీద ఆ యిరువురును విశేషార్థము గల 'రాచవారి' ని గుర్తింపలేదని సారాంశము.

శ. ర. కర్త "రాచవాఁడు = క్షత్రియుఁడు" అని ప్రత్యేకముగా పఠించుటయు ననవసరమే. "ముత్తరాచ = ఒక శూద్రజాతి (ముత్తరాచవాఁడు; ముత్తరాచది.)" అన్నట్లుగానే "రాచ=క్షత్రియకులము (రాచవాఁడు, రాచది)" అనియుండిన చాలును. కాని "రాచ = క్షత్రియకులము" అన్న సంగతి ఆచార్యులవారికి తెలిసినట్లు లేదు. అందువల్లనే "రాచ=రాజసంబంధి (రాచవాఁడు, రాచది)" అన్నారు. పొరపాటు. రాజసంబంధిజను లందరును 'రాచవారు' కారు. రాజుగారి భటుడు 'రాచవా' డగునా? రాజుగారి దాసి 'రాచది' యగునా ? రాచవాడు, రాచది అను పదములు క్షత్రియుడు, క్షత్రియస్త్రీ అను నర్థమునుమాత్రమే యిచ్చును. ("రాచవాఁ డనఁగను రాజన క్షత్రియుఁ డొప్పు." ఆం. భా. 2-182; "క్షత్రియాణి చను రాచది యనంగ" ఆం. భా. 2-108.) 'రాచవాడు', 'రాచది' అను నుడులలోని 'రాచ' కుల వాచకముగాని 'సంబంధి' వాచకము కాదు. 'రాచ' క్షత్రియకులము కానియెడల 'రాచవాడు' క్షత్రియు డగుట యెట్లు? ఆం. భా. (2-170) లో "పరఁగుఁ జతుర్వర్ణి బాఁపన రాచ కోమటి రెడ్డి నాఁగను" అని చెప్పబడియేయున్నది.

ఇంతకును, మనకు ప్రకృతమును జాతీయమును నైన 'రాచవారు' అను నుడిలోని 'రాచ' కులవాచకమూ కాదు; 'వారు' బహువచనమున వచ్చినదియును కాదు. ఇది యొక వింతశబ్దము. 'అయ్యవారు' అను శబ్దమువంటిది. 'అయ్యవా' రనగా ఉపాధ్యాయుడు. (ఈయర్థము శ. ర. లో లేదు. "అయ్యవారు = పూజ్యుఁ డగు బ్రాహ్మణుఁడు" అని మాత్రమే యున్నది.) బ్రౌను "అయ్యవారు-A bramin; a teacher - బ్రాహ్మణుడు; ఉపాధ్యాయుడు" అని రెండర్థములును చెప్పినాడు. "అయ్యవారు=ఉపాధ్యాయుడు" అనుటకు కవుల ప్రయోగములు నున్నవి.

"అయ్యవారికి జాలు ఐదు వరహాలు
పిల్లవాండ్లకు జాలు పప్పు బెల్లాలు"

— దసరాపద్యములు.

"నన్ను బింగిలు పెట్టించునాఁడె యయ్య
వారు నిద్రింపఁగాఁ జూచి చేరి యచటఁ
జింతబ్రే లొక్కమ్మ వంచుక సిగను గట్టి
విడిచి యుఱికితి నయగారు మిడికి కూయ"

—హంస. 3. 144.

'అయ్యవారు' అను పదమునకు ఉపాధ్యాయు డనునర్థ మెట్లు రూఢమో, అట్లే 'రాచవారు' అను పదమునకు 'దొర' అను నర్థము రూఢము. ఉపాధ్యాయు డేజాతివాడైనను 'అయ్యవారు' అనబడునట్లే 'దొరతనము' గలవా డేజాతివాడైనను 'రాచవారు' అనియే యనబడును.

అయ్యవారు, రాచవారులలోని 'వారు' అర్థ విశేషమున వచ్చినదిగాని బహువచనమున వచ్చినది కాదు. ("అర్థ విశేషంబునం దేకత్వంబునను గొన్ని శబ్దంబులకు మీఁద 'వారు' చూపట్టెడు." ప్రౌఢ. శబ్ద. 42.) కావున ఆ పదములకు బహువచనార్థము చెప్పుటగాని, 'అయ్యవాడు', 'రాచవాడు' అని యేకవచన రూపములు కల్పించుటగాని కూడదు.

ఒక్క యుదాహరణము—

"చొచ్చినచోన చొచ్చి తెగఁ
జూచెద నంచుఁ గడంగుచుండు, న
న్మెచ్చఁడు బాహుగర్వమున
నీచు సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ
బోవక పోవఁగరాదు నాకు, వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురు
వంశము చేటున కోపకుండుటన్."

—భార. ఉద్యో. 3-43.

ఇక్కడ 'రాచవా' రనగా 'క్షత్రియులు' కారు; ప్రభు వ(యిన ధర్మజుడ) ని యర్థము. మూల మిట్లున్నది :

"అహ మేత ద్బ్రవీ మ్యేవం రాజాప్యైవ ప్రశంసతి,
అర్జునో నైవ యుద్ధార్థీ భూయసీహి దయార్జునే"

"నే నిట్లు శాంతిని కోరుచున్నవాఁడను. ధర్మాత్మజుండును శాంతినే ప్రశంసించుచున్నాఁడు. అర్జునుండును యుద్ధము నాశింపలేదు. అర్జునుండు మిక్కిలి దయార్ద్రహృదయుండు గదా"

—కట్టి సాంబమూర్తిశాస్త్రిగారి తెనుగు

పై శ్లోకములోని 'రాజా' అనుపదమునకే తిక్కన 'రాచవారు' అను జాతీయమును వాడినాడు. ఆ రహస్యము నెరిగిన 'ఆమ్నాయకలానిధి' వ్యాఖ్యాతలు శ్రీమాన్ నేలటూరి పార్థసారథి అయ్యంగారు "రాచవారు = ప్రభుఁడు, ధర్మరాజు" అనియే టీక వ్రాసినారు.

'రాచవారి' తత్త్వమును గమనింపని పెద్దలు కొందరు చేసిన సవరణలను, వ్రాసిన టీకలను ఇందు చూపుచున్నాను.

## 1. 'రావుతు రాచవారు'

భీమేశ్వరపురాణము—

"ఏనిక మోముతా ల్పెలుక
నెక్కుడు రావుతురాచవారు, సే
నాని యనంగ పెద్దన" (1-2)

ఇది వ్రాతప్రతుల పాఠము. "ఏనిక ... నెక్కిన రావుతు రాజు సౌర సేనాని" అని ముద్రితప్రతిపాఠము.

'రావుతురాచవారు' అను వ్రాతప్రతిపాఠము తప్పనియు, ఆ తప్పును "రావుతురాజు సౌర సేనాని" అని సవరించుటకు మేము పడరానిపాట్లు పడితి మనియు సంస్కర్తలు పీఠికలో వ్రాసియున్నారు.

"పార్వతీనందన స్స్కంద స్సేనానీ రగ్నిభూ ర్గుహః" అని నిఘంటువున 'సేనానీ' శబ్దము కుమారస్వామికి రూఢముగా చెప్పబడియుండగా 'సౌరసేనాని' యనవలసిన యక్కరయేమో. 'రాచవారు' అను పాఠమున తప్పేమో, 'రావుతురాజు' అను పాఠమున కాకరమేమో వారు తెలుపలేదు.

ఏమయినను వ్రాతప్రతిపాఠమును రూపు మాపక పీఠికలో చూపి - చెప్పినందుకు మన మా సంస్కర్తలయెడ కృతజ్ఞులమై యుండవలెను.

## 2. 'బిరుదాంకుఁడగు రాచవారు'

శృంగార నైషధము—

"పేమణి హనుమంత బిరుదాంకుఁడగు రాచ
వారికి నెయ్యంపు వరసుతుండు"

(1-32)

ఇది పూర్వముద్రణపాఠము. "బిరుదాంకుఁడగు రాచవారు" అనుటలో భిన్నవచనతాదోష మున్నదని కాకోలు కీ. శే. వేదము వెంకటరాయశాస్త్రిగారు "బిరుదాంకులగు రాచవారికి" అని దిద్ది ముద్రించినారు. (కాని దిద్దినట్లు వారు చెప్పలేదు.) ఇక వారి సర్వంకషావ్యాఖ్య యిట్లున్నది:

"పేమ ... కులు = పేమణి హనుమంతయని బిరుదు (అంకము =) గుర్తు కలవారు (పేమణి యనఁగా సన్నెకల్లు, హనుమంతుఁడు సన్నెకంటిమీఁద పచ్చడి నూరిన నెట్లు నూఱునో, శత్రువులను అట్లు నూఱెడువాఁడు అని బిరుదార్థముగా నుండనోపు). నెయ్యంపు = గారాబంపు, వరసుతుండు = వరముచేఁ గలిగిన కుమారుఁడు"

'పేమణి హనుమంత' బిరుదుకు వారు వ్రాసిన యర్థము చాలా విచిత్రముగా నున్నది. హనుమంతుడు సన్నెకంటిమీద పచ్చడినూరుటలో ప్రౌఢపండితుడన్న అపూర్వ విషయమును వా రేశాస్త్రము నుండి గ్రహించినారో! 'హనుమంత' మంత్రియును శత్రువులను 'నూఱెడువాఁ' డట! శత్రువులను నురుమాడుట కలదు గాని అది యొకపనిగా నూఱుటయును కలదా!!! 'నూఱుట' యనగా నురుమాడుటయనియే భావము కావచ్చును. 'పేమణిహనుమంత' బిరుదుకు 'సన్నెకంటిమీద పచ్చడి నూరెడి హనుమంతు' డన్న యర్థ మున్నదో, లేదో నే నెరుగనుగాని, ఆ బిరుదు మాత్రము విశ్వబ్రాహ్మణులకు పరిపాటిగా నున్నది.

"శివపూజవిస్తార సింధుగంభీర
శివకటాక్షముచేత సిరి గాంచి తౌర
పేమణీహనుమంతబిరుదవిఖ్యాత"

ఇది దసరాపద్యములలో విశ్వబ్రాహ్మణులను గూర్చినది.

"దానప్రతిగ్రహాధీనబిరుదు మీది
పేమణీహనుమంతబిరుదు నాది
... ... ..."

రూఢికెక్కిన కందుకూర్ రుద్రకవిని"
—చాటుపద్య మణిమంజరి (పుట 26)

ఇంతకును ఆ శాస్త్రిగారి సర్వంకషావ్యాఖ్యవలన 'హనుమంతుడు పచ్చడినూఱుటలో పండితు' డన్న వింతవిషయమే గాని 'రాచవారి' వృత్తాంత మేమియు తెలియరాలేదు.

శ. ర. ననుబట్టి రాచవారు=క్షత్రియులు బహువచనము కావున 'బిరుదాంకుఁడను' అని విశేషణ మేకవచనమున నుండుట తప్పే. కాని పద్యమున వర్ణింపఁబడుచున్నవారు మంత్రులు - నియోగిబ్రాహ్మణులుగదా? మరి యట్టిచోట క్షత్రియుల ప్రస్తావ మెందుకు? అది యట్లుండగా, మంత్రి-అల్లాడరాజు, 'పేమణిహనుమంత బిరుదము గల రాచవారికి = (పలువురు) క్షత్రియులకు, 'వరసుతుండు' అని శ్రీనాథమహాకవి కవిత్వము చెప్పియుండునా? ఎక్కడిమాట? 'బిరుదాంకులు' అని దిద్దుట పొరపాటు. 'రాచవారు' బహువచన మనుకొనుట ఆపొరపాటుకు మూలము.

"వ: సు: పం: శః =వరముచేఁ గలిగిన కుమారుఁడు" అనుటకంటె "ఉత్తముఁడైన కుమారుఁడు" అనుట యుచితతరమని నా యభిప్రాయము.

### 3. 'వలరాచ రాచవాఁడు'

1831 సం.లో జూలూరు అప్పయ్యశాస్త్రిగారి టీకతో ముద్రితమయిన మనుచరిత్రలో (2-8),—

"వలరాచరాచవా డలికాక్షు కనువెచ్చ
గరగిన యలకనికరపుచోటు"

అనుపాఠమును, "వలరాచరాచవాడు = మన్మథుడనే రాజకుమారుడు" అనుటీకయు నున్నవి.

బ్రౌణ్యమున 'వలరాచకుమారుడు' అను పదము క్రింద "వలరాచరాచవాడు-The god of love, మన్మథుడు- వలరాచరాచవాడలికాక్షుకనువెచ్చ గరగిన (స్వా. 2-8)" అనియే యుదాహృతమై యున్నది. ఇక నిటీవల ముద్రితములైన (వావిళ్ల-ఆనంద) ప్రతులు జూలూరువారి ప్రతికి 'కాపీ'లే కావున వానిలో 'రాచవాడు' అను పాఠ ముండుట సహజమేకదా! కాకపోతే జూలూరువారు 'వాడు' అని నిర్బిందుకముగా ముద్రించితే తక్కినవారు 'వాఁడు' అని సబిందువుగా ముద్రించినారు. అంతేకాక ఇంకొక విశేషముగూడా కనబడుచున్నది. జూలూరువారి టీక సరియైనది కాదనికాబోలు, "వలరాచరాచవాఁడు=మన్మథుఁడను క్షత్రియుఁడు" అని యర్థమును సవరించినారు. ఈసవరణ సరియైనదికాదు. మన్మథుడు క్షత్రియకులమువాడుకాడు. ఒకవేళ అయినను, 'రాచవాఁడు' అనుట యనుచితము. "రాచవాడు, రాచది- బాపనవాడు, బాపనది" అను వ్యవహారము నిందయందు నీచార్థము ననేగాని పూజ్యార్థమున పుట్టదు.

"ఆడఁడు తన్ను దూషణము లాశ్రమవాసులఁగాని, నైరులం
గూడఁడు కందమూలఫలములు గూడుగఁదించు సమాధినిష్ఠుఁడై
వీడఁడు లోని చూడ్కులను విష్ణునిఁదక్క పరప్రపంచముం
జూడఁడు మద్గురుండు ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్."
— భాగ. 1-467

ఈపద్యము శమీకపుత్రుడగు శృంగి పరీక్షితుని శపించు ఘట్టములోనిది.

* "ఓరోరి రాచవాఁడా
రారా నావెంటఁ దిరుగరా గోసఁగివై
పోరాడి మాడ లిచ్చెదఁ
గోరా నీయప్పుఁ దీర్చుకోరా వెలచన్"
—హరిశ్చ. 4 ఆ.

కాటికాపరియైన చండాలుడు హరిశ్చంద్ర చక్రవర్తిని 'ఓరిరాచవాడా' అని సంబోధించుట నిరాదృతిచేతగాని పూజ్యభావముచేత గాదు. అయ్యంగారిని 'అయ్యంగాఁడు' అనుటయు, అయ్యగారిని 'అయ్యగాఁడు' అనుటయు, 'రాచ' వారిని 'రాచవాఁడు' అనుటయు నిందయందేగాని పూజ్యతయం దెన్నటికిని తగదు. వేమనయోగి 'అయ్యగార్ల'ను 'అయ్యగాండ్లు' అన్న విధము చూడండి.

"ఆఁడువారిఁ గన్న నర్థంబుఁ బొడగన్న
సారమైన రుచుల చవులు గన్న
నయ్యగాండ్లకైన నాశలుపుట్టవా! విశ్వ...వేమ."

'అయ్యగాండ్లకైనన్' అనగా 'అయ్యగార్ల' మని పెద్దపెద్ద పేరులతో విహరించు వేదాంతులకైనను అని నిరసనము.

'అయగాండ్లు' అనుపదమును 'పరమయోగి విలాస' కర్త వినియోగించిన విధము మిగుల చమత్కారముగా నున్నది.

"ఏపాటి పసిఁడిగిన్నియ
కో పాపం బని యొకింత కొంకక యెంతే
నీ పెదపెద యయగాండ్రను
బాపురె యిటువంటిపాట్లఁ బఱచెద రనిన్"
(3-284)

పసిఁడిగిన్నె కాజేసినందుకు 'అయగాండ్రు' అని నిరసనము. "ఏమయినను - పెద్దముండాకొడుకులు. అట్టివాండ్ల నిట్టిపాట్లఁ బఱచుట పాపము" అని కనికరము.

---

*ఈ పద్యము 'శంకరకవి హరిశ్చంద్ర' లోని దిగా శ. ర. లో 'గోసఁగి' క్రింద ఉదాహృతమై యున్నది. కాని వావిళ్లవారి (1910) ప్రతిలో లేదు.

ఏతావతా తేలిన సారమేమి? అయ్యంగాడు, అయ్యగాడు, రాచవాడు అనుపదములు పూజ్యార్థకములు కావు. 'రాచవారు' అను జాతీయములోని 'రాచ' కులమును తెలుపునది కాదు. 'వారు' బహువచనమున వచ్చినది కాదు. కావున 'వలరాచరాచవారు' అను పాఠమును 'వలరాచరాచవాఁడు' అని దిద్దుట పొరపాటు. 'రాచవారు' ఏకవచనమే కావున 'రాచవాడు' అను రూపము ఏకవచనమున పుట్టును. 'వలరాచరాచవాడు' అనగా 'వలరాజు అను దొర (ప్రభువు)' అని యర్థము. ఆతడు గొప్పదొర గావుననే ఆతడు 'కరఁగినచోటు' ప్రశంసార్హమయినది. వలరాజును 'క్షత్రియుడు'గా చెప్పుటయే పొరపాటు. పై పెచ్చు 'రాచవాడు' అని నీచముగా నిర్దేశించుట మరియును తప్పు.

విద్యార్థులు కొందరు ఈ మనుచరిత్ర పద్యమును 'వలరాచ రాచవాఁడు' అను నసాధు పాఠముతోనే చదువుచుండగా నే నొకటిరెండుచోట్ల వినియున్నాను.

విద్యార్థులమాట కేమిగాని, సూర్యారాయ నిఘంటువున గూడా 'రాచవాఁడు' అను పాఠముతోనే యీ పద్యము ("కరఁగు' అను పదముక్రింద) ఉదాహృతమై యున్నది. ఈ 'రాచవారి' తత్త్వము నెరిగిన పెద్దలు దిద్దిన గ్రంథములలోను, సంస్కర్తలచేయి సోకని తావులలోను 'రాచవారు' సురక్షితముగానే యున్నారు.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన ఉత్తర హరివంశములో

> "ఒక చపలాక్షి లేఁజిగురు
> టూయెలఁ గోయిల రాచవారి, ని
> క్కకు నెలయింప"
>
> (5–54)

శృంగార నైషధములో శ్రీ శాస్త్రిలవారు దిద్దని చోట

> వ. "వలరాచరాచవారికి వనదేవత లొనర్చు నీరాజన
> దీపాంకురంబులుంబోని ... సంపెఁగలును" (1–97)

"వలరాచరాచవారికి=మదనుఁడను రాజునకు" అని వారిదే టీక. (అక్కడ దిద్దిన శాస్త్రిగా రిక్కడ దిద్దక వదలుటకు కారణమేమో?)

భీమేశ్వర పురాణములో సంస్కర్తల కలముసోకని చోట—

> "వడకుసుబ్బలిరాచవారి కూరిమికన్య
> భీమయ్య శుద్ధాంతభామఁ గొలిచి"
>
> (3–97)





విక్టోరియాపార్కు, కొలంబో

ఉండినప్పటికిని ఎక్కువగా రాజకీయ పరిపాలనలో ఆంధ్రులు జోక్యము పుచ్చుకొనలేదు.

9-వ శతాబ్దమునుండి దక్షిణాపథమున చోళుల సాహసము ఎక్కువయ్యెను. వారు సింహళములో కొంతభాగము నాక్రమించిరి. 1-వ కులోత్తుంగుని కాలములో కళింగ దేశమును కూడ చోళులు ఆక్రమింప జూచిరి. అందువల్ల కళింగులకును, సింహళమువారికిని ముఖ్యమైన వైరియైన కులోత్తుంగుని పారదోలుటకు సింహళము రాజైన 1-వ విజయబాహుడు (1058-1114) కళింగ దేశపు రాకుమార్తెయైన త్రిలోకసుందరి యను నామెను పెండ్లియాడెను. త్రిలోకసుందరితోకూడ వారి బంధువులైన మధుకన్నవ, భీమ

# ఆంధ్రుల అడుగుజాడల్లో

శ్రీ రంగారావు

12, 13-వ శతాబ్దములలో సింహళమునకు పోలన్నరువా ముఖ్యపట్టణముగా నుండినప్పుడు అక్కడి రాజులు కళింగ సంతతికి చెందినవారని చెప్పుకొనుచుండెడివారు. అందుకు నిదర్శనముగా శిలాశాసనములలోను, గ్రంథములలోను ఈవిషయము చెప్పబడియున్నది.

సింహళమును పాలించిన రాజులలో మొదటివాడు శ్రీ విజయ. 'మహావంశ' లో విజయుడు కళింగదేశమునకు చెందినవాడని ఒకచోటను, వంగదేశీయు డని మరొకచోటను చెప్పబడియున్నది. ఆ 'మహావంశ' గ్రంథమునే ఇంకను పరిశీలించినయెడల అతడు వంగదేశీయుడు కాడనియు, కళింగుడే యనియు తెలియవచ్చును. బుద్ధుని పంటిచిహ్నము నాల్గవశతాబ్దములో కళింగదేశములోని దంతపురమునుండి సింహళమునకు గొంపోబడెనట. 7-వ శతాబ్దములో ఒక కళింగచక్రవర్తి శత్రువులచే అపజయమొంది సింహళములోని బౌద్ధవిహారములో దాసుకొనెనట.

సింహళపు రాజైన నాల్గవ మహీందుడు (క్రీ. శ. 954-970) కళింగ దేశపు రాకుమార్తెను పెండ్లియాడెననియు, ఆమెకు ఒకకొడుకు జన్మించె ననియు, అతడు సింహాసనము నధిష్ఠించె ననియు తెలియుచున్నది.

అనూరాధపురమును పాలించిన ఐదవ మహీందుడు కళింగదేశీయుడే యని శిలాశాసన మున్నది.

ఇంతవరకును, అనగా 10-వ శతాబ్దము వరకును ఆంధ్రులకును సింహళమునకును రాకపోకలును, ఇచ్చిపుచ్చుకొనుటలును

రాజు, బాలక్కర, ఈముగ్గురిచిన్న చెల్లెలు సుందరి యను నామె - వీరందరును సింహళమును చేరుకొనిరి. విజయసింహుని కొమారునికి వారి తాతపేరు 'మధుక మార్ణవ'

[కాండీ విహంగమ దృశ్యము, సిలోను]



## సింహళ దేశమును పరిపాలించిన

యనునామ మిడిరి. కళింగదేశములోని 'గంగ' రాజసంతతికి చేరినవారిలో కొంతమంది పైపేరుగలవా రున్నారు. కాన విజయబాహుడు పై సంతతివారిలో నొక్కరిని పెండ్లియాడియుండవలె నని తెలియుచున్నది

విజయబాహుని కొమారుడు మధుకమార్ణవ, లేక విక్రమబాహుడు 1116-1137 వరకును పాలించెను. ఇతని భార్య సుందరి, లేక సుందరమహాదేవి యుదంబగిరి, లేక ప్రస్తుతపు 'దింబులగాల' లో ఒక గుహ కట్టించి, దానికి 'కళింగ గుహ' యని పేరు పెట్టెనని శిలాశాసన మున్నది.



పురమందిరము, కొలంబో

# సింహళదేశము

## నిష్పాణి

విక్రమ బాహుని అనంతరము అతని కొమారుడైన రెండవ గజబాహువు (1137-1153) పరిపాలించెను. ఇతనికి పుత్రసంతానము లేమింజేసి కళింగదేశమునుండి కొంతమంది బంధువులను పిలిపించి యుండెను. వీరి కాలములో ఆంధ్రదేశమునకును, సింహళమునకును రాకపోకలు ఎక్కువగా నుండి యుండవలెను. వారి ఆస్థానములో చోడగంగ డనునత డుండె ననియు, అతనిని గజబాహువు దత్తు తీసుకొనవలె నని యుండె ననియు చరిత్రరీత్యా తెలియుచున్నది.

ఆంధ్రులు సింహళములోనికి ఎక్కువగా వచ్చుట సహించలేక పరాక్రమబాహు డనువాడు రాజగు గజబాహువు నెదిరించి రాజ్యము నపహరించెను. అప్పటికి ఇక ఆంధ్రులు సింహళ రాజకీయరంగములో నుండి విరమించెదరేమో యన్నట్లుండెను. కాని పరాక్రమబాహునికి సంతానము లేనందున అతని అంత్యకాలములో ఆంధ్రదేశమునుండి తన బంధువైన విజయబాహు వనువానిని రప్పించి అతనికి రాజ్య మొప్పజెప్పెను. కాని ఇతడు రాజ్య మధిష్ఠించిన రెండవరోజే రాజ్యములో, అరాచకము, విప్లవము బయలుదేరి రాజ్యభ్రష్టు డయ్యెను. కాని సేనాధిపతి యగు విజయు డనునతడు రాజ్యమును కుదురుపాటుకు తెచ్చెను. విజయబాహుడు ఒక గొల్లపడుచును ప్రేమించి అందువల్ల హతు డయ్యెను.



[కాండీసరస్సులో ఒకభాగము, సిలోను]

నిస్సమ్మకమల్లుడు తదుపరి రాజ్యమునకు వచ్చెను(1187-1196). సింహళమును పరిపాలించిన ఆంధ్రరాజులలో ఇతనియంతటి గొప్పవాడు లేడు. పాలించినది 9 సంవత్సరములే యైనను దేశమును కట్టుబాటులోనికి తీసుకొనివచ్చి ప్రజలకు శాంతి సంపత్తిని చేకూర్చినాడు. ఇంతటి ప్రముఖుని విషయమున 'మహావంశ'లో ఆ గ్రంథకర్త తొమ్మిది ముక్కలలో ముగించినాడు. అందుకు కారణము తెలియుటలేదు. బహుళా శిలాశాసనములు ఎక్కువగా ఇతనివిషయమై యున్న





వనియేమో. నిస్సమ్మకమల్లుడు ఆంధ్రుడు. అందులో నూటికి నూరుపాళ్లు ఆంధ్రు డన్న మాట. అతని ప్రతికార్యములోను, ప్రతిమాట లోను నేను ఆంధ్రుడ నను ధోరణి కాన వచ్చుచుండును. మావారు ఇంతటివారు, మా వారు ఇన్ని ఘనమైన కార్యములు చేసిరి అని అతడు పదేపదే చెప్పు కొనుచుండువాడు.

ఈనాటి పోలన్నరువాను కట్టించినది ఇతడే. ఇతడు దేశము మూల మూలకును సంచారము చేసినాడు. దేవాలయములు, గోపురములు కట్టించినాడు. రోడ్లు వేయించినాడు. నీటి వసతులు కల్పించినాడు. ప్రజను ఆదరించినాడు. వాటితోపాటు తానును కష్టించినాడు. బౌద్ధమతమును బాగుగా ఆచరించుచు వచ్చినాడు. సంఘములోని దురాచారముల నన్నిటిని తొలగించినాడు. ద్రావిడ దేశముమీద దాడివచ్చి రామేశ్వరములో ఆంధ్రధ్వజము నాటినాడు. ఆకాలములోనే

ఇతడు ఆంధ్రదేశములోని సింహపురీయుడని శిలాశాసనరీత్యా తెలియుచున్నది.

ఇతని తండ్రిపేరు జయగోపరాజు; తల్లి పార్వతీమహాదేవి. ప్రతివస్తువునకును ఇతడు 'కళింగ' యను నామము నిడుచుండెను.



[కొలంబో నౌకాశ్రయము, సిలోను]

భార్యపేరు సుభద్రయయిన ఇతడు 'కళింగ సుభద్ర' యని పిలుచువాడు. పోలన్నరువాకు అతని కాలములో 'కళింగపుర' అనియే పేరు. నాణెముల మీద కూడ 'కళింగ లామకేజస' యని యున్నది.

తోటలకుకూడ కళింగోద్యాన మని పేర్లు పెట్టినాడు.

ఇండియాలోని రికార్డులలో నిస్సమ్మక మల్లుని విషయము ఎక్కడను లేదు. కాని సింహపురివిషయము కళింగాధీశుడైన ఉమవర్మ తామ్రశాసనములో చెప్పబడి యున్నది.

అమరావతీ నాగార్జునకొండలు దక్షిణాపథములో ఎక్కువ కాలము బౌద్ధమతమునకు ఉనికిపట్టులుగా నుండియుండినందువల్ల సింహళము మొదటి రాజు శ్రీ విజయుడు ఈప్రాంతీయుడే అయియుండవలయునని యు, సింహపురము ప్రస్తుతపు బెజవాడగా నుండవచ్చుననియు నా యూహ.

నిస్సమ్మకమల్లుని అనంతరము చెప్పుకో దగినంతటి రాజులు లేరు కాన వారిచరిత్ర మన కనవసరము.






అనకాపల్లి సమీపములో
శ్రీ సత్యనారాయణస్వామి
తీర్థము



# అమాయకుడు



[ కథానిక ]

శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తి

"ఇన్నాళ్లు వూరుకుంటే నీకు సీటు ఎలా వుంటుం దనుకున్నావు?" అన్నాడు ప్రిన్సిపాల్ లాంఛనంగా.

"ఆలిస్యం అయిపోయిందండి! అన్నిటికీ నాకు నేనే కావటంవల్ల ఇలా అయింది!" అన్నాడు శాస్త్రి వినయవిధేయతలతో.

"మరి సర్టిఫికేటూ, జీతం సిద్ధంగా వున్నయ్యా?"

"చిత్తం!"

"అయితే ఈ ఫారం పూర్తిచేసి జీతంకట్టి వెంటనే క్లాసుకు వెళ్లిపో!"

శాస్త్రి జీతంకట్టి రసీదు తీసుకుని వెళ్లబోతుండగా ప్రిన్సిపాలు పిలిచాడు.

"ఇప్పటినించీ నీవు సరిగా కాలేజీకి వచ్చినట్లయితే అటెండెన్సు సరిపోతుంది. నీ అశ్రద్ధవల్ల కానీ, మరి ఏ ఇతర కారణంవల్ల కానీ అటెండెన్సు కనక చాలకపోతే నే నేవిధంగానూ సహాయం చెయ్యను. ఆలిస్యంగా చేరతానంటేమటుకు నన్ను ఎందుకు చేర్చుకోవాలని అప్పుడు నీవు వాదించి లాభం వుండదు. ఇవన్నీ నీవు ముందరే తెలుసుకుని కాలేజీలో చేరినట్టు భావిస్తున్నాను!"

"ఫరవాలేదండీ!" అన్నాడు శాస్త్రి. దిమ్మెరపోయి.

"ఆల్ రైట్!"

ఆసాయంకాలం గంట కొట్టగానే అందరితోపాటు శాస్త్రి తన కొత్త స్నేహితుడితో (ఆలిస్యంగా చేరే వాడికి ఎవడో ఒకడు రెండునిమిషాలలో దొరకకపోడు) గది బయటికి వచ్చాడు. ఓ యాభైమంది విద్యార్థులు గుంపుకూడి ఏమిటో చేస్తున్నారు. శాస్త్రి ఏమిటోచూద్దామని స్నేహితుడితో ఆగుంపును సమీపించాడు. అందరు మగ విద్యార్థులమధ్య ఓవిద్యార్థిని తలవంచుకుని నిలబడి వున్నది. ఆమెపక్కన మగవిద్యార్థిప్రవాహాన్ని ఆపుతూ కార్తవీర్యార్జునుడిలా ఓబ్రాహ్మణుడు నిలబడివున్నాడు. ప్రతి శుక్రవారం ఇంతేనని శాస్త్రికితర్వాత తెలిసినప్పటికీ అప్పుడు ఈ సినిమా ఏమిటో అర్థం కాలేదు. ఇంతలో అర్థం అవుతున్నట్టు అనుమానం వేసింది. ఆమెముందున్న ఇనప మెట్లమీదుగా మొదట తలలు, తర్వాత నడుములు, ఆతర్వాత కాళ్లు బయటపడుతూ ఒక్కొక్కరే విద్యార్థులు పైకి వచ్చి పైన వున్న తోటి విద్యార్థులు ఇచ్చిన దారిగుండా వెళ్లిపోతున్నారు.

ఆ గుండ్రగా దిగిపోయే ఇనప మెట్లమీదుగా ఇద్దరు కలిసి దిగిపోవచ్చు, లేక ఇద్దరు కలిసి పైకి రావచ్చు—లేదా ఒకరు దిగిపోతుండగా గాని, పైకి వస్తుండగాగాని మరొకరు పైకి వస్తూగాని కిందికి పోతూగాని ఒకరిని ఒకరు దాటిపోవచ్చు పురుషులయితేమటుకు. లేక అందరూ స్త్రీలయినా ఫర్వాలేదు. అంతే కాని ఒకస్త్రీ కిందికి పోతుండగా గాని, పైకి వస్తుండగాగాని ఒక పురుషుడు అదేసమయంలో పైకి వస్తూగాని కిందికి పోతూ గాని మధ్య ఒకరిని ఒకరు దాటిపోవటానికి పురుషుడికి అభ్యంతరం లేకపోయినప్పటికీ స్త్రీ సమ్మతించదు. స్త్రీకి సమ్మతం ఉన్నప్పటికీ అభాజను డైతే పురుషుడికి సమ్మతం ఉండదు. ఇద్దరికీ సమ్మతం వున్నప్పటికీ అలా చెయ్యటానికి కాలేజీచట్టం ఒప్పుకోదు. కాలేజీకి అటువంటి చట్టం లేకపోతే ఎవడో ఒకడు సైంధవుడల్లే అడ్డుపడి అలాంటిది జరగకుండా చెయ్యటం తప్పదు. ఏతావతా స్త్రీలూ పురుషులూ ఎంత సమానమయినప్పటికీ ఆ మెట్లమీద ఒకరిని వొకరు దాటిపోరు. ఇంతవరకు జరగలేదు. స్త్రీ మెట్లు దిగిపోతున్నా, ఎక్కిపోతున్నా పురుషుడు మూడుమెట్లు ఎడంగా దిగిపోవటంగాని ఎక్కిపోవటం గాని జరగాలిసిందే. అందు కెవ్వరూ ఏమనరు. ఒకవేళ స్త్రీ మెట్లు దిగి

వస్తున్నప్పుడు గాని, ఎక్కి వస్తున్నప్పుడుగాని పురుషుడు ఎక్కిపోతూగాని, దిగిపోతూగాని ఎదురుపడితే— ఇలా జరగటానికి బోలెడు వీలుంది. ఎందుచేతనంటే: పైనున్న వారికి కింది నించి స్త్రీగాని పురుషుడుగాని అసలు వస్తున్నదీ లేనిదీగాని, అలాగే కింది వారికి పైనించి స్త్రీగాని పురుషుడుగాని అసలు వస్తున్నదీ లేనిదీ గాని మెట్లు గుండ్రంగా తిరిగిపోవటంవల్ల తెలియదు— ఏమవుతుంది? అడవిలో సింహమూ, పెద్దపులీ ఎదురుపడితే ఏమవుతుంది? అడవిలో ఏమవుతుందో చెప్పలేం కాని, ఇక్కడ ఒకరి మొఖాలు ఒకరు చూచుకుంటారు. అదివరకు స్త్రీ విద్యార్థినులు వెళ్లుతుంటే ఆపుకో లేకుండా వెకిలి నవ్వు నవ్వేవా డయితే వెధవ మొహంవేసి ఆమెవంక చూస్తాడు. ఎన్నడూ అదివరకు అతన్ని కన్నెత్తి అయినా చూడని దయితే ఆమె మొదటిసారి ఆపని చేస్తుంది. బయట సారకాయలునరికేవాడయితే అతడు ముందర వెనక్కి తిరిగి మెట్లు దిగటంగాని, లేక వెనక్కి తిరగకుండానే మెట్లు ఆమెను చూస్తూనే ఎక్కి ఆమెకు దారి ఇయ్యటంగాని జరుగుతుంది. స్వాతంత్ర్యముకోసం సమరం చేసే యువతయితే వెనక్కి తిరిగి మెట్లు దిగటంగాని, ఎక్కిపోయి అతనికి దారి ఇయ్యటం గాని జరుగుతుంది. అతను ఎన్నడూ ఆడది తన వంక చూడనివాడయితే, భర్తచేత అడిగినప్పుడల్లా ముద్దు పెట్టుకోనిచ్చేటటువంటి ముగ్ధలాంటి దయితే ఎవరోమూడోవారు పైనించో కింది నించో వచ్చేవరకూ అలాగే నిలబడిపోతారు ఒకరివంక ఒకరు బెదరు చూపులు చూస్తూ. అంతేగాని ఒకరిని ఒకరు దాటిపోరు!

ఇంతలో పైకి వచ్చే విద్యార్థులు అయిపోయినారు. రెండు సెకండ్లు పూరుకుని ఆ బ్రాహ్మణుడు ఆమెకు 'పద' అన్నట్టు సౌంజ్ఞ చేశాడు. ఆమె కాలు మెదిపిందో లేదో మళ్లీ ఇంకోడు పైకి వచ్చాడు.

"ఇంకా ఎవరన్నా వున్నారా కింద?" అన్నా డా బ్రాహ్మణుడు ముక్కోపంతో.

"చాలామంది వున్నారండి!" అన్నా డతను.

"పైకి వస్తున్నారా?"

"తెలేదండి!"

ఒక్కనిమిషం ఆగారు. ఎవ్వరూ పైకిరాలేదు. ఎవరో శాస్త్రి వెనక "రైట్" అన్నారు. విద్యార్థులలోనించి బయలుదేరబోయే కలకలారవ మంతా ఆ బ్రాహ్మణుడు చూచిన శబ్దవేది చూపుతో పొంగే పాలమీద నీళ్లు పోయగానే అణిగిపోయినట్టు అణిగిపోయింది. ఏమనుకున్నాడో ఏమో, "పద" అని ఆమెను రూల్సుప్రకారం మూడుమెట్లు దిగనిచ్చి ఆ వెధవ కూత వచ్చినవేపే చూస్తూ దిగిపోయినాడు. శాస్త్రికి కనపడ్డది ఆఖరుకు ఆయనకన్నులు. తర్వాత భాగంలో అతనికి అభిరుచి లేకపోయింది.

అందరూ దిగనిచ్చిం తరవాత "ఆమె ఎవరూ?" అని అడిగాడు శాస్త్రి కొత్త స్నేహితుడిని.

"మనక్లాసేలే!" అన్నా డతను.

"ఆమెపేరు?"

"రాధిక!"

"ఆయ నెవరు?"

"తెలుగు లెక్చరర్—దీక్షితులు గారు."

"ఆమెకు చుట్టమా?"

"ఆమె విద్యార్థిని; ఆయన లెక్చరర్. మనకు తెలిసినంతవరకు అంతకంటె బాంధవ్యం లేదు. విద్యార్థినులను విద్యార్థులబారినుండి తప్పించటం ఆయనకు హాబీ. ఆ అమ్మాయిని రక్షించటం ఆయనకు విధి! అయితే ఈయన కాన్వాయిపద్ధతి కొంతమంది స్త్రీలకే ప్రాణసంకటంగా వుంటున్నప్పటికీ మొత్తంమీద గుణం కనిపించకపోలేదు. ఆమె అంటే ఆయనకు ప్రాణం!"

"ఆచికిలికన్నులచకోరాహా!"

అతను శాస్త్రివంక ఒక్కనిమిషం చూశాడు జాలిగా!

"అప్పుడే అయిందీ! ఆమెతో నీవు వెర్రిమొర్రివేషాలు ఏమైనా వేసినావట్టయినా నీకూ, ఆయనకూ గట్టి రంధి పడుతుంది తెలిసిందా? ఆతర్వాత ఆయన నిన్నేమీ చెయ్యకుండా ప్రిన్సిపాల్ కాదుకదా బ్రహ్మదేముడు ఆపలేడు. ఆమెకు సంగీతం చెప్పుతున్నాడనో, చెప్పిస్తున్నాడనో విన్నాను. ఆమెను విపరీతమైన తెలివితేటలుకలదాన్నిగా చేసి, అన్నివిషయాలలోనూ సాటిలేని మేటిగా చేసి, ఆమె అట్లా కావటానికి తనే కారణం అని లోకానికి అనుమానమే

కలగనిచ్చి, ఎవరైనా ఆమెను అట్లా శీలవంతురాలిగా చేసినందుకు ఆయన్ని అభినందించబోతే "నా దేమీ లేదండీ! అసలు బంగారం మంచిది కావాలి." అని ఒక్కచిరు నవ్వుతో తప్పుకునేస్థితిలో ఎల్లప్పుడూ వుండి, వొంటరిగామటుకు రాధిక చేతనే అరగంట కొకసారి మెప్పు పొందాలని ఆయనకు వుంది! సెనగలసెట్టి మామిడిటెంకమింగికూచుని వూరికే తనలో తానే నవ్వుకుని రత్నాలు రాసులుగా చెయ్యటం ఎరగవూ? రాధిక గుణవతి అయిన ఏసినిమాస్టారో, ఏ ఎసెంబ్లీమెంబరో, ఏకళాశాలలోనో ఏలెక్చరరో అయి ఎవ్వరికీ మాట్లాడటానికిగూడఅందక, ఏధనవంతుడినీ సమానంగా చూడక, ఏఅధికారినీ లక్ష్యంచెయ్యక ఎప్పుడైనా స్వగ్రామం చేరి తన ఇంటికి ఆ కుచేలుడి ఇంటికి సాక్షాత్తు ఆ శ్రీకృష్ణభగవాను డేతెంచినటుల ఏతెంచి పురజనులకూ, పురప్రముఖులకూ, రాష్ట్రీయాధికారులకూ ఆశ్చర్య సంభ్రమములు కలిగించిందనుకో! "ఆతార ఈ గోచిపాత రాయడింటికి ఎందుకు వెళ్లెను" అన్న ప్రశ్నకు "ఆమె అలా కావటానికి కారణం ఆయనే! ఆయన ఆమెకు గురువు" అని సమాధానం రాగానే "ఔరౌరా!" అని అందరూ ఆశ్చర్యచకితులు కారో? అది ఆయనకు ఇష్టం!"

"చాలాదాకా వుందే!"

"మరేమి టనుకున్నావు? ఈ సంగతి తెలియక ఒకడు ఆమెకు ఏదో వుత్తరం రాశాడు. వెధవ వుత్తరం ఎందుకు సాక్ష్యంగా? ఈలలు వేశో, ఒక కంటితో సౌంజ్ఞ చేశో, ఫలించకపోతే రెండు కళ్లతోనూ, చివరకి తలతోనూ సౌంజ్ఞలు చెయ్యకా! అప్పటికీ లాభించక పోతే బిక్కమొహం వెయ్యటం వుండనే వుంది కదా? ఆపైని అర్ధరాత్రివేళ ఆమె ఇంటిచుట్టూ తిరగటం మొదలయినవి ఆమెకే తెలిసేవి, ఇబ్బంది లేనివి బోలెడు చిటికెలుండగా వుత్తరం రాశాడు. మమ్మల్ని కన్నట్టు చేసినా ఏదో విధంగా వెలిగించేవాళ్లం. అలాంటిదేమీ లేకుండా, వుత్తరం రాశాడు. పైగా తనే రాసినట్టు తెలియటానికి సంతకం చేశాడు. ఆమె ఏంచేసిందనుకున్నావు? ఆవుత్తరం చించి వీడి మొహాన పారేసి వుమ్మెయ్యకుండా, ఆయనకు చూపించింది! చూపించింది అని మా అనుమానం. మర్నాడు ఆయన వాడికి పదిరూపాయలు అనహ్యామైన ప్రవర్తనకు ఫైను వెయ్యటమూ, దూర పదిరోజులు సస్పెండు చెయ్యటమూ జరిగినై. రేపటినించీ వాడూ వస్తాడు కాలేజీకి. ఆయనకు తెలియకుండా ఆమెఅనుగ్రహాన్ని సంపాదించాలన్న వుద్దేశ్యంతో — అంతకన్న వేరేవుద్దేశ్యం ఏమీ వుండివుండదులే — ఆయనదగ్గిర గూఢచారులుగా చేరారు కొందరు. ఎవరు ఆమె వంక ఎప్పుడు ఎట్లా చూచేదీ ఆయనకు చెబుతుంటారు. ఆయన్ని గురించి ఎవ రేమనుకునేదీ— ఏ విషయంలోనైనా సరే — ఆయనకు తెలియబరుస్తారు. అందుకని, ఇవాళే చేరావు కనకనూ, రేపే ఇంటికి పోవటం నా కిష్టంలేదు కనుకనూ చెప్పుతున్నా."

"ఆఁ, నా కెందుకు?"

"ఆమెను బాగా తర్ఫీదు చేసి ఆయనే వివాహంచేసుకుంటా డని గిట్టనివాళ్లు ఇద్దరుముగ్గురు కసితీర్చుకోటానికి పుకారు పుట్టించినా నిజమయివుండ దని నానమ్మకం. ఆయనకు యాభై దాటాయి; ఆమెకు పదహారు దాటాయేమో. అంతే! ఆదంతా వట్టిదికాని ఆయనబంధుకోటిలోనే ఎవరన్నా వున్నారేమోనని నా అనుమానం. ఈకాలేజీలో ఆమెతో చదివేవాళ్లని చూస్తేనే ఆయనకు కోపం!"

"చాలాముఖ్యమైనది చెప్పావు!" అన్నాడు శాస్త్రి.

"ఫలితం దక్కినప్పుడుకదా?"

మర్నాడు శాస్త్రి గ్రూపుమార్చి రాధికతీసుకున్న గ్రూపు తీసుకుని ఆమెవున్న క్లాసుకు వెళ్లాడు. మన్ను తిన్న పాములే అదివరదాకా ఏదో చెప్పుతున్న దీక్షితులుగారి కళ్లు శాస్త్రిని చూడగానే మెరిసినై!

శాస్త్రి పిల్లల్లో ప్రవేశించి నిలుచున్నాడు.

"ఎవరు నీవు?"

"కాలేజీలో కొత్తగా చేరిన విద్యార్థిని!"

"ఎప్పుడు చేరావు?"

"నిన్న."

"ఏంగ్రూపు?"


సుందర సుకుమార వినీల
కుంతల సమృద్ధిని గన్న
అఖిల హిందూ,
బర్మా, మలయ, సింహళాది
వివిధ దేశముల స్వాధీనపరచుకొన్న
కేశవర్ధిని
కింకను రాజ్యకాంక్ష యేల?
కేశవర్ధిని.
సుప్రసిద్ధ భారతీయ కేశవర్ధకౌషధ రాజము.

"మీ గ్రూపేనండి!"

"మరి నిన్న క్లాసుకు రాలేదేం?"

"నిన్న ఇంకో గ్రూపు తీసుకున్నానండి—ఇవాళ మార్చాను."

తోకతొక్కిన తాచల్లే లేచి కూర్చున్నాడు దీక్షితులుగారు!

"కారణం?"

"నాకు అది నచ్చలేదండి!"

"ఇది నచ్చుతుం దని ఏమిటి నమ్మకం?"

"ఇది నచ్చకపోతే ఇంకోటి తీసుకుంటానండి!"

"ఇందుకేనా నీవు కాలేజీకి వచ్చింది?"

"దేనికండీ?"

"రోజు కో గ్రూపు మార్చటానికేనా?"

"కాదండి!"

"మరి?"

"అందరూ ఎందుకు కాలేజీకి వచ్చారో అందుకే వచ్చానండీ!"

"అందరూ చదువుకోటానికి వచ్చారు."

"నేనూ అందుకేనండి!"

"మరి అందరూ నీకుమల్లే గ్రూపులు మార్చటం లేదే?"

"అందరూ నాకుమల్లే మార్చటం లేదు కాని నాకుమల్లే మార్చినవారు లేకపోలేదండి."

"ఎవరు?"

"ఈక్లాసులోనే వున్నారు. మీకు మల్లే తెలుగుభాషని బోధించేవారు లేరన్నసంగతి జగద్విఖ్యాత మే కాకుండా నిన్న ఒకరు చెప్పగా విన్నానుకూడాను. అప్పుడే మీ క్లాసుకు వద్దా మనుకొన్నాను."

"ఎవ రాచెప్పింది?"

"నాకు పేరు తెలియదండీ!" శాస్త్రిచూపు దూరాన రాధికకు సమీపంలో కూచున్న స్నేహితుడి మీద పడ్డది. వాడు శరీరమంతా కళ్లుపెట్టుకు ఇతనివంక చూస్తున్నాడు బిక్కమొహంతో!

"నువ్వు నాక్లాసులో వుండటానికి నాకు అభ్యంతరం లేదుకాని నువ్వు కొద్దిరోజులలోనే ఇంకో క్లాసుకు వెళ్లిపోవలసివస్తుందేమోనని నాభయం!

"ఎందుకని అండీ!"

"నాకు చిలిపిచేష్టలు చేసేవారంటే మహా అసహ్యం. కావాలంటే వీరిలో ఎవరిని అడిగినా చెపుతారు!" అన్నాడు దీక్షితులుగారు ముందుకు వంగి శాంతంగా.

ఇంతలో గంట కొట్టారు. దీక్షితులుగారు లేచి శాస్త్రివంక అలాగే చూస్తూ నిష్క్రమించాడు. ఆయన వెళ్లాడో లేదో పదిమంది వచ్చి ఇతని చుట్టూ మూగారు. ఒకడు ఇతని రొమ్ముమీద చెవిపెట్టి గుండె ఎలా కొట్టుకుంటున్నదో పరీక్షించాడు. అట్లా ఒకరితర్వాత ఒకరు పరీక్షిస్తూవున్నారు.ఇంతలో తర్వాతి క్లాసుమేష్టరు వచ్చాడు. ఎక్కడివా రక్కడకు వెళ్లి చతికిలబడ్డారు.

కాలేజీ వదలగానే స్నేహితుడు శాస్త్రిని కలుసుకున్నాడు.

"నీకు గట్టిగుండె వుంది కాని లాభం లేదోయి బ్రదర్! నీకూ ఈయనకూ యుద్ధం తప్పదనీ, దాని ఫలితం నీకే ఎక్కువ నష్టకరంగా వుంటుం దనీ వామాక్షి చెప్పుతున్నది."

"ఎందుకని?"

"ఏమిటా సమాధానాలు?"

"ఏమిటా ప్రశ్నలు?"

"వాటికి సమాధానం లేదు!"

"ఆయన అడిగినా?"

"మమ్మ ల్నెవర్నీ అట్లా అడగ డేం?"

"మీ రెవ్వరూ జబాబియ్యరు కనక!"

"మేం చేసేదే తెలివిగల పద్ధతి అంటున్నాను."

"నేను చేసిందాంట్లో తప్పు లేదంటాను!"

"నీయిష్టం కాని జాగర్త. తర్వాత నేను చెప్పలే దనుకోవద్దు ఆడదానికి మల్లే నాజూకుగా వున్నాను కదా తప్పించుకోలేనా అనుకుంటున్నావేమో!"

"మీ రిట్లా వున్నారు కాబట్టే ఆయ నట్టా చెలాయిస్తున్నాడు. మనవల్ల తప్పు లేనప్పుడు భగవంతుడుమటుకు మన నేమి చెయ్యగలడో నాకర్థం కాలేదు!" స్నేహితుడు పెదిమ విరిచాడు.

రోజులు గడిచిపోతున్నయి. శాస్త్రి మామూలుగానే కాలేజీకి

పోతున్నాడు. దీక్షితులుగారి కన్ను ఒకటి తనమీదకి వున్నట్టు తనకే కాకుండా అందరికీకూడ తెలుసు ననుకున్నాడు. బయటికి శాంతంగా వున్నా లోపల అగ్ని రగుల్కుంటూ నేవున్న దని శాస్త్రిస్నేహితుడికి అనుమానంగానే వుంది. దానికి తగ్గట్టుగా నిదర్శనాలు కనుపించకపోలేదు. శాస్త్రి ఆలిస్యంగా వస్తే దీక్షితులుగారు ఘోరమైన నేరంగా పరిగణించి సహించలేకపోవటమూ, శాస్త్రి పక్కవాడితో ఏది మాట్లాడినా బుస్సున తాచల్లే లేవటమూ దేనినైనా సమర్థించబోతే శాస్త్రిని బలవంతాన కూచోపెట్టటమూ మొదలయినవి ఆరోజు కారోజుకు వృద్ధిఅవుతున్నయి. ఇతరు లింకెవరు అలా చేసినా దీక్షితులుగారు అట్టే పట్టించుకోకపోవటమూ, శాస్త్రినే సహించలేకపోవటమూ శాస్త్రిస్నేహితుడు గమనించాడు. కారణమేమిటో అతనికి అర్థం కాలేదు. ఎవ్వరికీ అర్థంకాలేదు ఆమాటకొస్తే. దీక్షితులుగారి చర్య శాస్త్రిస్నేహితుడికి అర్థం కాకపోయినా తప్పు శాస్త్రిదే అయివుంటుందని అతని అనుమానం. ఒకరోజున శాస్త్రిని నిలవేసిఅడిగాడు. తనేమీ చెయ్యలేదని విసుక్కున్నాడు శాస్త్రి. అకస్మాత్తుగా శాస్త్రిస్నేహితుడికి ఒకఆలోచన కలిగింది.

"నువ్వు కాలేజీలో చేరినరోజున రాధిక మెట్లు దిగబోతుంటే ఎవరో 'రైట్' అనటం నీకు జ్ఞాపకముందా?" అన్నాడు స్నేహితుడు.

"ఆ!"

"అప్పు డాయన ఆశబ్దం వచ్చిన వైపు చూచాడు జ్ఞాపక ముందా?"

"ఆ!"

"మన వెనక ఎవరో ఆమాట అన్నారు. ఆయన మనవంక చూచాడు. నీవు కనపడివుంటావు. నువ్వే అది అన్నా వని ఆయనకు అనుమానం కలిగివుంటుంది. నీది కొత్త మొహం కావటం చూసి అప్పుడేమీ చెయ్యలేకపోయినా డనుకుంటాను. తగినట్టు మర్నాడు నీవు ఆయనక్లాసుకు వచ్చావు. అందుకనే చిలిపిచేష్టలు చేసేవా రంటే నాకు మహా అసహ్యం అన్నాడు, జ్ఞాపక ముందా?"

"ఆ!"

"ఆయన వుద్దేశం అనుమానించవలిసిన సందేహం లేదు. నువ్వే ఆ మా ట అన్నా వ ను కు ని సరికొత్తవాడివి కావటంవల్ల అంత తేలికగా పోనిచ్చాడు. కాని అది బైటికి వస్తునేవుంది! నన్నయినా నిన్నయినా అనుమానించాలి ఆమాటన్నట్టు. నాకు ఇంకా వారంటు పుట్టలేదు కనక ఆయన నిన్నే అనుమానిస్తున్నాడని నానమ్మకం. చూశావా?"

"మరి నేచేసిన తప్పేమిటి?"

"ఆయన కేం తెలుసు ఆసంగతి?"

"అందుకని నన్నిట్లాచూస్తాడా?"

"ఆయనగుణం అది! అదీకాక ఫలాని తప్పు నేను కాదు చేసింది అని చెప్పటాని'కూడ వీలులేదు. ఇది ఎవరు చేసింది అని ఆయనకు అనుమానం లేకుండానే తెలిసిపోయె!"

"వీలుంటేమటుకు వెధవదీనికి ఆయనతో మొరపెట్టుకుంటామా?"

"మరి ఏమిటి చెయ్యటం?"

"మాట్లాడకుండా వూరుకోటమే!"

"దానివల్ల ప్రయోజనం లేదు. అసలు నువ్వు రాధిక తీసుకున్న గ్రూపు తీసుకోకపోతే ఆయన అంతటితోనే మరిచిపోయేవాడు. నువ్వు మర్నాడే ఆయనక్లాసుకు చేరితివి."

"అయితే?"

"అదీకాక నువ్వు ఆయన అనుమానించినట్టు చిలిపిచేష్టలు చేసేవాడివే అయినట్లయితే ఆయన కింత బాధ వుండదు. ఎప్పుడో నిన్ను పచ్చడిచేసేవాడు. అట్లాకాక నువ్వు నిజంగా చిలిపిచేష్టలు చెయ్యనివాడవయినప్పటికీ చేయనివాడివిలాగ కనిపించటంచేతనిన్నిట్లా సాగతీయాలో ఆయనకు అర్థం కాలేదు! మొదటిరోజున నీమాటలు చూసి ఆయనకు అనుమానం వేసివుంటుంది ఎవరో గడుసుపిండమేనని! ఆయనతో అదివర కలా మాట్లాడినవాడే లేకపోయె!అందుచేత తలకాయ లోపలికి దూర్చిన తాబేలులావున్నావు ఆయన ప్రాణానికి. నేర్పరిఅయిన దొంగవనీ, నీతో జాగ్రత్తగా వుండటం అవసరమేననీ ఆయనకు నమ్మకం కలిగిందని నా అనుమానం!"

"అదిమటుకు నిజం! ఆయన సంగతి పూర్తిగా స్టడీచేసిన ట్టున్నావే?"

"ఇదంతా నా తెలివికాదు! నేను కిందటిఏడాది ఆయనచేత డిబెయిన్ చేయించబడ్డాను. అదివరకు నేను నీకు చెప్పినట్టే ఇతరులు ఆయన్ని గురించి చెపితే నేను నమ్మలేదు. ఆయనదెబ్బ తగిలింతరువాత గాని ఆయనతత్వం నాకు బాగా అర్థం కాలేదు! ప్రతి సంవత్సరమూ ఆయన ఆగ్రహానికి ఎవడో వొకడు గురి అవుతూనే వున్నాడు."

"నిజంగానా?" అన్నాడు శాస్త్రి.

వారం రోజులు గడవక మునుపే "లెక్చరర్లతో అసహ్యంగా మాట్లాడినందుకు" శాస్త్రికి రూపాయ ఫైను వేశాడు దొర! శాస్త్రిని యజ్ఞపశువు కింద కట్టేశారు విద్యార్థులంతా. శాస్త్రి మటుకు మాట్లాడలేదు. తన తప్పేమీ లేదని దొరతో చెప్పను కూడ లేదు. వెంటనే వెళ్లి ఫైను చెల్లించాడు. పదిహేను రోజులలో మళ్లీ రూపాయ ఫైను పడింది! దొర పిలిచి "ఏమిటి ఇది" అని అడిగాడు. "మీకు తెలియని దేముంది ?" అన్నాడు శాస్త్రి.

"ఈతడవ నీకు ఫైను ఒక్క రూపాయతో పోదు. యాభై ఏళ్ల లెక్చరర్ను అవమానించటానికి నీ వెంత వాడివి ?"

శాస్త్రికి కాలేజీఅన్నా, లెక్చరర్లన్నా అసహ్యంవేసింది. అత నెంత వుత్సాహంతో పొలం అమ్మి కాలేజీలో చేరాడు! అతను కట్టిన మేడలన్నీ ఏమయిపోయినై ?

ఒకరోజున ప్రిన్సిపాల్ దొర అందరినీ హాలులోకి హాజరుకమ్మని నోటీసుఇచ్చాడు. అందరూ చేరింతరువాత దొర శాస్త్రిని పేరుపెట్టి పిలిచాడు. శాస్త్రి ఏదో వచ్చిందనుకుని నిలబడ్డాడు.

"నీమీద ఒక అపరాధం వచ్చింది. వూళ్లోవిషయాలు కథలుగానూ, పద్యాలుగానూ రాసేవాళ్లున్నారు. ఒకపుస్తకంలోనించి ఒకవిషయాన్ని తీసుకుని స్వంతవిషయమల్లే అక్కడక్కడ మార్చి చెత్తసాహిత్యాన్ని సృష్టించేవారున్నారు. కాని నీకుమల్లే మూలానికి మూలం ఎత్తి స్వంత పేరుతో ప్రకటించేవాళ్లుండరని నానమ్మకం! కాలేజీతరఫున ప్రకటిస్తున్న పత్రిక ఇలాంటి రచనలకూ, రచన చేతకాని రచయితలకూ నిర్దేశించబడింది కాదు. రచనాశక్తివున్న వాళ్లు తమ శక్తిని పదునుపెట్టుకోటానికే ఇది వుద్దేశించబడింది. మొన్న వెలువడిన సంచికలో నీ పేరుతో ప్రచురించబడిన పద్యాలు నీవికావు. నీవు చేసిన దొంగతనం బైట పడదని నీ కెలా ధైర్యం కలిగిందో నాకు ఆశ్చర్యంగా వుంది! ఇలాటిపని చేసినందుకు నీ వేమి చెప్పుకుంటావో నీ స్నేహితులముందు చెప్పుకోవలిసింది!" అన్నాడు ప్రిన్సిపాల్. హాలంతా నిశ్శబ్దం అయిపోయింది. అందరూ ఆశ్చర్యంగా అతనివంక చూచారు. శాస్త్రి మెల్లిగా వెళ్లి బల్లదగ్గిర నిలబడ్డాడు. అతని మొహాన కత్తివాటు వేస్తే నెత్తురు లేదు!

"ఇది చాలా అన్యాయం!" అన్నాడు అతను మెల్లిగా. "నాపేర అచ్చుపడిన పద్యాలు దొంగిలించిన వని చెప్పగలిగిన పండితు లెవరో నాకు తెలుసు; మీఅందరికీకూడ తెలుసునేమో. నేను దొంగతనంచేశానని అనుకున్నా నాకు జరపవలిసిన శిక్ష ఇటువంటిది కాదేమో. నన్ను దొర చీవాట్లు పెట్టవచ్చును. నాకు విపరీతమైన ఫైను వెయ్యవచ్చును. నేను చేసిన పని అందరికీ తెలిసేటట్టుగా నోటీసుఇచ్చి నాకు అవమానం కలగ చెయ్యవచ్చును. కాని దానితో వారికి తృప్తితీరకపోవటంచేత ఇలా జరిపారేమో! వ్యాసాల్ని చోరీచేసిన వారి గతి ఇంతేనన్నట్టు దాఖలా చూపించారు కాలేజీవారు! నేను చేసిన పని అంత ఘోరమైనదా ? దీని కింత ఘోరమైన అవమానం చెయ్యాలా? కాని దొరగారు వారంతట వారు ఇలా చేసివుంటారని నేను అనుకోను. నామీద ఏకారణం వల్లనో క్రోధరసం తల కెక్కినవాడు ఈచాడీ చెప్పివుండాలి! కాని అతని కోరిక తీరనందుకు నేనూ, అతనూ విచారపడుతున్నాం. అత నెంత తెలివికలవాడయినప్పటికీ ఇక్కడ పప్పులో కాలు వేశాడు. అసలు సంగతి ఏమిటంటే, ఏపద్యాలయితే నేను దొంగతనం చేశాననుకుంటున్నారో అవి నేను రాసిన పద్యాలే!"

"నీవు రాసినవా?" అన్నాడు దొర.

"అవును! కొన్నాళ్లకిందట ఆ పద్యాలు రాసి నా అసలుపేరు పెట్టుకోటానికి సిగ్గుపడి మారుపేరుతో ఒకపత్రికకు పంపాను. నాకు ఆశ్చర్యం కలిగేటట్టు అవి అచ్చయినై! అవే మళ్లీ కాలేజీపత్రికకు పంపాను.

అచ్చయినవే పంపానన్న నేరం నా మీద మోపబడితే నా కభ్యంతరం లేదు. నా కంతకంటె తెలివితేటలు లేవు! అసలుసంగతి అది!" విద్యార్థులొక్కసారి గొల్లుమన్నారు.

"అవి నీవేనని రుజువుచెయ్యగలవా?" అన్నాడు దీక్షితులుగారు ముఖం మడతలుపడేసి.

"ఆపని చెయ్యాలిసింది మీరు!" అన్నాడు శాస్త్రి.

ప్రిన్సిపాల్ దొర ఆపత్రికాధిపతికి ఆపద్యాలు రాసినవారి పేరు తెలియపరచ మని రాయటమూ, శాస్త్రి పేరు తిరుగుటపాలో రాగానే దీక్షితులుగారు నివ్వెరపోవటమూ, దొర పెదివు విరవటమూ ఇన్నీ జరిగినై.

దీక్షితులుగారు మండిపోయినారు. తనమీద ఒకకుర్రాడు జన్మలో మరచిపోని దెబ్బ తీశాడు. ఆ రోజునించీ ఆయన క్లాసులో విషం కక్కేవాడు పూరికేనే. రెండురోజులు పాఠం ఇలా తగలపడిపోవటం చూసి ఇద్దరు ధైర్యంచేసి దీక్షితులుగారు చెప్పేది ఏమీ అర్థం కావటం లేదని సవినయంగా మనవిచేశారు. కాని వారి రోదనం అరణ్యరోదనం అయింది.

చాటుగా పదిమంది విద్యార్థులు శాస్త్రిని వేనోళ్ల పొగడారు. కాని శాస్త్రికి ఆవిధంగా తృప్తి కలగలేదు. అతను చేసింది ఏముంది? దీక్షితులుగారు ఆయనంతట ఆయనే గోతిన పడ్డాడు. తనంతట తాను చెయ్యగలిగినప్పుడుగా?

ఇంతలో కాలేజీడే దగ్గిరికి వచ్చింది.

"చూసుకో" అన్నాడు ఒకరోజున శాస్త్రి స్నేహితుడితో.

"ఏమిటి?"

"చూస్తూ వుండు. కాలేజీడే దగ్గిరికి వస్తూంది కాదూ? కలెక్టరుగారు బహుమతులు ఇస్తారు కాదూ? చూడు మరి!"

"ఏమిటో చెప్పుదూ!"

"ఇప్పుడు కాదు లే!"

"దీక్షితులుగారు సంగీతంలో గెలిచినవారికి నూరురూపాయలు బహుమానం ఇస్తాట్ట! ఆయనకు సంగీతం అంటే ఎంతప్రీతి?"

"అదికాదు. రాధికకన్న ఎవరూ బాగా పాడలేరని ఆయననమ్మకం. నిజం అయితే కావచ్చుకూడ. రాధికకుఈవిధంగా బహుమానం ఇయ్యాలన్న ప్లాహ వుంది ఆయనకు!"

"ఆరి వీడి తస్సాచెక్కా! నువ్వు చెప్పింది నిజమేనోయి!"

"అయితే అలా జరగదు!"

"ఎందుకని?"

"దీక్షితులుగారి కోరిక నెరవేరటం భగవంతుడికిష్టంలేదుకనక!"

"అంటే!"

"అంతే!"

* * *

హాలంతా నిశ్శబ్దంగా వుంది. పూళ్లో కొంతమంది పురప్రముఖులు కూడ విచ్చేశారు రాధికాగానామృతాన్ని గ్రోలటానికి. దీక్షితులుగారి మొఖం చాటల్లే అయివుంది. తన శిష్యురాలు పైకిరాబోతున్నది! మొదటిబహుమానాన్ని నిర్ణయించుటకు ఏర్పాటుచేయబడ్డవారిలో దీక్షితులుగా రొకరు.

ప్రిన్సిపాల్ లేచి సంగీతంపోటీ ప్రారంభంకావచ్చుననీ, ఆకాలేజీలో చదువుకునేవా రెవరైనా వచ్చి పదిహేనునిమిషాలకు మించకుండా పాడవచ్చుననీ, మొదటిబహుమానం వచ్చినవారికి నూరురూప్యములకిమ్మతుగల బహుమతి ఇయ్యబడుననీ సెలవిచ్చాడు.

సంగీతంలో అభిరుచిగల యువకులిద్దరుముగ్గురు మొదటిబహుమానం రాదని తెలిసికూడ పాడారు. సభికులు అభినందించారు. అసలు బహుమానం జగన్నాథానికి తప్పదని అందరికీ తెలుసు. అతను కాలేజీలో అందరిలోకీ పేరుపొందినవాడు. ఇద్దరు విద్యార్థినులుకూడ గానం చేశారు. సభికులు పాట బాగుండకపోయినా మనుష్యుల్ని చూచి మెచ్చుకున్నారు. జగన్నాథం వచ్చాడు. పాడకముందే చప్పట్లు! రెండురాగాలు విదలించిపారేశాడు. హాలంతా మారుమోగిపోయింది కరతాళధ్వనులతో. తర్వాత రాధిక వేదిక నలంకరించింది. హాలంతా నిశ్శబ్దం! ఆమె పోటీచేసేవారిలో ఒకరనుకోలేదు అసలు విద్యార్థులు! సంగీతం నేర్చుకుంటున్నదని అందరికీ తెలుసుగాని ఇలా బయటపడుతుందని ఎవ్వరూ అనుకోలేదు! సన్నని గొంతుతో పాడింది. సభికులు



# నేషనల్ స్టార్ అష్యూరెన్సు

## కంపెనీ, లిమిటెడ్.

హెడ్డాఫీసు: 27 లింగిచెట్టి వీధి, మదరాసు.

**అభివృద్ధి సూచించే అంకెలు**

| | | |
|---|---|---|
| • ఇన్సూరెన్సు చట్టముక్రింద డిపాజిట్టు కాబడిన సెక్యూరిటీలు | రూ. | 2,17,000 |
| • చెల్లించబడిన క్లెయిములు | రూ. | 3,02,000 |
| • వచ్చిన దరఖాస్తులు | రూ. | 66,00,000 |
| • కంపెనీ ఆస్తులు | రూ. | 3,61,000 |

మొదటి వాల్యుయేషనులోనే బోనసు రు. 1000 కి రు. **10**

ఆంధ్రదేశమంతటను పలుకుబడిగల ఏజంట్లు కావలెను.

శాఖలు: ఏలూరు, బళ్లారి, రాజమహేంద్రవరము,

హనుమకొండ, హైదరాబాదు (దక్కను)

## NATIONAL STAR ASSURANCE Co., Ltd.

**HEAD OFFICE :: MADRAS.**

(Post Box. 1246. G. P. O.)

## ఆంధ్రపత్రిక చందా వివరములు

| | | |
|---|---|---|
| 1 నెలకు | 2 | 0 0 |
| 3 నెలలకు | 6 | 0 0 |
| 6 నెలలకు | 12 | 0 0 |
| 12 నెలలకు | 24 | 0 0 |
| వారపత్రిక సం॥ర చందా | 4 | 0 0 |

**సంవత్సరమునకు తక్కువ చందాలు పంపబడదు.**

ఆశ్చర్యపోయినారు. ఆమె పాడటమే కాకుండా బాగా పాడుతున్నది. రెండుకీర్తనలు పాడింతరువాతగాని అందరికీ అర్థం కాలేదు ఆమె జగన్నాథంకంటె చాలాఅందంగా పాడుతున్నదని. మూడోకీర్తన పాడి ముచ్చటగా ముక్తాయింపుతో ముగించి నమస్కరించి దిగి వెళ్లిపోయి యథాస్థానంలో కూర్చుంది. దీక్షితులుగారి ఆనందానికి మేరలేదు. ఆయన లేచి ఏదో చెప్పుదామనుకున్నాడు. కాని శాస్త్రి జనాన్ని సర్దుకుంటూ తనవైపు రావటం చూసి ఆగాడు. శాస్త్రి దగ్గరకు వచ్చి ఆయనకు నమస్కరించి వేదిక ఎక్కి సభికులకు నమస్కరించి కూచున్నాడు. పిలవకుండా ఎవరైనా భోజనానికి వచ్చి పీటముందు కూచుంటే మనకు కలిగేటంత ఆశ్చర్యం కలిగింది దీక్షితులుగారికీ, శాస్త్రినిఎరిగిన అందరికీ. రాధిక పాడటమే ఆశ్చర్యంగా వుంది విద్యార్థులకు. ఇప్పుడు శాస్త్రి పాడబోవటం దీక్షితులుగారికికూడ ఆశ్చర్యంగా వుంది. మాట్లాడకుండా ఆయన కుర్చీలో చతికిలబడ్డాడు కానున్నది కాకమానదని!

శాస్త్రి పాడాడు. అదివరకెన్నడూ అతను అందరిలో పాడలేదు. ఇప్పుడూ అతను పాడకుండావుండేవాడే. కాని అతని అంతరాత్మ అతన్ని ముందుకు నెట్టింది. అతనికి తప్పలేదు. చివరవరకూ పెనుగులాడాడు అంతరాత్మతో. లాభించలేదు. కళ్లు మూసుకుని పాడాడు ఒక్కటే కీర్తన. మొదటి వొకక్షణం అతనిగొంతు వణికినట్టు అతనికి అనుమానం కలిగింది. కళ్లు తెరిచాడు. ఎర్రబడి మంటపుడుతున్నయి అతని నేత్రాలు. అందరూ అతనివంక విచిత్రంగా చూస్తున్నారు. లేచి నమస్కరించి దిగాడు. మరుక్షణం హాలు బద్దలయిపోయింది చప్పట్లతో!

శాస్త్రి ఇంటికెళ్లుతుండగా అతని స్నేహితులు దూరంగా తొలగి అతనివంక విచిత్రంగా చూడటం మొదలుపెట్టారు. పాతస్నేహితుడు మటుకు అతనిచెయ్యి పుచ్చుకుని ఆపి "ఎన్నడూ చెప్పలేదేం?" అన్నాడు.

"ఏమిటి?"

"నువ్వు పాడతావని!"

"ఎవరు పాడలేరు?"

"అంతబాగానా?"

"బాగుందా?"

"నీకు తెలియదూ?"

"నిజంగా తెలియదు. బాగుందని అనుమానమే! నేనెన్నడూ అంతమందిలో పాడలేదు!"

"ఇక మళ్లీ పాడకు!"

"ఏం?"

"అంత బాగుండలేదేమో!"

"అహా!"

"మొత్తంమీద భలేవాడివి నువ్వు!"

"అప్పుడే ఏమయింది?"

"ఇంటికి వెళ్లుతున్నావా?"

"ఆ!"

"బహుమానం తీసుకోవూ?"

"ఇంకా రెండుగంటలున్నది కదా. ఈలోపల వాళ్లు ఏదోనాటకం ఆడుతారు. కలెక్టరు బహుమానాలియ్యటానికి వచ్చేటప్పటికి నేనూ హాజరవుతాను! ఇంటికెళ్లి వస్తాను. తల తిరుగుతున్నది."

నాటకం మంచి రసకందాయంలో వుంది. కలెక్టరూ, ఇంకా ఇతర స్త్రీపురుషప్రముఖులూ చాలామంది వచ్చారు. గిరీశం కోసేస్తున్నాడు ఏమిటేమిటో మధురవాణితో. దీక్షితులుగారు గాలికోసం బయటికి వచ్చాడు. వరాండాలో ఒక స్త్రీ, ఒకపురుషుడూ నిల్చుని మాట్లాడుతున్నారు. స్త్రీలంటేనే వుబలాటపడే దీక్షితులుగారి హృదయం ఎగిరి గంతేసింది. వారిని సమీపించాడు.

"ఏమోయ్ రామమూర్తీ! ఇప్పుడేం చేస్తున్నావు?" అన్నాడు దీక్షితులుగారు ఆశ్చర్యంతో.

"ఇంటిదగ్గిరే వుంటున్నానండీ. ఏదో మీ అనుగ్రహం!" అన్నాడతను.

రెండుసంవత్సరాలకిందట తను అతనిని డిటెయిన్ చెయ్యటంలోని డిటెయిల్స్ బాగా జ్ఞాపకం లేకపోయినప్పటికీ దీక్షితులుగారు అసలు సంగతిమటుకు మరచిపోలేదు.

"ఆమె ఎవరు?"అన్నాడు పక్కనున్న యువతిని చూస్తూ.

"మాచెల్లెలు. మద్రాసులో చదువుకుంటున్నది!"

మన కాలేజీ వుండగా అక్కడికి పంపావేమి అని అడగటాని

ధైర్యం లేకపోయింది ఆయనకు. Art for Art Sake గా యువతీమణులతో తిరిగే ఎమెచూర్స్‌లో దీక్షితులుగా రోకడు. స్త్రీలకు-ముఖ్యంగా యౌవనంలో వున్న నవోఢలకు ఇచ్చే గౌరవం, చూపే మర్యాదా ఆయన ఇంకెవరిమీదా చూపడు. ఆమె ఆయన్ని ఆకర్షించింది. కళ్లజోడులోనించి ఆమె విశాల నేత్రాలతో ఆయనను చూడగానే ఆ ఎలెక్ట్రిక్ లైట్ల వెలుతురులో ఆయన ముగ్ధుడయిపోయినాడు. ఏమిషమీద ఆమె హస్తాన్ని స్పృశించగలడు? వంగపండురంగుచీరెతో, ముంగురులు నాజూకుగా మొహంమీదికి వాలుతో పార్శీయువతిలా నెత్తిన ముసుగుతో వున్న ఆమెను చూస్తూంటే దీక్షితులుగారి అంతరాత్మ మూలుగుతున్నది.

"పేరు?" అన్నాడు దీక్షితులుగారు.

"ఎవరిపేరు?"

"ఆమె పేరు?"

"జయజయవంతి!"

"ఆ!"

"అదో రాగం పేరు. అదంటే ఈమెకు ఇష్టం. ఆపేరే ఈమె పెట్టుకున్నది!"

"బాగుంది!"

"వస్తామండీ, శెలవు!" అంటూ రామమూర్తి చెల్లెలుతోసహా హాలులో ప్రవేశించాడు. పోతూపోతూ జయజయవంతి దీక్షితులుగారి వంక రెండుక్షణాలు చూచింది. కళ్లజోడు తీసి మొహమంతా తుడుచుకుని దీక్షితులుగారు ఎన్నడూ ఎరగని ఆవేదనతో వానరంతోడి వాలము వలె హాలులో ప్రవేశించాడు.

నాటకం అయిపోయింది. హాలంతా హడావిడిగా వుంది. ఈసంక్షోభంలో ప్రిన్సిపాల్ లేచి నిలబడ్డాడు. అందరూ నిశ్శబ్దంగా వున్నారు.

"ఈరోజు నాజన్మలో మరచిపోను! ఇంత జయవంతంగా ఈరోజు నే నెరిగివుండగా ఎన్నడూ జరగలేదు. గెలిచినవారికి బహుమతులు ఇయ్యటానికి అంగీకరించి ఇచ్చటికి విచ్చేసి మాకు ఆనందం కలగచేసిన కలెక్టరుగారికి మేము కృతజ్ఞులం. బహుమతిపొందినవారందరూ పిలవగానే వచ్చి వారివారి బహుమానాలను తీసుకుపోవాలెనని కోరుతున్నాను."

మాట్లాడటం కాగానే అందరూ కరతాళధ్వనులు చేశారు. ప్రిన్సిపాల్‌గారు నిలబడి బహుమతిపొందినవారిని పేర్లుపెట్టి పిలిచాడు. ఒక్కొక్కరే వచ్చి బహుమానాల్ని తీసుకుపోతున్నారు.

"రామశాస్త్రి-సంగీతం మొదటి బహుమానం!" ఎవ్వరూ రాలేదు. ప్రిన్సిపాల్ మళ్లీ పిలిచాడు. ఎవ్వరూ రాలేదు.

"సుబ్బారావు—ఫాన్సీడ్రెస్సుకు మొదటిబహుమానం. వేషం పాములవాడు."

సుబ్బారావు లేచి నిలబడ్డాడు.

"మొదటిబహుమానం రావలిసింది నాకు కాదండీ. ముగ్గురు జడ్జీలతో ఒక్కరైనా నన్ను గుర్తుపట్టగలిగారు. రామశాస్త్రిని ఎవ్వరూ గుర్తుపట్టలేకపొయ్యారు—"

"ఏడీ రామశాస్త్రి?" అన్నాడు ప్రిన్సిపాల్.

జయజయవంతి లేచి నిలబడింది. అందరూ ఆశ్చర్యపోయినారు. దీక్షితులుగారు నోరు తెరుచుకుని ఆమె వంక చూస్తున్నాడు. ప్రిన్సిపాల్ నివ్వెరపడిపోయినాడు. చెప్పినా గుర్తుపట్టటానికి వీలులేకుండా వుంది రామశాస్త్రికి! హాలంతా ఒక్కసారి గొల్లుమన్నారు.

"మొదటి బహుమానం రామశాస్త్రి!" అన్నాడు మారుమాట్లాడకుండా ప్రిన్సిపాల్ ఆగోలలో.

దీక్షితులుగారివంక చూస్తూ శాస్త్రి ఆయనకు వళ్లు జలదరించేటట్టు గాలిలో ముద్దుపెట్టుకున్నాడు!



# సాగరగానము

శ్రీ అడ్డేపల్లి నాగగోపాలరావు

నురుగు తరగల నురికె పరువు లెత్తెద వేల
తిరిగి జాబిల్లి నీదరికి రానే రాడు—
గంభీరనాదమ్ము గావించె దేలా ?
రంభాప్సరోంగనా రాగమ్ము రాదా !
అలల లాస్యమ్మేమి ? ఆనంద మేమి ?
ఎందు కీ చందముల్ సంద్రమా !
పలుకు !

ఆకాశ వీథినే అంటుకో జూచెదో !
లోకేశు పూజకై నీ కరము లెత్తెదో !
గంభీర నాదమ్ము... ... ... ...

రత్నాల రాసులః రాగిల్లు చుందువో !
ముత్యాల సంపదః మోదమ్ము గందువో !
గంభీర నాదమ్ము... ... ... ...

వీర కోలాహలము విజయ భేరీ రవము !
కోరి భారతికి మేల్కొలుపులే పాడెదో !
గంభీర నాదమ్ము... ... ... ...

సందేశ మేమిటో సర్వపావన తెల్పు
వందనమ్ములు నీకు వాహినీ వల్లభా !
గంభీర నాదమ్ము... ... ... ...

నురుగు తరగల నురికె పరువు లెత్తెద వేల
తిరిగి జాబిల్లి నీదరికి రానేరాడు—
గంభీర నాదమ్ము గావించె దేలా ?
రంభాప్సరోంగనా రాగమ్ము రాదా !
అలల లాస్య మ్మేమి ? ఆనంద మేమి?
ఎందు కీ చందముల్ సంద్రమా !
పలుకు !



భీమేశ్వర దేవాలయ గోపురము

# భారతజాతీయత

వ్యాసకర్త:
శ్రీ డా. పట్టాభి సీతారామయ్య



# భూత భవిష్యత్తులు

ఒకానొక కాలమందు భారతజాతీయత అనిన స్వవచనవిఘాత మనుకొన్న రోజులు కలవు. ఆరోజులు గడచినవి. భారతదేశమందు జాతీయత దుస్సాధ్య మను మూర్ఖు లెవరును లేరు. పూర్వపు చరిత్రకారులయొక్క అనాధారభూతములైన వ్రాతలును, అతిశయోక్తులును ఆబాలగోపాలమునకు తెలిసిపోయినవి. భారతజాతీయత సిద్ధాంతరీత్యా పరిశోధింపదగినట్టిగాని, చారిత్రకరీత్యా విమర్శింపదగినట్టి గాని, భూగోళరీత్యా పునర్నిర్మితము చేయవలసినట్టి గాని భావముగాక సర్వాంగశోభితమైన స్వరూపము దాల్చిన సకల సంపన్నమైన అగ్రస్థానమును, ఆధునిక కాలములో మాతృదేశమున కొసగదగిన భావముగా పరిణమించినది.

పాతకొంపను ఊడదీసి, నూతనభవనమును నిర్మించవలసిన తరుణ మాసన్నమైనది. పూర్వాచారపరాయణులకు మన కున్న ఇంటిని బలంతిగ మార్చుట పనిలేనివాని పనిగా కనిపించవచ్చును. కాని మానవశరీరమునకు ఆయుర్దాయ నిర్ణయము ఎట్లున్నదో, కాపురపు టిండ్లకును, జాతీయ సౌధములకును నట్టి ఆయుర్దాయపు హద్దు నిర్ణయములే గలవు. కాక, పరులచే నాక్రమింపబడి, ప్రాచీనశోభలను కోల్పోయి, పరాయిరాజ్యమునకు నూడిగముచేసి, ధనార్జనచేయు దేశద్రోహుల కెల్ల సాధనభూత మగు విద్యావిధానము, న్యాయ సంస్థాపనము ఆచరణలో నుండుటచే, పునర్నిర్మాణ కార్యము క్రొత్తగ స్థలము కొని, పునాదులు త్రవ్వి, నూతన నక్షీ, మదింపులు, వగైరాల ప్రకారము స్వేచ్ఛగ కట్టబడు సౌధమువలె గాక, ప్రాతక్రొత్తల మధ్య పునర్నిర్మితము గావింపబడు ప్రాసాదమువలె ఈ తరుణమునందు మన భారతభూమి యున్నది. నూతనముగ పాశ్చాత్య సంపర్కముచే అవతరించిన నూతనభావములను, ముఖ్యముగ ధనపూజను పురస్కరించుకొని ఉత్పత్తి అయిన భాగములు తేజోవిహీనము లైనవి. ఇట్టి తరుణములో ప్రజలు పెక్కు ఇక్కట్లకు లోనయినారు. ముఖ్యముగ జీవనభూతములైన వృత్తులు నశించినవి. ౩౫ కోట్ల జనులకు గావలసిన అన్నము, బట్టలు పరాయిదేశమునుంచి వచ్చినచో పంట లెక్కడ, వృత్తు లెక్కడ? పంటలు, వృత్తులు పోయినతరువాత ప్రాణములే పోవుచున్న ఇక భారతజాతీయతమాటకేమి చెప్పవచ్చును? కాబట్టి భారతజాతీయత అనగా సజీవమై, చైతన్యముతో నుండి, తినుటకు అన్నము, కట్టుకొనుటకు బట్ట, ఉండుటకు వసతి కలిగి, కళలను, వృత్తులను పోషించుకొనదగిన స్వావలంబనము కలిగిన స్థితియని మనము నిర్వచింపవచ్చును. భారతజాతీయతయొక్క భవిష్యత్తును నిర్ణయించుటలో భూత వర్తమానములు పరిశోధన చేయవలసియున్నది. భూత మెప్పుడును వర్తమానమునం దిమిడి వసించుచుండును. వర్తమానముచే భవిష్యత్తు నిరంతరము ఆవిష్కృత మగుచున్నది. భారత జాతీయత భారతదేశముయొక్క ప్రాచీన ధర్మములను పోగొట్టుకొనుట కాక ఆధునిక ప్రపంచముయొక్క నూతన ధర్మములను జీర్ణింప చేసుకొని, ఉభయ ప్రపంచములయొక్కయు, భూత వర్తమాన భవిష్యత్తులయొక్కయు సమ్మేళనము అగునపుడే పరిపూర్ణత నొందగలదు. ప్రాగ్దేశపు సభ్యత కేవలము ఆధ్యాత్మిక మయమైయుండి, పశ్చిమదేశపు సభ్యత భౌతిక విభూతితో కూడినదై యున్నది. మొదటిది సహయోగ, సంయో



గములమీద ఆధారపడి యుండి, రెండవది స్పర్ధమీద నిర్మింపబడి యున్నది. ఒక దానియందు సేవాతత్పరత, రెండవ దానియందు ధనపూజ గావింప బడుచున్నవి. రెంటికిని ఉండెడి తారతమ్యము ఆత్మబలమునకును, పశుబలమునకును నుండెడి తారతమ్యమే. వీటిని చిహ్నమాత్రముచే వర్ణింపవలసి వచ్చినచో ప్రాగ్దేశపు శోభకు గుర్తు రాటపుచక్ర మనియు, పశ్చిమ దేశపు సౌభాగ్యమునకు గుర్తు మోటారుచక్రమనియు చెప్ప వలసి యుండును. ఇంత యేల ? ప్రాగ్దేశమునందు గ్రామము, పాశ్చాత్య దేశమునందు నగరము కేంద్రస్థానములు. ప్రాగ్దేశమునందు గృహపరిశ్రమలు, పాశ్చాత్య దేశమునందు యంత్రనిర్మాణము గమ్య స్థానములు. ప్రాగ్దేశమునందు కళలు, పాశ్చాత్య దేశమందు శాస్త్రము సాధనములు. ఇట్టి సందర్భములో ప్రాగ్దేశపు పునాదులమీద పాశ్చాత్య దేశపు గోడలు, కప్పుతో కూడిన సౌధమును నిర్మింపగలిగినచో నదియే అభినవ భారత జాతీయత అని చెప్పనగును. నవీనాభ్యుదయముయొక్క మిరుమిట్లు చూడలేమని కళ్లు మూసుకొన్నచో ప్రయోజనము లేదు. ప్రాచీన సభ్యతయొక్క కాగడాలతో కాలము పుచ్చెద మని సంతుష్టిచెందుచో జీవితము సంకుచిత మగును. ఉభయ సమ్మేళనమును నుచితరీతిని సాధింప గలుగుచో భారత జాతీయత ప్రాక్ పాశ్చాత్యధర్మ సమ్మేళనమై చిరస్థాయిగ నుండ గలదు. ఇంతలో మరమ్మతు కోరదు.

## యువకుల వాదము

పాతపునాదులు పనికిరా వనియు, ఐరోపా ఖండమందు ప్రబలియున్న సభ్యతావిధానము లన్నియు అంతరించుచున్న వనియు, ఆస్తి ధనముయొక్క తారతమ్యములతో కూడిన సభ్యత యొక్క రోజులు గడచిపోయిన వనియు, సామాజికవాద సిద్ధాంతములను అనుసరించక తప్పదనియు, ఏతత్సిద్ధాంతములు కేవలము గ్రంథస్థములై, కళాశాలలయందు పఠనీయములై, కార్యాచరణయందు ఆదర్శమాత్రములై పొగడ్తకు పాత్రమైన తత్త్వములు కావనియు, ఆచార విచారములయందు అమలులోకి రావలసిన ఇట్టి మార్పులన్నియు ఒక్క రష్యాయందే అమలులోనికి వచ్చినవనియు, రష్యావారి కమ్యూనిజమే మనకు శరణ్య మనియు, ఏ తదుపరిగతిగాని, ముక్తిగాని లేదనియు మన యువకుల వాదము. భాగ్య భోగ్యములు గౌరవమునకు ఆధార భూతము లని మన వర్ణాశ్రమ ధర్మమునం దెపుడును నిర్ణీతము గాలేదు. కులములలో అగ్ర మని పేరొందిన బ్రాహ్మణత్వము దారిద్ర్యయుతతో కూడినది. బ్రాహ్మణుడు భిక్షాటనము చేసి, ప్రజలకు ఆధ్యాత్మికతత్త్వము బోధించి వారిచే నొసగబడు ముష్టిచే జీవించవలసిన దని వర్ణధర్మము యొక్క ప్రాతిపదిక. హింసాతత్త్వమును గమనించి, సమాజమునందు హింస లేకయే పని జరుగగలిగిన కాలము ఇంకను ఆసన్నము గాలేదని తలచి, హింసతో కూడిన దేశరక్షణము ఒక కులమునకు ధర్మముగ నిర్ణయించి, హింసను క్షత్రియ ధర్మములలో దిగ్బంధన మొనర్చిరి. అన్ని కులములవారును ఆయుధపాణులు కాజాలరు. ఆయుధోపయోగము, ఆయుధ వినియోగము గౌణమైనను, గర్హ్యమైనను, త్యాజ్యమైనను ఆవశ్యకతను బట్టి ఒక కులధర్మముగ నిలుపబడినది. ఇంక భాగ్య భోగ్యములయొక్క కదలిక, సంచాలనము వైశ్యుల స్వాధీనము చేయబడినది. అన్నిటికంటె మహత్తరమైన అన్నవస్త్రములయొక్క ఉత్పత్తి మరియొక వర్ణమునకు ధర్మముగ నిరూపింప బడినది. కొందరు బుధులు నాలుగు వర్ణములవారు, మనుష్య శరీరముయొక్క ఉదాహరణ ననుసరించి దానికి భిన్న భిన్న ప్రాంతములనుండి సృష్టికర్తయొక్క శరీరమునుండి ఉద్భవించినారని చెప్పువాక్యము ఆయా అవయవములవలన వినియోగమును సూచించుటకై చెప్పిన దృష్టాంతముగ నూహింప దగినదేగాని ఉచ్చనీచములయొక్క నిదర్శనమును తెలుపుట కుద్దేశింపబడినది గాదు. రాను రాను వర్ణ సమ్మేళనము — దీనినే కొందరు వర్ణ సంకరమందురు — జరిగినది; జరుగుచున్నది. కాని, సంఘముయొక్క స్థిరత్వము ఇట్టి ధర్మవిభజనవల్ల చిరస్థాయిగ నుండునటుల గావింప బడినది. పాశ్చాత్యసంఘపువ్యవస్థ వేణ్ణీళ్ల అండాలోని నీటితెరల వంటిది. నిప్పుయొక్క వేడిమిచే క్రింద నీరు వేడెక్కి తేలికయై, ఆ నీరు పైకి వచ్చి, పైనున్న చల్లని నీరు దానిబరువుచేత క్రిందకు పోవునట్లు చేసి, నిరంతరము స్థాయిలేని గతి గలిగి, క్రింద నీరు పైకి, పైనీరు క్రిందకు పోవుచుండును. అదే విధముగ పాశ్చాత్యదేశములు, సంఘములయందు ధన మనెడి వేడిచేత వర్గములు, తరగతులు అను నీటి తెరలు క్రిందనుండి పైకి, పైనుండి క్రిందకు, ఒకే విధముగ స్పర్ధకు లోబడి కొట్టుకొనుచున్నవి. ధనము ప్రధానలక్ష్యమైన పాశ్చాత్య సంఘమునందు ఈ స్పర్ధ అనివార్యము. ధనమును జీవిత సాధనముగ నెంచి, జీవిత విధానము నందలి ప్రాకారములలో నొకదానినిగా భావించుటచే యజమానిగ తిరస్కరింపబడుట జరుగుచున్నది. ప్రాగ్దేశపు సంఘట్టనమునందు ఎవరికాలమునయొక్క ధర్మము వారు నెరవేర్చుటయే శ్రేయమని సంఘముయొక్క నిర్మాణము కులకట్టుబాటు, కులపెద్దలు, కుల దండన, కులశిక్షలపైన ఆధార పరుపబడి యున్నది. కలియుగమునం దట్టి నిర్ణయము నిలువగలదా అను సందేహము చాలమందికి గలదు. పూర్వకాలమునందు, అనగా కనీసము 13 వేల సంవత్సరముల క్రితము స్థాపింపబడిన ఈ నిర్మాణము ఈరోజున ఉన్నది యున్నట్లుగ నిలిచియుండవలెనని గాని, నిలువగలదని గాని చెప్పుట సాహసము. కాబట్టి ఒకవిధమైన ప్రాచీన నవీనముల యొక్క, ప్రాక్పాశ్చాత్య దేశములయొక్క సమ్మేళనము కావలసి యున్నది. ఇట్టి సమ్మేళనమే గాంధీమహాత్ముని జీవితమునందు కానవచ్చుచున్నది. నాలుగు కులములయొక్క ధర్మసమన్వయమును, నాలుగు ఆశ్రమముల యొక్క ధర్మసమ్మేళనమును ఆయన

జీవితమునందు మనకు కనిపించుచున్నవి. ఒకప్రక్కన సూత్రప్రాయపు బుక్కలను వ్యాపింపజేయుచు, మరియొకప్రక్కన చూపుడువేలు ఎత్తినంతమాత్రముచేత దేశమునందు అరాచకములను మాపి ప్రాణరక్షణ గావించుచు, ఇంకొకప్రక్కన భాగ్యభోగ్యములను పెంపొందించుచు, అన్నిటికంటె మూలమైన అన్నవస్త్రాదుల నుత్పత్తి చేయుచు, దరిద్రనారాయణుని సేవ చేయుటకే గాంధీమహాత్ముడు తన జీవితము నుపయోగించుచున్న విషయము ఎవ్వరికి తెలియదు? బ్రహ్మచర్యాశ్రమమైన పిమ్మట గార్హస్థ్యము నవలంబించి, దానిని 36-వ యేటనే ముగించి,సంపాదించిన మూడులక్షలను త్యాగము చేసి,సన్న్యాసము నవలంబించి, నిస్సంగత్వమును పూని, భార్యయును తానును సంఘసేవ చేయుచు, పూర్వపు యోగులవలె పుర, గిరి, నది, అరణ్య, పర్వత, సాగరములను చేరి సంఘమును త్యజించి కాషాయ వస్త్రములను ధరించియుండు పద్ధతి నవలంబించక, సంఘముమధ్యనే యుండి, సంఘసేవ చేయుచు దేశముయొక్క, జాతియొక్క, సంఘముయొక్క, కుటుంబముయొక్క, వ్యక్తులయొక్క శ్రేయస్సును కోరుచు, అందులకు వలయు సమస్యలను తీర్చుచు పరిణతియందు జీవితము గడపెడి సంస్కారమును గాంధీమహాత్ముడు గావించిన విషయముగూడ రహస్యము గాదుకదా.

## రష్యాభావములకును మనకును నిమిత్తములేదు

ఈవిధముగ సంఘర్షణము, స్పర్ధ, పోటీ, అసూయ, స్వాభిమానము, అహంకారము, మమత్వము, సంకుచితత్వము మున్నగు లోపభూయిష్ఠమగు దుర్గుణములను పారద్రోలి, దేశమునందు నూతన జాతీయతావిధానపు, నూతన జాతీయతాసౌధపు నిర్మాణమును ఆరంభము చేసినాడు. ఇటువంటి దేశము పరదేశీయుల స్వాధీనమైన పిమ్మట ధనపూజకు లోబడి నిమ్నస్థితిలోనికి వచ్చినది. వర్గభేదము లున్నమాట నిజము. ధనతారతమ్యము లున్న మాట నిజము. కాని వీటిని పోగొట్టు మార్గము పరస్పర వినాశముగాదు. అది శాంతికి సాధనము కాదు. శాంతిలేని సంఘమునకు సౌఖ్యము లేదు. 'అశాంతస్య కుత స్సుఖం' అను గీతావాక్యమునకు అపవాదము లేదు కదా. కాబట్టి రష్యాభావములను మనము అవలంబించక మనయొక్క పూర్వపు ఆదర్శములను సంస్కరించి పునః స్థాపితము చేయ గలిగినచో సంఘమునందు తిరిగీ సమవర్తనము, సమరసత్వము, సామరస్యము, సామంజస్యము తిరిగి ఉద్భవింప గలుగును. ఇట్టి జాతీయతయే మనము కోరదగినది. రష్యాదేశములో స్వంత ఆస్తిని, స్వంత కుటుంబమును, అనగా వివాహసంస్థతో కూడిన భార్యాయుతమైన సంసారమును, మతమును త్రివేయవలె నను విప్లవము నారంభించి దేశమును రక్తపాతముచేసి, చివరకు మూడుసంస్థలను పునరుద్ధారణ చేయవలసి వచ్చెను. విప్లవ మధ్యమున నున్న పరదేశమునుండి ఎప్పటి కప్పుడు వచ్చు వార్తలు విని, అశాశ్వతములైన సంస్థలను, మార్పులను, పరివర్తనమును నమ్మట జాతియొక్క లక్షణము గాదు. అభినయము చేయుచుండు వక్తయొక్క మహాప్రవాహపు ఉపన్యాసమునుగాని, వారి అభినయముయొక్క చిత్రమునుగాని శబ్దగ్రాహక యంత్రముద్వారాను, ఛాయా చిత్రగ్రహణయంత్రముద్వారాను రికార్డు చేయుచో ఏ ఒక భావముగాని, పూర్ణవాక్యము కాదో, ఏ ఒక్క వాక్యముకాని భావ ప్రకటన కాజాలదో, అదే విధమున ఏ ఒక్క సంచలనముగాని పూర్తియైన అభినయమును చిత్రింప చాలదో అదే విధముగానే 1917-వసంవత్సరమునందు విప్లవము ప్రారంభించినపుడు అవలంబింపబడిన దారుణకృత్యముగాని, మధ్య మధ్య జరుగు పరివర్తనముగాని రష్యా విప్లవముయొక్క స్వరూపమును దెలుపజాలవు. కట్టకడపటకు విప్లవ దిన ప్రారంభమునుండి సుమారు 25 సంవత్సరముల అనంతరపు స్థితి ఒక విధమున ప్రమాణముగ నుంచుకొనతగును. ఆస్తి ఎత్తివేయ నేల, పునరుద్ధారణ నేయ నేల? వివాహము నిర్మూలము నేయ నేల, పునరవలంబనము గావింప నేల? దేవళములను శిథిలము నేయ నేల? పూజావిధానమును పునరుద్ధారణ సేయ నేల? అర్యతత్వమునందు వేల సంవత్సరములనుండి అనేక తెగలవారు, జాతులవారు, మతములవారు ప్రవేశించి తమతమమతములచే ప్రాచీనమతముయొక్క గభీరతను పెంపొందించి, సారవంతము చేసి ఈమహాసమూహమున తమ నీతుల నంతర్గర్భితము చేసి, ఉభయశ్రేయోదాయకమైన ఫలితము లందిరి. అన్ని మతములవారికి ఆశ్రయము నిచ్చుటచే గదా మనము మనస్వాతంత్ర్యము నిట్లు కోల్పోయినది? చివరకు మనకు మెరుగే గాని తరుగేమియు లేదు. భారతజాతి మానవకోటికి ఆదర్శప్రాయముగ నుండవలెననుచు ఇట్టి విధ్వంసక పునర్నిర్మాణపరంపరలచేతనే గదా నేటి పరిపక్వత సంభవించ గలదు? అట్టి పరిపక్వమును మనము కన్నులార చూచుచున్నాము. జమీందారులు తమ జమీందారీలను ప్రభుత్వమువారు కొనివేసి తమకు తగు భృతిని ఇప్పింపవలె నని కోరుచున్నారు. భాగ్యవంతులయొక్క భాగ్యములమీద పన్నులవిధానములవల్ల మనవారి భాగ్యములకు హద్దు లేర్పడుచున్నవి. మొన్న ఇంగ్లండులో బెడ్ ఫర్డు బ్రూక్ చనిపోవుటకు పూర్వము 36,90,000 పౌన్లు అనగా 5 కోట్ల రూపాయల ఆస్తిలో మూడుకోట్ల రూపాయలు బ్రిటిషు ప్రభుత్వమువారు చావుపన్నులక్రింద తీసుకొన్నారు. స్వంత వ్యవసాయము చేసుకొనెడివారికి 50 ఎకరములవరకు, అమరకము ఇచ్చువారికి 25-30 ఎకరములకంటె ఎక్కువగ నుండకుండగను హద్దు నిర్ణయించుటకు సంఘము ఒప్పుకొని తీరును. ఈవిధమున ఆకాశమునంటు తాటిచెట్లకును, భూమిమీద ప్రాకు నేలవేమునకును పొత్తు కలిపి సమరసత్వమును చేకూర్చుటకు సాధ్యమగుచుండ రక్తపాతముతో కూడిన వర్గకలహములను పెంపొందింపవలసిన ఆవశ్యకత లేదు.

భారతదేశపు సామ్యవాదము సంస్థలలో నిమిడ్చిపెట్టి నిబిడీకృతము గావింపబడినది. దానినే గాంధీమతము అనుచున్నాము.

గాంధీ నూతనమతము క్రొత్తగాదు. గాంధీ మరియొక కులమును, వర్ణమును సృష్టించువాడు కాడు. గురుపీఠము నలంకరింపవలె నను కోర్కె ఆయనకు లేదు. ఒక శిష్యపరంపర నేర్పరచవలెనని లేదు. ఆయన సంస్థల నెంత త్వరితముగ స్థాపించగలడో అంత శీఘ్రముగ వదలుకొనగలడు. సన్యాసికైనను తన మఠమునందు మమత్వముండుట సహజము. గాంధీకి తనది అని ఈ ప్రపంచమునందు చెప్పదగిన వస్తు వెద్దియు లేదు. ఏదైన నున్నచో అది సబర్మతీ ఆశ్రమమే అనవలెను. అట్టి ఆశ్రమమును 1933-వ సం. లో ఒక కలముపోటుతో హరిజనులపాలు చేసివేసినాడు. ఖైదునుండి విడుదల అయిన పిమ్మట నిలువ నీడ లేకపోయెను. అరణ్యములోని జంతువులకు గుహ లుండును. ఆకాశమందలి పక్షులకు గూళ్లుండును. కాని మానవ మాత్రుడైనవానికి క్రీస్తువలెనే ఇప్పటి గాంధీకికూడా తలదాచుకొనుటకు ఎడము లేదు. ఆయనకు 'వసుధైవ కుటుంబకం' అను నార్యోక్తి చక్కగ అన్వయించును. అట్టివాడు సామ్యవాదమును అవలంబించకపోతే, అబ్బ సంపాదించిన లక్షలు వెనుకబెట్టుకొని ధనార్జన చేయుచు, మాటికి ముందు ప్రపంచ పర్యటనము చేసి, 'ధనమూల మిదం జగత్' అను లోకోక్తి ననుసరించి జ్ఞాన విక్రయముచేతకూడ ధనము నార్జించువారా సామ్యవాదులు? లేక పేదరికమున పుట్టి ధనికుల సొత్తునంతను సమానముగ పంచవలె ననువారా సామ్యవాదులు? సామ్యవాదము ఒక ధర్మనిర్ణయము కాదు; ఒక ఆర్థికవిధానము కాదు; ఒక జీవితమార్గము అని వేదాంతవాక్కులు చెప్పు బెర్ట్రాండు రస్సెలు, ప్రొ. లాస్కీవంటి పండితులా సామ్యవాదులు? కాదు. ఆర్యసంఘట్టనము ఋషులచే నిర్మింపబడిన సామాజికనిర్ణయముల ననుసరించి, భాగ్యభోగ్యములను, దారిద్ర్యమును సమన్వయముచేసి, సంఘమునందు అశాంతిని తగ్గించి, స్తిమితమును, స్థిరత్వమును నిర్మాణముచేయునదే సామ్యవాదము. వేలకొలది ఎకరముల భూమి, లక్షలకొలది భాగ్యము, పదులకొలది ఉద్యోగములు ఒక్క కుటుంబములో కూడదీయుపద్ధతి ఈ దేశమందెన్నటికిని అమలులోనికి రాజాలదు. భారతదేశములో అహింసాత్మకమగు సామ్యవాదమునకు గల అనుకూల వాతావరణము మరియెచ్చటను లేదు. అది జనుల తత్వగతమైనది. రక్తమునందు ప్రవహించుచున్నది. అట్టి గుణములను పోషించుటయే కావలసినది. గాంధీమహాత్మునివంటి జీవితమే ఇట్టి పోషణకు సాధనము.

## 2

రాబోవు భారత స్వరాజ్య స్వరూపమును ఒకసారి కల్పితముగ మన దృష్టియందు చిత్రించుకొనగలమా అను సందేహము కలుగుచున్నది. స్వరాజ్యము ఒక ఫలితము గాదు; ఎన్నడును ప్రయత్నమే. ఒక గమ్యస్థానము కాదు; ఒక పంథా. ఒక ముక్తి కాదు; ఒక పూజావిధానమే. ఒక విద్యాలంకార బిరుదము కాదు నిరంతరాధ్యయనమే. స్వరాజ్యము కలిగి యున్న దేశములలో విప్లవములు లేకపోయినవా? 150 సంవత్సరములలో ఈ మధ్య ఫ్రాన్సు దేశములో మూడుసార్లు విప్లవము జరిగి, మూడుసార్లు ప్రజాస్వామ్యము నిర్మింపబడినది. అమెరికా దేశస్థులు రక్తము, మతము, తత్వము కలసిన తమ బ్రిటిషువారితో పోరాడి స్వాతంత్ర్యమును స్థాపించుకొనినారు. ఇంత యేల? స్పెయిను స్వతంత్ర దేశమే కదా? ఆంతరంగిక యుద్ధము ఏల రావలసివచ్చె? యుద్ధములు ఒకప్పుడు ఒక జాతివారికిని మరియొక జాతివారికిని, ఒక తెగవారికిని మరియొక తెగవారికిని వచ్చుచుండెడివి. పిమ్మట సామంతరాజులను స్వాధీనము చేసుకొని సామ్రాజ్యముయొక్క సమగ్రాధికారమును ఒప్పించుకొనుటకు మాత్రమే యుద్ధములు జరుగుచుండెడివి. అశ్వమేధయాగము చేయుటకు, యజ్ఞాశ్వము నంపి, ధర్మరాజు వెనుక అర్జునుని దానితోకూడ పంపినపుడు, దేశమునందలి సామంతరాజు లందరును పాండవుల ఆధిపత్యమును అంగీకరించిరనేగదా! అశోకుడు కళింగ దండయాత్రానంతరము తన పదునాలుగు బోధనా సూత్రములను శిలాలిఖిత మొనర్చి, అట్టి శిలను స్థాపించి, తన రాజ్యమునకు మరల పోయెను. రానురాను భూకాంక్ష పెరిగి, రాజ్యవిస్తరణకు యుద్ధములు సలుపబడుచుండెను. ఆంగ్లేయులయొక్క ముప్పదిసంవత్సరముల యుద్ధము, శతవర్ష సంగ్రామము, రోమనులు బ్రిటనును జయించి నాలుగువందలయేండ్లు పాలించుట, నార్మన్లు ఇంగ్లండును 1066 లో జయించి కొంతకాలము రాజ్యము చేయుట—ఇవన్నియు రాజ్యకాంక్షా సమన్వితమైన యుద్ధములకు దృష్టాంతములు. రోస్బెరీ ప్రభువు 1896-వ సంవత్సరమునందు ఒక సూచనను గావించియుండెను. భావికాలపు యుద్ధములు వర్తకపు యుద్ధము లని వారు చెప్పి యుండలేదా? ఆంగ్లేయుల సామ్రాజ్యము వర్తకముమీదనే ఆధారపడియున్నది. వారి దేశమునందు అయిదువారముల భోజనమునకు వలయు పంటకన్న ఎక్కువ పంట లేనందున తక్కిన 47 వారముల పంటను ఇతర దేశములనుండి పొంది అందుకు ప్రత్యామ్నాయముగ తమ పరిశ్రమలనుండి ఫలించు వస్తువులను ఆయా దేశములకు ఖరీదుకట్టి ఇవ్వవలసి యున్నది. కాబట్టి ఆయా దేశములలో ఆయావర్తకము లుండనిచో ఆంగ్లేయులకు సంవత్సరములో 47 వారములు భోజన ముండజాలదు. వివిధ దేశములందు తమ వస్తుసామగ్రిని వ్యాపకము చేయుటకు అచ్చటి ప్రజలను తమ కభిముఖులుగ చేసి, వారియొక్క విద్యను, రుచులను, అభిమానమును, ఆదర్శములను తమ ఆదర్శములకు అనురూపములుగ గావించుకొనవలెను గదా! అందులకు రాజకీయవిజయము ఆవశ్యకము. రాజకీయవిజయమునకు సైనిక ఆధిక్యత అనివార్యము. వాణిజ్యప్రాపకమునకు రాజకీయ ఆధిక్యత, రాజకీయాధిపత్యమునకు సైనిక ఉత్కృష్టత అవసరము. వీటి పేరే సామ్రాజ్యతత్వము అందురు. ఇందులకే 20-వ శతాబ్దపు యుద్ధములు వర్తకపు యుద్ధము లని రోస్బె

# న్యూ ఇండియా ఎష్యూరెన్సు కంపెనీ,

## లిమిటెడ్.

ప్రపంచమంతటా విస్తరించిన కార్యరంగం కల్గి, అంతర్జాతీయ ప్రఖ్యాతిగాంచిన,
భారతీయ సామ్రాజ్యపు గొప్ప సర్వసమ్మిళిత స్వదేశీ భీమాసంస్థ.

ప్రధాన కార్యాలయం:
ఎస్ప్లనేడ్ రోడ్డు, ఫోర్టు, బొంబాయి.

మద్రాసు శాఖ:
4 & 5, ఫస్టులైన్ బీచ్, మద్రాసు.

ఆర్థిక సంఖ్యలు

చందావేసిన మూలధనము: రూ. 3,56,05,275.

31-12-39 వ తేదీన మొత్తం నిధులు: రూ. 2 కోట్ల 96 లక్షలుపైగా

చెల్లించిన మూలధనము: రూ. 71,21,055.

ప్రారంభంనుండి పరిష్కరించిన క్లెయిముల ధనము రూ. 8 కోట్లకు పైగా.

అగ్ని, జీవిత, నౌకా, మోటారు, పనివాండ్ర నష్టపరిపూర్తి, దొంగతనపు, గాజు, విశ్వాసపుహామీ, (నగలు మున్నగువాటికి) అఖిలాపాయ, భీమాలవ్యాపారము కొనసాగించు సంస్థ.

గౌరవనీయులును పలుకుబడిగలిగినట్టివారినుండి ఏజన్సీ దరఖాస్తు లాహ్వానిస్తున్నాము.

కె. కె. శ్రీనివాసన్, బ్రాంచ్ మేనేజరు.

---

★ **కోహినూర్** ★

రోల్డుగోల్డు ఆభరణములు రంగుపోక గ్యారంటీగా యుండును.



మావద్ద కాలర్ పిన్నులు, సారె పిన్నులు, గుండీలు, గుండీగొలుసులు, చేతిగడియారపు గొలుసులు, గాజులు, లోలకులు, మెడగొలుసులు దొరకును.

అన్నిషాపులలో దొరకును—క్యాటలాగు ఉచితము.

**Kohinoor Rolled Gold Co.,**

**CHILAKALAPUDI**

---

శాస్త్రోక్తమగు టి. టి. ఇంగువలో

రసాయనిక పదార్థములు ఇమిడియున్నవి. అందుకే ఇంగువ




సువాసనయు సురుచియు నిండియున్నవి. ఈ ఇంగువ చేర్చిన వంటలు చాలా రుచిగా నుండును. జీర్ణశక్తిని సులభముచేయును.

పౌను ఖరీదు రు 1-14-0

రషీద్ జంషెడ్ సన్సు అండ్ కో,

హెడ్డాఫీసు: బొంబాయి.

బ్రాంచీలు: మదరాసు, కుంభకోణం, మధుర.

ప్రభువు చెప్పియుండెను. ప్రాగ్దేశమునందలి చైనా, జపాను, ఇండియా, ఆఫ్ఘనిస్థాన్, సిరియా, పాలెస్టయిను, పర్షియా, అరేబియా, ఈజిప్టు మున్నగు దేశములు అడ్డుచెప్పకుండగ పాశ్చాత్యదేశముల, ముఖ్యముగ బ్రిటనుదేశపు వస్తువులు కొన్నంతవరకు బ్రిటిషువారు జర్మనీ వారితో సరిసమానముగ వర్తక వ్యాపారములు సలిపి, 100 కి 7 గురు మాత్రమే వ్యవసాయదారులుగ నుండి, 91 మంది వర్తక వ్యాపారములలో జీవనభూతిని పొందుచుండిరి. కాని, ఈదేశములోని ప్రభుత్వములు స్వావలంబన తత్వపరులై పరదేశవస్తువులను బహిష్కరింప ప్రారంభించినపుడు అట్టి ఆధిక్యత బ్రిటనుకును, జర్మనీకిని గూడ పోవుచున్నది. మిగిలిన కొద్ది అవకాశములకొరకు ఈ ఉభయదేశములును పోటీపడి వర్తకయుద్ధములను జరుపుచుండుట మనము చూచుచున్నాము. ఇటీవల స్పెయినులో జరిగిన యుద్ధము వర్తక యుద్ధముగాక ఆంతరంగిక యుద్ధముగ లోకులు భావించుచుండిరి. భావములకొరకు ఈ యుద్ధము జరిగెనని కొందరు భావించుచుండిరి. ధనికులకును సామ్యవాదులకును యుద్ధమని కొన్నివేళలందు అపోహ కలిగెను. యుద్ధతత్వపరిణామమునందు మరియొక మెట్టు పైకి వెళ్లుచుంటిమా అను అనుమానము కలిగినది. కాని సత్యమును గనుగొన్నచో అట్టి పరిణక్వమేమియు కనిపించదు. స్పెయినులో ఆంతరంగిక కలహములుకూడ వర్తకములకే. డేనిషునూనెప్రభువునకును, అమెరికను నూనెప్రభువునకును జరిగిన కలహ మిది యని రహస్యము తేలుచున్నది. ఏది ఎట్లున్నను భారతదేశమునకు యుద్ధములతో సంబంధముండుటకు అవకాశములు లేవు. ఏలయన, మనము మరియొక దేశమును ఆశించువారము గాము. మనదేశమును 'వందేమాతరము' పాటయందు వర్ణించలేదా? 'సుజలాం' – జలపూర్ణములైన అనేక నదులుగల దనియు, 'సుఫలాం' - మామిడిపండు మొదలు సీమరేగుపండువరకు అన్ని విధములగు ఫలములు ఉన్నదనియు, 'మలయజ శీతలాం' – పర్వత ప్రాంతములనుండి వచ్చెడి చల్లటి వాయువులు కలదనియు, 'శుభ్రజ్యోత్స్న' – శరత్కాల చంద్రునియొక్క సౌందర్యముతో కూడిన దనియు, 'ఫుల్లకుసుమితద్రుమదళ శోభినీం' - అనేక విధములైన పండ్లు, పువ్వులు, చెట్లు, ఆకులయొక్క శోభతో ప్రజ్వరిల్లుచున్న దనియు, 'సుహాసినీం' – నవ్వుచుండునదనియు, 'సుమధుర భాషిణీం' – చక్కటి వాక్యానములు వినిపించున దనియు, 'సుఖదాం' - సుఖము నిచ్చునదనియు, 'వరదాం' - వరముల నిచ్చునదనియు —ఈ విధముగ మన దేశము వర్ణింపబడి యున్నది. ఇట్టి వర్ణన పరిగ్రస్తమైన విషయములవల్ల అన్ని విధముల సమంజసమైన దని మనకు తెలియును. ఇంతేగాక 35 కోట్లజనమును, 70 కోట్ల చేతులును కలవనికూడ వర్ణింపబడినది. 70 కోట్ల చేతులతో ప్రజ్ఞను వెల్లడించుటకు ఖడ్గములు పూనవలె నని కాదు మనభావము. బంకిం చంద్రుని కాలములో 'ఖరకరవాలే' అనునటువంటి తీవ్ర ఊహ మరియొక కాలములో అంతగ ప్రబలి యుండక పోయినప్పటికిని గాంధీ మహాత్ముని కాలమందు అతడు చెప్పినట్లు అట్టి చేతులు నిర్మాణకార్యక్రమమునందు నిమగ్నములై యుండవలె ననియే తప్ప విధ్వంసక కార్యమునందు శ్రద్ధ పుచ్చుకొనవలెనని కాదు. ప్రపంచముయొక్క జనాభా 200 కోట్లలో 5-వ వంతు అనగా 4( కోట్ల జనము భారత దేశమునందే గలదు. చైనా తరువాత భారత దేశములో ఉన్నంత జనాభా మరి ఏ దేశమునందును లేదు. ఇట్టి వారి కుండెడి సంప్రదాయసిద్ధమగు కళాకౌశలముచే నైననేమి జనబాహుళ్యము కల్గి సంఖ్యాజనితమగు సంక్షోభముచేనైన నేమి దేశమునందున్న శీతోష్ణస్థితుల విభిన్నత్వమువలన నైననేమి సహజమగు నది, పర్వత, సాగర, అరణ్యముల సంపదచేనైననేమి స్వయం పోషణకును, స్వావలంబనకును అనువైన దేశము భారతదేశము కంటె మరియొకటి ఉండజాలదు. కూలూనుండి సీమరేగుపండ్లు క్వెట్టానుండి దానిమ్మపండ్లు, నీలగిరినుండి బేరిపండ్లు, అన్ని ప్రాంతములనుండి పనసపండ్లు, మామిడిపండ్లు, సీతాఫలములు, జామిపండ్లు — ఇవిగాక స్ట్రాబెర్రీలు, రాస్బెర్రీలు, అంజూరా, ద్రాక్ష మొదలైనటువంటి పండ్లుకూడ ఈ దేశమునందు ఉండి యుండగా, ఒ ప్రక్క గోధుమ, మరియొక ప్రక్క వరి, జొన్న, మొక్కజొన్న రాగి మున్నగు ధాన్యము లుండియుండ, అన్ని విధములైన అపరము లుండ, ఉప్పు, మిర్చి మొదలగు నిత్యావసరములు లభించుచుండ వాసనద్రవ్యములు అనేకము లుండ, పూర్వకాలము ఇనుముతో చేయు మూసలు, కళ్లజోళ్లుచేయు రాళ్లు, కత్తులు చేయు ఉక్కు బట్టలునేయు మగ్గములు, నూలునువడుకు రాటములు, కమ్మరము వడ్రంగము, కుండలు, చెప్పులు, బొమ్మలు, ఆటవస్తువులు, ఒకటనేల—ఆవశ్యకములేమి, ఆనందమునకు వలయు వస్తువులేమి అన్నిటిని చేయదగిన సామర్థ్యము గలిగిన వార లుండ ఒకచోటి యాచనకు పోనేల? పరాయివస్తువులు మనము తెప్పించుకొనకూడదని కాదు. ఆవశ్యకమైతే తెప్పించుకొనవచ్చును. యంత్రసామగ్రిని మనము వాడకూడదని కాదు ఆవశ్యకమైనంతవరకు తప్పక వాడదము. కాని వాటికి మనము భృత్యులము కాజాలము. మనవశవర్తనం దవి ఉండవలెనుగాని, వాటి వశమునందు మన ముండరాదు. ఇట్టి సంప్రదాయమును స్థాపించుటకు భారతదేశముతో సమానమైన మరియొక దేశము లేదు. ఇదియే మన భావిజాతీయత. అయి వర్తకవిషయములలో స్వావలంబనము సాధ్యమా అని కొందరు అడుగవచ్చును.

## స్వావలంబనావశ్యకత

మానవస్వభావము కొంత అలవాటుపడినతరువాత అది పో ఎట్లు అనిపించును. నగరములలో చిన్నప్పుడు చదువుకొను రోజులలో ఈ దర్జీలు, ఈచాకళ్లు, మంగళ్లు, మోటార్లు, ట్రాములు మనవూ

పోతే ఎట్లా వస్తాయి అనిపించేది. ఇవన్నియు బస్తీల లక్షణములు. ఆరోజులు పోయి, ఇక్కడికి ఎప్పుడైనను వచ్చినప్పుడు 'ఎంతకాలముండవలెనురా' అనే రోజులు ఇప్పుడువచ్చినవి. పాశ్చాత్యదేశ వస్తువులు మనము కొన్నంతకాలము పాశ్చాత్య వర్తకాధిక్యత యుండక తప్పదు. అయితే ఆర్థికశాస్త్రవేత్తలు ప్రతిరాజ్యముయొక్కయు ఆదాయవ్యయపట్టికలలో ఎగుమతిదిగుమతి ఝుడితీలలో దేశమునకు వచ్చు భాగ్యము పోవు భాగ్యమునకంటె ఎక్కువగా నుండవలెననియు, అందుకొరకు దిగుమతులకంటె ఎగుమతులు ఎక్కువగా నుండవలెననియు నిర్వచించుచున్నారు. ప్రపంచమునందుండెడి అన్ని దేశములకు, అన్నిజాతులకు, అన్ని ఖండములకు పూర్తిగా ప్రత్యేకమైన ఇటువంటి ఆధిక్యత ఏ ప్రకారము కలుగగలదు? మోసేవారుండినగదా ఎక్కేవాడికి సవారీ? చేసే నౌఖరు వుంటేగదా చేయించుకునే యజమాని వుండునది? కొనే అమాయకులు వుంటేగదా అమ్మే బుద్ధిమంతులు ఉండేది? పైన వివరించినట్లుగ ప్రాగ్దేశములు పాశ్చాత్యదేశముల వస్తువులను కొనకనే పోతే ఏమి జరుగుతుంది? అందులో వర్తకపు ఝుడితీల ఆధిక్యత ఎట్లా వస్తుంటుంది? ఎక్కడైనా లోకంలో వుండే తల్లిదండ్రులంతాకూడా ఎప్పుడూ కట్నములు పుచ్చుకోవడమే మా పని అంటే ఇచ్చేవారెవరు వుంటారు? ఆడపిల్లలు వుంటేగాని వివాహము గాదు. ఆడపిల్లలు వుంటే కట్నము ఇవ్వవలసివుంటుంది. మేము కట్నము పుచ్చుకుంటాము గాని, ఇవ్వముఅంటారా? అందరూ మగపిల్లలే ఉన్నారనుకుందాము. అప్పుడు ఎవరికి ఎవ్వడు కట్నాలిస్తాడు? కనుక వర్తక ఝుడితీలలో అన్ని దేశములు తమకు తమకు ఎక్కువ ఆధిక్యత నిచ్చు భాగ్యము వుండవలెనని చెప్పు విషయము అట్లున్నది. అందులకు అన్ని దేశములును స్వావలంబనము అవలంబించవచ్చు. పరస్పర వర్తకములు జాతులకు ఉండవచ్చు. హిట్లరు చెప్పినట్లు తమకు కావలసినది భోజనపదార్థములైనను సరియే, పరిశ్రమలకు వలయు ముడిపదార్థములైనను సరియే—దిగుమతులకు ఎగుమతులవల్ల ఝుడితీ సరిలేకపోయినట్లైతే దిగుమతులు కలపవలసినదే. ఈసూత్రమే ఐరోపాఖండమునందంతయు గూడ రానురాను అవలంబింప గోరుతున్నది. మనకుగూడ అట్లు రావలసియున్నది. యుద్ధములవల్ల వర్తకము ఆధిక్యత అగునని తలచుట బుద్ధి తక్కువ. ఐరోపా మహాసంగ్రామమునందు బ్రిటనులో ఉన్న జనాభా 4 కోట్లలో కోటి పదిలక్షలు బేకారులు అయిపోయినారు. పనిపాటులు లేక మలమల మాడిపోయినారు. తినుటకు తిండి లేకపోయెను. పనిలేనివారికి భృతి నివ్వవలసివచ్చెను. వీటిమొత్తము రోజుకు కోటిరూపాయలు అయెను. దీనికి కారణమేమి? ఫ్రాన్సుదేశము బ్రిటనునుండి తమకు కావలసిన యంత్రసామగ్రి పనిముట్లు పుచ్చుకొనుచుండెడిది. యుద్ధానంతరము వర్సైయిల్సుసంధి జరిగినపుడు సంధిషరతులప్రకారము జర్మనీవారు ఫ్రాన్సుతో 3 వేల వంతెనలు, 40 వేలమైళ్ల రైళ్లు, 50 వేల మైళ్ల రోడ్లు, అనేక భవనములు పునర్నిర్మాణము చేయవలసివచ్చెను. వీటికి కావలసిన గర్డర్లు, ఇనప పట్టాలు, నికిల్, ఐరన్, తీగ, ఇనుము మేకులు, మరలు అన్నియు జర్మనీనుండి ఉచితముగ ఫ్రాన్సునకు రావడమువలన ఫ్రాన్సు సామాన్యముగ శాంతికాలములో ఇంగ్లండునుండి తెప్పించుకొనెడి వస్తువులకుగూడ ఆవశ్యకము తప్పిపోయి గెలిచిన ఇంగ్లండులోని వర్కుషాపులకు పనిలేకపోవుటయు, ఓడిన జర్మనీలో పగలు రాత్రి చేతినిండా పనియుండుటయు, ఇటుల పనిచేయు జర్మనులకు పెట్టుబడి ద్రవ్యము లేనందున ఇంగ్లండువారు, ఫ్రాన్సువారు అమెరికానుండి ఋణము పుచ్చుకొని వీరికిచ్చుటయు, ఈ విధముగ బాకీపడిన దేశమునకు బాకీ తీర్చుకొనుటకుగాను ఇంకను ఎక్కువ బాకీని, పెట్టుబడిని బాకీదారులైన ఫ్రాన్సువారు, ఇంగ్లండువారు ఇచ్చుచుండగ ఓడిన జర్మనీకి త్రికాలములందు అహర్నిశములు పనియుండుటయు, అచ్చట పనివారలకు మూడుపూటల కడుపునిండా భోజనము ఉండుటయు, ఈ విధముగ పరిస్థితు లన్నియు గెలిచినవాళ్లకు పనిలేక ఏడుపు, ఓడినవాడు పనిగలిగి సంతోషించిన సందర్భము గుర్తుకు తెచ్చుకొనవలసియున్నది. కాన యుద్ధముల ఫలితములు జయాపజయములతో నిమిత్తము లేకుండ ఆర్థిక సూత్రముల ననుసరించి నడుచుచుండును. వర్తకము పరులమీద నిర్బంధముగ మోపబడి స్థాపితమగుచున్నంతకాలము ఆర్థికఝుడితీ మనకు అనుకూలముగ నుండజాలదు. మనకు ప్రతికూలముగ నుండ మొదలుపెడితే అసలు నిలువలేము. కనుక, ప్రతిదేశమును స్వావలంబనము నవలంబించి, ఎగుమతి దిగుమతులను సరిపుచ్చుకొని యంత్రములు అనెడు మహాపిశాచములకు ఆహుతిగాక, చేతిపనులను పెంపొందించుకొని బహుజన పోషణము గావింపవలెనను సిద్ధాంతము భారత జాతీయతకు పునాది. ఇట్టి పునాదులవల్లనే గ్రామములలో గృహపరిశ్రమలను నెలకొల్పవలెనని అఖిల భారత గ్రామోద్ధరణ సంఘముయొక్కయు, చరఖాసంఘముయొక్కయు ఉద్దేశ్యమయియున్నది.

## 'గ్రామములకు మరలుడు'

ప్రశ్న చిన్నది. అయితే సమగ్రమైనది. సరియైనది కూడా. గ్రామములను బస్తీలకు తీసుకు వెడదామా, బస్తీలలో ఉండే సౌకర్యములను గ్రామముల చెంతకు చేర్చుదమా? గ్రామములను బస్తీలకు తీసుకుపెళ్లి పనిపాటులు ఏర్పరిచిన యంత్రసామగ్రియొక్క యాజమాన్యమును అంగీకరించి, యంత్రసామగ్రికి బానిసయై యుండవలసి వచ్చుచున్నది. గ్రామములలోని పంటలను కొనుటకు బస్తీలలోని షాహుకార్లను వారిచెంతకు పోనిండు. గ్రామములలోని పరిశ్రమల నుద్ధరించుటకు బస్తీలలోని వర్తకులను ఈ పరిశ్రమల నాదరించనిండు. గ్రామముల

లోని విద్యాలయములు దేశముయొక్క పరిస్థితులకును, పరిశ్రమలకును స్థానములు గానిండు. గ్రామములలోని వివిధములైన తగవులు తీర్చుకొనుటకు ప్రజలు బస్తీలకు పోవుటకు బదులు బస్తీలలో నుండెడి న్యాయస్థానములకు రూపాంతరములైన పంచాయితీ కోర్టులు గ్రామములలోనే న్యాయమును జరుపనిండు. అప్పుడే బహుజనాభిప్రాయమును మన్నించి, లోకమునకు వెరచి, అసత్యము చెప్పుటకు భయము ఏర్పడగలదు. అట్లుగాక న్యాయముకొరకు గ్రామస్థులు బస్తీలకు వచ్చినపుడు మోసము చెప్పడము తప్ప మరియొక్కటి సంప్రాప్తించదు. కోర్టులో అబద్ధములు చెప్పుటకు ఎవరైనా వెరుస్తారా? ఏమయ్యా అట్లా అబద్ధములు చెప్పావంటే అది కోర్టుకాదటండీ అని సులభముగ సమాధానము చెబుతారు. గ్రామములందైనచో తన తల్లిదండ్రులను, తన సంప్రదాయమును, తన పరువుప్రతిష్ఠలను బాగా ఆలోచించి గ్రామపెద్దల ఎదుట ఎవరైనను ధైర్యము చేసి అబద్ధము చెప్పగలరా? ప్రమాణము అనగా లాభము అయిపోయినది. ప్రమాణము అంటే కోర్టులు, కోర్టులంటే సత్యము చెప్పెద నని ఖరారునామా కాదు. అబద్ధము చెప్పుటకు లైసెన్సు పొందుచుండుట అన్న మాట. ఇది లోకవిదితము, నిర్వివాదము, సంస్కరణయోగ్యము. కాబట్టి గ్రామములను పునరుద్ధారణచేసి, బస్తీలను గ్రామస్థులు విక్రయార్థముగ నేర్పడువానిగ జేసి, ధనప్రవాహము గ్రామములనుండి పట్టణములకు, పట్టణములనుండి నగరములకు, నగరములనుండి పరదేశములకు గాక, ఈస్టు ఇండియా కంపెనీ వారు మొదట తమ దేశమునుండి ఇచ్చటకు ధనము తెచ్చిన విధమున పరదేశములనుండి ధన మిచ్చటకు వచ్చునట్లు చేసి, పెద్దనగరములనుండి వర్తకులు గ్రామములనుండి వస్తువులను తెచ్చి విక్రయించి ధనప్రవాహమును పైన దెలిపిన విధమున గాక విదేశములనుండి నగరములకు, నగరములనుండి పట్టణములకు, పట్టణములనుండి గ్రామములకు సహజముగ ప్రవహించునట్లు చేయవలెను.

## విద్యావిధానములో చేయదగిన మార్పులు

విద్యావిధానము కంఠపాఠముమీదను, పరభాషాశ్రయముగను, జాతీయతకు విరుద్ధముగను నుండుచుండు ప్రస్తుతవిధమును మార్చి, దేశముయొక్క పరిశ్రమలకును, గ్రామముయొక్క శ్రేయస్సునకును ఆవశ్యకమైన విద్యను బాల్యమునందే వీరికి అలవరచు విధానమును యోచించి యేర్పచవలెను. అదియే వార్ధా విద్యావిధానలక్షణము. ఇంతకాలము విద్యాసముపార్జన చక్షురక్షుర సంయోగముచేతనే జరుగుచున్నది గాని కర్మవిద్యలు, కళాకౌశలములవల్లను, బుద్ధివివేకమువల్లను కాదు. ఏవస్తువును నిజముగ కార్యాచరణరూపమున మనిషి సృష్టించగలడో ఆవిధముగ చేతిపరిశ్రమలను పెంపొందించునట్లుగ గ్రామముల యొక్క విద్యావిధానములను మార్చవలెను. న్యాయస్థానము న్యాయవిధానము మార్చినపుడు మాతృభాషయందు కార్యక్రమమునంతయు నడపు నాయకత్వము వహించి గ్రామములనుండి వచ్చు గ్రామీణనేతలే తమ దేశముయొక్క కష్టసుఖములను శాసన సభలయందు ప్రచురింపగలిగి, తనమనస్సులోని భావములను ఎదుటివారికి చెప్పగలిగియుండుటయే గాక, ఎదుటివాని భావములను తానుకూడా స్వీకరించగలిగియుండునట్లు శాసనసభలోను, విద్యావ్యాపకమునందును, వ్యవహార సరళియందును మాతృభాషాద్వారానే కార్యములు జరపు ఆవశ్యకతకూడా భావిజాతీయతయొక్క ముఖ్యలక్షణములలో నొకటి. విశ్వవిద్యాలయములకు పంపు విద్యార్థుల సంఖ్య సంకుచితముగ, నియమితముగ నుండవలెను. మన కక్కడ పిల్లలకు చదివించుటకు తగిన భాగ్యము లేదు. అట్టి చదువువలన జీవనోపాధి లభించు నవెడి ఆశ గగనకుసుమము. 40 కోట్ల జనములో అనుదిన పోషణకు వలయు స్వల్ప ఆర్జన చేయుటయే దుష్కరము. దానికొరకు మనము ప్రయత్నింపవలసి యున్నది. ప్రధాన మగు విద్య గ్రామవిద్య, వ్యవసాయ విద్య మనకు గావలెను గాని, విశ్వవిద్యాలయపు విద్య భాగ్యవంతులైన ఏ కొద్దిమందికో, తెలివితేటలు గల ఏ అల్పసంఖ్యాకులకో నిరూపింపబడవలెను. జపానునందు 100 కి 49 మంది వ్యవసాయదారులు. అందులో 12,14 సంవత్సరముల తరువాత వ్యవసాయ కళయందు క్రమశిక్షణ పొందని వ్యవసాయకు లెవరును లేరు. అటులనే ప్రతి గృహపరిశ్రమ విషయమైకూడా అచ్చట క్రమశిక్షణ నొసగుదురు. అట్లనే మనముకూడా మన పెద్దలు నిర్ణయించిన చతుష్షష్టికళలను శాస్త్రీయముగ చేసి, పఠింపజేసి, పిల్లలకు బోధింపించవలెను. భారత జాతీయతకును, ఔన్నత్యమునకును కారణమైన జాతీయవిద్యకు సంబంధించిన విద్యాసూత్రములయొక్క తెగిపోయినటువంటి అంచులు పట్టుకొని కూడదీసి మనము విద్యను సక్రమముగ నడిపించుట చాలా ముఖ్యము, ఆవశ్యకము. ఈ విధమున ఒక విద్యయననేల, ఒక స్థానికసంస్థ లననేల, ఒకపురపాలక సంఘము లననేల, ఒక గృహపరిశ్రమ లననేల, ఒక చేతిపను లననేల, దేశముయొక్క భాగ్య భోగ్యములకు మూలాధారమైన విద్యలన్నిటికిని ఈ సూత్రము వర్తించును.

బ్రిటిషు రాజ్యమునందు రైళ్లకు అతి ప్రాముఖ్యము నిచ్చినారు. రైళ్ల ఎదుట ఆనకట్టలు, డాములు, నీటిపారుదల సాధనలును హీనమై పోయెను. అథవా నీటిపారుదల యత్నములు గావించబడినను అవి బాహుళ్య ప్రమాణముమీద ఏకొద్దిచోట్ల ఏర్పడినవో కాని పూర్వపు చెరువులను మరమ్మతుచేసి వీటిద్వారా దక్కిన నీటిని ప్రజలకు అర్పించలేకపోవుటకూడా శోచనీయము. ఒక ప్రక్కనేమో సైనిక పెట్టుబడిఖర్చు ఎదుట పైవ్యవహారములకు వెచ్చింపబడిన సొమ్ము బహు తక్కువ. ఇంకొక ప్రక్కన రైళ్ల ఎదుట నీటిపారుదల యత్నములు, అందులో ఆనకట్టల ఎదుట గ్రామచెరువుల మరమ్మతు యత్నించుటయు. పాశ్చాత్య వాదులకు ఈ తంతంతయు విపరీతముగ కన్పట్టవచ్చును. కావున పూర్వపు

భావములను పూర్వపు ఊహాపోహలనుగూర్చి మన మెంతవరకు చేయగలమో అట్టి సంస్కరణలను జాతీయ జీవనము యొక్క బహు శాఖలయందు పరివర్తన తీసుకొని రాకలసిన విధి మనది. ఖద్దరు కట్టుకొన్నవారి ధర్మము తక్కిన గృహపరిశ్రమలకు మార్గదర్శకమని లోగడనే సూచించి యుంటిని. ఆయుర్వేద వైద్యులు ఆయుర్వేద వైద్యమును పునరుద్ధరించుట భారత జీవనమున కవసర మని తెలిపి ధన్వంతరిపూజ గావింపవలె ననియు, చరక సుశ్రుతులయొక్క యుగమును తిరిగి తీసుకొని రావలెననియు చెప్పుదురేగాని మల్లుబట్ట ధరింతురు. ఇంక జ్యోతిష్కుడు వచ్చును. బుధ, గురు, శుక్ర, సూర్యచంద్రాదులు తన అరచేయి అనెడి గగనమునందున్నటుల తలంచును. ఏ నక్షత్రమును పిలిచిన ఆ నక్షత్రము వీరి చెంత హాజరగును. రాహు కేతువులు, శని, కుజుడు-వీరందరును చేతులు కట్టుకొని వీరి ముందర నిలువ వలసినదే. జ్యోతిషశాస్త్ర పరిశ్రమ విశేషముగ చేయునుగాని గ్రామపరిశ్రమలయందు వీరికి భక్తిలేదు. ఆయుర్వేదవైద్యము వదలి పాశ్చాత్యవైద్యమును వీరు నవలంబింతురు. గ్రామఫోను హార్మోనియముల నింట్లో పెట్టుకొందురు. నాటకముల బదులు సినిమాలకు పోవుదురు. ఒక తమశాఖయందే జాతీయతను కోరుదురుగాని పరశాఖలలో విజాతీయత ననుసరింతురు. ఇంక కర్ణాటక సంగీత శిఖామణి. ఆయన పూర్వపు త్యాగరాయలను స్మృతికి దెచ్చుకొని తన్మయత్వముతో కళ్ల నీరుపెట్టుకొని జాతియొక్క స్థితికి విలపించునుకాని తాను ధరించెడి మల్లుబట్టలు, జరీవుత్తరీయములు, ఆల్పాకాకోట్లు, వాడెడి ఇంగ్లీషు వైద్యము మున్నగునవి జాతీయతకు విరుద్ధము లని తాను గ్రహింపజాలడు. ఇంక చతుర్వేదశాస్త్ర పారంగతుడును, షట్శాస్త్రవేత్తయు, సంస్కృత సారస్వతమును సాంగోపాంగముగ పఠించిన కవిశిఖామణిని సభకు పిలచెదము. పూర్వపు లోకోక్తులు, నీతి పద్యములు, సంస్కృత శ్లోకములు, భోజ విక్రమార్కుల కాలమున పండితుల కవిత్వపు రోజులు-వాటినిగురించి కుప్ప తెప్పలుగ కురిపించును గాని పిల్లలను విదేశపు పాఠశాలలకు పంపి, దేశదౌర్భాగ్యమునకు కారణమైన విద్యా విధానమునందు వివిధములైన పరీక్షలయందు తన కుమారుడు వుత్తీర్ణు డవవలెనని కోరుచుండును. సాలిశెట్టి హాజరై తన వృత్తి పోవుచున్న దని దుఃఖించునేకాని, తాను నేయు నూలు విదేశములనుండి దిగుమతి అయిన దని కనిపెట్టజాలడు. ఆ నూలే మంచి దనియు, బలమైన దనియు, ఒకమోస్తరుగ నుండు ననియు, పురిగలదనియు, తెగ దనియు, సన్నదనియు పొగడును. ఇట్టి నూలుయొక్క మిశ్రమము లేకయే ఇతడు నేయజాలడు. ఏలయని మనము శంకింపవచ్చును. అర్ధగంట సభలో మనము ఇంగ్లీషు మాటలు లేక తెనుగునందు ఉపన్యసింపజాలము. అటులనే విదేశపునూలు మిశ్రమము లేకుండ ఖద్దరునూలుమీద ఇతడు నేయజాలడు. నేత నేయు సాలిసెట్టి నూలువడకు ముసలమ్మయొక్క వృత్తిని నశింపజేయుచున్నాడు. ముసలమ్మ నూలువడకునుగాని విదేశపుబట్ట కట్టుకొని సాలిశెట్టిని నశింపజేయుచున్నది. కుమ్మరి, కమ్మరి తమ వృత్తులు పోవుచున్నవని మొరపెట్టుదురే కాని కుమ్మరి పింగాణీ గిన్నెలను, వడ్రంగి విదేశీ పనిముట్లను, మునిసిపాలిటీవారు పెంట బండ్లకు రబ్బరుటైరు చక్రములను వుపయోగించుటయు, చెప్పులు కుట్టువాడు పింగాణిగిన్నెలో గంజి త్రాగుటయు, కుమ్మరి విదేశీ వస్త్రము ధరించుటయు, మంగలి జపానుబూట్లను తొడుగుటయు, చాకలి బ్లీచింగు పౌడరు పెట్టి తెలుపు చేసియు, ఎవరి వృత్తులను వారే నశింప చేసుకొనియు, లేనిచో ఒకరి వృత్తులను మరియొకరు నశింప చేసుకొనియు ఆత్మవినాశకారులును, పరస్పర నాశనకారులును అగుచున్నారు. విద్యా విధానమునం దీవృత్తు లన్నిటికిని కళాశాలలు ఉండవలెను. ఎవరి వృత్తియందు వారు ప్రావీణ్యత సంపాదించి, తండ్రుల తొడలపై కూర్చుని కులవిద్య నేర్చుకొనుటయేగాక, గ్రామ పాఠశాలలయందు సుశిక్షితులు కావలెను.

దేశమునకు కావలసిన బాహుళ్య పరిశ్రమలు, అనగా విద్యుచ్ఛక్తియొక్క యుత్పత్తి, రైళ్లు, తంతి, రసాయనశాస్త్రమునకు సంబంధించిన పైరుపంటలు, ఇనుము, ఉక్కు ఉత్పత్తి, ఇవన్నియుండవలెగాని సర్కారుయొక్క అధీనమునందు, పెట్టుబడిదారులయొక్క భాగ్యభోగ్య సాధనములుగ నుండకుండునటుల చేయవలసియున్నది. భూమిలేనివారికి వీలైనంతవరకు భూమి పంచియివ్వవలెను. వృత్తులు లేనివారికి వృత్తులు కల్పించవలెను. దేశమున కావశ్యకమైన వస్తువులను దేశములో తయారుచేయవలెను. పరాయిదేశములనుండి అనివార్యముగ దిగుమతి చేయవలసిన వస్తువులకు మన ఎగుమతులవల్ల లావాదేవీలు సరిపడలయును. శాంతిసైన్యమువలన ఆంతరంగిక అరాచకములను, బహిరంగపు దండయాత్రలను ఎదిరించు సాధనములను నిర్మించవలెను. కలియుగమునుండి తిరిగి సత్యయుగము వచ్చునటుల చేయవలెను. ఇదియే భారతజాతియొక్క భవిష్యత్తు.

# నిరాకృతి

[కచుడు కృతార్థుడై ఆచార్యుల అనుమతితో మాతృసీమకు పోవనున్నాడు. ముందుగా ప్రాణదాత్రి అయిన గురుపుత్రిక దేవయానికి తన ప్రయాణము చెప్పి సెలవడిగినాడు. దివా స్వప్నాలతో పెంచుకొన్న తన మోహ ప్రవృత్తిని వ్యాఖ్యానించి సానునయముగా, సాక్రోశముగా ఆమె అతని పాణి కాసపడినది. అతని 'కాదు' యే నిరాకృతి.]

●

శ్రీ బొడ్డు బాపిరాజు

అనునయశీతలమ్ము, మదనానలతప్తహృదంతరవ్యథా
ధ్వనితము, నూత్నయౌవనవివర్ధిత సుందరభావనాసమ
ర్థనకుశలమ్ము నై తుది క్రుధాపరివర్తితమైన నీ నియో
జనమును నిర్వహింపగల శక్తి యెడందకు లేదు సోదరీ!

ఆసకు పాదుసేసి తడియార్చక పెంచుచు, ప్రేమ నక్షరా
భ్యాసము లేని యీ జడుని హస్తము నందిడి యేల యౌవన
శ్రీ సుకుమార మప్రహత చిత్తము భగ్నమొనర్పజూతు; వ
మ్మా! సుఖతృష్ణలో నరయవైతివి అన్యమనఃప్రవృత్తులన్.

ఏ దివ్యక్షణమందు నర్థినయి నే నీయాశ్రమాగ్రమ్మునన్
పాద మ్మూంచితినో, ప్రభాత వికచాబ్జంబ ల్లెదుర్కొంటి వా
మోదస్నిగ్ధములైన స్వాగతముదెల్పుం జూపులన్; నాడదే
సౌదర్య మ్మెద నావరించె నది త్రుంచన్ ద్రుంగ దీనాటికిన్.

ఈ నిమసమ్ము దాక గురితింపను చెల్లెలు లేని లోటు, స
న్మానముతోడ నీ మధురమైత్రులలో చన విచ్చి పుచ్చుకొ
న్నా నది దోహదమ్ముగను నన్నెటు లర్థము చేసుకొంటివో
కాని, మదాత్మలో నొక వికారపుతుంపురమైన లేవదే!

ఇల నడుగుంచి యుంచనపుడే మొదలైన నరాదదుష్టచే
ష్టల నణగారి, చచ్చిచెడి సత్కరుణాదరణామృతోర్మికా
నిలయ భవత్కటాక్షముల నీడల నూపిరి పోసుకొన్న మే
త్తలచుచు తల్లి! నీదు నుదరమ్మున పుట్టి ఋణమ్ము దీర్తునో?

గిలిగింతల్ పచరించు పల్కులను లొంగింపంగ నున్నావా? చె
ల్లెల! యీ స్థాణువు నల్లగుండె తొలచన్ లేవు, ఏమి లాభమ్ము! ప్రో

డులకుఁ బోసిన నీరువోలె శ్రమముండున్, శూన్యకేదార సీ
మలకున్ సాగిన యీ స్రవంతికల నమ్మా! వేరె మళ్లింపుమా!

తగదనుమాట కాదు, విబుధవ్రతపాలన కడ్డటంచు గా,
దిగ సుఖభోగభాగ్యముల నిచ్చ లగింపమి ముందె కాదు, నీ
వగపును జూచి జాలి దయివారక కాదు; మనమ్ము నీపయిన్
తగులము సెంద దింతట వృథా శ్రమ పుచ్చుకొనంగ మానుమీ.

ఏమనుకొన్ననున్ సరియె; యీవు సహోదరి వంచు మన్మన
స్సీమను నిల్పి నీ చెలిమి సేతలు చల్లని వేళలందు మా
గీమున నుగ్గడించి కరగించెద నందర; నీమనోధృతిం
బ్రామిన యల్క మానుకొనవా? సెలవీయవ? పోయివత్తునా!

# ప్రతీకారము

శ్రీ బి. వి. శ్రీనివాసాచార్య

●

[దేవయాని కచుణ్ణి శపిస్తుంది—]

నిను మనసార నమ్మితి; పునీతములైన మదీయ నిర్మల
ప్రణయ రహఃప్రపంచముల పాలన కేలిక జేసితిన్, కచా!
కనుగవ తోచు వెల్గుల నిగారపు చల్లని ఛాయలన్ సత
మ్మని యెద పొంగితిన్; తెలియనైతిని లెమ్ము యథార్థవృత్తముల్.

మనమున నింత కల్మష మమర్చి, అహో! నటనాధురీణ! ప్రే
మను వెలయించినా వసురమర్మము మంత్రము పొందినావు, కో
రిన యశమున్ లభించెడినిలే కచ; సర్వము సానుకూల మ
య్యెనుగద! ఇంక నేమిపనిలే, ననువంటియభాగ్యురాలితోన్?

నీకై పూవులు విచ్చె నీవనలతానీకమ్ము; వీచెఁ హిమా
నీకమ్రానిలముల్; తరంగిణులు పూనెన్ కిన్నరీ రమ్య సు
శ్లోకావ్యక్తమనోజ్ఞగీతములు;—మాలోకమ్ము సర్వస్వమున్
నీకై కైవస మయ్యె;—ఏ మెరుగురా నీకృత్రిమాలోచనల్.

సమముగ నిన్నియేండ్లు వరుసన్ జరియించిన మైత్రిజేసి ఆ
శ్రమవన సర్వసృష్టియు నశాంతిని నెంతగ తల్లడిల్లెడున్,
గుమిలెడు, క్రూర! నీకయి;—కనుంగొన సిగ్గును లేదురా! విని
ర్గమనము తెల్పవచ్చితివిరా! పెదవిన్ చిరునవ్వు చిందులన్.

నిను నీదేశము జేరినంత నెదురై నీవారు కేల్పుష్పసూ
న నిబద్ధోరు రథమ్మునన్ నిలిపి సన్మానింత్రు; స్వర్వీథు లె
ల్లను సుస్వాగత మిచ్చు నీకు; దిశ లాలాపించు నీకీర్తిగా
థను; నేనో ఇట నిల్చియుందు గతమున్ ధ్యానించు చీగాలులన్.

వెన్నెల రేల నిర్భరము 'వేణుమతీ' సికతాతలమ్ములన్
క్రొన్ననతావి కౌగిళులలో నొకతై విహరించునాటి సం
పన్నసుధాస్మృతుల్ తలపు వచ్చి యెడందను కోతపెట్ట వి
చ్ఛిన్న సుఖోర్మినై, బ్రదుకు సిగ్గరి యేడ్తునురా! కఠోరుడా!!

రమణియెడంద కోమలమురా! ఇటు వేదనలన్ రగుల్ప న్యా
యము మరి కాదురా! ఇదె త్వదంఘ్రులకున్ ప్రణమింతు; నీ ప్రయా
ణము విరమింపు మింతట; ధనమ్మును, కీర్తియు గావు జీవితా
ర్థము; లిటు ప్రేమ రమ్యసుమదామము కాలను రాయగాదురా!

నిలు నిలురా! కచా! మనగ నేరనురా నినుబాసి, అయ్యయో!
పలుకవా! పోదువో! బ్రదుకు స్వప్నములౌ మొదలంట త్రుంచి, స్త్రీ
యలిగిన తాళజాలవు సుమా! కపటీ! ఇదె నిన్ శపింతు: దై
త్యుల గికురించి నేర్చిన త్వదున్నతవిద్యలు వమ్ముగావుతన్!





# వైదికుల పరిభాషలు





## ఆకరాలు :: సంకేతాలు :: పుట్టుపూర్వోత్తరాలు


శ్రీ

జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి


ఉర్లాంలో శ్రావణి (సన్మానం) పుచ్చుకోడానికి బయలుదేరిన వేదమూర్తులు తరువాతకూడా సంచారం చేసి, ఆశ్వీజమాసాంతం తిరిగితిరిగి యిళ్లకు మళ్లుతారు. నున్నగా గవ్వమెఱుఁగుపెట్టిన ముండితమస్తకమూ, బ్రహ్మతేజస్సుబడే ఫాలమూ, చెవులకు మకరకుండలాలూ, బుజంమీఁద శాలువా, చేతికి సింహతలాటం ముఱుఁగులూ, చంకను మడిసంచీ, సీరుకావిధోవతులూ కలిగి, వేదపనసలు చెప్పుకుంటూ, తమ్ము సన్మానించిన చోట్లల్లా వేదనినాదాలు చేస్తూవుంటారు. వేదమెల్ల చదివినవారు. సరస్వతీదేవి పుంమూర్తులు వారు. అరణ్యాల్లో కూచుని ఉపనిషత్తుల్ని చూఁచిన వారికి వారసులు వారు. నాఁటి సంప్రదాయము దెబ్బతింటున్న ఈ నాఁటకూడా వారు ఇలా ఉన్నారే, ఆనాఁట వారు ఎలాఉండేవారో! నాఁడేమోగాని, నేఁడు వారూ అంతోయింతో పతితులైనమాట వాస్తవం.

ఒక క్రొత్త యుగసంప్రదాయము వచ్చి, పాత వాటిమీఁద మంచిగానో, చెడ్డగానో తన ప్రభుత్వము నేలుచున్న దినాలు యివి. నేఁటి కాలవాహినిలో ప్రతి వారును అంత్తోయింతో మునుకలువేసినవారే; వేసే వారే. మార్పు బలీయమైవచ్చింది. పాఁతవాటియెడల వైమనస్యం పెరిఁగినది. ఆ వేదమూ, అది విధించిన కర్మకలాపమూ బలవంతముగానో, భయము వల్లనో జరుపఁబడుచున్నదేగాని వినయ విధేయలతోఁ గాదు, త్రికరణశుద్ధితోఁ గాదు. యజనయాజనములు మూలఁబడినవి. కొండొక్కచో నున్నను అవి విడంబనకును, సంపాదనకును మాఱినవి. హిందూలాలో సప్తపదికి గౌరవం ఏర్పట్టం, అది వొక అవసరంగా ఉండటం వల్ల వివాహాదికం సమంత్రకంగా జరుపుతున్నాము (1930 తరువాత జరిగే పెళ్లిళ్లలో వివాహమంగళం ఎంతో దెబ్బతిన్నది. కాని అసలు మూర్తి గల్లంతు కాలేదు). మర్యాదకు ఉపనయనాదులు చేస్తున్నాము. తలిదండ్రులకు ముట్టిచస్తాయా అని అనుమానిస్తూనే —పెట్టకపోతే ఏ అరిష్టము చుట్టుకుంటుందో అనే భయాన తద్దినాలు పెడుతున్నాము (పెట్టేవాళ్ల మాటే. తద్దినమంత్రం తేటతెల్లంగా తెలుఁగు అయితే ఈగుంజాటన పోతుందిగాని, అట్టిపని జరగలేదు). ఈమార్పు, ఈ భావసంఘర్షణ ఒక్కనాఁడు వచ్చినది కాదు; ఎన్నాళ్లనుంచో వస్తున్నది. ముఖ్యంగా జీవిక ఒక వర్తకంగా తయారైనది. ఎక్కడ పట్టిచూచినా. వైదికుల జీవిక మరీ అర్ధాన్నమయినది. వారి జీవిత వర్తకానికి పెట్టుబడి లేదు. ఇంతలాభం అని నిర్ణయంలేదు. బేరండున్నా రశ్మిలేదు. దయాధర్మ బిచ్చం అయినది. ఏనాఁటినుంచీ వస్తోందో ఇది. ఈ పతనము (అనుకుంటే...) బౌద్ధులనాఁటిదో, తరువాతిదో

కాని మొత్తంమీఁద వైదికధర్మములమీఁద నిరాదరణ ప్రబలినది. మఱీమఱీ రానురాను ఆ నిరాదరణ పెచ్చు పెరిఁగినది. వేదశాస్త్రాదులయెడలా, వాటితో సంపర్కం పెంచుకున్న శ్రౌతస్మార్త క్రియాకలాపాదుల యెడలా వైమనస్యం ఎక్కువ అయినతరువాత అవి మఱీ వర్తకంగా తయారైనవి. ఇట్టివి చేయించేవారికి ఆనాటి వసిష్ఠధౌమ్యుల మర్యాదా ప్రపత్తులు కఱవైనవి. డంబమూ, పటాటోపమూ కావలసివచ్చినవి. కొంత మఱుఁగు తప్పనిసరి అయినది.

విషయం అంటూ వుంటే మాటలకు కొదవా? "ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిః." మాటలు సాంకేతికములై వెలసినవి. వాడుకలోకి వచ్చినవి. చెలామణీ అగుచున్నవి. ఇంకను ఇట్టివి పుట్టుటకు అక్కరకలుగుదో అట్టివి తయారగుటకు వీలునుకూడ కల్పించుకొన్నవి. ఇట్లు ఇప్పటికి తయారైన పదములు కేవలవైదికులకడ మాత్రమే చలామణీకాక, ఇతరత్రకూడ చలామణీ అయినవి. కవుల ప్రయోగములలోనికిగూడ కొన్ని ఎక్కినవి (ప్రయోగములున్నవాటికి అట నుదాహరణముల నిత్తును). వైదికులు పరస్పరము మాటలాడుకొను మాటలను చూపి, ఆ సంకేతము ఎటుల పుట్టినదో క్రమముగా నిరూపింతును.

***

"ఏమోయ్ కామావధాన్లూ! 'వయందేవస్య' ఎక్కడ?"

"'దేవావై' లో"

మొదటి బ్రాహ్మఁడు 'భోజనం ఎక్కడా' అని అడిగినందుకు 'సత్రమున' అని జవాబు.

తఱుచుగా వైదికులు పక్కనున్న మాటను ఈవలి మాటకు సంకేతము చేయుదురు. అటుల తయారైనదే ఈ 'వయందేవస్య'. శ్రుతిలో "వయందేవస్య భోజనం" అని గలదు.

అట్టిదే 'దేవావై'. "దేహావై సత్ర మాసత" అని శ్రుతి.

***

"'తేజోవా' ఏమన్నా ఉంటుందా?"

"'ప్రక్రాంతం' కాదూ...ఓ, 'యదశ్వమేధం'!"

మొదటి బ్రాహ్మఁడు 'నెయ్యి యేమైనా వేస్తారా' అని అడిగాఁడు. కడుపునిండుతుందా, లేక తూష్ణీం (ఊరికే) ఏదో పెట్టామంటే పెట్టాము అనేదేనా అని అడిగినవాని ఉద్దేశము. 'తద్దినము గనుక సమృద్ధిగా పోస్తారు, రావయ్యా' అని రెండవవాని జవాబు.

ఇందాఁక మనమనుకొన్నదాని చొప్పున ఇక్కడ వేదమును వెతకుచో కిటుకు తెలియఁగలదు. "తేజోవా ఆజ్యం" అని వేదము.

"ప్రక్రాంతం శ్రాద్ధకర్మ కరిష్యే" అని తద్దినం మంత్రము. నేయి నన్నయ భారతముకే ప్రవాహావత్ గా భావించఁబడింది. వైదికులకు నేయి అనఁగా మిక్కిలి మక్కువ. ఈ వైదికుల పరిభాషలలో నేతికి రెండు మాటలు కలవు. మఱొకటి 'తేజోవై'. "తేజోవై ఘృతం" అని మంత్రము.

***

"ఏఁవిషోయ్, అంత 'దేవాదేవేషు' జరిగిందీ..."

"ఆఁ, పోనిద్దురూ. ఇద్దరూ 'నిషంగిణ' గాళ్లే, ఏదో, మనకెందుకు?"

'ఏమిటోయ్ అంతపోట్లాట జరిగిందీ' అని ప్రశ్న. 'ఇద్దరూ దొంగలే మన కెందుకు' అని జవాబు.

'దేవాదేవేషు'అనఁగా పోట్లాట; దెబ్బలాట. 'నిషంగిణ' అంటే దొంగ. రుద్రమున "నిషంగిణ ఇషుధిమతే తస్కరాణాంపతయే నమోనమః" అని కలదు. విలుకాఁడను అర్థము పోయి, దొంగ అను అర్థము వీరి పరిభాషలో పుట్టినది.

ఇక్కడ ఒక విశేషము. పక్కనున్న మాట కాక కప్పగంతువైచి ఆ పక్కలనున్న మాట అర్థము మొదటిదానికి వచ్చినది. ఇట్టివి మఱికొన్ని గలవు.

'దేవాదేవేషు' అనుపదమునకు కథ యొకటి యున్నది. అది వెనక 'భారతి'లో అచ్చైనదిగూడ (పెట్టకథలలో). క్లుప్తముగా ఆ కథ యిది.—చిన్నల్లుఁడు అత్తవారింటికిఁ బోయినాఁడు. పెద్దల్లుఁడును వచ్చినాఁడు. పెద్దల్లుఁడు వేదమూర్తి; చిన్నాయన శాస్త్రము చదువుతూన్నవాఁడు; పండితుఁడు. చిన్నవాఁడు గనుకను, కొత్త

గనుకను అతనికి గదిలో మంచము వైచినారు. పెద్దల్లుఁడు పాఁతబడుటయు, అఱమఱికలు పోవుటయుఁ గల్గి, బయట సావిట్లోనే పన్నుండినాఁడు. చిన్నాయన శాస్త్రజ్ఞుఁడనను గర్వమున గది తనది కావుటను పాంకోళ్లు టకటకలాడించుచు రాత్రియంతయు గదినుండి బయటకు, బయటనుండి గదికీ పోవువాఁడు. చిన్నాయన నిద్రమైకమున నిద్రించుచున్న పడ్డకునికి పాంకోడు దెబ్బలు. దెబ్బతిని తోఁటియల్లుఁడు నొచ్చుకొనుచుండఁగా పండితుఁడు 'క్షమధ్వం' (Excuse me) అని తడవతడవకు అనువాఁడు. ఇటుల చాలాతడవలు గడిచినవి. నిద్ర పోవుటయేగాక నొప్పి, ఇతఁడు 'క్షమధ్వం' అనుటయు పెద్దాయనను విశేషించి బాధించినవి. మర్యాదకు సహించుచు వచ్చినాఁడు. చిన్నాతఁడు మఱల వచ్చి, పాంకోళ్లతోఁ ద్రొక్కి, 'క్షమధ్వం' అని దొడ్లోకి పోయినాఁడు. పెద్దాయన యిఁక భరించలేక, వెంటఁబోయి పిలక పట్టుకుని 'క్షమధ్వం' అను మాటవంటిమాట (ధ్వనిలో) గల "దేవా దేవేషు శ్రయధ్వం, ప్రథమా ద్వితీయేషు శ్రయధ్వం" అను పన్నమును చెప్పుచు, 'ధ్వం'వచ్చినప్పుడల్లా ఒక్కటిచొప్పున దెబ్బలు కొట్టినాఁడు. అల్లరికి నలుగురూ లేచి అడుగుడు కథయంతయు చెప్పినాఁడు. చిన్నాతఁడు సిగ్గిలినాఁడు. ఈ కథలో 'దేవా దేవేషు'తో దెబ్బలు ప్రారంభమైనవి గనుక 'దేవా దేవేషు' అనఁగా దెబ్బలాట అను అర్థము సంకేతించినారు వైదికులు. మంత్రమునుబట్టికాక కథనుబట్టి సంకేత మిది.

***

"సదస్యంట, రావుటయ్యా సుబ్బావధాన్లూ!"
"'వాయువ్యం' ఏమైనా ఇస్తారా?"
"ఇవ్వచ్చు. 'ప్రతిశ్రుత్కాయ'కు చచ్చుండదు."
"'యువాసు'?"
"ఇంకా నయం! మొత్తమ్మీఁద పోనిచ్చావుకావు."

సదస్యానికి రమ్మనఁగా 'రూపాయి ఇస్తారా' అని అడుగుతాఁడు. అర్ధరూపాయకు చచ్చుండదనఁగా, 'బట్టలు ఏమైనా ఉన్నాయా' అని శంక. మొదట పిలిచిన వాఁడు కసురుకుంటాఁడు.

"వాయువ్యగ్ఁ శ్వేత మాలభేత" అని మంత్రము. పక్కనున్నమాట అర్థము పూర్వపుమాటకు రాఁగా 'వాయువ్యం'అనఁగా 'శ్వేతం'అయినది. శ్వేతం అనఁగా రూపాయికి వైదికులు పెట్టుకున్న ఒక గుర్తు. రూపాయి తెల్లగా వుంటంచేత ఆకారాన్నిబట్టి పెట్టుకున్నది అది. 'వాయువ్యగ్ఁ' అంటే రూపాయి అని ఆక్షేత్రాన కుజ్ఞనికిఁగూడ కొట్టిన పిండి.

"ప్రతిశ్రుత్కా- యారతులమ్" అని సున్నాల పన్నము. తులం రూపాయకు పర్యాయముగా లోకవ్యవహారంలో కలదుకావున అరతులం అను మాటకు ముందున్న 'ప్రతిశ్రుత్కాయ' అను మాటను యిట్లు సంకేతించినారు. ఇట్టిదే 'కృష్ణాయ'. "కృష్ణాయర్ధులమ్" అని వేదమున కలదుగనుక అరతులం అర్ధులం అని, అర్ధులమును 'కృష్ణాయ'కు అంటకట్టి, 'కృష్ణాయ' అనఁగా అర్ధరూపాయ చేసినారు.

'యువాసు' అనఁగా బట్ట. ఏరికైనను బట్టలు చదివించునప్పుడు ఈ మంత్రమును జెప్పుదురు. "యువాసు వాసాః పరివీత ఆగా..." అని మొదలుకలది అది. ఆమంత్రము బట్ట అక్కర కలిగినపుడెల్ల వాడఁబడుట వలన ఆమంత్రపు మొదటితునకే బట్టకుఁగా సంకేతింపఁబడినది.

***

"ఏమిచ్చారుట, అక్కడ?"
"జోటికృష్ణాయ"

'ఇద్దరికీ అర్ధరూపాయ ఇచ్చారు' అంటున్నాఁడు. మనిషికి పావలాయిచ్చారని విడదీసి చెప్పవలసివచ్చుదో 'తలో యత్పుణ్యాం' అని. "యత్పుణ్యాం నక్షత్రం తద్బట్కుర్వీతోపవ్యుషం" అని శ్రుతి. ఆకారసామ్యమును బట్టి పావలాను నక్షత్రముగా చేసినారు. నక్షత్రపదమునకు ముందుండుటనుబట్టి 'యత్పుణ్యాం' అనఁగా పావలా. ఇక్కడ మాటలేకాక అర్థమును మండూకప్లుతి (కప్పగంతు) వైచినది.

***

"మన కేమయినా ఉందివయ్యా?"
"రమ్మన్నారు, 'ఏతత్సామగాయనం' చెప్పారు."

'లేదన్నారు' అనుదానికి 'ఏతత్సామగాయనం చెప్పారు' అని. "ఏతత్సామగాయనం నాస్తి" అని శ్రుతి.

'నాస్తి' అనిన అందరకు తెలియును గనుక చాటుదన మూకై 'ఏతత్సామగాయనం' అనుదానికి ఈసంకేతపు బరువు నెత్తినఁబడినది.

***

"ఇంటో లేట్ట"

"లేకేం, 'సుఖంచమే' కావచ్చు"

'ఇంటిలో లే'డని చెప్పినదానికి పక్కనున్నాతఁడు చేయు అనుమానము: 'ఇంటలేకేమి, నిద్రించుచున్నాఁడేమో' అని. చమకమున "సుఖంచ మే శయనంచ మే" అని ఉన్నది. 'శయనం' అన వెల్లడియగును. గుట్టుకు 'సుఖంచమే'.

***

"ఏమి టక్కడ కీచులాడుకుంటున్నారు?"

"'యద్దేవా' చెయ్యిస్తే, ఎవఁ డూరుకుంటాఁడు!"

ఈ 'యద్దేవా' అనునది వైదికుల కడ మాత్రమే నిలువలేదు. లౌకికులకడను ప్రాఁగినది. తనగుట్టును రట్టుచేసి వైదికులను మోసపుచ్చినది. నేఁడు 'యద్దేవ' అనఁగా హేళనఅని తెలుఁగునాట చాలా మందికి విదితచరము.

"యద్దేవా దేవహేళనమ్"అని శ్రుతి. 'యద్దేవా-హేళనం' అను మాటలనడుమ 'దేవ' అనునది అడ్డమున్నను కప్పగంతువైచిన దీహేళనము.

దేవులపల్లి వెంకట సుబ్బారాయ శాస్త్రులవారి మహేంద్రవిజయమున—

"అంసుమత్ఫలకు మధ్యంబు తధ్యంబదే
తత్సామగాయమో తరుణయజ్వ
సారంగి వదనంబు సారంగ లాంఛను
యద్దేవ చేయునో యాయజూక
చంద్రముఃకళి నాభిచంద మింద్రోపల
స్యసమానమో హవిర్యాజివర్య
యష్టాపదగృహంబునం దెకదా యాత్రి
యామ సుఖంచమే యాహితాగ్ని
యనుచు మందాకినీ తీరమునను తాన
మున కుమఃకాలమునఁ గూడికొనిన శ్రోత్రి
సోమయాజులు స్థాలికల్ త్రోమికొనుచు
నాత్మపరిభాష భాషింతు రచట నెపుడు"
[3-వ ఆశ్వాసం, ౧౮-వ పద్యం]

ఈ పద్యమున ఔచిత్యముతో మూఁడు వైదికుల పరిభాషలు వాడకము చేయఁబడినవి.

[యాయజూకుఁడు = మాటిమాటికి యజనము చేయువాఁడు. అష్టాపదగృహం=బంగారు ఇల్లు]

'ఏతత్సామగాయనం' అనఁగా 'లేదు'అని. అట్టిదే 'ఆజ్యక్తే చాగ్దణం'. ఆజ్యక్తే చాగ్దణం అనినను లేదనియే. "ఆజ్యక్తే చాగ్దణం నాస్తి"అని శ్రుతి. బట్టకు 'సువాసు'. అట్టిదే 'సర్వదేవత్యం'. "సర్వదేవత్యం వై వాసః" అని శ్రుతి.

***

"వాఁడికేం రా, 'ఆమాయంతు'గాఁడు"

'బ్రహ్మచారి, వాఁడికేం' అని ఆమాట తాత్పర్యము. "ఆమాయంతు బ్రహ్మచారిణః స్వాహా" యని హోమమంత్రం. 'ఆమాయంతు' అనియే సంకేతము.

***

'యోగశ్చ' అనఁగా కరణం. ఏదైనా కార్యము కరణాల, నియోగుల ఇండ్లలో జరిగినయెడలను, సామాన్యముగానున్న నియోగులను చెప్పవలసి వచ్చుచో 'యోగశ్చ' అని అందురు. దీనికి మూలము తద్దినం మంత్రమునఁ గలదు. "యోగశ్చ కరణంచైవ సర్వం విష్ణుమయం జగత్" అని.

'మరుద్భ్యః' అనఁగా కోమట్లు. సున్నాలపన్నమున "మరుద్భ్యో వైశ్యం" అని ఉన్నది.

'ఇంద్రాణి' అనఁగా విధవ. వితంతువు. లోకసామాన్యమున వెధవ అనునది ఎంతవిరివిగా యథేచ్ఛముగా తిట్లలో వాడుకయగుచున్నదో అటులే యిక్కడగూడ. దీనికి ఆకరమైన మంత్రమును నా కెవ్వరును చెప్పలేదు. 'ఇంద్రాణీ విధవా' యని ఎచ్చటనో కలదఁట. సి. పి. బ్రౌన్ దొరగారు తమ నిఘంటువున ఇటుల వ్రాసిరి: "ఇంద్రాణి Name of the wife of Indra. A sort of bracelet. Og, "Dowager" a brahmin widow. Enugala 28. July. 1830.» అని. బ్రౌన్ దొరకు పండితులు చెప్పనిదీ తెలియదుగదా. ఆనాఁటికే పండితవ్యవహారమున 'నింద్రాణి'కి ఈయర్థము రూఢమై యుండవలయును. ఈ

అర్థము ఎటులు కలిగినదో తెలియదు. ప్రయోగములు లేవు. శబ్దరత్నాకరాదుల కిది ఎక్కలేదు.

వెధవ అనునది ఇంద్రాణికి సిద్ధించినది. దీనిపైని వైదికులు ఇంకొక చమత్కారమును చేసిరి. నవగ్రహ పూజలో శుక్రగ్రహమును అర్చించునపుడు అధిదేవతగా ఇంద్రాణినీ అర్చింతురు. కావున శుక్రగ్రహాధిదేవత యన నింద్రాణిగనుక, ఇంద్రాణి వెధవగనుక, వెధవను చెప్పవలయునెడ శుక్రగ్రహాధిదేవత అనియు నందురు. "అమ్మో, శుక్రగ్రహాధిదేవత వుంది, జాగర్త!" ఇది యొక వైదికుని వాక్యము. దీనిమర్మము విడఁగొట్టుటకు నాకొక రోజంతయు పట్టినది. విషయమునుబట్టి వచ్చినవి కొన్ని పరిభాషలు కలవు. కాని, విషయమును గూడ విషయముగాఁ జేసినవి యిట్టివి యెన్ని కలవో ('యత్పుణ్యాం' యిట్టిదే). కాని, ఎక్కువగా తెలియరాలేదు.

***

"అబ్బ, పోనిద్దూ వాఁడో 'అపహతా'!"

'అపహత' అనఁగా పిశాచి. సంధ్యావందనమందును వచ్చు మంత్రమునం దిట్లు కలదు: "అపహతా అసురా రక్షాగ్ంసి పిశాచాః" అని. అపహత అనుదానికి ఈ అర్థము పక్కనున్న 'అసురా'వల్ల వచ్చినదో, మరి కొంత పక్కనున్న 'పిశాచాః'వల్ల వచ్చినదో తెలియదు. నాకు చెప్పిన అయ్యవారు 'పిశాచాః' అనుదానినుండి వచ్చిన దన్నారు. 'అసురా'వల్ల కాఁగూడదా అనఁగా, 'అవును, అదీ నిజమే' అన్నారు. కాని, ఇది ఇల్లాగు అని తెమల్చలేదు.

***

'అధర్మాయ' అనఁగా చెవిటివాఁడు.

"వాఁడో 'అధర్మాయ', వాఁడితోనా విన్నపం."

చెవిటివాఁడే కానక్కరలేదు. మాట చొరవ నీయని వానిని సైతము చెవిటివాఁడని కసితీరా అనుటకు ఈ చాటు. చెవిటివాఁడన నూరుకొనరుగదా. అందుకు ఇది. సున్నాలపన్నమున "అధర్మాయ బధిరం" అని.

***

అట్టివాఁడే 'స్వప్నాయ'. ఇతఁడు గుడ్డివాఁడు. తనకడకు వచ్చు పండితప్రవరులను, వేదమూర్తులను చూడలేఁడు. వారి దర్పమునైనను పరికింపలేఁడు. పాపము పుట్టుగ్రుడ్డి! సున్నాలపన్నముననే ఉన్న "స్వప్నాయాంధం" అనునది దీనికి మూలము. 'అంధం' అన తెలియని దెవ్వరికి? కాన ఈ మఱుఁగు.

***

'శంనో'అని మఱియొకఁడు. ఇతగాఁడు, పాపము, ఏమిపాపము చేసికొనెనోగాని, పశువైనాఁడు.

"వాఁ డుత్త 'శంనో'గాఁడు. వాఁడితో నీకేందుకురా"

అని ఇష్టులను కూకలుపెట్టుదురు. ఈకూకలు పెట్టుట పరుని. ఇతరుని పశువని తిట్టుచో వాఁ డూరకొనునా? కనకనే కొంత గూఢత. "శంనో అస్తు ద్విపదే శం చతుష్పదే" అని శ్రుతి. ద్విపాత్పశువు అనుటయే 'శంనో' అనిన. ఈ'శంనో' అనునది రూఢికెక్కి ప్రయోగాదులలోని కెక్కినదేమో తెలియదు.

***

"ఈశంనోకు చాలా 'అగ్నిర్హిమస్య' కలదు. అమ్మో, ఎంత వాఁ డనుకొన్నారు మరి"

"ఎంతనుకుంటున్నావూ, అమ్మో, 'అగ్నిర్హిమస్య' కేం లోటూ"

'అగ్నిర్హిమస్య' అనఁగా భేషజము. వైద్యునకు పటాటోపము, డంబముల అవసర మెక్కుడు. తిరగ మూఁతల సామగ్రితోను, కూరలలో వాడు అల్లము బెల్లములతోను చేయు గారడీ వైద్యున కెక్కుడు (తెలుఁగు వైద్యులమాట. ఇంగ్లీషు వైద్యము మనదేశాన కాలుపెట్టు నాఁటికే ఈ పదము మఱీ రూఢమై పోయినది). అట్టిది కాన భేషజమనుమాట పటాటోపమునకు పర్యాయమైనది. ఆ భేషజము అందరకు తెలియుటచే వైదికులు 'అగ్నిర్హిమస్య' అనుదానిని ఆ అర్థమున సంకేతించుకొనిరి. "అగ్నిర్హిమస్య భేషజం భూమి రావపనం మహత్" అని వేదము.

***

ఇట్టివాఁడే మఱియొక్కఁడు 'త్వాష్ట్రము'. ఇదియు నలుగురికీ తెలిసిపోయిన మాట. మఱీ ప్రసిద్ధికెక్కిన

మాట. చాటు ఇసుమంతేనియు లేని మాట. కన్యాశుల్కమున కరటకశాస్త్రుల్లు అగ్నిహోత్రావధాన్లను త్వాష్ట్రియనును. "త్వాష్ట్రాః పశవ ఉచ్యన్తే" అని యొక వాక్యము. ఇది వేదములోనిది కాదని నా అనుమానము. సస్వరముగా నేను వినలేదు. వాక్యవిన్యాసమునుబట్టి కూడా ఇది వేదమునందలి దని అనుకొనను. కాని యిదియే మూలముగా వైదికులు చెప్పిరి.

***

మఱియొకఁడు 'యంబ్రహ్మ'. ఈ యంబ్రహ్మయు తెలుఁగుదేశాన ప్రసిద్ధుఁడు. సృష్టికర్తకు ప్రతిగా తయారైనవాఁడు కాఁడీతఁడు. కవిబ్రహ్మలకు ప్రతిగా నున్న కవి యంబ్రహ్మ కాఁడు. "యం బ్రహ్మ వేదాంతవిదో వదంతి."

వేదాంతవేత్తలు శమప్రధానులు. ప్రవృత్తిమార్గమును వదలి, నివృత్తిమార్గమునఁ బడువారు. పడకపోయినను నివృత్తిమార్గమును కొండాడువారు. వారిని హేళనచేయుటకు వారు స్తబ్ధులనియు, చలిమిడి సుద్దలనియు, చేతకానివా రనియు అందురు. వేదాంతవేత్త పక్కనున్న కారణాన 'యంబ్రహ్మ'కు స్తబ్ధత మొదలగునవి సంకేతమువలన దక్కినవి. శ్లోకమువలన నిది వచ్చుట యిట విశేషము. ఇట్లు సంకేతింపఁబడ్డ యంబ్రహ్మ తన ప్రఖ్యాతికై పాఁకులాడి సంకేతల ప్రయోజనమును చెఱచినాఁడు. నేఁడు యంబ్రహ్మను తెలియనివారు లేరుగదా.

***

ఈప్రభువుకు చేయు మర్యాదలలో 'ఉద్వాసన' యొకటి. ఇదియు ప్రఖ్యాతిని బడసినదే. 'ఉద్వాసన చెప్పినారు' అనఁగా వెడలఁగొట్టారు అని. అవమానము ఐచ్ఛికము. ఉద్దేశించిన ఉద్దేశించవచ్చునుగాని, వస్తుతః లేదు. దేవతలను ఆవాహనచేసి, పూజించి, పూజ అయినతరువాత వారిని పంపివేయుట ఉద్వాసన. ఇది వైదికులు కల్పించినదయ్యు చెవిని పలుమారు పడుటవల్ల, ప్రత్యక్షముగా పెక్కుతడవలు చూచుటవల్ల ఉద్వాసన తేటతెల్లమయినది.

"ఆ సరసీరుహాక్షిపయి నాసల నాసరివారు నవ్వ ను
ద్వాసితధైర్యతన్ విసివి వాసనవింటి వజీరునమ్మలన్
గాసిలుచున్న వాఁడ నను గన్నడసేసె విధాత యయ్యయో
దోసము కాదొకో తనకు తొయ్యలినీయక యిట్టు లేచుటల్."

—అహల్యాసంక్రందనం, 2-వ ఆ. 83 ప.

'ధైర్యము పోయింది' అని చెప్పటానికి సముఖం వేంకటకృష్ణప్ప నాయకుఁడు 'ధైర్యం ఉద్వాసితమైంది' అని అన్నాఁడు.

***

మఱియొక ప్రబుద్ధుఁ డున్నాఁడు. అతఁడు 'ద్రాపి'. ఇతగాఁడు ద్రాబ గానూ, దేబెగానూ మారినవాఁడు. ఆప్టే నిఘంటువున "ద్రాపః. 1. Mud, Mire, 2. Heaven Sky 3. A fool, an Idiot 4. An epithet of Siva 5. A small shell." అని. కన్నడ నిఘంటువున "ద్రాబ- Adj. Aukword or useless" అని. బ్రౌన్ నిఘంటువున "ద్రాబ- 1 A block Head, A Fool. ఆముక్తమాల్యద 4. 262 adj. Silly, worthless, base, trashy. ద్రాబసొమ్ము H. s. Trash, Stuff, rubbish." అని.

ద్రాపి అతిప్రసిద్ధమై, పలువికారములకు లోనై వాడుకలోకి ఎక్కి, ప్రయోగములలోనికిని ఎక్కినది. శబ్దరత్నాకరమున "ద్రాప. దే. విణ. అసారుఁడు. అసారము." అనీ, "దుష్కవితలు లక్షణం బెఱుఁగఁజాలక ద్రాబలు కూర్చి అల్లుచున్" (కవి స. ౧ ఆ.) అనిన్నీ, అధముఁడు, అధమము అనిన్నీ, "గూబలచే నిట్లయితిమి ద్రాబలమై..."(పంచ: నా. ౨. ఆ.) అనిన్నీ ఉన్నది. ద్రాపి అనఁగా దరిద్రము, దరిద్రుఁడు. నిర్ధనుఁడని కాదు. (దరిద్రా ధాతువునకు దుర్గతి అర్థము) అన్నివిధాలా దరిద్రుఁడని వైదికులు చేసిన సంకేతము. "ద్రాపే-అంధసస్పతే దరిద్రం నీలలోహిత; ఏషాం పురుషాణాం ఏషాం పశూనాం మాభేర్మారో ఏషాంకించినామమత్" అని నమకము (రుద్రము)

'వీఁడు వొట్టి దరిద్రుఁడు' అని వెటక్కారాలు తినటం యిష్టంలేక, తమ అలవాటుచొప్పున దరిద్రం అనే మాటకు ముందు ఉన్న 'ద్రాపే' అనుదానికి ధర్మం ఐన దరిద్రాన్ని ధర్మిగా వాడి, 'ద్రాపే' అను దానికి 'దరిద్రుఁడు' అను అర్థమును సంకేతించుకొని

నారు. ఇది లోకమున పడినది. నలుగురూ వాడఁ జొచ్చినారు. వాడుకలోని కెక్కినది. అనేక వికారము లకు పాలయినది. ఆముక్తమాల్యదనాఁటికి—

"ద్రవిణము నొవ్వఁగొంట, నొఱ ద్రాబలతో నిడుచుంట భూమిఁ గొం
తవలికి నిచ్చుచుంట ప్రథమాప్తకఁ జూడక శంకనుంట లో
బొనయు నృపాళికై యభయము న్మణిభూషలు గుప్తి బంపి, భూ
ధవుఁ డరియుం దిరుందగు భిదం దనయం దివి మాన్పుకోఁదగున్."

—యామున ప్రభురాజనీతి. 4 ఆ. 248 ప.

ద్రాబఐ కావ్యమున కెక్కినది. నేఁటికిని రాయలసీమలో ద్రాభ అని అంటారు అని మిత్రులు శ్రీమాన్ తిరుమల రంగాచార్యులుగారు అన్నారు.

కృష్ణా గుంటూరు మండలాలలో దేబె అని వాడుక. ద్రాబ అన్నా, దేబె అన్నా, ద్రాపి అన్నా— మూలము దరిద్రుఁడనే. నేఁటి తిట్లలో సైతము అంత ర్వ్యాహీనిగా దరిద్రుఁడనియే వినఁబడును.

కైలాసవాసి శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు వెనక ఆంధ్రవారపత్రిక (1937) దసరాసంచికలో వ్రాసిన 'వైదికభాష—ఆంధ్రభాష' అను వ్యాసములో 'ద్రాపి'ని గురించియు కొంత ముచ్చటించినారు. వారు ఈ పదము వైదికభాషకు చెందినదే అని అంగీకరించినారు. తిట్టనియే ఒప్పుకొన్నారు. అర్థవివరణము మాత్రము ఇంకొకవిధముగా చేసినారు. వారిమాటలు—

"తెనుగువారి తిట్లలో ద్రాపివెధవ అనేది చాలా తరుచుగా ఉపయోగిస్తూఉన్నది. మనుష్యరూపము మాత్రము కనిపిస్తూ, మనుష్యునకు కావలసిన తెలివితేటలు లేనివాణ్ణి 'ద్రాపి వెధవ, అంటాము. ఈ క్రింది మంత్రము చూడండి—

'బిభ్రద్ద్రాపిం హిరణ్మయం
వరుణో వస్త నిర్ణిజం'

హిరణ్మయం సువర్ణమయం, ద్రాపిం కవచం, బిభ్రత్ ధారయన్.

ఇందు ద్రాపియనగా కవచ మర్థము. కవచము మనుష్యా కారము కలదేగాని, మనుష్యునకు ఉండే తెలివితేటలు ఉండవు. కాబట్టి మనుష్యజన్మ మెత్తి తెలివితేటలు లేనివానిని ద్రాపివెధవ అని తిట్టడం సహజం. ఈ ద్రాపి ద్రాబగా మారి గ్రంథాలలోకి ఎక్కింది. కాబట్టి, గ్రామ్యంలోని ద్రాపినీ, వైదికభాషలోని ద్రాపినీ ఒక్కటే అని చెప్పడానికి అభ్యంతరం ఉండకూడదు."

అని వ్రాశారు. వారు వ్రాసిందంతా నేను అంగీ కరిస్తాను. అర్థవివరణంలోనే వచ్చినది అభిప్రాయభేదం. ఆనాఁడే ఈ అభిప్రాయభేదం ప్రచురించెడివాఁడను కాని మిత్రుఁడు మల్లాది రామకృష్ణశాస్త్రి వైదికవాఙ్మయం యింకా గాలించి చూదాంఅని ఆఁపాఁడు. తాను గాలించాఁడు. నమకంలోదే సరిగా ఉందని తరువాత చెప్పాఁడు. వేలూరి శివరామశాస్త్రిలవార్ని కనుక్కున్నాను. ఈ అభిప్రాయభేదం చెప్పాను. వారున్నూ 'అ. అ. అలాగే' అన్నారు. నమకమున రుద్రుణికి "ద్రాపే, అంధసస్పతే, నీలలోహిత" అని సంబోధనలు కలవు గదా. ఈ మంత్రమునకు సాయణభాష్యమును, పాల్కురికి సోమనాథుని రుద్రభాష్యమును వొకపరి చూడతగ్గవి. అవిచూచి, నా అభిప్రాయము తప్పైనచో నేనుమార్చు కొందును. 'ద్రాపి'కి ఈవైదికుల సంకేతమువల్లనే తిట్టు మోతుఁతనము అబ్బినదిగాని, కవచముఅను అర్థమువల్ల వచ్చినది కాదని తలంతును. కవచము బుద్ధిహీనము గనుక, బుద్ధిహీనుఁడికి ద్రాపి అని అంటారనేదానిలో డొంకతిరుగుడు మొదటనుండీ నాకు కనఁబడుచున్నది. ఒక వెలితి కనఁబడుట నాతప్పిదమే కావచ్చునుగాని, నా కెందుకో నచ్చుటలేదు.

***

సాయంత్రము 5 గంటలు కొట్టినారు. భారతీఆఫీసున శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారును, నేనును మాటలాడుచున్నాము. గంట చెవింబడుటతోనే ఆయన "యత్తే అగ్నే చెబుదాం" అన్నారు. ఇది 1938 మేనెలలో. నాకు తెలియలేదు. వారే 'యత్తేఅగ్నే' అంటే ఏమిటో తెలివిడిచేసినారు.

'యత్తే అగ్నే' అనఁగా ఉద్వాసన. దేవతను ఆహ్వానించి పూజాక్రమము నెరవేర్చినపిదప ఉద్వాసన చెప్పు మంత్రము ఇది. "యత్తే అగ్నే తేజ స్తేనాహం తేజస్వీభూయాసం, యత్తే అగ్నే వర్చ స్తే నా హం వర్చస్వీ భూయాసం, యత్తే అగ్నే హర స్తేనాహం హరస్వీ భూయాసం" అని. ఈ 'యత్తేఅగ్నే' అనునది కూడా కొంత ప్రచారము నందుకొన్నదే!

***

యదగ్నే=కాసీ (కాలణా)

"ఏమిచ్చా రక్కడ?"

"యదగ్నే"

ఎంతో సంభావన యిస్తారని వెళ్లఁగా, అక్కడ కాసి మాత్రమే ఇచ్చిరఁట. దానిది పై సంభాషణ.

***

వషట్కారాలు = చీవాట్లు.

శ్రౌషట్, వౌషట్ అను ప్రత్యయములకు దుర ర్థము లేదు. వషట్ అనునది దేవతలకు గౌరవార్థమున ప్రయోగింపఁబడునది. ఆప్టేనిఘంటువున "వషట్—An exclamation used on making an oblation to a deity, (with dat of the deity) ఇంద్రాయ వషట్. పూష్ణే వషట్. వషట్కారః the formula or exclamation వషట్" అని యున్నది.

కాని, వైదికులు వషట్కారాలు అని చీవాట్లను గురించి వాడుదురు. ఏల వాడుదురో తెలిసినది కాదు. బహుశః వ్యతిరేక లక్షణచేత, శుద్ధ ఎద్దుమొద్దు స్వరూపమును "బృహస్పతి వీఁడు" అని వ్యవహరించినట్లును, అమంగళవారమును (కుజుఁడు యుద్ధాధిదేవత కాన) మంగళవారము అనీ, జయవారము అనీ వ్యవహరించి నటులను చీవాట్లను వషట్కారము లనిరేమో అని అనుమానము. వైదికుల నడిగి చూచితిని కాని వారు ఇద మిత్థమని తేల్చి చెప్పలేదు.

***

"ఏమైందీ అక్కడ...?"

"అయంవై—"

'నే నిక్కడ ఉన్నాను. ఆ సభలో ఏమైన'దని అడుగఁగా జవాబు 'అయంవై' అనినాఁడు. 'అయంవై' అనఁగా క్షవరము. 'ఏ ముందీ అక్కడ, క్షవరం అయిం' దని జవాబు. "అయంవై లోక ఆవపనం మహత్" అని శ్రుతి.

***

అసురఘ్నం=సగం.

"ఏమిచ్చారట"

"ఇచ్చిందే కొద్ది. అదైనా అసురఘ్నం వొచ్చింది."

ఒకఁడు పని చేయించి తెచ్చుకొనఁగా వాటాదారు సగం పంపిణీకి వచ్చాఁడు. తనకు మిగిలింది సగమే. అది వెల్లడించుచున్నాఁడు.

"అసురఘ్న మింద్రసఖం సమత్సు" అని మంత్రము. 'ఇంద్రసఖం' అనుదానిలో 'సఖం' ఉండుటనుబట్టి తెలుఁగునసగము అనుదానికి వైదికపు వొత్తులతో 'సఖం' అనుటయు శ్రుతిగోచరముకావున సగము అనుదానికి చాటుగా 'అసురఘ్నం' అను పదము సంకేతింపఁబడ్డది.

***

'అశ్మాచమే' అనఁగా మట్టి.

"ఏం మిగిలిందీ అక్కడ?"

"అశ్మాచమే, ఏం మిగులుతుందోయ్!"

చమకమున "అశ్మాచ మే మృత్తికాచ మే" అని కలదు కావున ఇటుల 'అశ్మాచమే' అనునది సంకేతింపఁబడినది. 'అశ్మా' అనుదానికి 'రాళ్లు' అనునది అసలు అర్థము.

***

దమ్మిడీకి 'గర్భం ధత్తే' అని. "గర్భం ధత్తే పయసా" అని శ్రుతి. 'పయస్సుచే (నీరూ-పాలూ) గర్భము ధరించినది' అని అసలు అర్థము.

***

"వాఁ డిప్పు డేం జేస్తున్నాఁడు"

"పాపం! అగ్నేయంతి చేస్తున్నాఁడు."

ప్రశ్నకు 'పాపం, ముష్టెత్తుకుంటున్నాఁ' డని జవాబు. ఈ అర్థములో అగ్నేయంతిని ప్రయోగించిన వారు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలవారు నా కగుపించారు. వారు ప్రయోగించిన వ్యాసం గుర్తులేదు గాని అది కృష్ణాపత్రికలో అచ్చయినది. "అగ్నేయంతి ద్రవిణం భిక్షమాణాః" అని శ్రుతి.

***

"ఏఁవయ్యా రామయ్యా ఏం చేస్తున్నట్టు?"

"హుఁ, రుద్రాయాత తామిసే."

ఉపవాసాలు చేస్తున్నాఁడనడానికి క్షేత్రాలు చెయ్యడమని వాడుక. అది ఎట్టుల వచ్చిందో తెలియదు గాని వాడటం ఎఱుఁగుదుము. శ్రీ జనమంచి కామేశ్వరరావు తల్లి "ఏమండీ రాత్రి క్షేత్రమా?" అనిఅడిగినప్పుడు మల్లవరపు విశ్వేశ్వరరావూ, నేనూ విస్తుపోయాము.

క్షేత్రంఅంటే తెలియక అతనూ, ఉపవాసం అని తెలిసి, ఈమె ఎల్లా అన్నారా అని నేనూను. ఏ కారణాన క్షేత్రానికి ఉపవాసం అర్థంవచ్చిందో తెలిసిందికాదు.

బ్రౌన్ నిఘంటువున క్షేత్రమునకు మామూలుగాఁ గల అర్థముల నిచ్చి, తుదిని "Starvation (This meaning is peculiar to Telugu)" అనినారు. ఉదాహరణముగా "నిన్న కటిక క్షేత్రముగా ఉండినాడు (He was starving all yester day)" అనినారు. వారికిన్నీ ఇది వింతగా తోఁచినది. సమక్షమున నున్న పండితులుగూడ తెలియదన్నారు కాఁబోలు. వైదికులు ఉపవాసానికి 'రుద్రా యాతతామినే' అంటారు. "రుద్రా యా తతామినే క్షేత్రాణాం పతయే నమో నమః" అని వేదము. క్షేత్రము అనునది ప్రఖ్యాతమైనది గనుక దాని అర్థమును ముందు మాటకు వాడినారు.

***

"భూర్భువ స్సువరోం అన్నారుట్రా?"

అని తోటి భోక్తను అడుగు తున్నాఁడు వొకఁడు. 'ఇంకా పొయ్యిలో నిప్పు వేశారా' అని దాని కర్థము. అగ్ని ప్రతిష్ఠాపన 'భూర్భువస్సువరోం' అని చేస్తారు గనుక విషయాన్ని బట్టి మాటను సంజ్ఞగా చేసుకోడము ఇది.

***

"పాంతు ఎంత ?"

"ఏముందీ అక్కడ యా త్తమస్య—"

'దక్షిణ ఎంత' అని ప్రశ్న వేశాఁడు ఒకఁడు. "దక్షిణాః పాంతు పాంతు దక్షిణాః" అని స్మార్త కలాప వాక్యముండుటను బట్టి 'పాంతు' అనుదానికి దక్షిణ అను అర్థము పొసఁగింపఁబడినది.

ఈపైవి కొంచెం ముతకమాటలు. తెలిసినను ఉన్నవిషయముగాన వీలైనంతమృదువుగా చెప్పెదను. కామక్రోధాదివిషయాలూ, రాజస తామసాలూ అన్నీ స్వాభావికాలూ, సహజాలూగనుకా, అందరిలోనూ మృగవాసనలు అంతో యింతో గోంద్రుమనుచుండును గనుకా వీరలు బూతులుకూడ వాడెదరు నిర్భీతిగా. తాము నిర్మించుకున్న కవచముచాటున విచ్చలవిడిగా బూతులను వాడెదరు. పైవారి కేమి తెలియును? దక్షిణ ఎంత ఇచ్చారని అన్న పైదానికి చెప్పిన జవాబు "ఏముందీ అక్కడ, యాత్తమస్య"అని గదా. "యాత్తమస్య పశవ స్సు జంభం"అని మంత్రము.

ఇట్టిదే ఇంకొకటి. 'పద్భ్యాముదరేణ' "పద్భ్యాముదరేణ శిశ్నా"అని సంధ్యావందనంలోని మంత్రము.

***

దారిని బోవు తరుణిని, జరఠను, సామాన్యను గాని ఆబతో వర్ణించుకొనుట వీరికిని గలదు. సంకేతమని తెలియని సంకేతాలతో వ్యవహరించుకోవాలి మరి. వీరూ సృష్టించుకున్నారు కొన్ని మాటలను. అవి: అక్రంద, ఏతేవాఇడాలు. "అక్రందదగ్ని స్తనయన్నివ ద్యౌః"అని మంత్రము. "ఏతేవా ఇడా స్తనాః"అనియు మంత్రము.

***

ఆరోహారు=మైథునము.

గర్భాధానఖండంలో మొదట, "ఆరోహారు ముపబర్హస్వ బాహుం." అని.

***

బయట తుప్పర పడుచో వీరు 'యాకుందేందు' అందురు. "యాకుందేందు తుషారహారధవళా" అని సరస్వతీస్తోత్రము.

***

'ఆరి సీపిండం పిల్లులకు పెట్టా' అనునది మోటు తిట్టు.

పిండం అనుదానికి వీరి పరిభాషలో "తేభ్య శ్చాయం" అని. "తేభ్యశ్చాయం పిండః తస్మై తే స్వధా నమో గయాయాం దత్తమస్తు" అని తద్దినం మంత్రము. దీనిలోని ముక్క 'తేభ్యం.'

విడివిడిగా నైన కొన్ని పరిభాషలు: టాతాడాధా-అణాకు. గంగి గోవు - పశుప్రాయుఁడు. రశ్మి-సంపాదన, లాభం. వికిరపిండం - కాకి ఇత్యాదులు.

వీరు వాడుక చేసిన మాటలలో అవతలిమాట అర్థాన్ని ఇవతలి మాటకు వాడుక చేయడము, వొకటి

రెండు మాటలు దాఁటినా అవతల వుండే పద అర్థాన్ని మొదటిమాటకు సంకేతం చేయడం, అర్థాన్నిబట్టి ప్రయోగించడమూ, విషయాన్నిబట్టి ప్రయోగించడమూ, పర్యాయంగా వాడటం, కొండగుర్తుగావాడటం, వ్యతిరేక లక్షణగావాడటం ఇవి కనిపిస్తూ వుంటాయి. ఈ పరిభాషలలో సంపూర్ణంగా వాక్యాలు నిర్మించి ప్రసంగం అంతా యిట్టి మాటలతో చేస్తారు. నాకు లభించనివెన్ని ఉన్నాయో మఱి. ఉన్నవాటికి ప్రయోగాలు కావ్యపరంపరలలో ఉన్నాయో లేదో మరి తెలియదు.



# సౌదామిని

శ్రీ కే. అన్నమరాజ శర్మ



నీలకాదంబినీయవనికలనుండి
దిగ్దిగంతర నీరంధ్ర తేజ మొలుకు
చంచలా! తావకాపాంగచారుదృష్టి
క్ష్మాతలము నొక్కత్రుటిని స్వర్గం బొనర్చు!

అంధకారావిలంబైన యవనికెల్ల
నీసము న్మేషహాసంబె నేత్ర మభ్ర
పథమునన్ స్వర్ణభూషలు పసలు గులుక
తొంగిచూచెదె సురనాట్యభంగిమముల.

ఓతటిత్కామినీ! సువర్ణోజ్జ్వలంపు
సహజలావణ్యమున నీకు సాటి యెవరు?
శ్యామలాంభోదభంగసంచయముఁ జీల్చి
మురిసిపోయెదె గగనసముద్రమందు.

సౌరసౌధాంతరమునుండి జాఱిపడిన
అప్సరఃకన్యవో? కాక, యంబుదముల
నవతరించిన విద్యుల్లతాంగి వేమొ
పలుకఁదరమౌనె! భావవిభ్రమము దక్క.

పరమ సౌందర్యమయివి శంపాకుమారి!
లీల నినుఁ జేర రెక్కలు లేవు కాని,
భావవిస్తృతసామ్రాజ్యపాలనమున
నేను, రారాని పోరాని నెలవు కలదె?

ఆగుమా హ్రాదినీ! యింత, యాగు మింత,
సుందర తనూవిలాసంబు చూడనిమ్ము,
సృష్టిసౌందర్యమున రససిద్ధికొఱకు
వెదకి, మూకత్వమున కడు వెడఁగనైతి.

---

# మన చెన్నపట్టణము: దాని పూర్వచరిత్ర

—◇—

శ్రీ దిగవల్లి వెంకటశివరావు

ఈ చెన్నపట్టణము తెలుగువారిదా, అరవవారిదా యని అనవసరమైన వాగ్వాదమొకటి బయలుదేరి చరిత్రపరిశోధకులలో కొందరియందు పక్షపాతబుద్ధి కల్పించి సత్యచరిత్రను మరుగుపరచుచున్నది. ఈ మద్రాసునగరమునందు గల జనసంఖ్యలో నే డరవము మాట్లాడువారే ఎక్కువగ నున్నారని యంగీకరించినను గూడ వీరందరు నరవవారే యనిగాని, ఈనగర మరవవారి దే యని గాని యంగీకరింపవలసిన పని లేదు. పూర్వకాలమునాటి ఆంగ్లేయ కంఫిణీ ప్రభుత్వమువారి రికార్డులుగాని, పాశ్చాత్య చరిత్రగ్రంథములు గాని పరిశీలించినచో నీ చెన్నపట్టణముయొక్క నిర్మాణమునకును, దీని యభివృద్ధికిని తెలుగువారే కారకులైరని స్పష్టముగా తెలియగలదు.

## చంద్రగిరిరాజుల చరిత్ర

17-వ శతాబ్దియారంభము నాటి కీ చెన్నపట్టణ సముద్ర తీరప్రాంతముల నేలువారు చంద్రగిరిరాజులు. వీరు విజయనగరసామ్రాజ్యము నేలిన 'తెలుగువిభు'లగు రాయలవంశమువారు. వీరి యధికారమునకు లోబడి పెనుగొండ, ఆర్మగాను, శ్రీరంగపట్టణము, జింజి, తంజావూరు, మధురల నేలు నాయకు లీ దక్షిణదేశమును పరిపాలించుచుండిరి. ఈ చంద్రగిరిరాజ్యము క్రమక్రమముగా బలహీనముకాగా నాయకులు బలవంతులై స్వతంత్రులగుచుండిరి. 1644-1647 ల మధ్య గోలకొండనవాబు సేనానాయకుని దండయాత్రతో నీ చంద్రగిరిరాజ్య మంతరించిన దని చెప్పవచ్చును.

1630 మొదలు 1642 వరకు వెంకటపతిమహారాయలు చంద్రగిరిలో రాజ్యము చేయుచుండెను. ఈయనతరువాత రాజైన శ్రీ రంగరాయలు 1647 అక్టోబరులో ఓడిపోయి మైసూరుకు పారిపోగా గోలకొండ సేనానియగు మీర్‌జుమ్లా కర్ణాటకమునకు నవాబయ్యెను.



సెంట్రల్ స్టేషను, స్టాన్లీ వంతెన

## ఆదిపురుషులైన దామెర్లసోదరులు

వెంకటపతిరాయల కాలమున నాయన బావమరది యైన దామెర్ల వెంకటభూపతి యని పేరుపొందిన వెంకటాద్రి నాయకుడు ప్రధానమంత్రిగాను, 15 వేలసైన్యమున కధిపతిగానునుండి వందవాశిలో పరిపాలనచేయుచుండె నని డచ్చివారి రికార్డులవలన తెలియుచున్నది. ఈ వెంకటాద్రినాయకుడు జింజిని జయించి తనతండ్రి చెన్నప్పనాయకుని పేరున చెన్నసముద్ర మను పట్టణమును నిర్మించెను. ఇతని తమ్ముడైన అయ్యానృపతి పూనమల్లిలో స్థానికనాయకుడుగా పరిపాలించుచుండెను. ఈ దామెర్లవారు కాళహస్తిలోని వెలుగోటి రాజవంశపువారే. ఇట్టి దామెర్ల సోదరులే పాలారు మొదలు ప్రళయకావేరి వరకు గల ప్రాంతములకు సర్వాధికారులై యుండిరని ఆంగ్లేయులు తమ కవిలెలలో వ్రాసినారు. ఆ కాలమున ప్రళయకావేరి (పులికాటు) లో డచ్చివారును, మైలాపూరులో పోర్చుగీసువారును వర్తకస్థానముల నేర్పరచుకొని వ్యాపారము చేయుచు నొండొరులతో నెడతెగకుండ పోరాడుకొనుచుండిరి. ఆంగ్లేయులు 1612 లో మచిలీ బందరులో వర్తకస్థానము నేర్పరచుకొని వ్యాపారము చేయుచు దక్షిణతీరమున గూడ నొక వర్తకస్థానము నేర్పరచుకొన దలచిరి. 1626 లో ప్రళయకావేరికి 35 మైళ్లదూరమున నెల్లూరుజిల్లాలో చేరిన ఆర్మగానులో నెలకొనిరిగాని అది వారికి సౌకర్యముగా లేనందున ప్రళయకావేరి, మైలాపురముల మధ్య నొకచోట తమ వర్తకస్థానము నేర్పరచుకొనుటకు అనుజ్ఞనిమ్మని మన దామెర్ల నాయకుల నాశ్రయించుచుండిరి. ఈ నాయకులు సుముఖులు కాగా ఆర్మగానులోని ఆంగ్లేయ ప్రతినిధియగు డే దొర మచిలీబందరులోని ఆంగ్లేయ ప్రతినిధి (ఏజెంటు) యనుమతితో నీ ప్రాంతములలో వర్తకస్థానమును స్థాపించుటకు గల అవ

కాశములను జూచుటకు పోయి, తాను 1639 జూలై 27-వ తేదీన నీమద్రాసుపట్న ప్రాంతమును చేరితిననియు, పూనమల్లి నాయకుడగు అయ్యనృపతియు, అప్పటికీ ప్రాంతమున నున్న దేశీయవర్తకులును, రంగులు వేయువారును, నేతగాండ్రును తనను బాసగనే ఆదరించిరనియు, ఆర్మగానులో కన్న నిక్కడ బట్టలధర నూటికి 20 మొదలు 40 వరకు హెచ్చుగ నున్నదనియు మచిలీబందరుపీజెంటుకు వ్రాసినాడు. మద్రాసుపట్నమున వర్తకస్థానమును, కోటను గట్టుకొనుటకు ఆంగ్లేయప్రతినిధి యగు డేదొర పూనమల్లి నాయకుడగు అయ్యనృపతి వలన నిట్లు 1639-వ సంవత్సరము జూలై 22-వ తేదీన లిఖితమూలకపట్టా పొందినట్లు ఆంగ్లేయుల రికార్డులందు కలదు. ఆగష్టు22-వ తేదీకి బదులు జూలై 22-వ తేదీ పొరబాటుగా వేయబడినదని కొందరియూహ. ఇట్లు స్థాపింపబడిన వర్తకస్థానమును, కోటయు, దీని ప్రక్కను పెరిగిన క్రొత్తగ్రామమును గలిపి ఆంగ్లేయులు మద్రాసు అనియు, దేశీయులు చెన్నపట్టణ మనియు వ్యవహరించుచుండినట్లు అనేక ఇంగ్లీషు గ్రంధములందు వ్రాయబడియున్నది.

ఈ చెన్నపట్టణ స్థాపననుగూర్చి అయ్యనృపతిసోదరుడైన అంకభూపాలుడు తన ఉషాపరిణయమున, వంశావళిలో నిట్లువర్ణించియున్నాడు:

"ప్రళయకావేరి మైలాపురంబుఁ గల్మి
బీరమున బోర నది మట్టుపెట్టి తండ్రి
పేరఁ దన్మధ్యభూమిని బృథువిభూతి
నలవరిచెఁ జెన్నపట్టణ మయ్యనృపతి."

## శ్రీరంగరాయలవారి రాజశాసనము

1645 లో మద్రాసులో నింగ్లీషు ఏజెంటుగా నియమింపబడిన గ్రీన్ హిల్ చంద్రగిరి రాజగు శ్రీ రంగరాయలను దర్శించి ఆయనవలన నీ ప్రాంతమున కొక కవులును పొందెను. కుంఫిణీ రికార్డులలో నిది యొక రాజశాసన మని పేర్కొనబడియున్నది. ఆరు సంవత్సరముల క్రిందట నాయకు డిచ్చిన పట్టాను ఈ రాజశాసనము స్థిరపరచెను.

శ్రీ రంగరాయలవారి రాజశాసనము యొక్క ఇంగ్లీషు తర్జుమాలో దేవాదాయములును, బ్రహ్మోదాయములును శాశ్వతముగను, సక్రమముగను అమలుజరుగవలెననియు, ఈ ప్రదేశ మొక 'జెంటూ' లేక తెలుగు పట్టణముగా పరిగణింపవలెననియు వ్రాసియున్నది. ఈ శాసనమందే అసలు గ్రామమగు మద్రాసుపట్టణము గాక ఇంగ్లీషువారి కోటచుట్టును పెరుగుచున్న భాగమును ప్రత్యేకముగా పేర్కొని దానిని శ్రీ రంగరాయపట్న మని పిలువవలెనని యుండెను. కాని అయ్యనృపతియొక్క పలుకుబడివలన దాని నతని తండ్రిపేర చెన్నపట్టణ మనియే వ్యవహరించుచుండిరి. ఈ చెన్నపట్టణ మను నది ప్రస్తుతపు 'ఫోర్టు సెంటు జార్జి' కోట యున్న స్థలముననే యుండెను. 1639-వ సం.కు పూర్వకాలమునుండియున్న మద్రాసుపట్నమను గ్రామము ప్రస్తుతమున్న కోట కుత్తరమున జార్జిటవు నున్న ప్రదేశములో నుండెను. ఈ ప్రాతగ్రామమగు మద్రాసుపట్నమును, క్రొత్తగా పెరిగిన చెన్నపట్టణమును గలిపి ఆంగ్లేయులు మద్రాసు పట్టణ మనియు, దేశీయులు చెన్నపట్టణమనియు వ్యవహరింప సాగిరి (Madras in Olden Times. J. Talboys Wheeler).

## ఆనాటి మద్రాసుపేటలు

ఈ స్థలములో నింగ్లీషువారు ప్రవేశించిన తరువాత చాల కాలమువరకును అక్కడ జరుగు వ్యాపారమునందును, పరిశ్రమలందును తెలుగువారే ప్రముఖులై యుండిరి. ఈ కోటవెలుపల పెరిగిన పట్టణము త్వరగనే తెల్లవారిబస్తీ యనియు, నల్లవారి బస్తీ యనియు రెండు భాగములుగా నేర్పడెను. తెల్లవారిబస్తీ యనునది ప్రస్తుతపు ఫోర్టు సెంటు జార్జికోట యున్న సరహద్దులలోనే యుండెనని చెప్పవచ్చును. నల్లవారిబస్తీ యన్నదో ఈకోట కుత్తరపు గోడ కానుకొని ప్రస్తుతము లాకాలేజీవరకు గల ఖాళీస్థలమును, లాకాలేజీయు, హైకోర్టు కట్టిన స్థలమును కలుపుకొనిన సరిహద్దులలో నుండెనని చెప్పవచ్చును (Story of Madras-Glyn Barlow).

మొట్టమొదట చెన్నపట్టణమున ఫోర్టు సెంటుజార్జికోటగోడ కుత్తరమున దాని నానుకొనియే దేశీయులు కాపుర ముండుపేట యుండెను. కోటగోడ నానుకొని అంగళ్ల వరుసగల బజా రొకటి యుండెను. కోటలోని తెల్లవారి పేటవలెనే ఈ దేశీయుల పేటకూడ నలుచదరముగా నుండెను. దీనిహద్దులు — ఉత్తరమున ప్రస్తుతపు చీనాబజారురోడ్డు; దక్షిణమున ప్రస్తుతపు కోటయొక్క లోపలి ఉత్తరపుగోడ; తూర్పున సముద్రము; పడమర బ్రాడ్వే చివరనుండి పశ్చిమోత్తరమున నదివరకు సముద్రమునకు సమాంతరముగా గీసినచో వచ్చు రేఖ. ఈ మధ్యప్రదేశమున అడ్డముగా వీధులు, దానిలో దేశీయుల ఇండ్లు. దీనిలో కొన్ని సత్రములు, రచ్చలు, మచ్చుల నొడ్డి, బేరి తిమ్మన్నగారు కట్టిన ఒక దేవాలయము నుండెను. ఈ బస్తీ చుట్టు నొక మట్టిగోడ యుండెను. బస్తీకి పడమర నేటి ఎస్ప్లనేడుకు అడ్డముగా నొక పెద్ద మురుగుకాల్వ ఉత్తరమున నదిలోనికి ప్రవహించుచుండెను. దానికి పడమర ప్రస్తుతపు పువ్వులయంగడిలోనే నాటి చాకలిపేట యుండెను. అందులో కుంఫిణీవారి బట్టలు ఎగుమతిచేయుటకు ముందుగా చలువచేయుచుండిరి. ఇట్లు నేటి జార్జిటవునులో క్రిక్కిరిసియున్న దక్షిణభాగము ఆనాటికి లేదు. ఇది తరువాత పెరిగిన క్రొత్తపేట. దీనిలో తరువాత నక్కడక్కడ దొరలు తోటల బంగాళాలలో నివసించుచుండిరి.

## ఆనాటి మద్రాసులోని దేవాలయములు

1669 లో చెన్నపట్టణమునకు వచ్చిన తామస్ బౌరేవొర (Mr. Thomas Bowrey) తానుచూచిన సంగతులను వర్ణించుచు వ్రాసిన The Countries round the Bay of Bengal గ్రంథమున ఈ పట్టణమునందలి దేశీయులలో చాలమంది 'జెంటూ' లను తెలుగువారు, 'మలబారు'లను అరవవారు ననియు, వీరిలో చాలమంది ఫోర్టుసెంటు జార్జికోట వెలుపలి గోడలమధ్యనే జీవించుచున్నారనియు, పురుషులు స్త్రీలు పిల్లలు కలుపుకొని నలుబదివేల జనాభా యున్నదనియు, అన్నిసరకులపైన సుంకము చెల్లించుచున్నారనియు వ్రాసినాడు. పూర్వకాలమునుండియు నీ ప్రాంతములలోని హిందువులకు తిరువలిక్కేణిలో వైష్ణవదేవాలయము, మైలాపూరులో శివాలయము నుండెను. చెన్నపట్టణపు హద్దులలో 1652 వరకు దేవాలయమున్నట్లు కంపెనీవారి రికార్డులలో లిఖితాధారములు కనబడవు. కాని గవర్నరగు తామసు పిట్టు ఆజ్ఞప్రకారము 1710 లో తయారు చేయబడిన ప్లానులో చాలా హిందూదేవాలయములు కనబడుచున్నవి. కోట కుత్తరమున దగ్గరగా నల్లవారిబస్తీమధ్య పెద్దదేవాలయ మొకటియు, ముత్యాలపేటలో నొకటియు, పెద్దనాయకనుపేటలో నొకటియు చూపబడినవి. 1673లో ఫ్రయ్యరీ పెద్ద దేవాలయమును జూచినాడు. కుంఫిణీవారు చెన్నపట్టణమును కొను పొందుటలో సాయముచేసిన బేరి తిమ్మన్నయు, కుంఫిణీవారికి తుపాకిమందు చేయు నాగన్నభట్టు అనునతడును నీ దేవాలయమునకు 1646లోను, 1648 లోను దానశాసనములు వ్రాసియిచ్చిరి. ఈ బేరి తిమ్మన్న చెన్నకేశవపెరుమాళ్ల కొక గుడియు, చెన్నమల్లేశ్వరున కొక గుడియు కట్టించెనని ఇతని శాసనమువలన తెలియుచున్నది. ఈతిమ్మన్న కుంఫిణీవారికి ముఖ్యవర్తకుడగు శేషాద్రిసెట్టితో కలిసి కొన్నాళ్లు వ్యాపారము చేసి తరువాత తానే ముఖ్యవర్తకు డయ్యెను. ఆరోజులలో చెన్నపట్టణముకోట ఆంగ్లేయులరాజధాని కాదు. ఇది యొక చిన్న వర్తక ఏజెన్సీ. 1652 నాటికి నలుగు రాంగ్లేయవర్తకులు, 26 మంది సైనికులు నుండిరి. 1653 లో పేరునకు రాజధాని యనిరిగాని 1654 లో దీనిసిబ్బందిని ఇద్దరు వర్తకులకు, 10మంది సైనికులకు తగ్గింపుమని ఉత్తర్వుచేసిరి.



మద్రాసు హైకోర్టు

చెన్నపట్టణమున నల్లవారి బస్తీలో సుంకములు, పన్నులు వసూలుచేయుట కొక గ్రామమునసబు, లేక అధికారి యుండెను. చిన్ననేరముల నితడు గ్రామచావడిలో విచారించుచుండెను. ఇతనికి తోడుగా లెక్కలువ్రాయు కరణము, లేక కణకపిళ్లయు, గ్రామకావలి కాయుట కొక పెద్దనాయకుడు నుండిరి. 1659 నాటికి గ్రామకావలి పెద్దనాయకునికి కొలునివ్వగా 20 మంది తలారులుగల పోలీసు దళముండెను. కుంఫిణీవారు బలవంతులై కోటలోని వర్తకస్థానము ప్రభుత్వముగా మారిన తరువాత నల్లయుద్యోగుల అధికారములు తగ్గింపబడి శాసనముల ద్వారా పరిపాలన జరిగెను.

## కుడిచేయి, ఎడమచేయి కులకక్షలు

## 2

చెన్నపట్టణమున ఇంగ్లీషువారు వర్తకస్థానము నేర్పాటుచేసికొని కోట కట్టుకొనగానే తమ వ్యాపారముకొరకు దేశీయ నేతగాండ్రను, సాలీలను, రంగుల యద్దకమువాండ్రను, చాకలివాండ్రను, ఇంక ననేక వృత్తుల వారిని, పారిశ్రామికులను, వివిధకులములవారిని తమ కోట రక్షణక్రిందికి వచ్చి కాపుర ముండవలసిన దని ప్రోత్సహింప సాగిరి. వీరితో పాటు సుమాస్తా పనులు, ఇతర పనులు చేయు బ్రాహ్మణులు, చిల్లర వ్యాపారములు చేయు వైశ్యులును వచ్చిచేరిరి. ఇట్లు వచ్చిచేరిన జనసంఘములో అనుక్రమముగా నుండు కులాచారములు, కక్షలు నిక్కడ త్వరలోనే తలయెత్తెను. దేవాలయములు, భజనమందిరములు, గ్రామదేవతలు, కొలుపులు, జాతరలు ప్రారంభముకాగా బ్రాహ్మణ వైష్ణవులలో వడగలి తెంగలి కక్షలవలెనే ద్విజేతరకులములందు కుడిచెయ్యి ఎడమచెయ్యి కులకక్షలు బయలుదేరి, పట్టింపులును వివాదములును పెరిగి, దెబ్బలాటలును హత్యలును జరుగసాగెను. కోటకట్టిన 13 సంవత్సరములలోనే యిట్టి కుడిచెయ్యి యెడమచెయ్యి కులముల తగాదా యొకటి వచ్చినట్లును, దీనిని కుంఫిణీవారి కోటలో ఏజెంటుగా నుండిన ఆరోన్ బేకరుగారు మధ్యవర్తిగా నుండి రాజీగా పరిష్కరించినట్లును

కుంఫిణీవారి రికార్డులలో వ్రాయబడి యున్నది.

### కుడిచెయ్యి, ఎడమచెయ్యి కులకక్షులు

చెన్నపట్టణము స్థాపించిన మూడువందల సంవత్సరములైన సందర్భమున జరుపబడిన ఉత్సవముల సంఘమువారి కొరకు రచియింపబడిన చెన్నపట్టణచరిత్రమున ప్రొఫెసర్ సి. ఎస్. శ్రీనివాసాచార్యులుగారీ కుడిచెయ్యి ఎడమచెయ్యి కులకక్షలనుగూర్చి వ్రాయుపట్ల "ఈ వివాదము లీప్రాంతములందలి తమిళదేశములోని అరవప్రజల జీవిత విధానమునందొక స్థిరలక్షణముగా నుండి 19-వ శతాబ్ది చివరిభాగమునగాని పూర్తిగా మాయము కాలేదు." అని వ్రాసినారు (పు. 50). ఈ వాక్యమువలన చెన్నపట్టణములో నీ కులకక్షలు ప్రబలిన జనులందరును అరవవారే యను నపోహకూడ కలుగుట కవకాశ మిచ్చుచున్నది. ఇది సరికాదు. చెన్నపట్టణములోని కుడిచెయ్యి ఎడమచెయ్యి కులములవారిలో అరవవారికన్న తెలుగువారే అధికసంఖ్యాకులుగ నుండిరి.

కుడిచెయ్యి ఎడమచెయ్యి కులకక్షలనునవి దక్షిణ హిందూదేశములోని తెలుగు అరవ జిల్లాలలో వివిధ ప్రాంతములందును, పట్టణములందును, పల్లెలందును అనాదిసిద్ధముగా నుండి యున్నవి.

కుడిచెయ్యి కులములను దైవాచార కులము లనుచుండిరి. ఈ కుడిచెయ్యి కులకక్షిలో లింగధారణము చేసినవారు నేతగాండ్రు, తెలికలవాండ్రు, కుట్రపుపనివారు, రెడ్లు, వ్యవసాయకులు, బలిజలు, గొర్రెల కాపరులు, కుమ్మరులు, బెండర్లు(Benders), చెప్పులు కుట్టువాండ్రు, బుట్ట లల్లువాండ్రు, గొల్లవాండ్రు, చాకలివాండ్రు, మంగళ్లు, జోగులు, బుడబుక్కలవాండ్రు, లింగములు కట్టుకున్నవారు నుండిరి. మాలలు, పరయాలలో కోటగార్లును చేరియున్నారు. ఇక ఎడమ చెయ్యి కులకక్షిలోనివారిని పాంచాలు లనిరి. వీరిలో ద్విజులవలెనే జంధెములు వేసికొను అయిదు తెగల బత్తులు — బంగారము వెండి పని చేయు కంసాలిబత్తులు, రాగి యిత్తడి పనిచేయు కంచరిబత్తులు, రాతి పని చేయు శిల్పులును, హాటగారు లను రంగులు వేయువారు, దేవాంగులు అనగా జంధెములు వేసుకొను నేతగాండ్రు, పరయాలలో చెప్పులుకుట్టు మాదిగలు చేరియుండిరి. ఈ రెండు కులకక్షలు ఒకరికన్న రెండవవారెక్కువవా రనియు, తమకు ముందుగా మర్యాదలు జరుగవలెననియు కోరుచుండిరి. ఎడమకులములవారు తాము వీరితో సమానుల మనుచుండిరి. ఇట్లెల్లప్పుడును వీరు తగాదాలుపడుచుండిరి. అనాదికాలమునుండియు నీ రెండు తెగల కులకక్షలవారికిని వారి వారి మతాచారములు జరిపించుకొనుటకు వేరు వేరు దేవుళ్లు, దేవతలు నుండిరి. వీరి వివాహములందు, మరణములందు, కొలుపులందు, జాతరలందు ఒక కులకక్షికి చెందినవారి వీధులగుండా రెండవవారు ఊరేగింపులు చేయకూడ దను కులకట్టులు, నిషేధములు అనాదిసిద్ధముగా నుండి తగవులకును, దెబ్బలాటలకును కారణము లగుచుండెను (The Madras Revenue Register, Vol. X, pp. 9-13).

### కులకక్షులు, తగాదాలు

కొన్ని ప్రాంతములందు కుడికులముల వారిని మహానాటివారనియు, ఎడమకులముల వారిని మత్తు లనియు వ్యవహరించుచుండిరి. ఎడమకులములలో కంసాలివారు, గొల్లలు, ముత్తరాచలు, మాదిగెలు వగైరా లుండిరి. వీరి కులాచారములును, మర్యాదలును చాలా చిత్రముగా నుండెను. ఈ రెండు తెగల వారిలో పెండ్లిండ్లు మొదలైనవి జరిగినప్పుడు మహానాటివారిలో మాలకులస్థులు గుఱ్ఱమునెక్కి ఊరేగుటకు కొన్ని గ్రామములందు అభ్యంతర ముండెను; కొన్ని గ్రామములలో లేకుండెను. తక్కినవారిలో ఆయా కులముల తారతమ్యములను బట్టి పల్లకీలు మొదలైనవి యెక్కి భజంత్రీలు, మేళతాళములతో ఊరేగినచో ఎడమకులములవారభ్యంతర పెట్టుచుండిరి. ఎడమకులస్థులలో కంసాలులు మొదలయిన పంచదాయీల వాండ్రు పెండ్లియూరేగింపులలో గుఱ్ఱము నెక్కి ఊరేగుటకు వచ్చిన మేళము 'చౌడాయి', అనగా గ్రామము కట్టునప్పుడు ప్రతిష్ఠింపబడిన రాతి స్తంభముదగ్గర నాదార్చకపోయినచో మహానాటివారాటంకము చేయుచుండిరి. వీరిగురువు సంచారము చేయుచు పగలు కంచుదివిటీలు మొదలయిన బిరుదులు వేసుకొని వచ్చునప్పుడు ఆటంకము చేయుటయు, అందువలన కలతలు వచ్చుటయు నుండెను.

గొల్లలు గుఱ్ఱముపై నెక్కి యూరేగినప్పుడును కలతలు వచ్చుచుండెను. తక్కిన ముత్తరాచలు మొదలైనవారు గుఱ్ఱము నెక్కి యూరేగునప్పుడు మహానాటివారాటంక పెట్టుచుండిరి. ఎడమ కులములలో చేరిన మాదిగవాండ్రు నాలుగుప్రక్కలను పట్టుకొను పుల్లెడ, తెల్లకత్తి, కాలికి గజ్జ కట్టుకొని గ్రామములోనికి వచ్చునెడల మహానాటివారు ఆటంకము చేయుటయు, ఉభయులకు కలతలు కలుగుటయు నుండెను. 1842 లో కుంఫిణీప్రభుత్వమువారు వివిధ జిల్లా మేజస్ట్రేటుల నీ కులకక్షలనుగూర్చి విచారణచేయవలసిన దని తాకీదు నంపగా పై సంగతులను గుంటూరు జిల్లా మేజస్ట్రేటు గారికి దాచేపల్లినుండి హెడ్డాఫ్ పోలీసు పెలిదండ్ల దాసప్పగారు 1842-వ సం. నవంబరు 3-వ తేదీన వ్రాసిన విన్నపమునందు వివరించిరి (చూ: లోకల్ రికార్డులు 62-వ సంపుటము; శ్రీగిడుగు రామమూర్తిపంతులు గారి గద్యచింతామణి, పుటలు 149-151).

### ఆంగ్లేయపరిపాలకుల పరిష్కార మార్గము

ఆంగ్లేయపరిపాలనలో చాలకాలమువరకును ప్రజల మెప్పుపొందుటకు కుంఫిణీవారు ప్రయత్నించుచు నీ కులాచారములను, మర్యాదలను

కాపాడుచు నవి సక్రమముగా జరుగునట్లు కని పెట్టి చూచుచు శాంతిని కాపాడుచుండిరి. అయితే ఈ మర్యాదలలో ఎన్ని అనాది సిద్ధము లైనవి, ఎన్ని నిజమైనవి, ఎవరిది ధర్మ పక్షము అని నిర్ణయించుట చాలా కష్టసాధ్య ముగా నుండెను. ప్రభుత్వకచ్చేరీలు, కోర్టులు నీతగవులతో నిండిపోయెను. గవర్నరు కవు న్సిలులో నీతగవులు చర్చింపబడి మధ్యవర్తి పరిష్కారములు జరుగుచుండెను. క్రమక్రమ ముగా ఆంగ్లేయపరిపాలన గట్టిపడి క్రైస్తవ మతాచార్యుల పలుకుబడి హెచ్చగా నీవిగ్ర హారాధకుల కులాచారము లను, మర్యాదలను క్రైస్తవ ప్రభుత్వము కాపాడవలసిన పనిలేదనియు, ప్రజలందరికిని రాజబాటలందును, బహిరంగ ప్రదేశములందును సర్వసమా నమైన హక్కు లుండవలెనని యు, శాంతికి భంగము రా కుండమాత్రము కాపాడవల యు ననియు నిశ్చయించి ఆ ప్రకారము పరిపాలింపసాగిరి.

వివిధకులములవారిని పూ ర్వమువలె బుజ్జగించుట మాని కఠినముగా మందలించి శాం తికి భంగము కలుగునని తోచి నప్పుడు వారి ఉత్సవములను, ఊరేగింపులను నిషేధింప సాగిరి. కులకక్షలవలన కలి గిన దెబ్బలాటలలోను, దొ మ్మిలలోను పాల్గొనినవారిని కఠిన ముగా శిక్షింపసాగిరి. ప్రజాశాంతికి భం గము కలిగింపనంతవరకు కులవివక్షత లేకుం డ అందరును బాహాటముగా ఊరేగవచ్చు నను సిద్ధాంతము ప్రబలెను. తక్కువకులముల వారు—మాలమాదిగలుకూడ తెలుగువారి సమానమైన హక్కులు చలాయింపసాగిరి. క్రిమినలు కోర్టులందును, సివిలుకోర్టులందును కులభేదములు లేకుండ ప్రజలందరును సమాను లను భావముతో న్యాయపరిపాలన చేయ సాగిరి. ఈ విషయము లన్నియు బళ్లారిజిల్లా మునసబుకోర్టులో వచ్చిన1875-వసంవత్సరపు

## తగాదాలు, తాపత్రయములు

677 నెంబరు అసలు వ్యాజ్యములో జిల్లామునసబు గారయిన శ్రీ పి. తిరుమలరావుగారు తమతీర్పులో చర్చించియున్నారు (చూ: రివిన్యూ రిజష్టరు పత్రిక 10-వ సంపుటము, పుటలు 9-13).



సెనేట్ హౌసు - శాసనసభా మందిరము

మన మహానగరములందు కులకక్షలవలన బుర్రలు పగులగొట్టుకొనుట తగ్గినను కులా చారములందు, మర్యాదలందు నిప్పటికిని పట్టుదల లున్నవి. చెన్నపట్టణములో తిరు పతిగొడుగులను ఉత్సవములు చేయుచు ఊరే గించు విషయమునకొన్ని కులములవా రిప్పుడు గూడ తగాదాలుపడుచు సివిలు క్రిమినలు కోర్టులలో వ్యవహారములు జరుపుచునే యున్నారు. అందువలన నీకులకక్షలు పూర్తి గా పోయిన వని చెప్పుటకు వీలులేదు.

చెన్నపట్టణమున 1652-వ సంవత్సరము లోనే కుడిచెయ్యి ఎడమచెయ్యి కులకక్షలు ప్రారంభమయినట్లు కుంఫిణీవారి కవిలెలవలన కనబడుచున్నది. కుడిచెయ్యి కులముల వారిలో చాలామంది భూస్వాములు, గ్రామ లెక్కలు వ్రాయు పిళ్లలును, కొందరు అంటరాని కులములవారును నుండిరి. ఎడమ చెయ్యి కులములలో వర్తకము చేయువారు, కులవృత్తులు చేయు పారిశ్రామికులు, తెలికల వారు, నేతగాండ్రు, తోళ్లపని చేయువారు నుండిరి. ఈ కులములవారిలో పెండ్లిండ్ల లోను, చావులలోను వీథులలో నూరేగింపులు తీసికొని వెళ్లుటలోనే ముఖ్యముగా ఈవివా దములు కలుగుచుండెను. 1652 లో కోనేరిసెట్టి ఎడమ చెయ్యి కులముల నాయకు డును, శేషాద్రినాయకుడు కుడిచెయ్యి కులముల నాయ కుడును నైయుండిరి. వీరిరు వురును గొప్పవర్తకులే. ఈ శేషాద్రినాయకుడు, లేక శేషా ద్రిసెట్టి ఆంగ్లేయు లిక్కడ వర్తకస్థానమును స్థాపించినది మొదలు కుంఫిణీవారికి ప్రధాన దేశీయ వర్తకుడుగ నుండెను. ఇతడు చాలా పలుకుబడి కలి గియుండెను. కోనేరిసెట్టియు కంపెనీవారి బట్టల ఎగుమతి వర్తకమున వ్యవహరించుచుం డెను. అందువలన నతడును బలవంతుడే. చెన్నపట్టణమున మొదటి గవర్నరుగా పేర్కొ నబడిన కుంఫిణీ సంఘాధ్యక్షుడగు ఆరోన్ బేకరుగారును, గ్రీన్ హిల్ గారును, ఇంక నితరులును మధ్యవర్తిత్వము చేసి ఈ తగవు పరిష్కరించినట్లు కనబడుచున్నది. ఈ తీర్పువలన నల్లవారి బస్తీలో నీ రెండు తెగలవారికి వేరు వేరు వీథులు ప్రత్యేకింప బడెను (**History of Madras, Prof. C. S. Srinivasa chari, pp. 50-51**).

1707-వ సంవత్సరములో చెన్నపట్టణ మున పిట్టు గవర్నరుగా నుండగా ఎడమ చెయ్యికులములకన్న తా మెక్కువవారమని కుడిచెయ్యికులములవారు తగాదాలు పెట్టి

ఇది స్థిరపరుచనిచో తాము చెన్నపట్టణము విడిచి పోవుదుమని బెదరించిరి. కుడిచెయ్యి కులములతో సమానముగ నైన చూచి తమ మర్యాదలు కాపాడవలసినదని ఎడమచెయ్యి కులములవారు కోరిరి. గవర్నరైన పిట్టుగారీ రెండు కులములు నివసించు ప్రదేశముల మధ్య రాతిస్తంభములుకట్టించి వేరుపరచెను. కాని శాంతిభద్రతలు కాపాడుట కెంతో కష్టపడవలసివచ్చెను. ఈ సందర్భములలో కుడికులములవారు కొందరు ఎడమకులములవారికే మాత్రపు గౌరవ మొసగబడుటకు గూడ ఇష్టపడక కోపగించి చెన్నపట్టణము విడిచి వెళ్లిపోయిరి (Annals of Madras, J. Talboy Wheeler). ఇది చాలా చిత్రమైన కథ. 1707-8 మధ్య కుడిచెయ్యి, ఎడమచెయ్యి కులముల కక్షలు మరల చెలరేగుట కొక అవకాశము కలిగెను. నల్లబస్తీ సంరక్షణ కొరకు చుట్టును గోడలు వగయిరాలు కట్టుటకుగాను గవర్నరు వివిధకులములవారిపైన పన్ను విధింపదలపగా ఎవరెవ రెంతెంత భరింపవలెనో నిశ్చయించుటకు కులపెద్దలందరును నల్లవారి ప్రాతబస్తీగుడిలో సభ చేసిరి. తమ వివాహములలో నూరేగింపు లే వీధులలోనుండి పోవలెనో యను విషయమున నీ రెండు తెగలవారును వివాదములు పడుచున్నట్లు గవర్నరుకవున్సిలు వారు 1707-వ సంవత్సరము జూను 26-వ తేదీన రికార్డు చేసియున్నారు. బస్తీలో శాంతిని కాపాడుటకు గవర్నరు బందోబస్తు చేయవలసివచ్చెను. అందుకొరకు ఈరెండు తెగలును నివసించుచుండిన వీధులను సర్వే చేయించుట కతడు నిశ్చయించెను.

ఈకక్షల కింకొక కారణము గూడ నుండెను. మొదట కుంఫిణీవారు తమకు కావలసిన సరకులను కొనుటకు ముఖ్యవర్తకు నొకని నియమించి సరకుల నీ దేశీయప్రతినిధుల ద్వారా కొనుగోలు చేయించుచుండిరి. వీరికి ముందుగా కొంత సొమ్ము బయానాగా నివ్వగా వారు నేతగాండ్రకు, పారిశ్రామికులకు కూలి నిచ్చి సరకులు కొనుచు పనులు చేయించుచుండిరి. ఈ వ్యవహారములు చేయు బ్రోకరులును, వర్తకులును చాలామంది కుడిచెయ్యి కులములవారుగా నుండిరి. వీరిలో ప్రధానవర్తకుడగు కాశీవీరన్న* ముఖ్యుడు. మొదటిరోజులలో గవర్నరుల కీవర్తకులు లంచమిచ్చుచున్నట్లు బయల్పడినది. ఇటీవల నిట్లు ముఖ్యవర్తకులను నియమించు పద్ధతి మానివేసి అందరువర్తకులకు కుంఫిణీవారు పనిచెప్పి పోటీలుగా సరకులు కొనుగోలు చేయుట ప్రారంభించిరి. ఇదియే ఈ రెండు తెగలవారి కులములలో కక్షలు ప్రబలుటకు కారణములయ్యెను.

ఎడమచెయ్యికులములు కాపుర ముండు వీధులలో నివసించు కుడిచెయ్యికులముల వారి నచ్చటియిం డ్లమ్ముకొని తమ కులములవారు నివసించు చోటికి పోవలసిన దని కుంఫిణీగవర్నరు కవున్సిలువారు తీర్మానించుచు కుడిచెయ్యికులములవారికి గల మర్యాదలకు భంగము కలిగింపవలదని ఎడమచెయ్యికులములవారిని ఆజ్ఞాపించిరి. అంతట కుడిచెయ్యికులములవారీ యవకాశము చూచుకొని 1707 లో తమ వివాహపు టూరేగింపును నిషేధింపబడిన వీధులలో నొకదానినుండి తీసికొనిపోయిరి. అట్లు నిషేధింపబడిన వీధులలో రెండు చిరకాలము నుండి తమకు హక్కుభుక్తములు గలవని వాదించి అధికారుల ఆటంకమునకు కోపగించి చాలామంది మైలాపూరు సముద్రతీరమున గల శాంతోముకు వెడలిపోయిరి. ఇప్పుడు కలవాయిసెట్టియు, వెంకటసెట్టియు ఎడమచెయ్యికులముల నాయకులుగ నుండిరి. నిజముగా నీతగాదాలు తాము కుంఫిణీవారి వర్తకమునందు లాభము పొందుచున్నందులకే వచ్చుచున్నవిగాని వీధుల అనుభవముకొరకు గాదని వీరు స్పష్టముగా జెప్పివైచిరి. గవర్నరు కవున్సిలులో సభ్యుడగు ఫ్రేజరుదొర గవర్నరైన పిట్టుకు వ్యతిరేకుడు. ఇప్పు డతడు కుడిచెయ్యి కులములవారితరఫున వాదింపసాగెను. అంతట గవర్నరుపిట్టు అతనిని సస్పెండుచేసెను. ఈరెండు తెగల కులపెద్దలను కోటలో నొకగదిలో నిర్బంధించి రాజీ ఏర్పాటు చేసుకొనునట్లు గవర్నరు నిర్బంధించెను. ఈ రాజీవలన కుడిచెయ్యి కులముల వారు పెద్దనాయకుడిపేటలోను, ఎడమచెయ్యికులములు ముత్యాలపేటలోను వసించునట్లు నిర్ణయింపబడెను. ఇట్లు వేరుచేయబడిన ప్రదేశములలో నున్న రెండవ తెగవారు ఇండ్లపట్టాలను మార్పుచేసికొనుట కొక గడువు కాలము నిర్ణయింపబడెను. ఇండ్లనమ్ముకొనువారా ప్రదేశములో హక్కుగల తెగకులములవారికే అమ్మవలెను గాని రెండవ తెగవారికి విక్రయింపరాదు. ముత్యాలపేటలో సముద్రతీరమున నున్న పడవవాండ్రును, లాస్కరులును, చేపలుపట్టు పల్లెకాండ్లును కుడిచెయ్యికులములవారైనను ఎప్పటివలెనే అచ్చటనే యుండవచ్చునని తీర్మానించిరి.

పారశీ, ఆర్మీనియను వర్తకుల సిఫారసుపైన పట్టణమునుండి వెడలిపోయిన కుడిచెయి కులములవారిని గవర్నరు క్షమించి మరల బస్తీలోనికి రానిచ్చుట కంగీకరించెను. కాని వారిలో కొందరు తిరిగి తమయిండ్లకు వచ్చి యుండుటకు మనసురాక సగము దూరము వచ్చి మరల శాంతోముకు వెడలిపోయిరి. అంతట గవర్నరు కోపముతో వారిని దండింపవలసెను. ఆ సంవత్సరముపొడుగునను వారిని

---

*ఈకాశీవీరన్న తెలుగువాడే. బేరీ తిమ్మన్నతో కలిసి కుంఫిణీవారి ప్రధానవర్తకుడుగా పనిచేసి తిమ్మన్న 1678 లో చనిపోగా తానే ప్రధానవర్తకు డయ్యెను. కుంఫిణీవారి ఎగుమతి వ్యాపారమంతయు నితనిద్వారా జరుగుచుండెను. గోలకొండలో నితనికి పలుకుబడి యుండెను. సగము సుంకము లే చెల్లించుచుండెను. ఇతడు 1680 లో చనిపోగా కోటనుండి ఇతని గౌరవార్థముగా 30 ఫిరంగులు కాల్చిరి.

రప్పించుటకు కొన్ని రాయబారములు జరిగెను. క్రైస్తవులైన పల్లెకారీలును ఏతెగకును చెందకపోయినను తమ యజమానులను బట్టి యిట్లు పోయినవారిలో నుండిరి. వీరు పశ్చాత్తాపము చెందిరిగాని యజమానులను వదలలేకపోయిరి. నేతగాండ్రును, తెలికలవాండ్రును మొదట ఏకక్షకు చెందుటకు నిలుకడ లేకుండిరి. కాని తరువాత వీరిలో నేతగాండ్రు ఎడమచెయ్యి తెగలోను, తెలికలవాండ్రు కుడిచెయ్యి తెగలోను చేరిరి. ఈరెండు తెగల కుడి ఎడమ చెయ్యి వారి యిండ్లలో ఐదువందలయిండ్లు ఇట్లు మార్చుకొనవలసివచ్చెను. తుదినిర్ణయమునుబట్టి పెద్దనాయకునిపేటలో కొన్ని వీథులు ఎడమచెయ్యి కులములకొరకు ప్రత్యేకింపబడెను. ఈవ్యవహారమునందిట్లు ప్రత్యేకముగా నిర్ణయింపబడిన ప్రదేశమును నిర్ధారణగా నిరూపించుట కష్టమేగాని చెన్నకేశవపెరుమాళ్లగుడి దక్షిణముననుండి టంకసాలవీథికి, అనగా (మింటుస్ట్రీటుకు)తూర్పున గల పేట యిట్లు ప్రత్యేకింపబడెనని యూహింపవచ్చును. నాటువారి పిళ్లయారుగుడికి తూర్పున గల వీథు లన్నియు కుడిచెయ్యి కులములకును, పడమటిప్రక్క వీథులన్నియు ఎడమచెయ్యికులములకును ప్రత్యేకింపబడెను. ఏకాంబరేశ్వరగుడి, వెంకటనారాయణప్పరాతిచావిడిమాత్రము ఉభయకులములు ఉపయోగింపవచ్చు నని నిర్ణయింపబడెను (History of Madras, pp. 125-127).

ఈకులకక్షలు మరల 1716 లో చెలరేగెను. ఇప్పుడు ఎడమచెయ్యికులములలోని సెట్లు కుడిచెయ్యికులములపైన ఫిర్యాదుచేసిరి. ఎడమచెయ్యికులములకు నాయకులయిన కలవాయిసెట్టియు, కాళాస్త్రి సెట్టియు పెద్దవర్తకులు. వీరు అధికారుల యుపేక్షకు కోపగించి శాంతోముకు వెడలిపోయిరి. ఈవివాదము కొన్నిగుడులదగ్గర వినాయకుని పండ్రెండుమారులు పూజించి యారాధించు కులాచారవిషయములో వచ్చెను. అంతట గవర్నరుకవున్సిలువారింక సెట్టి క్రొత్త దేవాలయములను గట్టరాదనియు, సెంటు జార్జిక్రాసుజండా తప్ప వేరే జండా నెగురవేయరాదనియు, కుడియెడమకులములవారెవ్వరునుగూడ నల్లవారి బస్తీలోని పెద్దగుడిదగ్గర సెట్టి యారాధనలును చేయరా దనియు శాసించి కలతలు రాకుండ కట్టుదిట్టము చేసిరి (చూ: శ్రీనివాసాచారిగారి చెన్నపట్టణ చరిత్ర, పుట 134).



మద్రాసు యూనివర్సిటీ లైబ్రరీ

## పేరుపొందిన తెలుగు వర్తకులు

ఆకాలమున చెన్నపట్టణమునందు పేరు పొందిన వర్తకులలో చాలమంది తెలుగువారే. 1711 లో నరసప్పయను ముఖ్య వర్తకుడు తన పదవిని గోల్పోయినపిమ్మట సుంకురామసెట్టి చాలా బలవంతుడైన గొప్పవర్తకు డయ్యెను. కోటలో తనబట్టలు నిలువ చేసికొనుటకు ఈ సుంకు రామసెట్టిని కుంఫిణీవారు గిడ్డంగిగా నుపయోగించుకొనుట కొరకు ఇంటిని కొననిచ్చిరి. 1717 లో ప్రధానమైన వర్తకులలో బాలిసెట్టికూడ నుండెను. కలవాయి సెట్టి కాళాస్త్రిసెట్టియు కులకక్షలలో కుంఫిణీవారి యనుగ్రహమును గోల్పోవగా గంగారమయ్య, భద్రయ్య యనువారు ప్రముఖులైరి. పెద్దనాయకుని పేటకు పడమర ముత్యాలపేట కుత్తరమున గల బందోబస్తు గోడలకు ఫిరంగి దిమ్మలకు బ్లాకు హౌసులును ఈపెద్ద వర్తకులు నిర్మించినందున వారి పేరు ఎప్పటికిని ప్రసిద్ధిలో నున్నది. ఆ కాలమున కుంఫిణీవారి కొలువులో నుండిన పెద్ద వర్తకులు, సెట్లు, దుభాషులు చాలమంది తెలుగువారే యనుసంగతి యింకొకచోట చెప్పబడినది. చెన్నపట్టణమున నాకాలమున కుంఫిణీవారి కొలువులో చాల గౌరవము పొందినవారిలో ఆంధ్రబ్రాహ్మణుడగు రాయసం పాపయ్యగా రొకరు. ఈయన కుంఫిణీవారి ప్రధాన దుభాషీగ నుండితర్జుమాచేయు ట్రాన్సులేటరుగా నుండెను. ఇత డెక్కడకు పోయినను ఈయనకు ఛత్రముపట్టు గౌరవ మొసగబడెను. 1717లో కుడియెడమ కులకక్షలలో నితడు పాల్గొనెననియు, ఉప్పు వ్యాపారములో నేదో యొక లోటు చేసెననియు కొన్నాళ్లపాటు ఇతనిని మర్యాదచేయుట మానిరి. కాని తరువాత 1720 లో మరల నీతని నెప్పటివలె గౌరవించిరి(Ibid, page 135). పాపయ్యయను పేరుగల తెనుగుబ్రాహ్మణులనేకులు చెన్నపట్టణ చరిత్రలో ప్రఖ్యాతి వహించిరి. వీరిని గూర్చియు నింకొకచోట వర్ణింపబడినది.

## 3

చెన్నపట్టణమున నాంగ్లేయులు క్రమక్రమముగా నభివృద్ధిగాంచిరి. గోలకొండ నవాబుప్రతినిధితో చాల చిక్కులుపడి శిస్తుకట్టుట కంగీకరించి ఆయనతో సఖ్యము చేసికొనిరి. తరువాత ఔరంగజేబుతోను, ఆయనప్రతినిధియగు కర్ణాటక నవాబుతోను చిక్కులు వచ్చెను గాని వీరు ఏదో విధముగా రాజీపడి తమ వ్యవహారములు జరుపుకొనిరి. 1693 లో ఎగ్మూరు, పారశువాకము, తండయారుపేట, తిరువలిక్కేణి ఉపగ్రామములను సంపాదించిరి. 1708 లో తిరువత్తొయ్యూరు, నుంగంబాకము, వ్యాసర్పాడి, కత్తివాకము, సత్తనగాడులను సంపాదించి నల్లవారిబస్తీ గట్టిచేసిరి. 1717 లో నీ యైదుమాళ్లకును చక్రవర్తివలన పట్టా పొందిరి. 1719 లో కొలెట్టుపేట స్థాపించిరి. ఎగ్మూరు, పారశువాకము, తండియారుపేటలలో 1721 లో పరిపాలన ప్రారంభించిరి. 1734 లో చింతాద్రిపేట స్థాపించిరి. 1742 లో వేపేరి, పెరంబూరు, పుదుపాకము, ఎరనవూరు, సదయను కుప్పములు నవాబువలన సంపాదించుటతో చెన్నపట్టణముఖ్యపరిసరము లెల్ల వీరివశములై నేటి మద్రాసురాజధానినగర మేర్పడుటకు దారి యేర్పడెను.

### ఆంగ్లేయులతోపాటు
### పట్టణాభివృద్ధి

కర్ణాటకనవాబు మహమ్మదాలీ వీరికి వశుడు కాగా రాజ్యాధిపత్యమునకును, అభివృద్ధికిని మార్గము లేర్పడెను. అయితే ఈలోపుగా నొక అంతరాయము కలిగెను.

ఇంగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని జరిగిన యుద్ధములో నాంగ్లేయు లోడిపోగా 1746 లో చెన్నపట్టణము ఫ్రెంచివారిచేతులలో పడినది. 3 సంవత్సరముల తరువాత ఆంగ్లేయులకును, ఫ్రెంచివారికిని సంధిజరుగగా నది మరల నాంగ్లేయుల వశమైనది. ఆనాటికే చెన్నపట్టణము మన చోళ మండల సముద్రతీరమున ప్రధానమైన వర్తకస్థానము. అప్పటికే నగరమునందలి దేశీయుల జనసంఖ్య 40 వేల ప్రజలు. దీని రాబడి సాలుకు 50 వేల వరహాలు. ఇది చాలవరకు ఎగుమతి దిగుమతి సుంకములవలననే వచ్చుచుండెను. అప్పటి ఫోర్టుసెంటు జార్జికోట ఉత్తరపు గోడనానుకొని మన దేశీయుల ఇండ్లుగల నల్లవారి బస్తీ యుండి నందువలన కోటచుట్టును ఫిరంగు లమర్చి యుద్ధముచేయుటకు వీలులేక కోటను శత్రువులనుండి కాపాడుట కష్టమని తలచి ఫ్రెంచివారు ఆ పేటలోని ఇండ్లనెల్ల పడగొట్టిరి. ఇక్కడి వర్తకుల నందరిని పాండుచేరికి వచ్చి వ్యాపారము చేయుడని బలవంతము చేసిరి. కొందర ట్లు పోయిరి గాని మరికొందరు నిరాకరించిరి. ఇట్టి స్థితిలో నల్లవారిబస్తీ పాడుపడెను. చెన్నపట్టణపు ప్రాతకాపులు చాలమంది చెల్లాచెదరైరి. కొంతమంది ఆస్తిని గోల్పోయి దరిద్రులైరి. కొందరు మరణించిరి. ఆంగ్లేయులు 1749 లో మైలాపూరుసముద్రతీరమగు శాంతోము నాక్రమించిరి. సంధి జరిగిన తరువాత మరల చెన్నపట్టణము 1749 లోనే ఆంగ్లేయుల వశమైనను 1752 వరకును ఆంగ్లేయులు మరల తమ కార్యాలయముల నచ్చటికి మార్చుకొనలేదు.

### వర్తకముచేసికొనువారు
### పరిపాలకులైరి

ఫ్రెంచియాక్రమణతరువాత నాంగ్లేయ కుంఫిణీవారు మరల చెన్నపట్టణమున తమ రాజధానిని స్థాపించునప్పటికి కుంఫిణీవారి స్వభావమే మారిపోయెను. వర్తకము చేసికొనువారు పరిపాలకులైరి. ఇదివరకు సీనియరువర్తకులనియు, జూనియరువర్తకులనియు పిలువబడు ఉద్యోగులు సివిలు అధికారులై, యొకచేతితో వ్యాపారపు గల్లాపెట్టెయు, రెండవ చేతితో ప్రభుత్వధర్మదండమును బుచ్చుకొని వ్యవహరింపసాగిరి. వీరి వర్తక కార్యాలయములే ప్రభుత్వపు కచ్చేరీలుగా నుండెను. చెన్నపట్టణమునను, దాని రక్షణ క్రింద నుండు రాజ్యభాగములందును సివిలు సైనిక బందోబస్తులు చేయబడెను.

మరల చెన్నపట్టణము చేరగానే ఆంగ్లేయులు చేసిన మొదటి పని కోట గోడలు గట్టిచేయుట. కోటను రక్షించుటకు కట్టుదిట్టములు చేసి నేడు కనబడుచున్న విధముగా కోటను పునర్నిర్మాణము చేసిరి. పూర్వము కోటగోడ నానుకొనిన నల్లవారి బస్తీని ఫ్రెంచివారు నాశనము చేయుటవలన ఇంగ్లీషువారి పని సులభమయ్యెను. ఈ పాతబస్తీలో నొక గుడిమాత్ర మింకను మిగిలియుండెను. దీనిని పడగొట్టివేసి ముత్యాలపేటయు, పెద్దనాయకుని పేటయు కలిపి నల్లవారి క్రొత్తబస్తీగా చేయుటకు నిశ్చయించిరి. ఆప్రకారము 1757 లో నీగుడిని పడగొట్టి దాని నింకొకటి కట్టుకొనుమని కొంత నష్టపరిహార మిచ్చిరి. హిందువులు 1762 లో నొక క్రొత్తగుడిని గట్టుకొనిరి. ఈనల్లవారి క్రొత్తబస్తీకి ఉత్తరమునను, పడమరను 1769 లో మూడున్నర మైళ్ల పొడుగున నొక గట్టిగోడను, మధ్యమధ్య దిమ్మెలను గట్టిరి.

### కర్ణాటక నవాబు
### పతనము

1755లోనే కర్ణాటకనవాబు మహమ్మదాలీ చెన్నపట్టణము వచ్చి ఆంగ్లేయుల సంరక్షణ గోరెను. 1761 లో నాంగ్లేయులు ఫ్రెంచివారి నోడించి పాండుచేరీ పట్టుకొనిరి. అంతట నవాబు చెన్నపట్టణముననే స్థిరనివాస మేర్పరచుకొనుటకు 1764 లో నిశ్చయించెను. మొదట నాయనకొరకు కోటలోనే యొక భవనమును నిర్మింప దలచిరిగాని తుదిమానిరి. నేడు తిరువలిక్కేణి సముద్రతీరమున చేపాకులో రివిన్యూబోర్డు కార్యాలయము లున్న కట్టడములు గల ప్రదేశమును దానిచుట్టు సముద్రతీరమునుండి గవర్నమెంటు హౌసు తోటలో కొంతభాగము

వరకును, కూము నదినుండి పైక్రాఫ్ట్సురోడ్డు వరకునుగల 117 యకరములభూమిని నవాబు 1767 లో పుచ్చుకొనగా 1768 లో 'కలశ మహల్' అని నేటికిని పిలువబడు రాజనగరు నిర్మింపబడెను. ఈ యావరణమునకు చుట్టు నొక గోడ యుండెను. ఈ దేవిడీయొక్క సింహద్వారము మూడు ఆర్చిలు గలిగి వాలాజారోడ్డుమీద నేటి గవర్నరు ప్రయివేటు సెక్రటరి ఇంటిదగ్గర నుండెను. ఈ కోటగుమ్మముపై కావలివారి గదులు, నకర్ఖానాయు, దీనిలోపల నొక ఆయుధాగారము నుండెను. దక్షిణమున కలశమహలు, ఉత్తరమున హుమయూనుమహలు, దివానీఖానా అనునవి రాజనగరు భాగములు. దీనిలో నిప్పుడు పి. డబ్ల్యు. శాఖ, సెక్రటేరియటు కచ్చేరీలు, రివిన్యూబోర్డు కచ్చేరీలు పెట్టి యున్నారు. ఆవరణలో ఏనుగులశాల, సిపాయీల బారకీచులు నుండెను. ప్రస్తుతపు సెనేటుహాలున్న స్థలమున గౌరవార్థము ప్రేల్చు ఫిరంగులమర్చి యుండెను. నేటి యూనివర్సిటీ లైబ్రరీ బిల్డింగు కట్టుటకు పడగొట్టిన 'మెరైన్ విల్లా' నవాబు అష్టభుజభవనమనబడుచుండెను. కూమునదిలోనికి కట్టిన స్నానఘట్టము దగ్గర నిది చావిడిగ నుండెను. కుంఫిణీవారీ కర్ణాటక నవాబును త్రోసి రాజనిరి. 1801 లో నితని రాజ్యమును తీసికొని, 1855 లో నీతని నవాబు బిరుదు తీసివేసి రాజనగరును గూడ తీసికొనిరి.

చెన్నపట్టణపు పరిసరములును మార్పు జెందెను. పూర్వము వర్తకపు వ్యవహారములు చక్కబెట్టు గవర్నరులును, వ్యాపారోద్యోగులును కోటలోపలనే సంకుచితమైన గృహములందు నివసించుచుండిరి. ఇప్పుడన్నను క్రొత్తతరపు ప్రభుత్వోద్యోగులు బయలుదేరి చెన్నపట్టణమునకు పడమట సత్రపు మైదాన (Choultry Plain) మని పేరు గల విశాల

## క్రొత్త చెన్నపట్టణము

ప్రదేశమున చిన్న చిన్న తోటలను, బంగాళాలను నిర్మించుకొనసాగిరి. కోటలో తమ కార్యాలయములుమాత్ర ముంచుకొని కచ్చేరీలు చేయుచుండిరి. మద్రాసుకు దక్షిణమున 8 మైళ్లలో సెంటుతామస్ మౌంటు అని ఆంగ్లేయులవలనను, ఫరంగికొండ యని దేశీయుల



ప్రెసిడెన్సీ కాలేజి

వలనను పిలువబడు చిన్న కొండకు పూర్వము ఆంగ్లేయులు విశ్రాంతికొరకు పోయిఅక్కడ విహరించుచుండిరి. ఇటీవల నాప్రదేశమును సైన్యముల నుంచు దండుగా నుపయోగించుట ప్రారంభించిరి. ఆంగ్ల స్త్రీ పురుషులు సాయంత్రము మౌంటురోడ్డు చెట్ల నీడలనే విహరింపసాగిరి.

పూర్వము కోట కుత్తరమున నుండిన నల్లవారిబస్తీలో తెల్లవా రెవ్వరును కాపుర ముండకుండిరి. వీరి వర్తకకార్యాలయములు గాని, కచ్చేరీలుగాని అక్కడ నుంచుకొనకుండిరి. చాలమంది కోటలోనే కాపురముండి కచ్చేరీలు చేయుచుండిరి. క్రమక్రమముగా నాంగ్లేయుల సంఖ్యయు, బలమును హెచ్చగా గొప్ప యధికారులు, దొరలు కోటబయట దూరముగా తోటలు వేసికొని బంగాళాలు కట్టుకొని నివసించుచు కోటలో తమ వ్యాపారములు, ఉద్యోగములు చేసికొన సాగిరి. ఇది చాలా ధనవ్యయ సాధ్యముగా నున్నందున సామాన్యులగు ఆంగ్లేయులు, వర్తక కంపెనీలవా రిది భరింపలేక క్రమ క్రమముగా నల్లవారి క్రొత్త బస్తీలో సముద్రతీరమున కార్యాలయములను స్థాపించుకొని దూరముగా బంగాళాలలో కాపురము లుండసాగిరి.

ఆంగ్లేయుల పరిపాలనము బలవంతమగువరకును దేశములో నివసించు దొరలు దేశీయులను మర్యాదగనే చూచుచుండిరి. ఇప్పటి కింకను వారిలో జాత్యహంకారము ప్రబలలేదు. భారతదేశమునందితర ప్రాంతములందుకన్న చెన్నపట్టణమున దొరలకును, దేశీయులకును స్నేహభావ మెక్కుడుగనే యుండెను.

### ప్రజాజీవితములో మార్పులు

చెన్నపట్టణమున నాంగ్లేయ ప్రజా జీవనమునందు పూర్వకాలపు నిరాడంబరత్వము పోయి డాబు దర్పములు ప్రవేశించెను. ఆంగ్లేయ సైనికుల సంఖ్యకూడ 600కు హెచ్చెను. చెన్నపట్టణము దక్షిణ హిందూస్థానమునకు ముఖ్యపట్టణ మయ్యెను.

పూర్వపు పట్టణ మొక చిన్న బస్తీగా నుండెను. ఐరోపావారందరును కలిసి 400 మంది యుండిరి. దీనిలో 300 మంది సైనికులే. మిగిలినవారిలో ముప్పది నలుబది మంది కుంఫిణీ నౌకరులు స్వతంత్ర వర్తకులుగను, అంతకు రెట్టింపుమంది ఓడలవారుగను నుండిరి. ఈ జనసంఖ్యలో సగముమంది రైన

పెండ్లి చేసికొనినవారు కారు. పెండ్లియైన వారిలో సగముమందికైనను ఐరోపాదేశపు భార్య లుండరు. చాలమంది దేశీయస్త్రీలనే యుంచుకొనిరి.

ఆంగ్లేయ కంపెనీ యుద్యోగు లొక తెగగా నుండిరి. వీరి కాకాలమున నివ్వబడు జీతము లతిస్వల్పముగ నుండెను. రైటరు లనువారికి సాలు కైదునవరసులు జీతమే గాని వారికి కాపురముండుట కిల్లు, నౌకరులు ఉచితముగ నేర్పాటుచేయబడుచుండిరి. వీరికి త్రాగుటకు సారాయము చాల చౌకగనే ఇవ్వబడుచుండెను. వీరు ధనము సంపాదించుట కనేక మార్గము లుండెను. స్వంత వ్యాపారము చేసికొని లాభము పొందవచ్చును. చాలా వ్యాపారము లందు వీరికి ప్రత్యేకసౌకర్యము లుండెను. ఇంకొకరీ వ్యాపారము చేయకుండ నిషేధింపబడుచుండిరి. వీరి సరుకులపైన పన్నులేదు (**The Nabobs of Madras, Henry Dodwell, pp. 10-16**).

## క్రొత్త
## చెన్నపట్టణము

1800 నాటికే చెన్నపట్టణము చాలా మారిపోయినది. సముద్రతీరమున హోరుమని పొర్లుకెరటములును, కోటబురుజుపైన తటతట కొట్టుకొనుచు నెగురు బ్రిటిషుపతాకమును తప్ప మారని వస్తువుగాని, సందర్భముగాని లేదు. సెంటుజార్జి కోట మఱల పునర్నిర్మాణము చేయబడి తూర్పుదేశములందెల్ల బలవంతమైనది. నల్లవారి బస్తీ పూర్వమువలె దీని గోడల నానుకొని లేదు. కోటచుట్టును విశాలమైన ఎస్ప్లనేడు మైదాన మున్నది. ఉరికంబము, కెప్టెన్ పౌనేగారి నలుబది యడుగుల స్మృతిచిహ్నము తప్ప ఫిరంగిమూతుల కడ్డముగానుండు కట్టడములు లేవు. పండ్రెండు నెలలకు కావలసిన సరంజామును, సంబారములను కోటలో నిలువచేయుచుండిరి. తుపాకిమందు, ఫిరంగిగుండ్లు, ఆయుధములు పుష్కలముగా నుండెను. ఇది 60 వేలమంది సైన్యమునకు కేంద్రమైనది.

ఈ చెన్నపట్టణమునకు చుట్టుపట్టుల నెక్కడను ఆంగ్లేయులబలము నెదుర్కొని వారి యధికారమును తిరస్కరింపగల స్వదేశరాజు లేకుండెను. ఆంగ్లేయుల సంరక్షణలో నుండిన కర్ణాటకనవాబు మహమ్మదాలీ చేపాకులోని 'కలశమహల్' అను తన భవనమున 1795 లో చనిపోయినాడు. ఈ మహలు కుత్తరమున కొంతదూరములో గవర్నరు తోటమాత్ర ముండెను. దానిలో నేటి గవర్నమెంటు హౌసు ఇంకను అప్పటికి నిర్మింపబడలేదు.

ఈ యేబదేండ్లలో మన చెన్నపట్టణ మెంత పెరిగిపోయినది! పూర్వము నలుబదివేలుగా నుండిన దేశీయుల జనసంఖ్య రెండు లక్షల ఏబదివేలకు పెరిగినది. ఇప్పుడు చెన్నపట్టణమున కాపురమున్న ఐరోపాకుటుంబములలో నాలుగైదు వందల కుటుంబములవారు గవర్నమెంటు హౌసులోను, అసెంబ్లీ రూములోను ఆహ్వానముపొందు దర్జా కలిగిన వారుగ నుండిరి. పూర్వ మీ బస్తీలోనుండిన ఐరోపావారి నందరిని గవర్నరు కోటలోని అడ్మిరాలిటీ హౌసులోనే సత్కరింపగలుగుచుండెను. తరువాత 1798_1803 లో గవర్నరుగ నుండిన క్లయివుప్రభువు ఎక్సుచేంజిలోనో, పాంతియనులోనో సత్కరించవలసి వచ్చెను. వినోదములకొరకును, సత్కారములకొరకును గవర్నమెంటుహౌసు పెంపుచేయవలసివచ్చెను. ఐరోపావారు కోటలో నివసించుటయే మానిరి. కూమునది దాటి మౌంటురోడ్డులో 1753 నాటికి గవర్నరుగారి తోట బంగాళా గాక మూడుతోటబంగాళాలు మాత్రమే యుండెను. వీరికి సిపాయీల కాపలా యుండెను. ఇప్పుడు మౌంటురోడ్డు తెల్లవారి తోటబంగాళాలతో నిండెను. ఇవిగాక పీటర్సు గార్డెన్సు, డెంట్సు గార్డెన్సు, మాకేసు గార్డెన్సు మొదలగు విశాలమైన తోటలును, బంగాళాలును బ్లాకర్సు గార్డెన్సువరకు "లాంగ్ టాంకు"అను చెఱువు వరకు నిర్మింపబడెను. నదికుత్తరమున హాలిబర్టన్సు తోట, పాంతియను, కౌన్సా మేజరు తోటయు నుండెను. పూనమల్లి రోడ్డు వెంబడి నిలాండన్సు గార్డెన్సు వరకును, అటార్నీ డెసీన్ దొర యింటివరకును, ఇంకొక వరుస దక్షిణమున నల్లివన్సు గార్డెన్స మొదలు మాబ్రేసు గార్డెన్సు వరకును అడయారు నదీతీరమున సుందరమైన బంగళాలు బయలుదేరెను. ఇట్లు నాలుగుమైళ్లు పొడవు, రెండుమైళ్లు వెడల్పుగల ఈవిశాలమైన మైదానములో పెద్ద పెద్ద తోటలతో నొక వంద బంగాళాలు వెలసినవి (**The Nabobs of Madras, Henry Dodwell, pp. 235-239**).

వాల్టర్ హామిల్టన్ గారు 1820 లో ప్రకటించిన 'హిందూస్థానము-దానిదగ్గర దేశముల భూగోళము, చరిత్రస్థితిగతులు'(A Geographical, Statistical and Historical description of Hindustan and Adjacent Countries) అను గ్రంథమున చెన్నపట్నములోని ఆంగ్లేయుల జీవితవిధానము నిట్లు వర్ణించిరి (చూడు: రెండవసంపుటము, పుట 410).

"కలకత్తాకన్న చెన్నపట్టణమున ఐరోపావారి జనసంఖ్య తక్కువగనున్నది కావలసిన పదార్థము లిక్కడ కొంచెము హెచ్చు ఖరీదుకు సకృత్తుగా దొరుకునన్న మాటతప్ప జీవితవిధాన మొకరీతిగనే యుండును. శీతకాలములో ప్రతినెలలోను ఐరోపావారి సమావేశములు జరుగుచుండును. చెన్నపట్టణమున దొరలు దొరసానులు విహరింపబోవు ప్రదేశములలో మౌంటురోడ్డు ఒకటి. ఫోర్టుసెంటుజార్జికోట దగ్గరనుండి సెంటుథామసు మౌంటు(ఫరంగికొండ)వరకు పోవు మౌంటురోడ్డు అను బాట చాలా విశాలముగాను, నునుపుగాను ఉండును. దీనికి రెండుప్రక్కలను మర్రిచెట్లును (White Tulip), గంగరావిచెట్లును నీడకొరకు వరుసగా వేయబడి చాల మనోహరముగా నున్నది. కోటనుండి ఐదుమైళ్లదూరములో

కారన్‌వాలీసుప్రభువు స్మారకచిహ్నమొకటి చాల సొమ్ము వ్యయముచేసి కట్టియున్నారు. సాయంకాలము చల్లబాటువేళ దొరలు, దొరసానులు ముస్తాబుచేసికొని అందమైన వాహనములలో నీ మౌంటురోడ్డులో షికారుపోవుచు, పైన చెప్పిన స్మారకచిహ్నముచుట్టు మెల్లగా తిరుగుచు, సరససల్లాపము లాడుకొనుచు సంభాషించుకొనుచుందురు.

### ఆంగ్లేయుల అలవాట్లు

ఈ రాజధానిలో సాధారణముగా ఉదయము తొమ్మిది గంటలు మొదలు పదకొండు గంటలవరకును యువకులు ఇరుగు పొరుగిండ్లకు పెత్తనములకు బోవుచు, కబురులు సమాచారములు జేరవేయుచు కాలక్షేపము చేయుదురు. తాము మధ్యాహ్నము పనిమీద బస్తీలోనికి పోయి వచ్చునప్పు డేమైనను తెచ్చిపెట్టుటకును, పను లేమైన నున్నచో చేసిపెట్టుటకును పురమాయింపులు చేయుంచుకొందురు.

ఈ యువకులు సెలవు పుచ్చుకొనునప్పటికి సోమరులగు మరికొందరు పనిలేనివారు సిద్ధమగుదురు. వీరు మధ్యాహ్నము ఫలహారములవేళయగు రెండుగంటలవరకును కాలక్షేపము చేయుదురు. ఇప్పుడే తెల్లవారు నిజముగా విందారగించు సమయము. తరువాత ఎవరియిండ్లకు వారు పోవుదురు. అంతట మధ్యాహ్నము ఎండవేళ నందరును విశ్రమింతురు. కొందరేదైన గ్రంథకాలక్షేపము చేయుదురు. సాయంత్రము ఐదుగంటలకు గృహయజమాను డింటికి వచ్చును. అప్పుడు కుటుంబమువారు మౌంటురోడ్డుకు షికారుకు పోవుదురు. ఇంటికి వచ్చినతరువాత సాయంకాలపు భోజనము చేయుదురు. ఒక్కొక్కప్పుడు విందులుగాని, బాల్సుగాని జరుగుచుండును. ఇదియే వారి జీవితవిధానము.”

## అవధానం పాపయ్యగారి అధికార ధోరణి

18-వ శతాబ్దములో నాంగ్లేయులందరును హుక్కాలను పీల్చుచుండిరి. క్రమక్రమముగా ఈ పోకు తగ్గిపోయెను. 1820 మొదలు 1830 వరకు నింగ్లాండులో పోవు పెద్దయుద్యోగులు హుక్కాలను గూడ తీసికొని పోవుచుండిరి. 1840 వరకు నీ హుక్కాలు మంచివాడుకలో నుండెను గాని తరువాత నిరువదేండ్లలో నీయాచారము పోయినది. హుక్కాలను భోజనము మేజాల దగ్గరను, చీట్లాట మేజాలదగ్గరను, నాటకశాలలోని ప్రత్యేక బాక్సులలోనుకూడ ఉపయోగించుచుండిరి. తరువాత పెద్ద చుట్ట వాడుకలోనికి వచ్చినది. మొదట దీనిని క్రింది తరగతులవారే కాల్చుచుండిరి. దీనికంపును కొందరు సహింపరైరి. కాని తరువాత నిదే అలవాటైనది.



మౌంటురోడ్డులో నొకభాగము

చెన్నపట్టణమున చాలకాలమువరకును దొరలు పల్లకీలలోనే పోవుచుండిరి. మంచి రకము పల్లకీలు అలంకారముచేయబడి అందులో మెత్తనిదిండ్లు వేసియుండెడివి. ఆపల్లకీలో కాళ్లుచాచుకొని పరుండవచ్చును. దానిలో కచ్చేరీకి పోవుచు హుక్కాలు పీల్చుచుందురు. నాల్‌కీన్, లేక నాలకీయనబడు నింకొకరకపు వారి వాడుకలోనుండెను ఈవాహనము 5 అడుగుల పొడుగును, 4 అడుగుల వెడల్పును గలిగి వీని ప్రక్కలు మంచికర్రపైన నగిషీలు చెక్కియుండెను. లోపల దిండ్లువేసిన కుర్చీ యమర్పబడియుండెను. దీని కెనిమిది మంది బోయీలు మోయుచుండిరి. హుక్కాలతో పాటుగానే ఈపల్లకీలు కూడ క్రమక్రమముగా వాడుకలోనుండి పోయి వానికి బదులు గుర్రపుబండ్లు వచ్చెను (History of Madras, pp 253-25.).

1842-వ సంవత్సరము మొదలు 1871 వరకును చెన్నపట్టణమున బారిష్టరుగ నుండి అడ్వకేటు జనరలుగా పనిచేసిన జాన్ బ్రూస్ నార్టనుగారు 1854 లో పార్లమెంటువారిబోర్డు ఆఫ్ కంట్రోలు జాయింటు కార్యదర్శి రాబర్టు లోవ్ గారికి చెన్నపట్టణముయొక్క స్థితిగతులను, ప్రజల యావశ్యకతలను గూర్చి డిమ్మిసైజున అచ్చులో 325 పుటలుగల దీర్ఘమైన లేఖ వ్రాయుచు ఆనాడీదేశమున జీవించు ఆంగ్లేయుల జీవిత విధానమును చక్కగా వర్ణించియున్నారు. ఆ కాలమున ఆంగ్లేయు లెల్లరును తమతమ పనులలో నిమగ్నులై యుండి సాయంకాల మింటికి వచ్చునప్పటికి అలసిపోయి యుందురనియు, ఎట్టి మానసికమైన పరిశ్రమనుగాని, శరీర వ్యాయామమునుగాని చేయుటకుఓపిక లేక ఏదో లోకాభిరామాయణమున వినోదముగా కాలము వెళ్లబుచ్చుచుండిరనియు, ఇరుగు పొరుగువారిని గూర్చిన గుసగుసలు, ఊరిలోని వేడిమి, మోసములకును, బట్టలకును అంటుకొని ఎరుపు రంగును వేయు మౌంటు రోడ్డుదుమ్మును, దోమలబాధయు వీరి సంభాషణలోని సామాన్య విషయములుగా నుండెననియు, రాకపోకలు కష్టమై రోడ్లు పనికి

మాలినవై దేశము ఉష్ణముగా నున్నందున అత్యవసరమైన తప్ప ఆంగ్లేయులలో నెవ్వరును, తుదకు రివిన్యూ సివిలు ఉద్యోగులైనను ప్రయాణము చేయకుండిరనియు, జబ్బుచేసినప్పుడు మాత్రము నీలగిరికి వెళ్లుచుండిరనియు వ్రాసినారు. ఆ కాలమున నెంత దూరమైనను నాలుగు ప్రక్కలను మూసిన పల్లకీలలో రాత్రిపూటలనే ప్రయాణము చేయుచుండిరని వ్రాసి, సార్థకముగా రీ పల్లకీలు దొరలనుంచు ప్రేతపు పెట్టెలవలె నుండెనని హాస్యముచేసిరి. మరియు ఈదొరలు ప్రయాణములో పగటిపూట రహదారీ బంగళాలలో మజిలీ చేయుచుండిరనియు, ప్రజల స్థితిగతులను చూచుటకు వీరి కవకాశము లేకుండె ననియు, వీరు ప్రజల కష్టసుఖములను, సమస్యలను గమనించుటకుగాని, వారి కష్టములు తీర్చుటకుగాని, అభివృద్ధి చేయుటకుగాని పాటుపడుట లేదనియు వ్రాసిరి. ప్రజల కుపయోగకరమైన ఆనకట్టలు మొదలగునవి నిర్మించు ఇంజనీర్లు తప్ప తక్కిన వారు ప్రజలతో కలిసి మెలసి యుండరనియు, రివిన్యూ వసూలుచేయు కలెక్టరులను జూచినచో ప్రజలు దూరముగ తొలగుదురనియు వ్రాసినారు (**Condition and requirements of Madras, John Bruce Norton** (1854) **pp.** 8-10).

## 4

క్రీ. శ. 1788 మొదలు 1809 వరకు చెన్నపట్టణమున నెక్కడ చూచినను అవధానం పాపయ్యగారిపేరు మారు మ్రోగుచుండెను. చెన్నపట్టణమున జాన్ హాలండు అనునతడు 1789లో కౌన్సిల్లు గవర్నరుగా పనిచేసెను. తరువాత మెయిలరు గవర్నరయ్యెను. అతని తరువాత 1790 లో జాన్ హాలండు సోదరుడైన ఈ. జే. హాలండు గవర్నరయ్యెను. వీరితరువాత 1790 మొదలు 1792 వరకు సర్ విలియం మెడోస్ సర్వసేనానిగా నియమింపబడెను. ఈ మెడోసుగారు అధికారము స్వీకరించిన వెంటనే హాలండు సోదరులను పదభ్రష్టులుగా చేసి ఉద్యోగమునుండి తగ్గించవలసినదని కలకత్తా ప్రభుత్వమువా రాజ్ఞాపించగా నిత డట్లు చేసెను.

## అవధానం పాపయ్యగారి అధికారధోరణి

హాలండు సోదరులు లంచగొండు లయినందున వీరి పరిపాలనను అన్యాయముగను, అవినీతికరముగను నుండెను. ఇంతేకాదు. వీరు అసమర్థు లయినందున క్రింది అధికారులందరును యథేచ్ఛముగా దుర్మార్గములు చేయుచుండినందున దుష్టపరిపాలనము మితిమీరెను. వీరికాలముననే టిప్పుసుల్తాన్ కుంఫిణీవారి యాశ్రితుడగు తిరువాంకూరురాజు దేశములోనికి దాడివెడలి వచ్చెను. ఈ సోదరులు దుబాషియైన అవధానం పాపయ్యగారి చేతులలో కీలుబొమ్మలై యుండిరి. ఈ పాపయ్యగారు చాలా తెలివిగలవాడు. రాజకీయ వ్యవహారములందు చతురుడు. కార్యసాధనకొరకెట్టి కార్యమునైనను చేయుటకు వెనుదీయడు. ఆకాలమున నీతడు దొరలకందరికిని గుండెకాయగ నుండి లంచములతో వారిని వశపరచుకొని తన ఇష్టమువచ్చినట్లు ఆడించుచుండెను. ఈతడు చాల బలవంతుడై, భయంకరుడై యుండెను. దొరలుకూడ ఈతనిని జూచి భయపడుచుండిరి.

పాపయ్యగారు మొదట కుంఫిణీవారి కొలువులో నొక చిన్న గుమాస్తాగా కుదిరి తన తెలివితేటలవలన పైకివచ్చి సీకస్టమ్సు ఆఫీసరు (సముద్రసుంకముల అధికారి) క్రింద రేవులోనికి వచ్చు నోడల లెక్క వ్రాయు ఆంకరేజి అక్కౌంటెంటు అను నుద్యోగమును సంపాదించెను. తరువాత గవర్నరు కౌన్సిలు ప్రెసిడెంటుపని చేసిన హాలండు సోదరులకు దుబాషియై గొప్పపలుకుబడిని, అధికారమును వహించి కౌన్సిల్లు చెన్న రాజధాని పరిపాలనమును గిరగిర త్రిప్పెను.

హాలండు సోదరులు లంచగొండులై చేయుచున్న దుర్మార్గములను జూచి రివిన్యూ బోర్డు మెంబరుగ నుండిన హాలిబర్టను దొరగారు సహింపలేక వీరి యక్రమములను విమర్శించి ప్రతిఘటింపసాగెను. అంతట వారతనిపైన కక్షవహించి పాపయ్యగారి సహాయముతో పగసాధింప సమకట్టిరి. వీరు హాలిబర్టనుగారిపైన అనేక అపనిందలు మోపి అందు కనుగుణముగ అబద్ధపు సాక్ష్యములు గల్పించిరి. ఈ హాలండు సోదరు లీతని నొక అనారోగ్యకరమైన మన్యపు ప్రదేశమునకు బదలాయింపుచేసిరి.

హాలండుసోదరులు పదచ్యుతు లైన పిమ్మట వీరి యక్రమములనుగూర్చి విచారణ జరిగెను. అంతట అవధానం పాపయ్యగారును, ఈతని సోదరుడైన అవధానం రామస్వామియు, శంకరపురము వెంకటాచలముసెట్టియు, వొప్పెయ్యంగారును కలిసి కుంఫిణీవారి కొలువులో సీనియరు మర్చంటుగా నుండిన జేనిజ్ హాలిబర్టను దొరగారికి వ్యతిరేకముగా కుట్రచేసినట్లు బయలుపడెను. అంతట గవర్నరైన మెడోసుగారి అధ్యక్షతక్రింద 1792లో 'క్వార్టరు సెషన్సు' అనబడు న్యాయవిచారణసభ జరుపబడి వీరి నేరములు విచారణచేయబడెను. అవధానం పాపయ్యగారు దోషియని నిర్ణయింపబడి ఆయనకు 3 సంవత్సరముల ఖయిదును, పెద్దమొత్తము జుల్మానాయు విధింపబడెను. ఆకాలమున నిట్టి శిక్షితులు ప్రజలు వచ్చిపోవు బహిరంగ ప్రదేశములో 'పిల్లోరి' అనబడు బోనులో ఒకగంట నిలిచి యవమానమును భరింపవలసి యుండెను. ఈ యవమానము మాత్రము పొందకుండ న్యాయస్థానములోని జ్యూరీ సభవా రీతనిని దయదలచి మన్నించిరి.

పాపయ్యగారు చెరసాలనుండి విడుదలయైవచ్చినతరువాతకూడ ఆయన రోజులు బాగులేకుండెను. ఆర్కాటునవాబు బాకీలనుగూర్చి జరిగిన విచారణవలన చెన్నపట్టణములో ఉద్యోగములు చేయు దొరలును, వర్తకముచేయు దొరలునుకలిసిచేయుచుండిన

## పాపయ్యగారిపై ఫోర్జరీ కేసు

అన్యాయము లనేకములు బయలుపడెను. ఈ యాంగ్లేయులు తమ దుర్మార్గములం దీ పాపయ్యగారివంటి దేశీయుల నుపయోగించుకొనుచుండిరి. ఈ సందర్భమున నిదియెల్ల బయల్పడెను.

### ఆర్కాటునవాబుగారి అప్పులు

పూర్వము 1752-1795 మధ్య ఆర్కాటు నవాబుగా నుండిన మహమ్మదాలీ కుంఫిణీవారి స్నేహముచేసి చెడినవారిలో నొకడు. అతడు రాజ్యకాంక్షచేత నాంగ్లేయుల యండ జేరి వారిని మెప్పించుటకును, లంచము లిచ్చుటకును, భోగవిలాసములకొరకును అమితధనవ్యయము చేయవలసివచ్చి ఋణములలో మునిగెను. అతడు సైన్యములకొరకును, ఇతర ఖర్చులకొరకును కుంఫిణీవారికిని, ప్రయివేటు వ్యక్తులగు ఆంగ్లేయులకును ఋణపడెను. అధికారములో నున్న దొరలు అతని కాసలు గల్పించియు, బెదిరించియు సాలుకు 40,50 వంతున వడ్డీలతో ప్రతిఫలశూన్యములైన ఋణపత్రములు వ్రాయించుకొనియు, అందుక్రింద నతని రాజ్యములోని కొన్ని భాగములను తాకట్టు వ్రాయించుకొని తామే యిజారాలు పాడి హెచ్చుశిస్తులు వసూలుచేయుచు ప్రజలను పీడించుటయు మొదలిడిరి. ఇట్టివారిలో చెన్నపట్టణమునకు 1763 లో ఇంజనీరుగా వచ్చి లక్షాధికారియైన బెన్‌ఫీల్డు ఒకడు. ఇతడు నవాబు తనకు 16 లక్షల 20 వేలు బాకీయున్నాడనియు, అందుకింద తంజావూరు తాకట్టుపెట్టినాడనియు చెప్పుచు చెన్నపట్టణ గవర్నరు కవున్సిలువారితో కలిసి కొన్ని అన్యాయములు చేయసాగెను. దీని కిష్టపడక అడ్డుతగిలిన గవర్నరు పిగట్టు నీ దుర్మార్గు లందరును కలిసి 1776 లో చెరబెట్టిరి. కుంఫిణీవారి యుత్తరువులు వచ్చునప్పటి కతడు చెరలోనే మరణించెను! పిగట్టు తరవాతగవర్నరైనరంబోల్డుదుర్మార్గుడు. ఇతని వలెనే గవర్నరు పనిచేసిన వైటుహిల్లును, మరికొందరును కలిసి నూజివీడు జమీందారుల నన్యాయముచేసి దొంగపత్రము వ్రాయించుకొనిరనియు, లంచములు పుచ్చుకొనిరనియు బయల్పడెను. అంతట వీరిని 1781 లో పనిలోనుండి తొలగించిరి. ఆకాలమున చెన్నపట్టణ ప్రభుత్వ మిట్టి యన్యాయములతో పుచ్చిపోయియుండెను. 1788 లో బెన్‌ఫీల్డును గవర్నరు జనరలగు కారన్‌వాలీసు ప్రభువు బలవంతముగా నింగ్లాండు కంపగా నతడు పార్లమెంటులోనే తన పలుకుబడిని చలాయింపసాగెను. ఇట్టి దుర్మార్గుల ప్రభావమువలన భారతదేశములో జరుగుచుండిన అన్యాయములను గూర్చి విచారించుటకు బర్కుగారు పార్లమెంటులో పెట్టిన తీర్మానములుగూడ విఫలమై పోయెను. ఈనవాబు బాకీలు నానాటికిని వృద్ధియై తుదకు దీనివడ్డీలు సాలుకు 6 లక్షల పౌనులకు పైగా నుండి కంపెనీవారి లాభమునకు రెట్టింపుగా నుండెను. ఉద్యోగుల ఒత్తిడివలనను, ఒకరిఋణమున బడి చనిపోయె నను అపవాదు లేకుండుటకును ఈమహమ్మదాలీ వంశీకు లతని ఋణపత్రములను తిరుగ వ్రాయుచుండిరి. ఈయన్యాయము మితిమీరి పోగా ఓమదత్ ఉద్దౌలానవాబు చనిపోయిన తరువాత 1801 లో నితని రాజ్యమును కుంఫిణీవారు వశపరచుకొని ఈబాకీలను సాలుకు 12 లక్షల రూపాయల చొప్పున వాయిదాలపైని తీర్చదలచిరి. బాకీలు తీర్చబడునని తెలియగానే దొంగపత్రములు బయలుదేరెను. బజారులో నిట్టి పత్రముల వ్యాపారము సాగెను. అనేకులు ఆంగ్లేయులీ వ్యవహారమున సంబంధము కలిగియుండిరి. అంతట నీబాకీల నిజానిజములను పరిశీలించుటకు కుంఫిణీవారు 1807 లో కమీషనర్లను నియమించి యొక విచారణ సంఘము నేర్పరచిరి. నవాబువలన తమకు సొమ్ము రావలసియున్నదని చెప్పు బాకీదారు లందరును నీ కమీషనరులయెదుట తమ ఋణపత్రములను దాఖలుచేసి బాకీలు ఋజువుచేసికొనవలెనని నిర్ణయించిరి. ఈ కమీషనులో లండనులో ముగ్గురు విచారణకర్తలను, వంగరాష్ట్రమునుండి ఇంకొక ముగ్గురు కమీషనరులను నియమించి ఇక్కడి వారిని సాక్ష్యసాధనములనువిచారించి లండను కమీషనరులకు రిపోర్టు చేయవలసిన దని యుత్తరువుచేసిరి. అంతట అడ్వకేటు జనరలు అధ్యక్షత క్రింద నొక విచారణసంఘ మేర్పడి యీ విచారణ చేయసాగెను. అనేక పత్రములను, సాక్షులను వీరు విచారించిరి. లేని బాకీలను ఉన్నట్లుగా చూపుటకు దొంగపత్రములు సృష్టింపబడుటయే కాక వానిని ధ్రువపరచుటకు కర్ణాటక నవాబు లెక్కపుస్తకములలో దొంగపద్దులు కూడ వ్రాయబడినట్లు బయలుపడెను.



సుప్రసిద్ధమైన ఒక క్రైస్తవాలయము

రాయ రెడ్డిరావు అనునతడు కర్ణాటక నవాబుక్రింద శిరస్తాదారుడుగా నుండెను. ఈతడు చాల పలుకుబడి కలిగి యుండెను. చాల కాలము నవాబు ఈతని చేతులలో కీలుబొమ్మగ నుండెను. పెక్కుమంది ఆంగ్లేయోద్యోగు లీతని నాశ్రయించుచుండిరి. ఈ రాయరెడ్డి రావు బుద్ధిపూర్వకముగా దొంగలెక్కలను తయారు చేయించె నని కొంద రీతనిపైన ఫిర్యాదుచేసిరి. తానేపాప మెరుగ ననియు, తా నుండిన చో దొంగపత్రములు చలామణి చేయుచున్న వారి దుర్మార్గము బయటపడునని తన నీపనిలో నుండి తీసివేయుట కిట్లు కల్పింపబడిన దనియు ఆతని పక్షమున వాదింపబడెను.

### ఫోర్జరీ కేసులో పాపయ్యగారు

రాయ రెడ్డిరావుగారిపైన నిందమోపిన వారిలో నీబాకీల వ్యవహారమునందు సంబంధముగల దొరలకు స్నేహితుడును, సలహాకారియు నగు అవధానం పాపయ్యగారొకరు. ఈయన నవాబువలన తనకుగూడ నొక బాకీ రావలెననిరి. ఆ బాకీకి దాఖలాగా 46 వేల వరహాలఋణపత్రమును సృష్టించుటలో పాపయ్యగారికి సంబంధ మున్నట్లు కమీషనర్ల దగ్గర జరిగిన విచారణలో బయటపడెను. అంతట నీ పాపయ్యగారిని కూటసృష్టి ఫోర్జరీ నేరములకు ప్రాసిక్యూషను చేయుటకు మదరాసు ప్రభుత్వము వారు అనుజ్ఞ నిచ్చిరి. కమీషనర్ల దగ్గర రాయరెడ్డిరావుగారు దాఖలు చేసిన పత్రమునుగూర్చి కమీషనరులు విచారించుచుండగా నది కూటసృష్టియని పాపయ్యగారు వాదించిరిగాని రుజువు చేయలేక పోయిరి. అంతట కమీషనరులు పాపయ్యగారిని కుట్రనేరమునకును, ఆయన సాక్షులను అబద్ధపు సాక్ష్య మిచ్చిన నేరమునకును విచారింపు డని 1808 లో శిఫారసు చేసిరి.

పాపయ్యగారు పెద్దపెద్ద యింగ్లీషు దొరల స్నేహమునకును, అనుగ్రహమునకును పాత్రుడుగ నుండినందున వారందరు నితని కీవిషయమున సహాయము చేయసాగిరి. అట్టి వారిలో ఆబట్టు (Abbot) దొర యొకడు. చెన్నపట్టణమున స్వతంత్ర ఆంగ్లేయ వర్తకుడగు ప్యారీ (Parry) దొర యింకొకడు. ఈ ప్యారీదొర కర్ణాటక నవాబు క్రింద కొన్నాళ్లు సైనికాధికారి యనుపేరున నొక కందారాయడుగ నుండెను. ఈతని దుష్ట చర్యలను చూచి కుంఫిణీ డైరెక్టర్లితని నింగ్లండుకు పంపివేయు డని చెన్నపట్టణములోని యధికారులకు ఉత్తర్వు చేసియుండిరి గాని ఇతడు బలవంతుడైనందున తప్పించుకొని తిరిగెను. ఇట్టి స్థితిలో కర్నాటక నవాబు బాకీల విచారణ చేయుటకు నియమింపబడిన కమీషనర్ల యెదుట రాయ రెడ్డిరావుగారు తనకు నవాబువలన రావలసిన బాకీనిగూర్చి రుజువు చేయుటకొరకు దాఖలుచేసిన ఋణపత్రము నిజమైనది కాదనియు, అది యతడు కూటసృష్టిచేసిన దొంగపత్రమనియు అవధానం పాపయ్యగారును, నతని మిత్రులును కమీషనర్ల దగ్గర వాదించి విఫలులై తమపలుకుబడిని వినియోగించి అతనినిసాధింపదలచి ఆవిధముగా నతడు ఫోర్జరీ చేసెనను నేరము నతనిపైన మోపుచు నొక ఫిర్యాదు దాఖలు చేసిరి. ఆ కాలమున చెన్నపట్టణమున 'జస్టిస్ ఆఫ్ ది పీస్' అను హోదాగల మేజస్ట్రేటుగా నుండిన మెయిట్లాండు అను నొక దొర పాపయ్యగారి పార్టీవారికి స్నేహితుడు. ఆయన తన యధికారమును పురస్కరించుకొని పాపయ్యగారిపైనను, అతని సోదరుని పైనను ఆ నేరమును మోపి వారిని మద్రాసు సుప్రీముకోర్టు సెషన్సులో విచారించునట్లు ఉత్తర్వుచేసెను. నేటి హైకోర్టు సెషన్సునందువలెనే ఆ కాలమున సుప్రీముకోర్టు సెషన్సులోకూడా నేరములు విచారించు న్యాయమూర్తికి విచారణలో తోడ్పడి దోషనిర్ణయముచేయుటకు జూరీసభ్యులు నియమింపబడుచుండిరి. రాయ రెడ్డిరావుగారి దురదృష్టవశమున నాయనకేసులో నియమింపబడిన జూరీ సభ్యులు పాపయ్యగారికిని,ఆయన యాంగ్లేయ మిత్రులకును వశవర్తులైనవారైరి. ఇక రాయరెడ్డిరావుగారి తరఫున నా కాలమున సమర్థులైన ప్రభుత్వ న్యాయవాదులుగాని, న్యాయాధికారులుగాని పనిచేసి పోవుదురేమో యని ముందుగానే పాపయ్యగారును, ఆయనపక్షీయులగు ఆబట్టు, రోబక్కు (Roebuck), ప్యారీదొరలును అట్లు పని చేయ రాదని ప్రభుత్వమువారికి స్పష్టముగా తెలియపరచిరి. అంతట సుప్రీము కోర్టులో ప్రధానన్యాయమూర్తి సమక్షమున నీకేసు విచారణ జరిగెను. మొదటినుండియు పక్షపాతబుద్ధితో నున్న జూరీసభ్యులు రెడ్డిరావును దోషియని తీర్మానించిరిగాని ప్రధాన న్యాయమూర్తి అతడు నిర్దోషియని నమ్మి అతనిని శిక్షింప నిరాకరించెను. ఈ సుప్రీము కోర్టులోనే విచారణజరిగిన రెండవకేసులో అబద్ధపు సాక్ష్యము చెప్పినందులకు విచారింప మని కమీషనర్లు శిఫారసు చేసిన పాపయ్యగారి సాక్షులను నిర్దోషులని వదిలివేసి పాపయ్యగారు రెడ్డిరావుగారిపైనను, నవాబు కార్యదర్శిగా నుండిన బాట్లీ (Battley) గారిపైనను దాఖలుచేసిన కేసులో ఈ జూరీసభ్యులే వారిని దోషులని నిర్ణయించిరి! ఇట్లు పాపయ్యగారును, అతని పక్షీయులును నీవ్యవహారములో జయించిరి. అంతట వీరు విజృంభించి తమచర్యలను సమర్థించుకొనుచు నవాబు బాకీల నిజానిజములను విమర్శించుచున్న కమీషనర్లు పక్షపాతబుద్ధితో నున్నారనియు, ఆ విచారణ చేయగూడదనియు గవర్నరు జనరలుకు ఒక అసమ్మతి అర్జీని పంపిరి. అయితే ఇంతలో క్రొత్త చిక్కులు వచ్చెను. పాపయ్యగారికి కొందరాంగ్లేయులు సాయము చేసినట్లే ఇంకొక తెగవారు దొంగదస్తావేజులను తీసివేయవలెనని పాటుపడిరి. ఈ పక్షీయులలో తరువాత ఆర్బత్‌నాటుకంపెనీ అని ప్రసిద్ధిజెందిన లాటర్ అండు కో (Latour & Co) వారును, బిన్నీ అండు డెన్నిసన్ కంపెనీ (Binny & Dennison & Co) వారును, కోట్సు హోర్టు వెస్టను కంపెనీ

## రెడ్డి అండ్ కో (రిజిస్టర్డు). స్థాపితము 1920

హెడ్డాఫీసు : గోపాలపురము, తూర్పుగోదావరిజిల్లా.

ప్రపంచములోని అన్ని భాగములకు ఔషధములు సప్లై చేయుచు అంతర్జాతీయ ప్రఖ్యాతిగల్గిన హిందూదేశపు గొప్ప ఆయుర్వేదసంస్థ.

## చికిత్స చేయబడు వ్యాధులు

మేహ, కుష్ఠు, చర్మ, సుఖరోగములకు - సాధారణముగా స్త్రీలకు కలుగు ఎఱుపు, పసుపు, తెలుపు మొదలగు కుసుమవ్యాధులకు—బహిష్టగుటకుముందుకలుగు శూలపోటులకు—వాత, పిత్త. శ్లేష్మ, కఫ, ఉబ్బస, క్షయ, శ్వాసకాసదగ్గులకు—రక్తమూలము, మలములో నెత్తురుపడుట, ఆసనము బిగువుగానుండుట మొదలగు మూలశంఖలకు—శుక్లనష్టము, వీర్యము పలచనబడుట, రతియందు కాళ్లు, నడుము లాగుట, ధాతువునందు పటుత్వము లేకుండుట, మొదలగు రుగ్మతలకు —

స్వల్ప వ్యయముతో గ్యారంటీగా కుదర్చబడును.

రెడ్డి అండ్ కో లో చికిత్సబడయుటకు ముఖ్య కారణాలు:-

(1) అష్టాదశకుష్ఠు - మేహ - చర్మవ్యాధులకు, బసలను, తగు వసతులను యిచ్చు పెద్దకంపెనీ ఇండియాలోకెల్ల నిది యొక్కటియే.

(2) సదరు కంపెనీవారిచే ప్రతిసంవత్సరము వేలకుపైగా రోగులు రోగవిముక్తులయి సౌఖ్యముగా నుండుట.

(3) ఆశ్రమములోనుండి చికిత్సబడయుటకు అద్దె వగయిరా నీయనక్కర లేకపోవుట.

(4) ఆశ్రమము వసిష్టగోదావరి నదీతీరంబుననుండుటచే ఆరోగ్యము - ఆనందము - హాయిని కలిగించుట.

(5) బీదసాదలు ఉచితవైద్యము బడయగల్గుట.

(6) మా సంస్థ బొంబాయి, పోర్చుగీసు, మద్రాసు గవర్నమెంటు డాక్టర్లచే నామోదింపబడియుండుట.

ముఖ్యగమనింపు:—ఇమిటేషను (నకలు) పేర్లను నయూనా కంపెనీలను, కృత్రిమ ప్రకటనలను చూచి మోసపోకుడు.

బ్రాంచి ఆఫీసులు:—

వాల్తేరు, ఆర్. ఎస్. పోస్టు,

గాంధీనగరం, బెజవాడ.

233 గోవిందప్పనాయకన్ వీధి, మద్రాసు.

ది మైసూరు పేపర్‌మిల్సు లిమిటెడ్,

బెంగుళూరు.

బిసన్ బ్రాండు పేపరులు




పైన ఉదహరించిన బ్రాండు భారత మూలధనము, కార్మికులు, మేనేజిమెంటువల్ల మైసూరు వెదురుతో మైసూరులో తయారగుచున్న భారతదేశకాగితమును సూచించు చున్నది.

దక్షిణ ఇండియాలోని ముఖ్యపట్టణము లన్నిటిలోను మా కాగితములు దొరకును.

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:—

జాన్ డికిన్సన్ అండ్ కంపెనీ, లిమిటెడ్

మదరాసు, బొంబాయి, కలకత్తా, మరియు రంగూన్.



వారును (Colt,Hart and Weston & Co), హారింగ్టన్ టల్లాకు కంపెనీ వారును (Harrington Tulloch & Co), ఎస్. హెచ్. గ్రిగ్గు డి ఫ్రైసు కంపెనీ (S. H. Grig De Fries & Co), డి మాంటి కంపెనీ (De Monte & Co) వార్లును నుండిరి.

అబట్టుగారును, పారీగారును కొంత తొందరపడి కమీషనర్లను భయపెట్ట దలచి వారిపైన సుప్రీము కోర్టులో క్రిమినలు కేసులు పెట్టుదుమని కమీషనర్లను బెదిరింప సాహసించిరి. అంతట గవర్నరైన బార్లోగారు వీరి యక్రమకృత్యములను జూచి కొంత చర్య గైకొనవలసివచ్చెను.

రోబక్కుగారికి చెన్నపట్టణమున గల ఉద్యోగము తీసివేసి విశాఖపట్టణమునకు బదలాయించిరి. పెయిట్లాండును 'జస్టిస్ ఆఫ్ ది పీస్' ఉద్యోగమునుండి తొలగించిరి. తామస్ పారీదొర నింగ్లాండుకు బోవ సిద్ధముగా నుండుమని ఉత్తర్వు చేసిరి. కాని ఇతడు చాలా పలుకుబడి కలవాడగుటవలన మరల తప్పించుకొని తిరిగెను. పాపయ్యద్వారా తనకు సంక్రమించిన దని ఇతడు వాదించిన ఋణపత్రము బాకీమాత్రము త్రోసివేయబడెను. పాపయ్యగారిపైన కేసు మరల విచారణ జరుగుటకు సిద్ధముగానుండగా ఇంతలో 1809-వ సంవత్సరారంభమున పాపయ్యగారు చనిపోయిరి. కమీషనర్లు తమ విచారణను పూర్తి చేయ ప్రయత్నించిరి. ఇంతలో రెడ్డిరావుగారు కూడ కొంత ద్రోహముచేసెనని బయల్పడెను. అంతట నతడు ఆత్మహత్య చేసికొనెను. ఈరెడ్డిరావుగారును, పాపయ్యగారును కొన్ని దొంగపత్రములు చలామణిలో పెట్టినందులకు సందేహము లేదుగాని నిజముగా నానాడు పేరుపొందిన ఆంగ్లేయ కంపెనీలలో చాలమంది కిందులో భాగముండెను. ఈకమీషనర్లు తమ విచారణ పూర్తి చేయగా 3 కోట్ల నవరసుల బాకీలలో 25 లక్షల నవరసుల బాకీలు మాత్రమే నిజమైనవనియు, తక్కినవి దొంగబాకీ లనియు తేలినది.

## అవధానం వారిచర్యలు, ఆంగ్లేయులపాలు

పాపయ్యగారి పే రిప్పటికిని చెన్నపట్టణమున వినబడుచుండును. చూళలో నింక నిప్పటికిని అవధానం పాపయ్య వీధియని పిలువబడుచున్న వీధియొకటి యున్నది. సర్ వాల్టరు స్కాటు తను రచియించిన 'సర్జెన్సు డాటర్' అనబడు నవలలో నీపాపయ్యగారి నొక పాత్రగా చిత్రించి యితని పేరు శాశ్వతము చేసినాడు. స్కాటు తండ్రి తల్లికి హాలిబర్టను బంధువు. ఈపాపయ్యగారి విచారణను గూర్చిన కరపత్రము 1790 లోనే ప్రకటింపబడినది. దానిని స్కాటు చదివియుండును. 1827 లో స్కాటు తన నవలను ప్రకటించినాడు. ఈపాపయ్య ఒక దుబాషియనియు, కవున్సిలు ప్రెసిడెంటు ఇతని ద్వారా దేశీయ రాజులతో రాయబారములు జరుపుచుండె ననియు, ఈపాపయ్య జిత్తులమారియగు హిందు వనియు (artful Hindoo), ఘోరమైన పాతకములను పన్నుటలో మొనగాడనియు, స్వలాభముకొరకో, రాజకార్యము కొరకో బీద లనేకుల జీవనములను, ధనికుల సౌకర్యములను, మనుష్యుల గౌరవమును, స్త్రీల మానమును బలిపెట్టుటకు వెనుదీయక ఈ పాతకములుచేయుటచే కలిగిన ముడతలు గల ఫాలముతోడి తూర్పుదేశపు మాకియలిక్, అనగా చాణక్యునివలె కుటిల రాజనీతి విశారదుడనియు, పగదీర్చుకొనుటలో మొనగాడనియు స్కాటు వర్ణించినాడు.

(Page 34. paper of Mr. A. V. Venkatarama Iyer entitled 'Avadhanam Papaiah and a famous Madras trial' in the Indian Historical records commission proceedings of meet ings Vol XII. Also refer to the article—'The two Hollands of Madras and their Dubashi' by Justice Fawcell in the J.I.H.Vol.V.)

(History of Madras, pp. 197-198; 210-212.)

ఈపాపయ్యగారింతటి దుర్మార్గుడుగా వర్ణింపబడినను నిజముగా నితడు చేసిన దుర్మార్గములం దితడొక్కడు మాత్రమే భాగస్వామికాడు; ఆకాలమున చెన్నపట్టణమున ఉద్యోగాధికారములును, పలుకుబడియు గల ఆంగ్లేయు లనేకులీ యన్యాయములలోను, దుర్మార్గములలోను భాగస్వాములై పంచమహాపాతకులుగ పరిగణింప దగినవారుగ నుండిరి. వారి యాదరణమువలననే యితడిన్ని సాహసములు చేయగలుగుచుండెను.

## 5

ఈ చెన్నపట్టణము మొదటినుండియు దక్షిణ హిందూస్థానమునకు వర్తక కేంద్రముగా నుండి ఎగుమతి దిగుమతి వ్యాపారములు విరివిగా జరుగుచుండెను. కుంఫిణీవారు నూలుబట్టలు, కాలికోలు, పరంగి పోషులు, కలంకారీబట్టలు, చింట్జులు, కిన్కాబులు ఎగుమతిచేయుచున్న కాలములో ఆబట్టల నూలు వడుకుట, నేత, అద్దకము, చలువచేయుట, రంగులువేయుట మొదలగు పరిశ్రమలను కుంఫిణీవారు ప్రోత్సహించుచుండిరి. అందువలన కలంకారి పరిశ్రమకు కేంద్రమగు మచిలీపట్టణమునుండియు, అద్దకములకు కేంద్రమగు ఆర్మగాను, లేక దుగరాజుపట్టణమునుండియు, చెన్నపట్టణమున కుత్తరమున అనేక ప్రదేశములనుండియు తెలుగు నూలు పారిశ్రామికులు, నేతగాండ్రు, అద్దకముచేయువారు, చిత్రకారులు (Designers of patterns for Chintz), మచ్చులు తయారుచేయువారు, చలువచేయువారును అసంఖ్యాకులుగావచ్చి ఇప్పుడు జార్జిటవునని వ్యవహరింపబడు ప్రదేశములోను, చాకలిపేటలోను, గవర్నరైన కాలెట్టుగారి పేరున నిర్మింపబడి విరూపము పొందిన కలాతిపేటలోను నివసింపసాగిరి.

## తెలుగువారి ప్రాబల్యము

ఆకాలమున స్థాపింపబడిన వర్తక కార్యాలయములందును, కచ్చేరీలయందును, కోర్టులలోను తెలుగువారే ఎక్కుడుగా ఉద్యోగులుగా నుండిరి.

విజయనగర రాజుల కాలమునుండియు దక్షిణమున కావేరినదివరకును తెలుగే రాజభాషగా నుండినందున చెన్నపట్టణమున నదియే ప్రధానభాషగా నుండెను. అయితే అరవము, కన్నడము వచ్చి కలిసిన చోటులలో కొంత కలగాపులగపు పదము లుండెను. పూర్వము తురకల ప్రాబల్యమునుబట్టి తురక పదములును, క్రొత్తప్రభువుల ఇంగ్లీషుభాషా పదములును క్రమక్రమముగా తెనుగున జేరుచుండెను.

చెన్నపట్టణమున మొదటినుండియు కంఫిణీవారి వ్యాపారమునందు ప్రాముఖ్యము వహించిన వర్తకులు గూడ చాలమంది తెలుగువారే. ముఖ్యముగా 'ఛీఫ్‌మర్చెంటు' అను పేరుతో కుంఫిణీవారు నియమించు ప్రధాన వర్తక ప్రతినిధు లందరును తెలుగువారుగ నుండిరి. ప్రారంభమున దేశములోని పారిశ్రామికులనుండియు, వర్తకులనుండియు సరుకులను కొనుగోలు చేయుటకు కంఫిణీవా రొక దేశీయునినే ముఖ్యవర్తకునిగా నియమించిఅన్నివ్యవహారములతనిద్వారానేజరుపుచుండిరి ఈ యుద్యోగమును జేసినవారు ధనవంతులై పలుకుబడి కలిగి చెన్నపట్టణమున దానధర్మము లనేకములు చేసిరి. వీరిలో శేషాద్రి నాయకుడు, బేరీ తిమ్మన్న, కాశీ వీరన్న మొదలగు తెలుగువారి పేరులు సుప్రసిద్ధమైనవి. వారన్ హేస్టింగ్సు చెన్నపట్టణమున గవర్నరుగా నుండిన కాలమున 1769-1772 మధ్య నీయుద్యోగము తీసివేసి కుంఫిణీవారే స్వయముగా ఏజెంట్లను, గుమాస్తాలను గ్రామముల కంపి కొనుగోళ్లు చేయసాగిరి. 1800 తరువాత నూలుబట్టలు తయారు వస్తువులు ఎగుమతి చేయుటయే తగ్గినది. ఈ ప్రధాన వర్తకులలో శేషాద్రిసెట్టియే మొదటివాడు.

శేషాద్రినాయకుని తరువాత బేరీ తిమ్మన్నగారును ముఖ్యవర్తకు డయ్యెను. ఇతడు నెల్లూరిజిల్లా ఆర్మగాను కాపురస్థుడు. చెన్నపట్టణమును కొలపొందుటలో నాంగ్లేయులకు సాయము చేసినవాడు. తరువాత నతని సోదరులు పెద వెంకటాద్రియు, చిన వెంకటాద్రియు, నతని కొమారుడు వెంకట నారాయణయు కంఫిణీవారి కొలువులో ప్రధాన వర్తకులై ఉద్యోగములు చేసిరి. కుంఫిణీ ముఖ్య దేశీయ వర్తకుడుగా నుండిన కాశీ వీరన్నగారే తిరువలిక్కేణిని సంపాదించుటకు తోడ్పడెను. గోల్కొండ జ్యాగుతో స్నేహము కలిగించెను. వీరన్న 1680 లో చనిపోగా పెదవెంకటాద్రి ముఖ్య వర్తకు డయ్యెను. మద్రాసు కార్పొరేషను 1686 లో స్థాపింపబడగా నం దితడు సభ్యుడుగ నుండెను. ముద్దా వీరన్న గారును నొక సభ్యుడుగ నుండిరి.

17-వ శతాబ్దిలో తెనుగువాడగు పొదిలి లింగప్ప పూనమల్లికి నవాబుయొక్క ప్రతినిధిగా పరిపాలకుడై కుంఫిణీవారిని గడగడలాడించెను. ఇతని పేరన స్థాపింపబడిన లింగంబాకమే నేడు నుంగంబాక మయినది. కుంఫిణీవారికి గోలకొండలోనుండిన మొదటి ఏజెంటు తెలుగుబ్రాహ్మణుడు వెంకటపతి.

18-వ శతాబ్దిలోగూడ తెలుగువారు ప్రముఖులుగ నుండిరి. తిమ్మప్పయు, అంగరప్పయు చెన్నపట్టణమున పెద్దనాయకులుగ నుండిరి. అనగా పోలీసు రక్షకశాఖకు నాయకులు రామప్పగారు కొన్నాళ్లు ప్రధాన దుభాషిగ నుండెను. అంకన్నగారు చాలాకాలము ప్రధాన బ్రోకరుగ నుండెను. చింతాద్రిపేటను స్థాపించిన సుంకర రామన్న 1712 నుండి ముఖ్యవర్తకుడుగ చాలకాలమువరకు పనిచేసెను.

పాపయ్యాగా రను బ్రాహ్మణుడు 1697 మొదలు కుంఫిణీవారికి ట్రాన్సులేటరుగా నుండెను. ఆయన 1727 లో చనిపోయిన పిదప అతని తమ్ముడును, అతని కుటుంబమువారైన చినపాపయ్య, వ్యాసం పాపయ్యలును నీ యుద్యోగముచేసిరి. కంఫిణీవారి ప్రధాన రైటరు లేఖరి వీరరఘువయ్యయు తెలుగువాడే.

చెన్నపట్టణములోని తెలుగు వర్తకులైన భద్రయ్య, గంగారాముడు, సుంకురాముడు, బాలిశెట్టి, కలవాయిశెట్టి మొదలగువారు చేసిన దానధర్మము లిప్పటికిని ప్రసిద్ధిలో నున్నవి. అనేకమైన పేటలు, వీథులు తెలుగువారిపేరుతో కనబడుచున్నవి. 1789 మొదలు హాలండు సోదరులు గవర్నరులుగా నుండగా చెన్నపట్టణము నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన అవధానం పాపయ్యగారి చరిత్ర సుప్రసిద్ధమైనది.

19-వ శతాబ్దారంభమునాటికి చెన్నపట్టణమున నెక్కడ జూచినను తెలుగువారే గొప్ప యుద్యోగములలో నుండిరి. ఆంగ్లేయులకు దుబాషులుగను, కార్యదర్శులుగను, పండితులుగను, కచ్చేరీలలో గుమాస్తాలుగను, శిరస్తాదారులుగను, ట్రాన్సులేటర్లుగను, దేశీయులకొసగబడు అన్ని యుద్యోగములందును మనవారే కనబడుచుండిరి. కేవలము బ్రాహ్మణులే గాక బ్రాహ్మణేతరులును, పైకి అరవపేరులుగా కనబడు మొదలియారు, పిళ్లె మొదలగు పేరులవారును గూడ తెలుగువారుగనే యుండిరి. మెకంజీ దొరగారు సేకరించిన అపూర్వమైన ప్రాచీన గ్రంథములు, కవిలెలు ప్రోగుచేయుటలో 1796 మొదలు మెకంజీగారి క్రింద పండితుడుగనుండిన కావలి వెంకటబొరయ్యగారును, ఈయన సోదరుడు లక్ష్మయ్యగారును, ఆంధ్ర భాషలో ననేక గ్రంథములు సేకరించి నిఘంటువు రచియించిన సి. పి. బ్రౌను దొరగారి పండితులగు వఠ్యం అద్వైత పరబ్రహ్మశాస్త్రి, జూలూరు అప్పయ్యపండితుడు మొదలగువారు సుప్రసిద్ధులైన తెలుగువారును గలరు.

### ఆనాటి విద్యాసంస్థలు :

#### ఆంధ్రులు

ఆంగ్లేయోద్యోగులకు ఈ దేశాచార వ్యవహారధర్మములందును, భాషలందును తర్ఫీదు నిచ్చుటకు 1812 లో కోటలో నొక కాలేజీ స్థాపింపబడెను. దీని కొక పరిపాలక బోర్డు నుండెను. దీని నంటి ఒక ముద్రాక్షరశాల, పుస్తకముల డిపో, గ్రంథాలయము స్థాపింపబడెను. తరువాత ప్రాచ్యలిఖిత గ్రంథభాండాగారము దీనివశము చేయబడెను. దీని యాజమాన్యమున పెక్కు తెలుగు అరవము గ్రంథములు ప్రకటింపబడెను. తరువాత నొక స్కూలుబుక్కు సొసైటీ స్థాపింపబడెను. దీనిలో ఉదయగిరి వెంకటనారాయణయ్యగారు హెడ్ ఇంగ్లీషు మాస్టరుగను, పట్టాభిరామశాస్త్రిగారు ప్రధాన సంస్కృతాంధ్రపండితులుగను నుండిరి.

రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు 1819 లో ప్రధానాంధ్రపండితులు, కాలేజీకార్యదర్శి సంస్కృతపండితుడు, అహోబలాచార్యులుగారును ముఖ్యులు. సదరదాలతు కోర్టులో వెంకటరామశాస్త్రిగారు తెలుగు పండితులుగ నుండిరి. ఆకాలమునాటి తెలుగు పండితుల కుటుంబములవారు కొంద రిప్పటికిని ఈనాములను అనుభవించుచున్నారు. సదరుకోర్టులో తెలుగు అరవము నుండి ఇంగ్లీషులోనికి తర్జుమాచేయు 'ఇంటరుప్రిటరు' పదవి 1815 లో ఖాళీ వచ్చినప్పు డాపనికి వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారు నియమింపబడిరి. వీరు 1829 వరకు నీయుద్యోగము చేసి ఉపకారవేతనము నందిరి.వీరు 1839-వ సం.అక్టోబరు 1-వ తేదీన దివంగతులైనారు. వీ రింగ్లీషులో నొకస్వీయచరిత్రను వ్రాసినారు. 1819లో అప్పాస్వామి యను వాడుకపేరు గల వెంకటరామయ్యగారు సుప్రీము కోర్టులో తెలుగు అరవముల నుండి ఇంగ్లీషుభాషకు తర్జుమా చేయు ఇంటర్‌ప్రిటరు పదవిలో నుండి చనిపోగా నాయుద్యోగము సుబ్బారావుగారి కియ్య దలచిరి. అంతట వారు తమ బంధువులైన ఏను

## తెలుగువారి ప్రాబల్యము

గుల వీరాస్వామయ్యగారి కిచ్చునట్లు దొరలకు శిఫారసు చేయగా వారికిచ్చిరి. వీరాస్వామయ్యగారు 1835 వరకు నాయుద్యోగము చేసిరి. ఆకాలమున దక్షిణ హిందూస్థానమునందు నేడు అరవజిల్లాలని చెప్పబడు కుంభకోణమువరకును, మైసూరులోను, దక్షిణ కనరాజిల్లావరకునుకూడ మన తెనుగువారే జిల్లా జడ్జీ కోర్టులలో, కలెక్టరుల కచ్చేరీలలో, సైనిక కార్యాలయములందును పెద్దయుద్యోగములు చేయుచుండినట్లు వెన్నెలకంటి సుబ్బారావుగారు దక్షిణదేశయాత్ర పోయినప్పుడు ఆయా ప్రాంతములలో చూచిన యుద్యోగుల పేరులుకూడ వివరించినారు. చెన్నపట్టణమున 1820 నాటికి ప్రతివీథిలోను నొక వీథిబడి యుండెననియు, నందు తెలుగు అరవము లెక్కలు నేర్పబడుచుండెననియు, ఉపాధ్యాయులు ఉత్తర జిల్లాలలోని తెలుగు బ్రాహ్మణు లనియు సుబ్బారావుగారు వ్రాసియున్నారు.

ఏనుగుల వీరాస్వామయ్యగారును, వీరి ముఖ్యస్నేహితులును జార్జి నార్టనుగారితో కలిసి 1833 లో హిందూ లిటరరీ సొసైటీని స్థాపించి ప్రజాసేవ చేసిరి. హిందూ లిటరరీ సొసైటీ కార్యాలయము చెన్నపట్టణమున గుజిలీబజారులో నుండెను. వీరితో కలిసి చెన్నరాజధానిలో నాంగ్లేయ విద్యావిధానమును స్థాపించుటకు కృషిచేసిన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లెగారును, వెంబాకం రాఘవాచార్యులుగారును తెలుగువారే. శ్రీనివాసపిళ్లెగారు చెన్నపట్టణమున పచ్చయ్యప్ప ధర్మములను, మణేగారు సత్రమును, ఇతర ధర్మములను నిర్వహించి పేరుపొందిన ఆంధ్రులు. వీరాస్వామయ్యగారి జీవితమును వీరు చక్కని తెనుగులో రచియించి 1838 లో ప్రకటించినారు. వీరి చిత్రపటము లిప్పటికిని పచ్చయ్యప్ప కళాశాలలో నున్నవి.

## 6

చెన్నపట్టణము 1830 నాటికే నేటి స్వరూపమును దాల్చిన దని చెప్పవచ్చును. ఏనుగుల వీరాస్వామయ్యగారు 1831 లో రచియించిన కాశీయాత్రచరిత్రయందు చెన్నపట్టణముయొక్క చరిత్రను వ్రాసి ఆనాటికి గల పరిస్థితులను వర్ణించియున్నారు. వీరిరచన ఆంగ్లేయులు రచియించిన గ్రంథములందలి సంగతులతో చాలవరకు సరిపోవుచున్నది.

### 1831 నాటి చెన్నపట్టణపరిస్థితులు

ఆ కాలమునాటికి చెన్నపట్టణముక్రింద పరిపాలింపబడుచుండిన మద్రాసు రాజధాని ఆదాయము ఒకకోటి ఇరవైయైదు లక్షల వరహాలు. ప్రభుత్వవ్యయము అప్పుపైన వడ్డీతో చేరి ఆదాయమునకు మీరి యుండెను. కుంఫిణీవారి కానాటికి గల ఋణము రెండు కోట్ల వరహాలు. స్థావరజంగమరూపకమైన ఆస్తి 8 కోట్ల వరహా లని మదింపు వేసిరి. దండు యాభైవేలమంది ఫౌజు. ఈ చెన్నపట్టణమునం దాయనకాలమునాటికి మూడులక్షల జనసంఖ్య యుండెను. చెన్నపట్టణము బస్తీకి మూడుప్రక్కల 'మహరు పాను' గోడ పెట్టియుండెను. తూర్పున సముద్రము హద్దు. బస్తీ కోసెడు దూరము చచ్చౌకముగ నుండెను. బస్తీకి పావుకోసెడుదూరములో దక్షిణపు ప్రక్క సముద్రమునకు వారగా కోట కట్టియుండెను. ఉత్తరపు ప్రక్క ఎగుమతిదిగుమతి చేయు ఓడరేవు సరకులగిడ్డంగులు నుండెను. చెన్నపట్టణములో కెల్ల పాపంవీథి, కాలవీథి అనునవి విశాలమైనవి. ప్రజలపైన పన్ను విధించి, రోడ్లు మరామతుచేసి, వీథులు శుభ్రపరచి లాణాలు ఉంచి కావలికాయు ఏర్పాటులు చేయబడెను. 10 దేవాలయము లుండెను. అందు ప్రతిసంవత్సరము వైభవముతో బ్రహ్మోత్సవములు జరుగుచుండెను. ఇండ్లు చక్కగా గాలివచ్చునట్లు కట్టబడియుండెను. సముద్ర

ముపైన, భూమిపైన ఎగుమతి దిగుమతి సుంకములను వసూలుచేయుటకు ఒక కస్టమ్సు హౌసును, ఒక లాండుకస్టంహౌసు కోట బయటను నుండెను. తక్కిన కచేరీలలో కొన్ని కోటలోను, కొన్ని బయటతోటలలోను ఉండెను. గవర్నరు ఇల్లును, చేపాకులో ఆర్కాటు నవాబు ఇల్లును ఉపగ్రామ మయిన తిరువలిక్కేణిలో నుండెను. జాతులవారు బస్తీకి ఆమడదూరమున నుండు ఫరంగి కొండ వరకును, మూడుకోసుల దూరములో నుండు పెరంబూరివరకును సుందరమైన తోటలు వేసి బంగాళాలు కట్టుకొని నివసించుచుండిరి. హిందువుల యిండ్లలో అయ్యా పిళ్లెయిల్లును, కోటలో దీపస్తంభము గల యక్సుఛేంజి యిల్లును పెద్దవి. బయట నుండు జాతివారి మిద్దెలలో మూరాతు కట్టిన యిల్లు పెద్దది.

బస్తీకి దక్షిణమున బస్తీతో సమానమైన తిరువలిక్కేణి, మైలాపురము, తిరువట్టేశ్వరుడిపేట మొదలైనవియు, పడమట చూళై, పొరశవాకము, కోమలేశ్వరుడి గుడియు, ఉత్తరమున చాకలిపేట, రాయపురము, తండయారుపేట మొదలైన ఉపగ్రామములు నుండెను. ఈబస్తీలోనుండు హిందువులందరును బస్తీకి ఉత్తర భాగమందు తిరువట్టూరి వరకు ఆరామములు కట్టుకొని విహరించుచుండిరి. ఊరిలోని తటాకములు, నదులు బస్తీకి మంచినీటి సదుపాయమును కలిగించుచుండెను. సకల ద్వీపద్వీపాంతర పదార్థములును దొరుకుచుండెను. జనసమ్మర్దము వలన బస్తీయొక్క ఆరోగ్యము మాత్రమంత బాగుగ లేకుండెను. అంటువ్యాధులు తరుచు సంభవించుచుండెను.

ఈదేశము ద్రవిడ ఆంధ్ర కర్ణాటక దేశముల మధ్య నుండినందున నిక్కడ నీ మూడు భాషలును, పూర్వము దొరతనము చేసినవారి తురకమును, తరువాత ప్రభువులైనవారి యింగ్లీషు పదములును నోట నానుటచేతను, పదార్థముగ కొన్ని సంస్కృత వాక్యము లభ్యసించుటచేతను ఇక్కడి ప్రజల యుచ్చారణము స్పష్టముగ నుండెనని వీరాస్వామయ్యగారు వ్రాయుచున్నారు.

ఈ పట్టణమునందలి స్త్రీలు చొరవగల వారనియు, ఎక్కువ మూరల పొడుగుగల చీరలను ధరింతురనియు, గర్విష్ఠలనియు వ్రాసిరి. ఈ పట్టణమున సమస్త దేశపు వృక్షములును, సమస్త జాతుల ఫలపుష్పాదులును గలవనిరి. ప్రజలు యథోచితముగ కర్మిష్ఠులనియు, దేవబ్రాహ్మణవిశ్వాసము గలవారనియు వ్రాసిరి. బ్రాహ్మణకులములందు వడగలి తెంగలి కక్షలవలెనే పూర్వము ద్విజేతరకులములందు కుడిచెయ్యి ఎడమచెయ్యి కులములలో కక్షలవలన తగాదాలు, దెబ్బలాటలు తీవ్రముగా జరుగుచు శాంతిభద్రతలకు భంగము కలుగుచుండె నని వ్రాసినారు.

జాతులవారి జనబాహుళ్యము, విభవము, తెంపు, స్త్రీపురుషుల సల్లాపములు చూడదలచినచో ప్రతిదినము సాయంకాలమునందు మౌంటురోడ్డులో వృక్షముల నీడగల 'ఫరంగి కొండశాల'లోను, సముద్రమువద్ద ఓడరేవుదగ్గర నాటిన వృక్షముల నీడను నిలచినచో వారందరును వాహనవిశేషములు ఎక్కి వత్తురు గనుక చూచి ఆనందించ వచ్చుననియు వ్రాసిరి.

వీరాస్వామయ్యగారు చేసిన వర్ణనలో ఎట్టి అతిశయోక్తులుగాని, లోటు పాటులుగాని లేవని ఆ కాలమునాటి స్థితిగతులను గూర్చి ఆంగ్లేయ గ్రంథకర్తలు వ్రాసిన సంగతులు చదివినచో తెలియగలదు.

1833 మొదలు 1854 వరకును ప్రతి సంవత్సరము చెన్నపట్టణమున ప్రకటింపబడుచుండిన అసైలం ప్రెస్ అల్మనాకులను పంచాంగములను, ఆనాటి ఆంగ్లేయ పత్రికలను, గ్రంథములను చదివినచో చెన్నపట్టణములోని పరిస్థితులు చక్కగా తెలియగలవు. 'లవు' గారు వ్రాసిన 'వెస్టిజెస్ ఆఫ్ మద్రాసు' అను గ్రంథమునను, టాల్‌బాయిస్ వీలరు గారు వ్రాసిన 'మద్రాస్ ఇన్ ఓల్డెన్ టైమ్సు' అను గ్రంథములోను, ఇటీవల చెన్నపట్టణ త్రిశతాబ్ది వార్షికోత్సవసందర్భమున ప్రకటింపబడిన శ్రీనివాసాచార్యులు గారి మద్రాసు చరిత్రలోను, ఉత్సవ సంపుటము (Madras Tercentenary Commemoration Volume) లోను పూర్వకాలమునాటి చెన్నపట్టణము వర్ణింపబడి యున్నది.

## 7

1833-వ సంవత్సరపు అసైలం ప్రెస్ అల్మనాకును చూచినచో ఆనాటి చెన్నపట్టణమున మన తెలుగువా రెంత ప్రముఖులుగ నుండిరో తెలియగలదు. ఆనాడు ఉన్నతతన్యాయస్థాన మగు సుప్రీముకోర్టులో ఇంగ్లీషుకు తెనుగు అరవములనుండి తర్జుమా చేయు ఇంటరుప్రిటరు ఏనుగుల వీరాస్వామయ్యగారు, మళయాళము మాపిల భాషల ఇంటరుప్రిటరు రామరాజుగారు. సెంటుజార్జికోట కాలేజిలో తెలుగు ఉపాధ్యాయులు, పండితులు నుండిరి.

### 1820.40 నాటి ఆంధ్రమహాపురుషులు

మణేగారు సత్రమునకు ధర్మకర్తలగు పదకొండుమంది ఆంగ్లేయులతో పాటు తొమ్మిదిమంది దేశీయధర్మకర్త లుండిరి. వారిలో మన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లెగారు, వెంబాకం రాఘవాచార్యులువారు, బి. వి. రామానుజులనాయుడు, డి. పెరుమాళ్లనాయుడు, యం. భగవంతరావు అను పేర్లు కనబడును.

1837-వ సంవత్సరపు అల్మనాకులో గూడ తెనుగుప్రముఖుల పేర్లు అనేకముగా కనబడును. పోలీసు మాజిస్ట్రేటులు, డిప్యూటీ సూపరెంటు, జస్టిసెస్ యిన్ సెషన్సు అను శీర్షిక క్రింద వెంబాకం రాఘవాచార్యులు గారి పేరు కనబడును.

చెన్నపట్టణమున రాజకీయ సాంఘిక మత వ్యవహారములు జరుపు సంస్థలందు తెలుగువారనేకులు పెద్దయుద్యోగములు చేయుచుండిరి.

1820-వ సంవత్సరము నాటికి చెన్నపట్టణమున వివిధ ప్రాంతములందుండిన దేశీయ పాఠశాలలందు తెలుగులోను, అరవములోను పాఠములు చెప్పబడుచుండెననియు, ఉత్తర సర్కారులనుండి తెలుగు పండితులు, ఉపాధ్యాయులు నియమింపబడుచుండిరనియు వెన్నెలకంటి సుబ్బారావుగారు మద్రాసు స్కూలుబుక్కు సొసైటీవారికి వ్రాసియుండిరి. 1839-41 మధ్య స్థాపింపబడిన ప్రభుత్వమువారి ఉన్నత పాఠశాలలోను, పచ్చయ్యప్ప పాఠశాలలోను తెలుగునందును, అరవమునందును విద్య బోధింపబడునట్లు నిర్ణయింపబడెను. తెలుగు అరవభాషలకు రామకృష్ణశాస్త్రిగారు సూపరెంటెండెంటుగను, చిన్నయ్యసూరిగారు తెలుగు పండితుడుగను నియమింపబడిరి. 1839 లో స్థాపింపబడిన మద్రాసు యూనివర్సిటీ బోర్డులో కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లెగారును, వెంబాకం రాఘవాచార్యులుగారును, చొక్కప్పశెట్టి వెంకటపతి మొదలగు తెలుగువారును సభ్యులుగా నియమింపబడిరి.

చెన్నపట్టణమున సుప్రసిద్ధులైన దేశీయ వర్తకుల కంపెనీలలో అప్పాస్వామిపిళ్లె కంపెనీయు, (గాజుల) సిద్దులశెట్టి కంపెనీయు 1841 నాటికే ప్రసిద్ధిగాంచెను. సిద్దులశెట్టి కంపెనీవారు ప్రత్తి నీలిమందుల ఎగుమతి వ్యాపారము చేసి లక్షలార్జించిరి. ఈ కంపెనీ భాగస్థులు తెలుగువారే. ఈకంపెనీ ఆర్మీనియను వీథిలో నుండెను. ఈసిద్దుల శెట్టిగారి తరువాత నీయనకుమారుడు లక్ష్మీనరసుశెట్టిగారే ఈకంపెనీ వ్యాపారము నడుపుచు అమిత ధనము నార్జించి చెన్నపట్టణమున గొప్పపేరు పొందినారు.

## చిరస్మరణీయుడు గాజుల లక్ష్మీనరుస్సశెట్టి

### 8

శ్రీ గాజుల లక్ష్మీనరుస్సశెట్టిగారి పేరు చెన్నపట్టణ చరిత్రలో శాశ్వతముగా జ్ఞాపకముంచుకొన తగినది. వీరు 1806-వ సంవత్సరమున మద్రాసులో పెరియమెట్టులో జన్మించిరి. వీరు గాజుల బలిజవంశజులగు ఆంధ్రులు. సిద్దులశెట్టిగారి కుమారుడు. ప్రత్తి నీలిమందు వ్యాపారమున లక్షాధికారియై తన ధనమునెల్ల స్వధర్మరక్షణకొరకును, దేశోద్ధరణకొరకును వ్యయముచేసిన త్యాగి. ప్రజాసేవకొరకు జీవితమును ధారబోసిన దేశభక్తుడు. మిషనరీల యాగడములను ప్రతిఘటించుటకు ఈయన 1844-వ సంవత్సరములో 'క్రెసెంటు' అను ఇంగ్లీషుపత్రికను, చెన్నపట్టణస్వదేశసంఘమును స్థాపించి ప్రజాసేవచేసిరి. చెన్నపట్టణమున కుంఫిణీవారి పరిపాలనములో ననేక అన్యాయములు జరుగుచు ప్రజలు బాధలుపడుచుండగా దీనిని గూర్చి పార్లమెంటువారికి నివేదించి ప్రజల బాధలు మాన్పుటకును, రాజకీయ సంస్కరణములు చేయించుటకును కృషిచేసిన దేశనాయకుడు. ఈయన అనేక గ్రంథములను కృతి నంది, ప్రకటించి, చిన్నయసూరిగారిని ఆంధ్రమున నిఘంటు రచనకు ప్రోత్సహించి భాషాపోషణ చేసిన భాషాభిమాని. చెన్నపట్టణ ప్రజాజీవనమునం దీయనతోనే జాతీయోద్యమము ప్రారంభమైనదని చెప్పవచ్చును.

### జాతీయోద్యమమును లేవనెత్తిన ధీశాలి గాజుల లక్ష్మీనరుస్సశెట్టి

ఆకాలమునాటి యాంగ్లేయ ప్రభుత్వము దేశప్రజలనుండి ఎంత ఎక్కుడు శిస్తులు గ్రహింపవచ్చునా యని ఆలోచించి దానిని నయమునను, భయమునను రైతులను హింసించి వసూలుచేయుట తప్ప ప్రజల విద్యకొరకుగాని, రాకపోకల సౌకర్యములకు బాటలు నిర్మించుటకుగాని, పల్లపు సాగునీటి వసరుల కొరకుగాని, దేశప్రజల సౌకర్యములకొరకు గాని, అభివృద్ధికిగాని ఎట్టి ప్రయత్నమును చేయకుండెను. కోర్టులలోని న్యాయ పరిపాలన మధోగతిలోనుండెను. సామాన్యులకు న్యాయము దొరకుట దుర్లభముగా నుండెను. ఈప్రజలు తమలాభముకొరకేర్పడిన చరాస్తియని కుంఫిణీ పరిపాలకులు తలచి యుపేక్ష వహించుచుండిరి.

వీరిమతముల జోలికి రామని చెప్పిన కుంఫిణీవారే ప్రజలను, బాలురను గూడ తమ క్రైస్తవమతమున గలుపుటకు ప్రయత్నించుచున్న క్రైస్తవ మతబోధకులకు తోడ్పడుచుండిరి. చెన్నపట్టణములోని ఉద్యోగులు క్రైస్తవమత పక్షపాతము జూపుచుండిరి. 1842 మొదలు 1848 వరకు గవర్నరుగనుండిన ట్వీడ్ డేలు క్రైస్తవ మతాభిమానిగనుండి పాఠశాలలందు బైబిలును ప్రవేశపెట్టుట కనుజ్ఞ నిచ్చెను. చెన్నపట్టణములోని పెద్ద ఉద్యోగులు, న్యాయాధిపతులు, జిల్లాలలోని ఆంగ్లేయోద్యోగులు, తుదకు న్యాయ పరిపాలన చేయవలసిన జడ్జీలును క్రైస్తవాభిమానము జూపుచుండిరి. జిల్లా కలెక్టరులు, పోలీసులు అప్రయోజకులుగ నున్నను, జిల్లా పరిపాలన మధోగతిలో నున్నను, శిస్తువసూలులో చిత్రహింసలు జరుగుచున్నను ఉపేక్షించుచు మిషనరీలకు తోడ్పడుచుండిరి. చెన్నపట్టణమున నీదుష్పరిపాలనము మితిమీరి ప్రజలు నోరు లేనివారై బాధలుపడుచు ఏమిచేయవలెనో తెలియక పరితపించుచుండగా నీ లక్ష్మీనరుస్సశెట్టిగారు ప్రజలను రక్షించుటకు నడుముగట్టి తన ధనమునెల్ల ధారవోసి గొప్ప రాజకీయాందోళనమును ప్రారంభించిరి. తమకు గల హక్కులెట్టివో, తామేమి చేయవలెనో తెలియని ప్రజలలో ప్రచారముచేసి

దేశీయులకు గూడ కొన్ని ప్రాతిపదిక హక్కులు కలవని నిరూపించి వానిని సంరక్షించుకొనుటకు పత్రికాముఖమునను, ప్రజా సంఘముల ద్వారమునను, మహాసభల తీర్మానములు గావించియు, పార్లమెంటుకు మహజరులంపియు తమ కష్టములను బాపుకొని రాజకీయసంస్కరణములను పొందుటకు స్వయం కృషి ప్రయత్నములు చేయు క్రొత్తవిధానమును ప్రారంభించెను. త్వరలోనే స్వధర్మ రక్షణమునకే గాక దేశోద్ధరణము చేయుటకుగూడ విధాన ముపయోగించెను. మిషనరీల యక్రమము లరికట్టబడెను. శిస్తుల వసూలులోని హింసలనుగూర్చి 1854 లో విచారణజరిగి అవి నిషేధింపబడెను. 1853 లో పార్లమెంటువారు కుంఫిణీవారికి క్రొత్త పట్టా నిచ్చు సందర్భమున లక్ష్మీనరసుగారీదేశప్రజల కష్టములను, ప్రభుత్వములోని అన్యాయములను వివరించుచు ఈ ప్రభుత్వ విధానమును సంస్కరించ వలయు ననియు, దేశపరిపాలనలో ప్రజాప్రతినిధులకు కొంత పలుకుబడి యుండవలెననియు స్పష్టముగా కోరియుండిరి. ఏవో కొన్ని చిన్న సంస్కరణములు జరిగినను కుంఫిణీ పరిపాలనా విధానము మారలేదు. అందువలన 1857 వరకును లక్ష్మీనరసుగారీవిషయములను గూర్చిన రాజకీయాందోళనమును శాంతియుతముగా చేయుచునే యుండిరి. దేశములోని దుష్పరిపాలనము మితిమీరిపోగా 1857లో ఉత్తరహిందూస్థానమున హింసాత్మక విప్లవము వచ్చిన పిదప 1858 లో కుంఫిణీప్రభుత్వమునురద్దుచేసి క్రొత్తరాజ్యాంగమును స్థాపించిరి. చెన్నపట్టణమున క్రొత్తగా నిర్మింపబడిన శాసనసభలో లక్ష్మీనర్సుగారిని సభ్యునిగా నియమించిరి. ఆయన ప్రభుత్వ గౌరవముల కాసపడి యూరుకొనక 1868 లో తానుమరణించువరకును ప్రజలహక్కుల కొరకు పాటుపడసాగిరి. లక్ష్మీనరసుగారు మైసూరురాజ్యము నారాజు కిప్పించుటకును, ఆర్కాటునవాబునకు జరిగిన అన్యాయములను గూర్చియు, తంజావూరు రాజుల జీవన భృతిని గూర్చియు కృషిచేసి వారి కుపకారము చేసిరి.

ఇట్లు లక్ష్మీనరసుగారు చెన్నపట్టణములోని జనసామాన్యముయొక్క రాజకీయ సాంఘిక మతక్షేమములకొరకును, అభివృద్ధి కొరకును తమ జీవితమును ధారవోసి జాతీయ పత్రికా ప్రచురణమునకును, జాతీయసభానిర్మాణమునకును, జాతీయోద్యమమునకును మార్గదర్శకులై యశఃకాయులైరి.

1868 లో పచ్చయ్యప్ప కళాశాలా భవనమున జరిగిన వీరి స్మారకసభలోను, 1869 లో వీరి ఛాయాపటమును బహిర్గతము చేసిన సభలోను ఉపన్యసించుచు చెన్నపట్టణమున అడ్వకేటు జనరలుగా నుండిన జాన్ బ్రూస్ నార్టనుగారు ఈ లక్ష్మీనరసుగారు తనమిత్రుడని చెప్పుకొనుటకు తాను గర్వపడుచున్నాననియు, ఈయనగారొక మహాపురుషుడనియు, కేవలము తీవ్రమైనమాటలు చెప్పి యూరకొనిన వాక్శూరుడు కాడనియు, ప్రజలక్షేమలాభములకొరకు నిర్భయముగా పాటుపడి కృతకృత్యుడైన కార్యశూరుడనియు, దేశభక్తుడనియు చెప్పి అనేక విధములుగా ప్రశంసించిరి. ఈనార్టనుగారు 1842 మొదలు 1871 వరకు చెన్నపట్టణమున నుండి దేశీయ ప్రజల కుపకారము చేసిరి.

లక్ష్మీనర్సుగారి జీనితమును జి. పరమేశ్వరం పిళ్లెగారు 'రిప్రజెంటేటివ్ మెన్ ఆఫ్ సదరన్ ఇండియా' అను గ్రంథములోను, 'రిప్రజెంటేటివ్ ఇండియన్సు' అను గ్రంథములోను ఇంగ్లీషులో రచియించియున్నారు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు నీ మహాపురుషుని జీవిత చరిత్రమును తెలుగున రచియించియున్నారు.

ఈ లక్ష్మీనరసుగారి కాలముతో మన చెన్నపట్టణముయొక్క పూర్వచరిత్రముగిసెననియు, ఇందొక క్రొత్తయుగ మారంభమైనదనియు చెప్పవచ్చును



# మానవుడా!

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

రాశిచక్రగతులలో
రాత్రిందివాల పరిణామాలలో
బ్రహ్మాండగోళాల పరిభ్రమణాలలో,
కల్పాంతాలకు పూర్వం కదలిక పొందిన
పరమాణువుసంకల్పంలో
ప్రభవం పొందినవాడా!
మానవుడా! మానవుడా!
సౌందర్యం ఆరాధించేవాడా!

కవితలో, శిల్పంలో-పురుగులో, పుష్పంలో–
మెరుపులో, మేఘంలో
సౌందర్యం ఆరాధించేవాడా!
జీవించేవాడా!
సుఖించేవాడా! దుఃఖించేవాడా!
విహ్వలుడా! వీరుడా!
ప్రేమించేవాడా!
వియోగీ! యోగీ! భోగీ! త్యాగీ!

ఆలోచనలు పోయేవాడా!
అనునిత్యం అన్వేషించేవాడా!
చెట్టూ, చెరువూ
గట్టూ, పుట్టా
ఆకసంలో, సముద్రంలో
అన్వేషించేవాడా!
అశాంతుడా! పరాజయం ఎరుగనివాడా!
ఊర్ధ్వదృష్టీ! మహామహుడా!
మహాప్రయాణికుడా!
మానవుడా! మానవుడా!

కొట్లాడుకునేవాడా! ఓర్వలేనివాడా! సంకు
చితస్వభావుడా!
అయ్యో! మానవుడా!
ఓహో! మానవుడా!
ధర్మస్థాపనకు యుద్ధం చేసేవాడా!
అన్యాయం భరించలేనివాడా!
ఆదర్శజీవీ! మహాత్మా! మానవుడా!

ఆసియా, అమెరికా, యూరప్,
ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో,
సముద్ర ద్వీపాలలో,
ధ్రువప్రాంతాలలో
పట్టణాలలో, పల్లెలలో
ధనివో, దరిద్రుడవో,
వృద్ధుడవో, యువకుడవో,
తెల్లని, నల్లని, ఎర్రని, పచ్చని రంగో,
బలవంతుడివో, బలహీనుడివో
బ్రదికేవాడా! పాడేవాడా! మానవుడా!
[మానవుడా!

అవిభక్తకుటుంబీ!
ఏకరక్తబంధూ!
మానవుడా! మానవుడా!
అనేకభాషలు మాట్లాడేవాడా!
అనేకస్థలాలలో తిరిగేవాడా!
అనేక కాంతులు వెదజల్లేవాడా!
సహృదయా! సదయా!
సన్మార్గగామీ!

సముద్రాలు దాటేవాడా!
ఎడారులూ, పర్వతాలూ గడచేవాడా!
ఆకాశాలను వెదికేవాడా!
నక్షత్రాలను శోధించేవాడా!
పిపాసీ! తపస్వీ!

వంతెనలు నిర్మించినవాడా!
వైద్యశాలలు, వస్తుప్రదర్శనశాలలు
గ్రంథాగారాలు, పరిశ్రమాలయాలు,
ధూమశకటాలూ, నౌకలూ, విమానాలూ
నిర్మించినవాడా!
దూరదృష్టి దూరశ్రవణశక్తులు
సాధించినవాడా!
మానవుడా! మానవుడా!

రసైకజీవీ! కవీ! నటుడా! శిల్పాచార్యా!
గానకళాకోవిదుడా! వేదాంతీ!
విజ్ఞానధనీ! భావధునీ!

దుఃఖమయా!దయాళూ! పరదుఃఖాసహనశీలీ!
చీమనుకూడా చంపడానికి
చేతులు రానివాడా!

బుద్ధమూర్తీ!
జీసస్!

సంఘపశూ! శ్రమైకజీవీ!
శరీరపరీవృతుడా!
ఘర్మవర్ష పయోదుడా!
రక్తకణ సమష్టికుటుంబీ!
కష్టజీవీ! కార్మికుడా! మానవుడా!
కూలీ! మాలీ! రైతూ!
గుడిసెలలో బ్రదికేవాడా!
గంజినీళ్లు తాగి కాలం గడిపేవాడా!
కడుపెడుసంతానం కలిగినవాడా!
ఆకలికన్నూ! మానవుడా!

తిరగబడేవాడా! ప్రశ్నించేవాడా!
అన్యాయాలకు ఆహుతి కావడానికైనా
జంకనివాడా!
ఖైదీ!
శాడీ!
ఖూనీకోర్!
జేబీ!
మానవుడా! మానవుడా!





# చిలక

[ కథానిక ]

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

౧

నేను చక్కనివాణ్ణనే సంగతి అందరికీ తెలిసిన విషయమే. ఈచక్కదనమే నన్నెన్నోసార్లు రక్షించింది. ఎన్నోసార్లేమిటి, ఒక్కసారి తప్ప అన్నిసార్లూనూ నామీద కోపము వచ్చి విరోధులు కాబోయేవాళ్లు కూడా నా ఎదటికి వస్తే చక్కగా మాట్లాడి విరోధాలన్నీ మరచిపోయి వెళ్లుతారు పాపము, ఒక్క మదనమోహనుమాత్రము మరవలేకుండా ఉన్నాడు. అతనైనా నన్ను ముఖమెత్తి తేరిపారచూస్తే మరుస్తాడేమో!

నాకీ చక్కదనము పుట్టుకలోనే వచ్చి ఉంటుంది. కాని ఉన్న అందాన్ని పోకుండా ఆపిపెట్టుతున్నది మాత్రము నాయౌవనము.

నేను యౌవనమున్నవాణ్ణి అంటే నేను చిన్నవాణ్ణి అనుకోరాదు. నాతోకూడా పుట్టినవాళ్లెంతమందో ఈపాటికి ముసలివాళ్లయిపోయినారు. కొంతమందికి పొట్టబుగ్గలు పడి ముఖాలు పీలగా ఐపోయి ముడుచుకొనిపోయినవి; రొమ్ములు ఈచుకొనిపోయినవి. మరికొంతమందికి వినాయకునికివలె బొజ్జలు పెరిగి పర్వతాకారాలు పడ్డాయి. అందరికీ తలలు ముగ్గుబుట్టలైనవి. గడ్డాలు, మీసాలు నెరిసినవి. ఇప్పుడు చూసినవాళ్లెవరైనా నాకూ, వాళ్లకూ ఒకటే ఈడంటే ఎప్పటికీ నమ్మరు. నాజుట్టు తుమ్మెదరెక్కలవలె ఉంటుంది. పళ్లుకూడా ధగధగలాడుతూ ఉంటవి. పాలుగారే నా ముఖమూ, ప్రేమ వొలికే నాకళ్లూ, బంగారము కమ్మిపోసినట్లుండే దీర్ఘమైన నా దేహయష్టీ చూసి మాఊళ్లో ఉండే కవి "చిలకను చిన్నప్పుడు వాళ్ల అమ్మగారు ఉగ్గుబాల్లో అమృతం కలిపి పోసిందా ఏమి?" అంటాడు. నా దేహమంత మిసమిసలాడుతూ ఉంటుంది! మా అమ్మగారుకూడా చాలా చక్కనిదని పేరు పడ్డది కావడమే కాక ఆమె చనిపోయేదాకా నా అక్కచెల్లెళ్లకంటె చిన్నదిగా కనబడేది. ఒకటి రెండుసార్లు మా అమ్మగారు మా అక్కచెల్లెళ్లతో కలిసి పేరంటానికి వెళ్లితే "ఈమె మీ చెల్లెలా" అని మాఅమ్మగారిని చూపి మా అక్కచెల్లెళ్లను ఒకరిద్దరు అడిగినారట. అప్పటినుంచీ దిష్టిచేటని మా అక్కచెల్లెళ్లతోకలిసి మా అమ్మగారు పేరంటానికి వెళ్లేదికాదు. కాబట్టి మా తోబుట్టువులందరిలోనూ నా కొక్కడికే మా అమ్మగారి నిత్యయౌవనము అబ్బిందన్నమాట.

కాని మా కవి చెప్పినట్లుగా మా అమ్మగారు నాకు ఉగ్గుబాల్లో అమృతం కలిపి పోయలేదు. మా అన్నలకంటేనూ, మా అక్కచెల్లెళ్లకంటేనూ నన్నామె ఎక్కువ గారాబంగా మాసేదన్నమాట నిజమేకాని ఆమెకు వాళ్లందరిమీదా అతిశయమైన వాత్సల్యముండేదే. ఆమెకు అమృతములభిస్తే వాళ్లకుకూడా నాతో సమానంగా పోసివుండేదే. అదిగాక ఈరోజుల్లో దేవలోకానికీ, భూలోకానికీ దారులన్నీ పూడిపోయినవంటారుగా!

పెద్దలంతా యౌవనము నిలబెట్టుకోడానికి మార్గాలు చెపుతూఉంటే నాకు నవ్వు వస్తుంది. సామాన్యంగా వాళ్లు బ్రహ్మచర్యముతోనే నిత్యయౌవనము వస్తుందంటారు. అందుకు నా దొక్కటే జవాబున్నది. ఉన్న ధనము కాస్తా మూటకట్టి భూమిలో పాతివేస్తే సంపద నిలుస్తుందా, దాన్ని వడ్డీలకిచ్చి పెంచుతూఉంటే పెరుగుతుందా? ఈ లోభులనేవాళ్ల పీనాసితనము ఒక్కటే లోకానికి కనబడుతుంది కాని

వాళ్ల ధనముమాత్ర మేమీ అభివృద్ధికాదు. అంతేకాకుండా చాలాకాలము భూమిలో ఉండడమువల్ల ఆ ధనానికి విలవకూడా నెమ్మదిగా తగ్గిపోతూఉంటుంది. తీరా దాన్ని కదిపితే అది సగానికి సగం తగ్గిపోయి ఉంటుంది.

యౌవనముకూడా సరిగ్గా అంతే! ఒక సుందరికి క్రొత్త యౌవనము ఇచ్చామంటే మళ్లీ అక్కడనుంచి ఎంతయౌవనము మనము పుంజుకుంటామో ఎవరికి తెలుసును? నా కెందుకు, నాకుమాత్ర మిది బాగా అనుభవమే. నే నెంతమంది స్త్రీలతో సరసపల్లాపాలు జరిపినానో లెక్కలేదు. పదిహేనేళ్లు పదహారేళ్లు వచ్చిన నవోఢలు ఎంతమంది! వాళ్లతో నేను గడిపిన మనోహరమైన రోజులూ, అప్పటి వాళ్ల దివ్యరూపాలూ, ఇప్పటి వాళ్ల క్షీణాకారాలతో పోల్చి ఆలోచిస్తే నాకు కన్నీళ్లుకూడా వస్తవి. వాళ్ల యౌవన మంతా పోయింది. కాని, నాదో? ప్రతిక్షణవిజృంభమాణమై ఉన్నది. ఇప్పటికీ ప్రసన్నయౌవనంలో ఉన్న లతాంగులకు నామీద పరిపూర్ణకటాక్షమే. నేను బ్రహ్మచర్యం ఎప్పుడు అవలంబించాను?

బ్రహ్మచర్యము అవలంబించ మనేవాళ్లు మహానుభావులే. వాళ్లను చూస్తే నాకు గౌరవమే. కాని వాళ్లు వచ్చినడబ్బుకాస్తా వాడక ఇంట్లో దాచుకోమని సలహాఇచ్చే లోభులవంటి వెఱ్ఱివాళ్లు. లోహధనముమీద వాళ్లకు నిరసనమే కాని యౌవనధనంలో మాత్రము లోభిత్వముతో ప్రవర్తించి ఉన్న దానివిలవకాస్తా పోగొట్టుకోమంటున్నారు. చిన్నప్పుడే సన్యసించినవాళ్లను మన మెంతమందిని చూడడం లేదు? గౌరవంకోసము వాళ్లల్లో బ్రహ్మవర్చస్సు వెలుగుతున్న దని వందనము చేస్తాము. కాని పరీక్షగా చూస్తే, వాళ్ల కాషాయవస్త్రాల కాంతి మరిచిపోయి నిదానించి చూస్తే, వాళ్ల నిజస్వరూపము బయటపడుతుంది. యౌవన మెక్కడ ఉన్నదో, ఎక్కడలేదో కనిపెట్టడములో నా దృష్టి సర్చిలైటువలె ఆరితేరింది. ఇందులో నావలె స్పెషలిస్టు కానివాళ్లుకూడా అవివాహితలుగా ఉండి కట్టెవారిపోయిన పాశ్చాత్య స్త్రీలను వివాహితలతో పోల్చి ఒక్కసారి పరిశీలిస్తే బ్రహ్మచర్యము యౌవనానికి ఎంత ప్రబలశత్రువో వెంటనే తెలుస్తుంది.

కాని ప్రస్తుతము నాకు వనితలతో ఐన సావాసాలసంగతి చెప్పను. అవన్నీ ఒక్కొక్కటి ఒక్కొక్క కథ! ఈ చుట్టుపక్కల ఊళ్లల్లోనే కాకుండా నే నెప్పుడూ చూడని పట్టణవాసాలకుకూడా అత్తవారిళ్లకు వెళ్లుతూ పిల్లలు నా దివ్యరూపాన్ని తమ హృదయాలల్లో గాఢంగా చిత్రించుకొని వెళ్లినారు. ఇప్పుడు, పాపము, బుల్లి 'లలిత' జ్ఞాపకము వస్తో ఉన్నది. ఆమె ఇప్పుడు ఏ కల్పవృక్షపు నీడకిందనో కూర్చొని స్వర్గవాసనలు ఆఘ్రాణిస్తూ, వాటికంటే తియ్యనైన మా ప్రణయ విహారాలు తలచుకుంటూ తన గులాబి పెదవులతో చిరునవ్వు వెన్నెలలు నందనవనమంతా చల్లుతూ ఉండదనా!

నా యౌవనము నిజంగా నిలవ బెట్టినది ఏమి టంటే, ముఖ్యంగా జ్ఞాపకంవచ్చేవి,— లలిత పెదవులూ, కమల కళ్లూ, రత్నము కపోలములూ — లేత తమలపాకు చేతితో తాకినప్పు డల్లా రత్నము ముట్టుకున్నట్టే ఉంటుంది, వేణి స్తనకుచ్చములూ, లక్ష్మి కరపల్లవములూ, రాజ్యము పాదపద్మములూ, మరీ ఆ సీత నాభి! — ఇటువంటివేగా! మరీ ఆ సీత నాభి ఉన్న దే, అది నిత్యయౌవనపు సరస్సేకామా! వెఱ్ఱిపిల్ల, నన్ను చూస్తే వణికేది కాని నన్ను విడిచి ఒక్క క్షణం సేపు కూడా ఉండలేక మళ్లీ వెంటనే పరిగెత్తుకొని వచ్చేది!

౨

బ్రహ్మచర్యం నిలుపుకోమని చెప్పేవాళ్ల మాటల సారాంశము ఆలోచిస్తే, స్త్రీ సహవాసాలు వదిలిపెట్టి పురుష సహవాసాలు చేయమనడంకంటె మరేమీ నాకు కనపడడంలేదు. వాళ్ల మాటలు నాకు సమ్మతము కాకపోయినప్పటికీ అని తేల్లకిందులుచేసి పురుషసహవాసం వదిలిపెట్టమనకు. నా కెందుకు, నేను పురుషులతో చేసే సావాసాలు పురుషులతో చేశాను, స్త్రీలతో చేసేవి స్త్రీలతో చేశాను. ఇంతే కాదు. నాకు నిత్య యౌవనము అబ్బిందంటే ఎప్పుడూ చిన్నవాళ్లతోనే ఉండేవాణ్ణి అనుకోవడము సహజము. కాని అది ఏ మాత్రమూ సత్యము కాదు. డెబ్బై నభై ఏళ్ల వృద్ధులుకూడా నాకు ప్రియులే. వృద్ధాప్యాన్ని చూసి భయపడ సాగినామా, అది మరీ వెంటనే మీదికి పెనుభూతము వలె దూకుతుంది. అట్లాగే చక్కనివాళ్లే గాక అనాకారివాళ్లుకూడా నాకు మిత్రులే. అటువంటి ఒకానొక కురూపితో నాకైన మైత్రి సంగతే ఇప్పుడు చెప్పదలచుకున్నాను. శత్రువులను మచ్చిక చేసుకోవలెగాని విరోధిస్తే చివరకు ఒక వేళ వాళ్లు ఓడిపోయినా ఈ మన్యు పెట్టే చికాకుతో మన శక్తి సహం చంపుతారు అంతెందుకు వాళ్ల జయం నిశ్చయము! నా కెందుకు, నేను మాత్రము చికాకు పడలేను. నా కంతా పూలమీద నడిచిపోతున్నట్లు ఉండవలె. నే నెప్పుడూ బొమలు ముడివేసుకొని కాని, కళ్లు ఎఱ్ఱచేసి కాని ఎరగను. ఎప్పుడన్నా ముఖమంతా ఎఱ్ఱవారిన దెరుసుదురుగాని అది రాగాధిక్యము వల్లనే కాని మరెందువల్లా కాదు. కళ్లనీళ్లెప్పుడైనా విడవడం కద్దు. నేను హృదయపూర్వకంగానే కంట తడిపెడతాను. ఐనా చూసేవాళ్లకు అది విలాసచేష్టగా ఉంటుందట. అది లలిత నన్ను విడిచి వెళ్లేప్పుడు నాకు మొదట తెలియవచ్చింది. అప్పుడు నేను కన్నీళ్లు పెట్టుకుంటే లలిత నావద్దకు పరుగెత్తుకొని వచ్చి నా కన్నీళ్లు తుడిచి "అట్లా కన్నీళ్లు కార్చినావా అంటే అసలు నిన్ను విడిచి పోలేను చిలకా!" అని తన గులాబి పెదవులతో నా కన్నులు తాకింది.

ఇందువల్ల నేను చెడ్డవాణ్ణి అనుకోరాదు. అసలు నా ఉద్దేశము అందరిచేతా మంచి

అనిపించుకోడానికే ఈ లోకంలో పుట్టినా మని. ఇక, నాకు తెలిసినంతమటుకు నా అంత మంచి అనిపించుకున్నవాళ్లు ఎవ్వరూ లేరు. నే నెక్కడ అడుగుపెట్టితే అక్కడ సమస్తమూ మధుర మైపోతుంది. అందు కోసమనే మా ఊళ్లో కవి "మన చిలక ఎక్కడ ఉంటే అది ధర్మ యుగములోని బుష్పాశ్రమ మవుతుంది" అంటాడు. నా హృదయము సముద్రమువలె విశాల మైనది. అందువల్లనే భూమిని అంతా చుట్టుకొని ఉన్న సముద్రంవల్లనే లోకాన్ని అంతా నేను ప్రేమిస్తాను.

ఈ లోక మంటే ఎంత ఇష్టమో నాకు పుస్తకాలలో మనుష్యు లంటే కూడా అంతే ఇష్టము. నేను చదివే పుస్తకాలకు మేర లేదు. వనంలో దుష్యంతుణ్ణి చూసి మోహించిన శకుంతలను గురించి చదువుతూంటే, పాపము, నా లక్ష్మి జ్ఞాపకం వస్తుంది. అట్లాగే రాధ! మరీ అపుష్ప బాణవిలాసము, అమరుశతకం, గాథాసప్తశతి, ఆర్యాసప్తశతి—అటువంటి కావ్యాలలో నాయికలంటే నాకు మహా ఇష్టము! అక్కడ పద్యానికి ఒక నాయిక ఉంటుంది. ఏమి వాళ్ల మాధుర్యము! రామాయణము, మహాభారతము చదవడంకూడా నాకు ఇష్టమే కాని సీతా, సావిత్రీ, గాంధారీ, అరుంధతీ — వీళ్లంతా మా అమ్మగారిని జ్ఞాపకానికి తెప్పిస్తారు.

ఇక మనదేశపు కావ్యాలే కాక పాశ్చాత్యుల కావ్యాలుకూడా నాకు బాగా పరిచయమే. ఆ హెలెనా, క్లియొప్యాత్రా, గినివియరూ, లారా, మార్గరెటూ—వీళ్లంతా నాకు చిరపరిచితలే. పురుషులలో నార్సిసను డాన్‌జాన్ మరీ నచ్చినారు. బైరన్నూ, షెల్లీ లంటేన్నూ, వాళ్ల కవిత్వా లంటేనూ నా అభిప్రాయం వేరే చెప్పడ మెందుకు! కొంతవరకు ఆస్కారువైల్డు అంటేకూడా నాకు అమితాదరమే. వాళ్లు స్వర్గంలో నుంచి జారిపడ్డ అమృతపు తునకలే కాదూ! అటువంటివాళ్ల వ్రాతలవల్లనే యౌవన [illegible] క్షీణించిపోకుండా ఉన్నది లోకంలో. లేకపోతే కమలవంటివాళ్లూ, వేణివంటి వాళ్లూ పుట్టడ మిప్పటి కెప్పుడో మానేసి ఉండేవాళ్లే!

## 3

నేను స్త్రీసావాసాలూ, పురుషసావాసాలూ చేసినవాణ్ణే ఐనప్పటికి ప్రస్తుతము స్త్రీసావాసాల సంగతి చెప్పదలుచుకోలేదన్నాను. కాని ఎంత మరుద్దామన్నా మరుపురాక ఆ స్త్రీసావాసాలే మాటిమాటికీ జ్ఞప్తికి వస్తున్నవి. కొంతమంది స్త్రీపురుష జాతులలో ఒకజాతికే అందమూ, ఆకర్షణా ఎక్కువ ఉన్న దంటారు. కాని నే నది ఒప్పుకోను. ఐనా నాకు మాత్ర మెందువల్లనో స్త్రీసహవాసాలయందే ఎక్కువ ఆకర్షణ ఉన్నట్లున్నది. లేకపోతే నా పురుషసావాసాలలో ఒకదానిసంగతి చెప్పబోయి నాలలితసంగతీ, సీతసంగతీ, రత్నము కపోలనులసంగతీ-ఇవన్నీ చెప్పడ మెందుకు? నేను పురుషుణ్ణి కాబట్టి కాబోలును, స్త్రీ లంటే నా కంత ఎక్కువ ఉల్లాసము! ఐనా ఇట్లా అసందర్భంగా మాట్లాడడము నాకు స్వభావసిద్ధమే. "చిలకా, ఒకటిచెప్పబోయి ఇంకొకటి చెప్తూ ఉంటావేం?" అని ఎప్పుడూ అంటూ ఉంటారు నా స్నేహితులంతా. నిజంకూడా అంతే. నాకు వాక్‌స్థానమందు శని ఉన్నాడని జ్యోస్యు డన్నాడు. అందువల్లనే ఏది తోస్తే అది మాట్లాడుతాను. దుష్యంతుడు చెప్పినట్లుగా అంతఃకరణప్రవృత్తులే సజ్జనులకు ప్రమాణములు! కాబట్టే తోచినపని చేస్తూ ఉంటాను, తోచినమాట అనేస్తూ ఉంటాను. దుష్యంతుని కున్నట్లు నాకు సందేహముమాత్ర మేమీ లేదు.

నేను మాట ఆచనని నా స్నేహితులు నాకు రహస్యాలు చెప్పడానికి భయపడతారు. "మనస్సుకు తోచిందే చేస్తావుకాని కాస్త ఆలోచించవేమి చిలకా!" అంటారు నామీద విశేషాదరం కలవాళ్లు! వాళ్లమాటలకు సామాన్యంగా చిరునవ్వునవ్వి ఊరుకుంటాను. వాళ్లూ చెప్పి ప్రయోజనం లేదని ఊరుకుంటారు. అట్లా కాకుండా వాళ్లను ఆడించవలెననే బుద్ధే పుట్టిందా, "అవును బాబూ, నాకది పెద్దలోపమే. ఎంత ప్రయత్నించినా సవరించుకోలేను!" అంటాను. అక్కడినుంచీ వాళ్లు పెద్దపెద్దఉపన్యాసాలుఇస్తారు."ఆలోచించకుండా ఏకార్యమూ చేయరాదు" అనే తాత్పర్యంగల సామెతలన్నీ ఇంగ్లీషులోవి, సంస్కృతంలోవి, తెలుగులోవి, కన్నడంలోవి, హిందీలోవి, బంగాళీలోవి, కొంతమంది మరాఠీ గుజరాతీ భాషలలోవీ కూడా చెప్తారు. నే నవన్నీ చాలా విచారంతో విని "ఇన్ని భాషలు చెప్తున్నా నా లోపము సర్దుకోలేకుండా ఉన్నాను, ఏమిచేయను!" అని నిట్టూర్పు విడుస్తాను. ఐనా ప్రయత్నించి చూడమని వాళ్లు ఎంతో హృదయపూర్వకంగా బోధించి చూస్తారు. "నేను నేటినుంచే తప్పక ప్రయత్నిస్తాను" అంటాను. వాళ్లూ సంతోషించి ఊరుకుంటారు.

కాని చాలామంది అజాగ్రత్తలో ఉన్న వివేకం ఎరగరు. నా అభిప్రాయాలన్నీ నా అనుభవాన్ని బట్టే ఉంటవి. నే నెప్పుడూ తోచిన పని చేస్తూ ఉండడమువల్లనే నన్నంతా "చిలకబుద్ధి అమృతమువలె స్వచ్ఛమైనది. అందులో కల్మషముండదు. అతను ఈకాలపు మనిషి కాడు" అంటారు. నేనే గనక ఆలోచించి జాగ్రత్తగా ప్రతిదీ మాట్లాడుతూ ఉన్నానంటే 'లోపలలోపల స్వయంపాకి' మనీ, 'కూచి'అనీ, 'టక్కరి'అనీ నన్ను లోక మనకపోదు. ఇప్పటివలె లోకము నన్నప్పుడు నమ్ముతుందా? ఇక ఆలోచించి చేయడమువల్ల ఫలితమేమున్నది, జనులకు మనమీద ఉన్న విశ్వాసం పోగొట్టుకోవడమే కదా! నాకు ఎన్నడూ అలవాటులేని ఆలోచన చేసి మాట్లాడినందువల్ల నాకైన శాస్తికూడా కాస్తసేపటిలోనే చెప్తాను వింటారుగదా!

నాస్నేహితులంతా నాకిట్లా జాగ్రత్తగా ఉండమని ఉపదేశాలు చేస్తారన్నమాటే గాని ఏదైనా రహస్యము నాతో చెప్పకుండా దాచుకోలేరు. నన్ను చూడగానే "చిలకా, నీకొక రహస్యము చెపుతాను, ఎవరికీ చెప్ప

బోకు!" అని నే నటువంటి వాగ్దత్తమేమీ చేయకముందే ఆ రహస్యము నాకు చెప్పి స్తారు. వ స్త మాటిమాటికీ నన్ను ... చిలకా' అని పిలుస్తూ ఏదో చెప్పతూ ఉండకుండా ఊరుకోలేరు.

ముం దిప్పుడు నా పేరు చిలక అని ఎందుకు వచ్చిందో చెపితే బాగుంటుం దేమో! నేను చిలకనంటే 'శుకసప్తతి'లో వచ్చి మాట్లాడే పక్షిజాతిలో చేరిన చిలకనని ఆంధ్రపండితులు కూడా ఇంతవరకూ విన్నట్లయితే భ్రమించి ఉండరు. నేను మొదటినుంచీ చక్కగా బట్టలు దిద్ది కట్టుకొని దేహ మెప్పుడూ ధగ ధగలాడుతూ ఉండేట్లు శుభ్రంగా ఉంచుకొని, నాయికాగమనము నిరీక్షించే నాయ నివలె మోహనంగా ఉండేవాణ్ణి. ఇప్పుడూ ంతే. ఇంతేకాకుండా నాకు క్షణానికి ఒక ్రమైన అలంకారము చేసుకోవడ మిష్టము. నేను ఏ అలంకారము చేసుకున్నా నాకది ిదిరిపోతుంది. అందువల్లనే మావూళ్లో కవి "చిలకకోసమే ఈఅలంకారాలన్నీ లోకంలో ్టినవేమో!" అంటూ ఉంటాడు. సరే! ఈ నాఅలంకారప్రియత్వము చూసి ఇంగ్లీషు దువుకున్న నాస్నేహితులు 'జటర్ఫ్లై'కి ర్జుమాచేసి 'సీతాకోకచిలక' అనేవా ాని ఇంగ్లీషు చదువుకోకపోవడంవల్ల దాని చమత్కారం బాగా తెలియని మా వూళ్లో కవి "అంతపేరు బాగుండలేదు. 'చిలక' అని మాత్రమే ఉంటే బాగుంటుంది" అన్నాడు. అక్కడినుంచీ నన్నంతా 'చిలక చిలక' అని పిలవడం సాగించినారు. అందుచేత నా అసలు పేరు చెప్పినా చాలా మందికి తెలియదు. నేనే నా అసలుపేరు మరిచిపోయిన ట్లున్నాను. అది జ్ఞాపకం చేసుకోవడానికి నే నిప్పు డవస్థ పడనేను. ఎందుకూ, దానికోసము వృథా ప్రయాస పడడము!

## ౪

ఇప్పటికి రెండుసార్లు ప్రయత్నించినా అసలు కథలోకి రాలేక పోయినాను. ముఖ్యంగా మూడోసారి యత్నంచేస్తాను. ఈ మా టన్నా కష్ట ... ండా నా ప్రయత్నం సఫలం ... చూతాను, ఇంతలో ఒరిగిపోయే ... న్నది! నే నిప్పుడు పరీక్షకు కూర్చోలేటుగా! అంతగా ఐతే ఇంకోసారికూడా అప్రస్తుత ప్రశంసలోకి దిగుతాను!

ప్రస్తుతము నా స్త్రీసహావాసాల సంగతి చెప్పదలచుకోలేదు. పురుష సహావాసాలన్నిటినీగురించికూడా చెప్పడానికి తలపెట్ట లేదు. అందులో ఒకదాన్నిగురించిమాత్రమే చెప్పదలచుకున్నాను. అది మదనమోహనంతో నాకు వచ్చిన భేదముసంగతి! అవును, అతనితో నా సావాసముసంగతి కాదు, భేదముసంగతే, నేను చెపుతాను!

నన్ను చూస్తే ఎవరికీ విరోధభావము కలగదు. నేను దూరాన ఉన్నప్పుడు ఒకవేళ కలిగినా నన్ను చూస్తే వాళ్ల కది కాస్తా మాయమైపోతుంది. ఇదంతా నిజమే. కాని ఒక్క మోహనం విషయంలో నాకు భేద భావము కలిగిన దన్నమాటకూడా నిజమే. భేదభావము నాకు కలిగిన దనడము పొర పాటు, అతనికే నావిషయంలో ఆ భావము కలిగినది!

నేను చక్కనివాళ్లతోనే గాక అనాకారివాళ్లతోగూడా సమానంగా సావాసం చేస్తా నన్నాను. మదనమోహనం పేరు ఎట్లా ఉన్నా నిస్సంశయముగా అతను ఆరెండో జాతిలో చేరినవాడు. నా స్నేహితులలో అపహాసించే స్వభావము గలవాళ్లు "లోక పితరుడైన బ్రహ్మదేవుడు అందం పెట్టక పోయినా, మదనమోహనం తండ్రిగారు మాత్రము పేరులో అతన్ని మోహనాకారుణ్ణి చేసినారు" అని పరిహాసిం చేవా ళ్లు. చక్కని రూపమున్నా, ఏ పుల్లయ్యో అనో పేరున్నవాళ్ల ... గువవ్వలా నవ్వుతూ "నీ కేమయ్యా, ప్రేమావతారమైన పేరున్నది!" అనేవాళ్లు.

కాని నేను మదనమోహనాన్ని ఒక్క మాట ఐనా నా ఎదట అననిచ్చేవాణ్ణికాదు. ...కారితనంమీద ప్రేమ ఇది నాది తెచ్చి పెట్టుకున్నది కాదు. అది మనస్సులోపల నుంచి స్వయంగా వచ్చేదే. 'కాకిపిల్ల కాకికి ముద్దు' అన్నట్లు అవతలవాళ్ల అనాకారి తనం ఆదరాతిశయంవల్ల తెలియకపోవడం కూడా కా దిది. ఏది అందమో, ఏది కాదో తెలుసుకోవడం నాకు తెలిసినట్లు లోకంలో మరెవ్వరికీ తెలియ దని ప్రతీతి పడ్డవాణ్ణి. చివరకు చిత్రకారులుకూడా తమ బొమ్మలు చూపి నా సలహా అడిగి నేను గనక బాగున్న దంటే తృప్తిపడి వెళ్లుతూ ఉంటారు. మదనమోహనం రూపములో ఒక్క దంత పంక్తికి తప్ప ఆ బ్రహ్మదేవు డింకెక్కడా అందము కల్పించలేదు. "ఆ అనాకారి ముఖంలో అటువంటి మంచి దంతపంక్తి ఉండడము కూడా ఎక్కిరించినట్లుగా ఉంటుంది" అనేవాళ్లు నా స్నేహితులు! కాని ఆమాటల్లో ఎంతవరకు సత్యమున్నదో నా కింకా నిర్ధారణ కాలేదు. కాని అందంలో ఏమి లో...న్నా అంతటినీ అతని సరసత్వము మరిపి... .

నే నతనితో సావాసం చేస్తున్నప్పటి నుంచీ నాపూర్వస్నేహితు లంతా ఆశ్చర్య పడ సాగినారు. ఎందుకో, అతను సరసుడు కాడనికూడా వాళ్ల అభిప్రాయము. "మన చిలక ప్రతిదీ ఆలోచించకుండా చేస్తాడు. చెపితే వినడు. ఏం జేయగలము!" అనుకునేవాళ్లు. కొంతమంది నా వద్దనుంచి కొంచెము దూరంగా తొలిగి ఉండవలెనని ప్రయత్నంకూడా చేసినారట గాని వాళ్ల కది సాధ్యము కాలేదు. నన్ను చూడకుండానూ, నాతో మాట్లాడకుండానూ ఒక్క రోజుకూడా వా ఉండ లేరు.

ఆపైన కొన్నాళ్లల్లో నెమ్మది నెమ్మదిగా నా స్నేహితులంతా మా సావాసానికి అల వాటుపడ్డారు. కాని అ... పయస్యంగా వాళ్లకు మోహనంమీద ఇంకా ... యి ... మంచి

ష్టము వాళ్లు బయటపెట్టకుండా ఉండలేక పోయేవాళ్లు. ఏదో విధంగా మోహనాన్ని ఎక్కిరిస్తూనే ఉండేవాళ్లు. మే మిద్దరమూ ఒకచోట ఉంటే హంసా కాకి ఉన్నట్లుగా ఉంటామట. ఈవిధమైనవే ఎన్నో ఉపమానాలు కల్పించేవాళ్లు. 'కప్పా, మీనూ కలిసి ఉన్నట్లు' అనేవాళ్లు! నా పూర్వస్నేహితులు ఇంతమోటుగా ప్రవర్తిస్తారేమా అని ఒక్కొక్కప్పుడు నాకు విచారము కూడా కలిగేది. నే నేమన్నా వాళ్లే నడిగి నానా "మేము చెప్పినదాంట్లో అబద్ధ మేమున్నది? నీవల్లేనే మాకు తోచింది మే మంటున్నాము, తప్పేమున్నది చిలకా?" అని నామాట నాకు అప్పగించి టక్కరు నవ్వులు నవ్వేవాళ్లు.

ఇక మోహనంసంగతి! అతనితో నేను మాట్లాడుతూ కూర్చుంటే నాకు ఆనందమయంగా ఉండేది. లోకంలో ఉన్న సమస్త భేదశక్తులనూ మైత్రి కలుగుతే అది ఎంతిగాఢంగానూ, మనోహరంగానూ ఉంటుందో మా మైత్రి అంత మనోజ్ఞంగా ఉండేది. సంభాషణలో అతన్ని నేను మాటి మాటికీ మదనా మదనా అనీ, మోహనా మోహనా అనీ సంబోధిస్తూ ఉండేవాణ్ణి. అతనూ అట్లాగే నన్ను చిలకా చిలకా అంటూ ఉండేవాడు.

కాని మా స్నేహానికి నా పూర్వస్నేహితులు పానకంలో పుడకలులాగా ఉంటూ ఉండేవాళ్లు. మదనమోహనంకూడా చేతనైనంతవరకు వాళ్లు నాదగ్గర ఉండని సమయంలోనే నాతో మాట్లాడి పోతూ ఉండేవాడు. కాని నా స్నేహితు లందరితో అతనికికూడా నెమ్మదిగా అనురాగబంధము ఏర్పడసాగింది. వాళ్లు మాత్రము నే నింతగా ప్రేమిస్తున్న మోహనాన్ని కొంత ఐనా ప్రేమించకుండా ఎట్లా ఉంటారు! రోజు లంతకంతకు సౌమ్యముగా గడిచిపోసాగినవి.

౫

మోహనంలో చక్కదనం లేకపోయినా విపరీతమైన ఉల్లాసం మాత్ర ముండేది. అందువల్లనే నా పూర్వస్నేహితులు అతనంటే ఇష్టంలేని మొదటి రోజుల్లో, పాపము, కొంచెము నిర్దయతో "లోకంలో కల్లా చక్కని వాడికైనా ఇంత ఉల్లాస ముండదు" అనేవాళ్లు. ఉల్లాసపూర్ణమైన ముఖంతో అతను నన్ను రోజూ ఒక్కసారన్నా కలుసుకొని మాట్లాడిపోతూ ఉండేవాడు.

కాని ఒకపర్యాయము వరసగా రెండు రోజు లతను రాలేదు. ఏమా కారణ మని ఆశ్చర్యపడ్డాను. మూడో రోజు కూడా వచ్చింది. ఉదయం దాటింది. మాట్లాడడానికి వచ్చిన స్నేహితు లంతా వెళ్లిపోయినారు. కిటికీలోనుంచి మోహనం ఇవ్వాళైనా వస్తాడేమో నని చూస్తున్నాను. దూరాన అతని ముఖం కనపడ్డది. నాముఖం మామూలు కంటె విప్పారింది.

కాని అతను లోపలికివచ్చి ముఖం చూపేప్పటికి నా సంతోష మంతా పోయింది. అతను మామూలువలె లేడు. అతని ముఖంలో ఉల్లాసమనే మాట లేదు. ముఖాన తెర దింపినట్లుగా దైన్యము వేలాడుతున్నది. సహజకురూపి ఐన అతనికి, పాపమ్, అది భయంకరాకారము కలిగించింది. అతని కళ్ల వెంట నీళ్లు కూడా వస్తున్నట్లున్నవి.

నేను దుఃఖపడేవాళ్లను చూడలేను. అది కాఠిన్యమువల్ల కాదు; ఆదరాతిశయమువల్లనే. పిల్లరు చనిపోతున్నప్పుడు ఆ భయంకరాకారము చూడవలసి వస్తుందని చూసిరానన్న గెటే నాకెప్పుడూ జ్ఞాపకంవస్తాడు. అందువల్ల అప్పుడు నేను తొందరతో "విశేష మేమిటి మదనా?" అన్నాను.

కొంతసేపటిదాకా అతను నోరెత్తి మాట్లాడలేదు. చివరకు ముఖము అవతలికి తిప్పుకొని మాట్లాడినాడు. "చిలకా చిలకా, రెండురోజులబట్టీ ఓర్చుకున్నాను. ఇవ్వాళ నీదగ్గిరికి రాకుండా ఉండలేకపోయినాను!" అన్నాడు.

నేను కొంచెము ఆదుర్దాతో "ఎవరన్నా నిన్ను అవమానించినారా ఏమి మదనా?" అన్నాను.

"నన్నెవ్వరూ అవమానించలేదు. నా దురదృష్ట మే! దానికి నేనేమి చేసేది!" అని కొంచెము రోదన మారంభించినాడు.

నాకు గాభరావేసింది. నేను స్వయంగా రోదనము చేయలేను. ఇతరులు రోదనము చేస్తూఉంటే చూడనుకూడా చూడలేను. కాబట్టి కూర్చున్నవాణ్ణి అక్కడినుంచి చివాలున లేచి అతనిముఖం ఉన్న వేపుకు వెళ్లి "అట్లా ఏడవక సంగ తేమిటో త్వరగా చెప్పు!" అన్నాను.

నే నటు వెళ్లగానే అతను తన ముఖమంతా దోసిట్లో మూసుకొని "అవతలికి పో చిలకా! నీవు నా వెనకకు వెళ్లు చిలకా! అందాకా నీతో మాట్లాడను!" అన్నాడు. వచ్చినప్పటినుంచీ ముఖము నాకు కనపడకుండా ఉండేవిధంగా కూర్చున్నాడని నాకప్పుడే స్పష్టమయింది.

అంతకుమునుపు నాతో ఎవ్వరూ అంత మోటుగా మాట్లాడి ఎరగరు. అందువల్ల ఆనాడు మోహనం అట్లా మాట్లాడడము మహాసోద్యమయింది. మొదట అది కొద్దివిరసమైన హాస్యమేమో అనుకున్నాను. కాని చూడగా ఆదుఃఖము నటనగా కనపడలేదు. కొంతసేపు ఆలోచించి నెమ్మదిగా అవతలికి వెళ్లినాను. నేను అవతలికి వెళ్లేవరకూ మానభంగమైన స్త్రీవలె 'పో పో'అంటూ అతను ముఖం దోసిట్లోనే పెట్టుకొని అరుస్తున్నాడు.

నివ్వెరపోతూ నేను యథాస్థానానికి వచ్చి "ఇక ఏమిటో చెప్పు"మన్నాను.

అప్పుడుఅతను నెమ్మదిగా దోసిట్లోనుంచి ముఖమెత్తి "చిలకా, నీకంటె వేరే నాకాప్తులెవరూ లేరు. నా దుఃఖభారము నీకుకూడా చెప్పకుండా దాచవలె నని రెండురోజులనుంచీ ప్రయత్నించినాను కాని నా కది సాధ్యము కాలేదు. నా కీభారము దుర్భర

మయింది. ఈసంగతి ఎవరితో చెప్పవుగదా!" అన్నాడు.

అప్పటికే నాకతనితో మాట్లాడడం విసుగు పుట్ట సాగింది. కష్టపడుతున్న వాళ్లతో ఎక్కువసేపు ఉండలేనని మునుపే చెప్పి నానుకామా! అందుకని ఎట్లాగో అట్లా తప్పించుకోడానికి "సరేలే చెప్పు" అన్నాను.

"ఎవరితో నన్నా చెప్పేవుసుమా!" అని మళ్లీ అన్నాడు.

"రహస్యాలు దాచడం నా చేతకాదు. అందుకు ఒప్పుకుంటేనే చెప్పు! లేకపోతే చెప్పనేవద్దు!" అందా మనిపించింది. నాలిక చలనంకూడా ప్రారంభించినది. కాని దుర్బుద్ధి పుట్టేవేళకు అనఃలసిన వాక్కు నోట వస్తుందా! అనుకున్న ఆమాటలు నాలిక తోనే ఆగిపోయినవి. తోచినమాట అనేసే స్వభావమున్న నేనుకూడా ఆ ఒక్కసారికీ తోచిన ఆమాటలు అనక అతన్ని కాస్త సంతోష పెట్టడము కోసము "ఎవరితోనూ చెప్పనులే, చెప్పు!" అన్నాను. అట్లాతోచిన మాట అనక ఆలోచించి మాట్లాడిన ఫలితము ఎంత భయంకరంగా నా అనుభవానికి వచ్చిందో త్వరలోనే చెప్తుతాను. సైతాను ప్రేరేపణకు లొంగిపోయిన ఆదాముహవ్వల గతే నాకు సరిగ్గా పట్టింది.

నేను వాగ్దత్తము చేయగానే మోహనం కొంచెము శాంతము తెచ్చుకుని గొంతు సవరించుకొని ఇట్లా చెప్పసాగినాడు :

"చిలకా, నాదంతపంక్తి సొగసుగా ఉంటుందని నీవుకూడా ఎప్పుడూ అంటూ ఉంటావు. నేనుకూడా అద్దంలో వాటి అందంచూసి తనివితీరక పదేపదే చూచుకుంటూ ఉంటాను. ఇక నాకా భాగ్యమేదీ! ఎవరన్నా ఓర్వలేనివాళ్లు ఏ చాతబడి ఐనా చేసినారేమో! దంతమొకటి లోపలిది మొన్న తెల్లవారేప్పటికి ఊడి పక్కలో పడిఉన్నది. మొదట అది నాది కాదేమో అనుకున్నాను. కాని అంత చక్కని దంతము నాకు కాక పోతే మరి ఎవరికి ఉంటుంది! నాపక్కలో ఉన్న దంతము చూసినకొద్దీ నాదేనేమోనని అనుమానం పుట్టసాగింది. చివరకు నా నిలువుటద్దంలో పోయి చూసుకుందునుగదా, నేను భయపడ్డదే నిజమయింది. అప్పుడిక నాకెట్లా ఉన్నదో ఏమి చెప్పేది! ఇంకా జీవించడం ఎందుకా అనిపించింది. లోకముముఖ మెట్లా చూస్తానా అనుకున్నాను. లోకమంతా తొఱ్ఱిపోయిన నా నోటినే చూస్తూ వెక్కిరిస్తున్నట్లుగా తోచింది. చిలకా, నీ కెట్లా నా ముఖము చూపుతానా అనుకునేప్పటికి ఏడుపు వచ్చింది. ఈ రెండురోజులనుంచీ గదిలోనుంచి బయటికి రాక నిద్రాహారాలు లేకుండా ఒక శేతీరున విలపిస్తున్నాను. ఇప్పుడు చివరకు నీకు కూడా చెప్పకోక పోతే మనసునిలవక చెప్పడానికి వచ్చినాను"

మాట్లాడడం చాలించి మదనమోహనం నా వైపుకు ముఖం తిప్పినాడు. అతని ముఖమప్పుడు చూస్తే నాకు చాలా చింతకలిగింది అనుకున్నాను. కాని అతను "చిలకా, నీవు ఎంత కఠినుడివి! నా ఆఘోషణ వినికూడా నీ వేమాత్రం చలించవేమి!" అన్నాడు.

"కాదు మదనా, నేను నిజంగా చింతిస్తున్నాను. ఇంత విచారము మునుపు నా కెప్పుడూ కలగలేదు. లలిత విడిచి వెళ్లేప్పుడు నాకు కన్నీళ్లు వచ్చినవి, చివరకు అప్పుడుకూడా నాకింత కష్టమనిపించలేదు" అన్నాను.

నా మాటల కతనికికూడా చిరునవ్వు వచ్చింది. అతను నవ్వగానే అతని దంతపంక్తి కనపడ్డది. ఆ దంతపంక్తి యథాప్రకారముగా స్వచ్ఛమై, శోభావంతమై సక్రమంగా ఉన్నది. నాకాశ్చర్యమువేసి "మదనా, నీదంతపంక్తి అంతచక్కగాఉంటే దంతము పోయిన దంటావేం?" అన్నాను.

పాపమతను మళ్లీవిచారగ్రస్తుడై "చిలకా, నేను నోరు బాగా తెరవకపోతే అట్లాగే ఉంటుంది. పోయినది లోపలిదంతము!" అని చూపినాడు.

ఏమున్నది! అది చూడగానే నాకు చెప్పలేని రోత కలిగింది. కాని మళ్లీ రెండవ సారి తోచినమాట అనక అది దాచి అతన్ని సంతోష పెట్టడానికి "ఫరవాలేదు లెద్దూ మదనా, అది ఎవ్వరికీ కనపడదులే!" అన్నాను.

మళ్లీ నన్నతను "ఎవ్వరితోనూ చెప్పకు సుమా" అని మరీ మరీ చెప్పి వెళ్లి పోయినాడు.

## ౬

మళ్లా యథాప్రకారము మదనమోహనము స్నేహితులతో తిరగ సాగినాను. వెనకటివలె అప్పుడప్పుడుకూడా ఫక్కు మని పెద్దనవ్వు నవ్వడ మొక్కటి లేదే కాని యథాప్రకారము అతని ముఖము ఉల్లాస పూరితమై ఉండసాగింది. జరిగిన ఆ కాస్త మార్పు స్నేహితు లెవ్వరూ గమనించ లేదు. ఆ తొఱ్ఱపన్ను లోపలగా ఉన్నందువల్ల అదికూడా వాళ్లు గమనించ లేదు. అంతే కాక వాళ్లలో ఎవరికన్నా ఆదరాభిశయము కలిగినప్పుడు ఒక్కొక్కసారి "మోహనను దంతపంక్తిలో నిజంగా మదన మోహనుడే" అనేవాళ్లు. ముఖ్యంగా అటువంటి వేళలలో నా నోరూరుకునేదికాదు. నిజము తెలిసిన నాకు చెప్పివేతామని బుద్ధి పుట్టేది. కాని నైజానికి విరుద్ధంగా ప్రతిజ్ఞాబద్ధుడనై ఆపుకో సాగినాను. మాటిమాటికీ నా ప్రతిజ్ఞ నా సౌఖ్యానికి ప్రతిబంధకంగా ఉండ సాగింది.

ఆ రోజుల్లో ఎప్పుడూ మైడాసు రాజు భార్యకథ జ్ఞాపకం వచ్చేది. అనగా అనగా మైడాసు అనే పేరుగల రాజొక డుండేవాడు. అతనికి అన్నీ మంచి గుణాలే. విశేష ధనవంతుడు, ప్రతాపశాలి, దివ్య సుందర విగ్రహుడు. కాని ఎప్పుడూ ఉష్ణీష మొకటి ధరించి ఉండేవాడు. అ దెందుకోమాత్రము ఎవరికీ బోధపడేది కాదు.

ఆ మహారాజు ఒక్క క్షణమైనా తలగుడ్డ తీసివేయడేమా అని ప్రతివాళ్లకూ ఆశ్చర్యంగా ఉండేది. కాని ఎవ రాయనను ప్రశ్నించగలరు? అందరికీ తెలుసుకోవలెనని కుతూహల ముండేదే కాని ఎవ్వరూ అడగ సాహసించలేరు.

ఆ రాజుకు ప్రియురాలైన భార్య ఒకతె ఉన్నది. ఆమెతో కలిసిఉన్నప్పుడుకూడా మైడాసురాజుకు ఉష్ణీష ముండేది. "సభ విడిచి వచ్చినతర్వాతకూడా ఉష్ణీషము తీసివేయరే" మని ఆమె చాలాసార్లు అడిగింది. రాణికి అడగడానికి ఏం భయము? కాని రాజు ఎన్నిసార్లో చెప్పక కప్పిపుచ్చినాడు. చెప్పకుండా ఉన్నకొద్దీ తెలుసుకోవలెనని రాణికి కుతూహల మెక్కువ కాసాగింది.

ఏమున్నది! ఆపైన ఎప్పటికీ జరిగే కథేగా? చివర కొకనాడు రాణి భర్తను ఎక్కువ సంతోషపెట్టి ఉష్ణీషము తీయక పోవడానికి కారణ మడిగింది. రాజు కరుణార్ద్రీభూతచిత్తుడై "దేవీ, ఇది పరమ రహస్యము. నీవు పదిలముగా ఇతరులకు చెప్పకుండా ఉండగలవా?" అన్నాడు.

నావల్లే గాక ఆమె మహానందంతో సరేనని ఘోరంగా ప్రతిజ్ఞ చేసింది. రాజు రహస్యము చెప్పివేసినాడు. అతనివి 'గాడిద చెవులు.' అవి కనపడకుండా ఉండగలందులకే ఆ ఉష్ణీషము రాత్రింబగళ్లూ ధరిస్తాడు.

రాణికి రహస్యం తెలిసింది. రహస్యము ఒక్క పురుగుకుకూడా వెల్లడిచేయనని ఘోరప్రతిజ్ఞ చేసిఉన్నది. ఎట్లా! అందరూ రాజును దివ్యసుందరవిగ్రహు డని పొగడేవాళ్లు! ఆమె అది విని ఎట్లా సహిస్తుంది? "విూకే నిజం తెలుస్తేనా?" అనుకునేది.

రోజులు గడిచిపోతున్నవి. రహస్యపు భారము రాణి భరించలేకుండా ఉన్నది. ఆమె కెప్పుడూ అదే వ్యథ. అందులో స్త్రీ ఆయెను! మన పురాణాల్లో విష్ణుమూర్తి రామావతారము ఎత్తబోతున్నాడనే రహస్యము దేవలోకంలో తెలుసుకొని ఆ రహస్యము ఆపుకోలేక పొట్ట ఉబ్బిపోతున్న నారదమహర్షి కథ వింటామే, ఆవిధంగానే అయింది ఆగ్రీకురాణి అవస్థ. నారదుడు రహస్యమంతా పుట్టలో ఊది భారము తగ్గించుకున్నాడుట. అది వాల్మీకిమహర్షి కి ఒక్కడికిమాత్రమే తెలిసింది. ఇక ఆరాణి ఏమిచేసిందో, దాని ఫలిత మేమిటో వినండి!

ఆ పూర్వకాలపుసత్యయుగంలో రాజులకు, రాణులకు ఇప్పటివలె ఐశ్వర్యము, ఆడంబరము ఉండేవి కావు. వాళ్లుకూడా సామాన్యులవల్లేనే తమగృహకృత్యాలు తాము నిర్వర్తించుకునేవాళ్లు. పనిచేయడము అగౌరవమనేభావము వాళ్లలో ఇంకా పుట్టలేదు. కాబట్టి మైడాసురాజు పొలాలు దున్నేప్పుడు, గనులు తవ్వేప్పుడు తీరిక ఉంటే స్వయంగా అక్కడికి వెళ్లి పనులుచేయించేవాడు. రాణికూడా రోజూ చెరువుకు బిందె చంకను పెట్టుకొని నీళ్లకు వెళ్లేది.

ఒకానొకరోజున ఉదయమే రాణి నీళ్లకు వెళ్లింది. అప్పటి కెవ్వరూ ఇంకా అక్కడికి రాలేదు. ఒక్కపెట్టుగా శివ మెత్తినట్లు ఆమెకు రహస్యపుభార మావేశించింది. ఎవ్వరూ వినడంలేదుగదా అని ఎట్లాగో వంగి నెమ్మదిగా ఆ చెరువునీటితో "నాభర్తకు 'గాడిదచెవులు!' అందువల్లనే రాత్రింబగళ్లూ ఉష్ణీషము పెట్టుకోవడము! ఇది పరమరహస్యము!" అనేసింది. అంతటితో ఆమె హృదయభారం తీరింది! ఇక దాని ఫలిత మేమిటో వినండి!

గోడలకు చెవులు ఉంటవని అంటారు. ఐతే ఆ చెరువునీటికి చెవులే కాక నోరుకూడా ఎట్లా వచ్చినదో తెలియదు కాని ఆ ఉదయమే లోకానికంతా ఆ పరమరహస్యము వెల్లడి ఐపోయింది. అంతా మన రాజువి 'గాడిదచెవు' లని అనుకునేవాళ్లే! "ఇన్నాళ్లేబట్టే ఉష్ణీషమురహస్యము బయటపడలేదు. ఏదో ఇటువంటిది ఉంటుందనుకుంటూనే ఉండేవాళ్లము!" అనుకొని అంతా ముసిముసి నవ్వులు నవ్వుకునేవాళ్లే!

కొంతకాలము నాదికూడా ఆరాణి అవస్థే అయింది. అలవాటులేని ఈ ఔపాసనము ఎందుకు పెట్టుకున్నానా అని చింతించసాగినాను. ఎన్నడూ లేనిది నాలో ఏదో మార్పు ఉన్నట్లుగా స్నేహితులుకూడా గమనించసాగినట్లున్నారు. కాని నేను ఎక్కువకాలము చింతతో బాధపడలేను! నాప్రకృతి అది! చివరకు ఒకనాడు నా రహస్యము స్నేహితులకు చెప్పివేశాను. ఆరోజున వాళ్లు మదనమోహనందంతకాంతులనుగూర్చి మరీ ఎక్కువగా పొగడుతున్నారు. మోహనమప్పుడు అక్కడే ఉన్నాడు. నాకేసి అతను దీనంగా చూస్తున్నాడు. ఐనా నేను ఆపుకోలేకపోయినాను, చెప్పేశాను!

"పాపము, మదనమోహనానికి పన్నొకటి ఊడిపోయింది. ఇంక ఏమి ఉండి ఏమి లాభము!" అనేశాను.

దానితో నాభారం తీరింది. నా కష్టం మాయమయింది. ఎన్నటికీ మళ్లీ రహస్యం దాస్తానని గట్టిగా వాగ్దానం చేయగూడ దనుకున్నాను.

కాని ఆ ఒక్కసారీ వాగ్దత్తముచేసిన ఫలమేమిటో తెలుసునా! నన్ను చూసి అసహ్యించుకొనేవాళ్లు ఈ ప్రపంచకంలో ఎవ్వరూ లేరు కాని ఆ మదనమోహనము మాత్రము నాతప్పు మన్నించలేదు. మరి నాతోగాని, నా స్నేహితులతోగాని అతను మాట్లాడలేదు. నన్నుకూడా లోకంలో ఒకరు విరోధభావంతో చూస్తున్నారుగదా అనే భావం నాకు మొదటిసారి కలిగింది. నాకు ఎక్కువగావిచారపడడము చేతకాదు. కాని ఈ విషయమైన చింత ఒక్కటి మాత్రము నా జీవితరాగములో అపశ్రుతివలె బాధిస్తున్నది.

నా ప్రతిజ్ఞాచిహ్నము ఒక్క మదనమోహనంమనస్సులో మాత్రమే ఉండిపోయినా నేనంతగా విచారపడేవాణ్ణి కాదు. అది నా

దేహాన్నే ప్రత్యక్షంగా వచ్చి ఆవేశించింది. ఆసంభాషణ జరిగినమర్నాడు అద్దంలో నా దంతపంక్తి చూసుకోగా, సరిగ్గా ఎటువైపున ఎన్నవదంతము మదనమోహనానిది ఊడిపోయిందో, ఆ దంతముమీదనే, నాస్వంత దంతముమీదనే మచ్చ ఒకటి ఏర్పడ్డది. అది నా కళ్లబడగానే చేతులోని అద్దము జారి కింద పడిపోయింది. కళ్లవెంబడి నీళ్లు కారినవి. లోకములోని బాధ నాకు తెలియవచ్చింది. ఆదాము, హవ్వలు సైతానుకు లొంగిపోయినారు.

ఈ లోపము నా దేహాన్ని ఆవహించి ఉన్నందువల్లనేనేమో మునుపు నామీద కోపము వచ్చిన ఇతరులను వల్లే నేను ఈ మదనమోహనముకోపము జయించలేక పోయినాను!

కాని ఇందులో ఒక్క వివేకకార్యము మాత్రము చేసినాను. మదనమోహనమువలె నాకోపము కప్పిపెట్టవలెనని ప్రయత్నించక స్నేహితులందరికీ ఆపూటే చెప్పివేశాను. మనసులోమాట దాచవలెనని కొన్నాళ్లు ప్రయత్నించినందుకు ఈ శాస్తి అనుభవించి కూడా మళ్లీ అపారపాటు చేస్తానా? నా స్నేహితులందరికీ నా దంతలాంఛనము సంగతి తెలుసును. అందుకనే మావూళ్లో కవి "మన చిలకకు దంతలాంఛనము చంద్రునికి కళంకమువల్లే ఒకటి ఉన్నా చిలక అమృత స్వరూపుడుగదా!" అంటూ ఉంటాడు.

కళంకం వంటిమీదఉన్న చంద్రుడి మనస్సులో బాధ ఉంటుందో, ఉండదో నే నెరగనుగాని ఈ దంతలాంఛనము నాకుమాత్రము అశాంతి కలిగిస్తున్నది.



# ఆంధ్రదేశంలో ఆయుర్వేదోద్యమం

## ఆయుర్వేదాభివృద్ధికై పాటుపడిన ఆంధ్ర మహాపురుషులు : వారు పడ్డ పాట్లు

[వైద్యశాస్త్రి]

"దేశముయొక్క రాజకీయపారతంత్ర్యమును నిర్మూలింపవలెననే యుద్దేశము కాంగ్రెసున కున్నప్పటికీ, కేవలము ఆ యుద్దేశమే దాని పుట్టుకకు కారణము కాదు. కాంగ్రెసుసంస్థమూలమున నే జాతీయవికాసమునకు సంబంధించిన అనేకోద్యమములు వ్యాప్తిలోనికి వచ్చినవి."

—కాంగ్రెసుచరిత్ర



నిజంగా భారతదేశంలో జాతీయపునర్నిర్మాణం యాభైసంవత్సరాలకు పూర్వమే పలుముఖాల ప్రారంభమైంది. భారతజాతిని అంతటినీ తన పూర్వపు ఔన్నత్యాన్ని పొందేటట్లు చేయడానికి రాజకీయనాయకులే గాక శాస్త్రజ్ఞులు, పండితులు, కవులు, పారిశ్రామికులు, కళాభిజ్ఞులుఅందరూ అనేకవిధాల పాటుపడుతూనే ఉన్నారు.

### ఆయుర్వేదోద్యమం

ఒకప్పుడు మహోన్నతమైన దశను అనుభవించి, ఇప్పుడు అనేకకారణాలచేత అధోగతిలో ఉన్న భారతదేశంలో, అన్ని ఆర్యవిద్యలతోపాటు, భారతదేశసంప్రదాయాను గుణంగా జాతీయారోగ్యాన్ని కాపాడగలిగిన దేశీయవైద్యశాస్త్రమైన ఆయుర్వేదం కూడా అధోగతిన ఉండడం చూచి, దాని పునరుద్ధరణకై, ఆయుర్వేదోద్యమం, అఖిలభారతాయుర్వేదవైద్యసమ్మేళన రూపంతో 1907-వ సం. నుండి ఒక సునిశ్చితమైన కార్యవిధానాన్ని అనుసరించి ప్రారంభమైంది. అంతకుమునుపే వైద్యలోకంలో తీవ్రమైన సంచలనం లేకపోలేదు. 1907-వ సం.లో చెలరేగిన స్వదేశోద్యమంతోపాటు ఆయుర్వేదవైద్యులు కూడా దేశాభిమానప్రేరితులై ఈ సమ్మేళన కార్యక్రమం నిర్మాణవిధానంతో సాగించడం మొదలుపెట్టారు. దీనికి ప్రధానకారకులు నాసికాపట్టణ నివాసులు శ్రీ శంకరదాజీ శాస్త్రీపదేగారు. అప్పటినుంచీ ప్రతి ఏటా వైద్యసమ్మేళనాలు భారతదేశంలో పలుచోట్ల జరుగుతూనే ఉన్నాయి. ఇప్పటికి ముప్పైఫై వార్షికసభలు జరిగినయి.

భారతదేశంలో కుంఫిణీప్రభుత్వం నెలకొన్న వెంటనే ఆయుర్వేదానికి మరీ హీనదశ రాలేదు. ఈస్టిండియా కంపెనీవారు మొదటమొదట ఏ కొందరు దేశీయవైద్యులనో-వారి స్వప్రయోజనానికే కానీయండి-ఆదరించక పోలేదు. రానురాను బ్రిటిషుప్రభుత్వం మన దేశంలో పాతుకుపోయిన కొద్దీ ప్రభుత్వంతోపాటు ఇంగ్లీషువైద్యులూ, ఇంగ్లీషువైద్యవిద్యా దేశంలో విరివిగా దిగుమతి కావడం సాగింది. భారతదేశ ప్రజలు కూడా క్రొత్త ఒకవింత గనుక మరీ పాశ్చాత్యనాగరకతావ్యామోహితులై వారిచదువే చదువుతూ, వారి విద్యలే అభ్యసిస్తూ, వాటియందే వ్యామోహం కలవారై, ఆర్యవిద్యలందు కొంత నిరాదరణకూడా చూపారు. ఈవిషయంలో కేవలం ఇంగ్లీషువారిదే తప్పనడానికి కొందరు అంగీకరించరు. పారతంత్ర్యం చేతను, దాస్యభావంచేతను, చాలావరకు ఆర్యవిద్యలందు ఆదరణ బీదపడింది. అయినప్పటికీ, దినదినం, ఇంటింటా, ప్రతిమనిషికి అవసరమైన ఆయుర్వేద వైద్యశాస్త్రం మాత్రం పూర్వంమాదిరి అంత ఉచ్చదశలో లేకపోయినా, అనాగరకప్రజలుగా భావింపబడే, పాశ్చాత్య సంపర్కం లేని పల్లెటూరిజనంలో మాత్రం జీవమాత్రావశిష్టమై ఇప్పటికీ ప్రాముఖ్యం పొందుతూ, కొనవూపిరితో నిల్చి ఉంటూనే ఉంది. పాశ్చాత్య సంపర్కం ప్రబలంగా ఉన్న పట్టణాల్లో ఇంగ్లీషు చదువుకొన్నవారును, సర్కారు ఉద్యోగులును, నాగరకుల మనుకొనేవారును ఎంత వ్యామోహంతో అల్లోపతీవైద్యులవెంట పడ్డప్పటికీ, కాయచికిత్సలో అప్పటికి ఇప్పటికి కూడా ఆయుర్వేదవైద్యుడే పైచేయిగా ఉన్నాడు.

"తొలుత పాశ్చాత్యవైద్యం ఈదేశంలో ప్రవేశపెట్టబడినప్పుడు ఈ దేశస్థులుపాశ్చాత్యవైద్యులనుండి యెక్కువ లాభం పొందగలమనుకొనిరి. కాని పాశ్చాత్యశస్త్రవైద్య, ప్రసూతి తంత్రాలు మనశాస్త్రంతో పోల్చినప్పుడు యెక్కువగా కనిపించినను, కాయచికిత్సయందు పాశ్చాత్యచికిత్సను జేమియు చేయజాలక తగ్గిపోవుచున్నాడు. ఇందులో వీరిద్దరిని సరితూచిన పాశ్చాత్యవైద్యులు కొన్ని కాయచికిత్సలందు బొత్తుగా నిస్సహాయులై పోతున్నాడు. ప్రజలకున్నదినియందు నమ్మకము పోయి, దేశమందల్లెడలను మార్పుగలుగుచున్నది. దానిఫలితమే ఆయుర్వేదశాస్త్ర పునరుద్ధరణము."

ఈ వాక్యాలు అల్లోపతీవైద్యవిద్యను అభ్యసించిన ఒక భారతీయభిషగ్వరుడు 1911-వ సం.లో చెప్పాడు.*

ఆర్యవిద్యల అధోగతికి కారణాలు ఏటువంటివైనా, భారత దేశంలో జాతీయవైద్య శాస్త్ర పునరుద్ధరణం తీవ్రంగా సాగడానికి ఫలితంగా, దేశంలో అప్పటికి అనాదరణ పొందుతూవున్న ఆయుర్వేదవైద్యులందరును ప్రబోధితులై ప్రతిరాష్ట్రంలోను రాష్ట్రీయ వైద్యసమ్మేళనాలు, పాఠశాలలు, ఔషధాలయాలు, పత్రికలు మొదలైనవి స్థాపించి, దేశభాషల్లో వైద్యవిద్యాప్రచారం సాగించి, తీవ్రమైన ఆందోళన చేసి, పల్లెటూళ్లలో తమకు ఉండే పలుకుబడితోపాటు పట్టణాల్లోవుండే నాగరకులవద్దను, సర్కారు ఉద్యోగులవద్దను కొంతవరకు ఆదరాన్ని పొందగలిగారు. ప్రజాందోళనకు తాళుకోలేక గవర్నమెంటువారు కూడా సవతితల్లి ప్రేమతో కొన్నాళ్లనుంచీ దేశీయ వైద్యాన్ని సాకుతూ ఉన్నారు. ముఖ్యంగా ఈ ఆందోళనవల్ల తేలిన విషయ మేమిటంటే—

ఆయుర్వేదవైద్యంకూడా ఒక విజ్ఞానాత్మక విధానం (Scientific system) అనే విషయాన్ని ఇక ఋట్టే రుజువు పరుచుకోవలసిన అవసరం లేకుండా, మాకూ ఒక అర్హమైన స్థానం సంఘంలోనూ, దొరతనంవారి రిజిష్టరులోనూ ఉన్నదన్న సంగతిని ఆయుర్వేదవైద్యులు దృఢపరుచుకోగలిగారు. ఈగౌరవం సంపాదించడానికి మనవైద్యనాయకు లంతా ఇప్పటికి సుమారు నలభై సంవత్సరాలనుంచి చాలాశ్రమపడ్డారు. మనరాజధానిలో అందుకు ముఖ్యులు, కీర్తికాయులు, శ్రీ గోపాలాచార్లుగారు పడ్డ శ్రమ ఇంతా అంతా అని చెప్పజాలనిది.

## గోపాలాచార్లుగారు

ఆంధ్రదేశంలో ఆయుర్వేద పునరుద్ధరణ కార్యక్రమం ముందుగా ఆరంభించినవారు కీ. శే. డి. గోపాలాచార్లుగారే. వీరు నిఖిల భారతాయుర్వేదవైద్యసమ్మేళనంపుట్టడానికి పూర్వమే, 1901-వ సం. లో చెన్నపట్టణంలో ఆయుర్వేదకళాశాల ప్రారంభించారు. వీరు ఆయుర్వేదాభివృద్ధికై ఎన్ని విధాల పాటుపడ్డదీ వ్రాయవలసివస్తే ఆ పరిశ్రమ అంతా ఒక గ్రంథంగా తయారవుతుంది. జీర్ణదశలో ఉన్న ఆయుర్వేదాన్ని పునరుద్ధరించడానికి పుట్టిన అవతారపురుషులే వీరు. ఆంధ్రదేశమే గాక భారతదేశం యావత్తూ ఈవిధంగానే గౌరవించింది వీరిని. వీరు వేలకువేలు ఆర్జించి,ఆర్జించిన ధనమంతా ఆయుర్వేద పునరుద్ధరణకే వినియోగించారు. మరణసమయంలో కూడా ఇతరదానాలతోపాటు ఒకేతూరి నలభైవేలరూపాయిలు మైసూరు ఆయుర్వేదకళాశాలకు యిచ్చారు. వీరి ఆప్తమిత్రులైన దేశోద్ధారకులు ఆ సమయానికి చెన్నపట్నంలో ఉండివుంటే ఆధన మంతా ఆంధ్రదేశానికే లభించేది. దురదృష్టవశాత్తూ అపుడు శ్రీ నాగేశ్వరరావుగారు తీర్థయాత్రలకై దేశాంతరం వెళ్లడం తటస్థించింది.

వీరు ఆయుర్వేదోద్యమం మదరాసులో ప్రారంభించినప్పుడు ఆయుర్వేద మంటేనూ, ఆయుర్వేదవైద్యులంటేనూ దొరతనంవారికి కంటకంగా ఉండేది. ఇది శాస్త్రమేకాదనీ, ఈ వైద్యావలంబకులు ఉత్త quaks అనీ పరిహాసిస్తూ ఉండేవారు. ఎవరైనా కొందరు అల్లోపతీవైద్యులు దీనిని ఆదరించినా, అనుకూలంగా మాట్లాడినా, వీరి సంఘాలతో సంబంధం కలిగిఉన్నా వారిని వాళ్లసంఘాల నుంచి వెలివేస్తూ ఉండేవాళ్లు. దొరతనం వారు ప్రత్యేకంప్రతికూలభావాన్ని వహించి మునిసిపల్ సంఘాలూ, లోకల్‌బోర్డులూ సహాయంచేస్తే, ఆలా చేయరాదని గ్రాంట్లు అంగీకరించేవారు కారు. గవర్నమెంటు వారికి ఒత్తిడిని కలిగించి, ఇటువంటి ప్రతికూలభావాన్ని మాన్పించడానికై, అప్పటి శాసనసభలో ప్రజాప్రతినిధులుగా వున్న కొందరు దేశాభిమానులకు నచ్చచెప్పినీ ఆయుర్వేద కళాశాల వార్షికసభలకు కొందరు గవర్నమెంటు మెంబర్లను అధ్యక్షులనుగా పిలిచినీ, వారిచే ఆయుర్వేదం శాస్త్రీయమైనదే అని ఒప్పించిరి. చివరకు అప్పుడు గవర్నరుగా ఉన్న పెంట్లెండు ప్రభువును కూడా ఒకతూరి ఆయుర్వేదకళాశాలకు తీసుకువచ్చి, వారికిన్నీ ఆయుర్వేద మాహాత్మ్యమును విన్నవించి యుండిరి. ఈ ప్రకారం అనేకవిధాల వీరు జీవించిఉన్నంతవరకు తంటాలుపడగాపడగా గవర్నమెంటు వారు చివరకు లోకల్‌బోర్డుల గ్రాంట్లు అంగీకరిస్తూ,1921-వ సం.లో ఆయుర్వేదశాస్త్రాభివృద్ధికి గవర్నమెంటువారు సహాయము చేయవచ్చునో కూడదో విచారించి తెలుపమని ఉస్మాన్‌కమిటీని నియమించారు. అప్పట్లో మదరాసు రాష్ట్రీయ శాసనసభలో ఆయు

---

* *"The public had expected much greater things of him (the doctor) when Europeon system was introduced into the country. Time however showed that although Europeon surgery and mid-wifery, were incomparably superior, yet in the practice of medicine, the doctor, though in some cases superior to Kaviraj, is very much inferior. In the treatment of many Indian diseases the doctor is to be found absolutely hopeless. He was weighed in the balance and found wanting. People had their faith slackened in him and a reaction came over the whole country. The inevitable result was a revival of the ancient system of medicine"*

*—Dr. Jadunath Ganguli B A.,M.B. Address on a National system of Medicine for India. Calcutta, March 1911.*

ర్వేదంకోసం పట్టుదలతో పోరాడినవారు శ్రీ ఆచార్లగారి మిత్రులు అమంచర్ల సుబ్బకృష్ణారావుగారు, కీ. శే. టి. ఆర్. రామచంద్ర అయ్యరు, కీ. శే. యం. కృష్ణస్వామి అయ్యరు మున్నగువారు ముఖ్యులు. గవర్నమెంటువారి ప్రతికూలభావాన్ని సుళువుగా మార్చగలిగిన మాహాత్మ్యం అంతా శ్రీ గోపాలాచార్లగారికే చెందుతుంది. వీరి పరిశ్రమ ఆయుర్వేదమనే మహాసౌధానికి పునాదిరాయివంటిది. వీరు ఆనాడు చేసిన పరిశ్రమ ఫలితమే ఈనాడు ఆయుర్వేదానికి వివిధరాష్ట్రాలలోనూ కలిగిన రాజాదరణ, గౌరవమూ.

ఆంధ్రదేశంయొక్క దురదృష్టంచేత రౌద్రిసంవత్సరం (1920)లో వీరు పరమపదాన్ని పొందారు.

## లక్ష్మీపతిగారు

తరువాత ఈ స్థానాన్ని వహించి, వీరు లేని కొరతను తీర్చినవారు శ్రీ డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు. వీరు ఆంగ్లవైద్యంలో ఆరితేరినవారైనప్పటికీ, శ్రీ ఆచార్లగారి చెలిమివల్లనూ, స్వతహాగా దేశాభిమాని కావడంవల్లనూ ఆయుర్వేదం యొక్క ఉత్కృష్టతను గ్రహించి, 1918 నాటి మెడికల్ రిజిస్ట్రేషన్ ఆక్టువల్ల ఆయుర్వేదవైద్యులకు కలిగిన అవమానాన్ని సహించలేక మెడికల్ రిజిష్టరులోంచి తమ పేరు తొలగించుకొని శ్రీ ఆచార్లవారి శిష్యబృందంలో చేరి, ఆంధ్రవైద్యనాయకమణియై ఇరవై యేళ్లనుంచి ఆయుర్వేదం కోసం పాటుపడుతున్నారు. శ్రీ లక్ష్మీపతిగారు ఈ గొడవలో దిగకుండా వారి అల్లోపతీ వైద్య మేమిటో వారు చూచుకుంటూవుండి వుంటే ఈపాటికి ఏ గొప్పపదవిలోనో వుండి, లక్షలు ఆర్జించి, కూడబెట్టుకుని ఉండేవారు. కాని, వీరి జాతకం అటువంటిది కాదు. వీరన్నట్టు, వీరి డబ్బుపెట్టె అడుగులేనిది; జీవితము విశ్రాంతిని ఎరుగనిది. శ్రీ ఆచార్లగారు ఉద్యమంముఖ్యపట్టులో చనిపోయినందున ఆ ఉద్యమభార మంతా వీరిమీద పడడంచేత, ఆ యెత్తున ఉద్యమం నడిపెంచడంలో వీరు చాలా వ్యయప్రయాసలకు లోనుగావలసివచ్చింది. ఎప్పుడూ సన్నిహితంగా ఉండడంచేత నేను స్వయంగా ఎరుగుదును. పగలు కార్యభారంచేత విశ్రాంతి ఉండేది కాదు. రాత్రి 12 గంటలప్పుడు ఆయుర్వేద కళాశాల విద్యార్థులకు పాఠాలు చెబుతూ వుండేవారు. ఎందుకు వీరి కింత శ్రమ! నెలజీతములు పుట్టవనా? ఒకవంక రోగులు! ఒక ప్రక్క ఫార్మసీ!! ఒక పెద్ద కళాశాల!!! మరొకవంక విజ్ఞాన చంద్రిక—ఇంకా ఆరోగ్యాశ్రమం, గ్రంథరచన, ఆయుర్వేద ప్రచారం, ఎడతెగని ప్రయాణాలు! పైగా కసరత్తు!! ఇప్పటికి అరవై ఏండ్లు దాటినా ఇరవై ఏండ్ల యువకుడికి ఉండే ఓపిక, కార్యోత్సాహం — ఏమి ఆశ్చర్యము!!

## అఖిలభారత వైద్య నాయకత్వం

అఖిల భారతాయుర్వేదోద్యమంలో ఆంధ్ర వైద్యనాయకుల ఆందోళనాభాగం ఎక్కువగానే ఉంది. 1920-వ సం. వరకు అఖిల భారతాయుర్వేద మహామండలి, విద్యాపీఠ కార్యస్థానాలు మదరాసులోనే ఉండేవి. ఆచార్లగారే ప్రధానపాత్రవహించి కార్యక్రమ మంతా నడిపేవారు. 1917-వ సం. లో లాహోరులో జరిగిన తొమ్మిదవ అఖిలభారతాయుర్వేదవైద్య సమ్మేళనానికి గోపాలాచార్లుగారే అధ్యక్షులు. 1933-వ సం. లో బికనీరులో జరిగిన సమ్మేళనానికి శ్రీ డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు అధ్యక్షులు.

సుప్రసిద్ధ భిషగ్వరులైన ఈ ఇద్దరు ఆంధ్రపుత్రులును అఖిలభారతదేశఖ్యాతిని గడించి, పరరాష్ట్రాలలో జరిగిన అఖిల భారత మహాసభలకు అధ్యక్షత వహించి పూజింపబడ్డారంటే సంతసింపని ఆంధ్రు లుంటారా? వీరిద్దరికిని ఆంధ్రదేశంలోకంటె ఇతర రాష్ట్రాలలోనే గౌరవం ఎక్కువ.

## ఆంధ్రవైద్యసమ్మేళనం

మనదేశంలో జరిగే మహాసభల కన్నిటికీ కాంగ్రెస్సే మాతృసంస్థ. ఆ మహాసభనియమాలే అన్నిటికీ మేలుబంతి. ఆపద్ధతిని అనుసరించే ఏ ఉద్యమానికి చెందిన మహాసభ కార్యక్రమమైనా జరుగుతుంది. ఒక్క అఖిలభారతాయుర్వేద మహాసభవల్లనే వివిధభాషలు, రాష్ట్రాలు గల మన దేశంలో ఆయుర్వేద ప్రచారం చక్కగా సాగదని, 1916-వ సం. లో పూనానగరంలో జరిగిన 8-వ మహాసభలో భాషా ప్రయుక్తంగా రాష్ట్రాలను విభజించి, ఆయుర్వేద ప్రచారం సాగించడానికి నాయకులు నిశ్చయించారు. దాన్ని అనుసరించి 1917-వ సం.లో ఆంధ్రరాష్ట్రీ ఆయుర్వేద వైద్యసమ్మేళనం ప్రారంభమయింది. మొదటిసభ ఆ సంవత్సరమే బెజవాడలో జరిగింది. అప్పటినుంచీ ఇంతవరకూ జరిగిన మహాసభలు, అధ్యక్షులు మొదలైన వివరాలు ప్రక్కపుటలోని పట్టికలో చూడవచ్చును. ఈసమ్మేళనం స్థాపించినది మొదలు ఆయుర్వేద వైద్యులలో సంఘీభావం ఏర్పడి, ఆయుర్వేదప్రచారం ఆంధ్రదేశంలో చురుకుగా సాగుతోంది. ఈసమ్మేళనానికి శాఖలుగా జిల్లాసంఘాలు, తాలూకాసంఘాలు, ఫిర్కా సంఘాలు, ప్రాథమికసంఘాలు ఏర్పడి, పరస్పరం ఐకమత్యంతో ఆయుర్వేదప్రచారాన్ని చేస్తున్నాయి. సువిధమైన కార్యసంచలనాని కంతటికీ మొదటినుండి ఇంతవరకు అనేకమంది పనిచేసివున్నారు. అందు ముఖ్యులు గోపాలాచార్లుగారు, లక్ష్మీపతిగారు, నోరి రామశాస్త్రిగారు, కృష్ణమాచార్లుగారు.

## గ్రంథరచన

ఆంధ్రదేశంలో మొదటినుంచీ వైద్యశాస్త్రంలో కృషిచేసి, గ్రంథాలు రచించి, పేరు ప్రతిష్ఠలు గడించుకొన్న భిషగ్వరు లున్నారు. వీరిలో నాగార్జునుడు, వసవింతాచార్లు, శ్రీనాథపండితుడు, ఇంద్రగంటి వల్లభాచార్యుడు, బసవరాజు, లోలంబ

వీరరస ప్రధానమగు చారిత్రక గాథ!




కుంభీనసుడు మంత్రిస్థానంలో ఉంటూ మహారాజు ఆశయాన్ని మంటగలపడానికి కృత్రిమ సాధనాలనన్వేషిస్తాడు.— అతడు రాజద్రోహి. రణధీరుడు కేరళ సామ్రాజ్య లక్ష్మికి నమ్మినబంటు. రాచబిడ్డకు రక్తసిక్తమైన హస్తంతో రాజ్యాభిషేకం చేయిస్తాడు—అతడు రాజభక్తుడు. రమాదేవీరణకేళీసముల్లాసాన్ని ప్రత్యక్షంగా చూడండి!

For Particulars Apply to:— VANI PICTURES 3, Appukannu Mudali Street, Royapettah, MADRAS,

| సభ | సంవత్సరం | స్థలం | అధ్యక్షులు |
|---|---|---|---|
| 1 | 1917 | బెజవాడ | వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్లుగారు |
| 2 | 1918 | కాకినాడ | రాజవైద్య కొంపల్లి చెంచురామయ్యగారు |
| 3 | 1919 | విజయనగరం | డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు |
| 4 | 1920 | శ్రీకాకుళం (గంజాం) | ఆయుర్వేదభూషణ నోరి రామశాస్త్రిగారు |
| 5 | 1921 | తెనాలి | కె. శేషశాస్త్రిగారు |
| 6 | 1924 | నెల్లూరు | ప్రతివాదిభయంకర కృష్ణమాచార్లుగారు |
| 7 | 1925 | మదరాసు | దంటు సుబ్బావధాన్లుగారు |
| 8 | 1926 | నంద్యాల | ఆచంట లక్ష్మీపతిగారు |
| 9 | 1927 | గుంటూరు | జి. శ్రీనివాసమూర్తిగారు |
| 10 | 1929 | మచిలీపట్టణం | యస్. మాధవమీనన్ గారు |
| 11 | 1931 | రాజమండ్రి | ఆచంట లక్ష్మీపతిగారు |
| 12 | 1933 | తణుకు | పాలకోడేటి వెంకటకృష్ణారావుగారు |
|  | 1934 | (ప్రత్యేకసభ) భీమవరం | వైద్యపంచాననకృష్ణశాస్త్రికవడేగారు, |
| 13 | 1935 | తుని | ఆచంట లక్ష్మీపతిగారు పూనా |
| 14 | 1936 | — | చిట్టి నారాయణమూర్తిగారు |
| 15 | 1937 | — | తి. ప. రామానుజస్వామిగారు |
| 16 | 1938 | పార్వతీపురం | పసుమర్తి వీరభద్రస్వామిగారు |
| 17 | 1939 | గుడివాడ | ఆచంట లక్ష్మీపతిగారు |
| 18 | 1940 | నంద్యాల | ఆచంట లక్ష్మీపతిగారు |

రాజు, శరభరాజు, రాయసం పేరన, వృషభరాజు, వెంకటభట్టు, వెంకటాచార్లు మొదలైనవారు ముఖ్యులు.

వీరు రచించిన గ్రంథాలు అచ్చుపడినవి గాక ఇంకా అచ్చుకురానివి,మంచిమంచివి, పరహితసంహిత, కచ్ఛపుట తంత్రము,ఆంధ్ర అష్టాంగ హృదయము, భిషక్సుధార్ణవము, భిషక్సారము, వృషభరాజీయము, భేషజ దర్పణము, వైద్యయోగసంగ్రహము ఇత్యాదులు ఎన్నో ఉన్నయి.

అచ్చువచ్చిన తర్వాత ఆంధ్రదేశంలో ముందుగా అచ్చుపడ్డ ఆయుర్వేద గ్రంథాలు చాలావరకు పువ్వాడవారు అచ్చువేసినవే కనపడుతున్నాయి. వీరు 1894-వ సంవత్సరంలో అష్టాంగహృదయం, బసవరాజీయం, వైద్యచింతామణి ఇత్యాదులైన వైద్యగ్రంథాలు తెలుగుటీకతో అచ్చువేయించారు.

ఎట్టావారి వస్తుగుణదీపికకూడా 1894-వ సంవత్సరములోనే మొదటికూర్పుఅచ్చుపడ్డది.

ఇదిగాక శ్రీ విజయనగరం మహారాజా వారి ఆదరణక్రింద 'వైద్యకశబ్దసింధు' అనే బృహత్కోశము ఒకటి 1894-వ సంవత్సరంలోనే అచ్చుపడ్డది. ఇది ఒక గొప్ప ఆయుర్వేదకోశము. మరి, ఇటీవలి విషయాలను పరామర్శించి చూస్తే, ఆంధ్రుల ఆయుర్వేదాభిమానానికే గాక, ఆయుర్వేద గ్రంథరచనకూ, పత్రికాప్రచురణకూ కూడా కారకులు గోపాలాచార్లుగారే అని మళ్లీ చెప్పాలి. వీరి విద్యావంశం వృద్ధి పొందిన తరువాతఅసలు మూలగ్రంథాలు కొన్ని తెలుగులోకి తర్జుమాపొంది ప్రకటింపబడ్డాయి. 1902-వ సం. లో పెద్దాపుర సంస్థానానికి చెందిన కొత్తాం జమీందారుగారు, రాజా వత్సవాయి సింహాద్రిగజపతిరాజులుంగారు 'మహాయోగానందామృతకల్పవల్లి' అనే, ఆంధ్రదేశ సంప్రదాయానికి చెందిన, 350 యోగాలుగల గ్రంథం ఒకటి ప్రకటించారు. అందులోని యోగాలు గ్రహించే ఇటీవల చాలామంది కొన్ని ఇతర యోగాలుకూడా కలిపి వారు సంపాదించినవిగా అచ్చువేసి అమ్ముతున్నారు.

కార్వేటి నగరంలో కె. యస్. శాస్త్రి గారు ముందుగా చరకసూత్రస్థానం తెలుగు టీకతోను, సంస్కృతవ్యాఖ్యానానికికూడా తెలుగు వివరంతోను అచ్చువేసి ప్రకటించారు. తరువాత వీరే చికిత్సాస్థానంకూడా ఈ విధంగానే వ్రాసి, ఆంధ్రా యుర్వేద ఫార్మసీవారిచే ప్రకటింపజేశారు. ఈ రెండూ చాలా ఉపయోగకరమైన గ్రంథాలు. మూల గ్రంథంలో వుండే విషయాలన్నీ తెలుగులో కూడా వివరించారు. నూజివీటిలో ఉయ్యూరు రాజాగారి ప్రాపున చివుకుల వారు, మదరాసులో ఆయుర్వేదాశ్రమం వారు, ఆంధ్రాయుర్వేద ఫార్మసీ వారు చక్రదత్త, రసరత్న సముచ్చయం, మాధవ నిదానం, రసప్రదీపిక, ఆంధ్ర వైద్య చింతామణి, వైద్యసారం మొదలైన గ్రంథాలు ప్రకటించారు. ఇవిగాక ఫార్మసీ వారు ఔషధయోగాలు కొన్ని ప్రకటించి, వాటికొక 'స్టాండర్డు' ఏర్పాటు చేశారు. చాలావరకు ఆయోగాలే ఇప్పుడు గవర్నమెంటువారుగు ఉపయోగించేవి,ప్రకటించినవీ, లోకల్‌బోర్డు ఆస్పత్రులలో ఎక్కువగా వాడేవీను.

ఇటీవల ప్రకటింపబడినవాటిలో శ్రీపాదవారి చరకం చెప్పతగింది. ఆంధ్ర భాషలో సంపూర్ణంగా ఈ గ్రంథం లేదనే కొరతను వీరు తీర్చారు. ముక్కామలవారి భావప్రకాశ, ఏటూరివారి యోగ రత్నాకరం,వేటూరివారి వస్తుగుణదీపిక ఎన్న తగిన గ్రంథాలు. చావలివారు సుశ్రుతాన్ని అనువదించడానికి ఆరంభించారు. సూత్ర స్థానం బయలుపరిచారు. మిగతా స్థానాలు కూడా త్వ్రలోనే ప్రకటిస్తా రని ఆశింప వచ్చును.

ఈ పైగ్రంథకర్త లంతా సాక్షాత్తు శ్రీ ఆచార్లగారి శిష్యకోటిలో వారే. శ్రీమాన్ సామవేదం కృష్ణమాచార్లుగారు రసరత్నాకరం, రస, రసేంద్ర, రసాయన

ఖండములు గల సంపుటం ప్రకటించి ఆంధ్ర దేశానికి మహోపకారం చేశారు. ప్రకటించినవాటిలో ప్రాచీన గ్రంథాలకు అనువాదాలు గాక సంకలిత గ్రంథాలు కూడా కొన్ని ఉన్నయి. వల్లూరి సుబ్బారావుగారి బాలతంత్రం. ఆంధ్ర ఆయుర్వేద విద్యాపీఠ స్థాపకులైన శ్రీమాన్ ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులగారు రచించిన ఆయుర్వేదాంగ శారీరం, మల్లాది రామమూర్తి శాస్త్రిగారు రచించిన ఆహార విజ్ఞానం—ఈ రెండు గ్రంథాలూ శ్రీయుతుల పాండిత్యానికి నిదర్శనాలు. స్వతంత్రమైన ఆలోచనాశక్తిని పురికొల్పేవి. ఇటువంటి గ్రంథాలే ఈ కాలానికి అవసరమైనవి. వీరింకా ఇట్టి గ్రంథాలు రచిస్తారని ఆంధ్రదేశం ఎదురు చూస్తోంది.

ఇంకా చాలా గ్రంథాలు వైద్యసంప్రదాయం తెలియనివారు ప్రకటించినవి, రచించినవి కొన్ని ఉన్నాయి. అవన్నీ పేర్కొంటే చాలా విషయం పెరుగుతుంది. అనుభూత యోగాలనీ, చిట్కాలనీ ధనాపేక్షతో చాలామంది గ్రంథాలు ప్రకటిస్తారు. ఇటువంటి యోగాలు గల గ్రంథాల కొరకు ఆదుర్దా పడి పుస్తకాలు కొనే వారుకూడా చాలా మంది ఉన్నారు. ఇటువంటి సంప్రదాయదూరములైన గ్రంథాల ప్రకటనను వైద్యులే గాక జన సామాన్యం కూడా ప్రోత్సాహపరచరాదు.

### జమీందార్లు - ఆయుర్వేదాభిమానం

భారతదేశసంస్థానాధిపతులు వారిసంస్థానాల్లో ఆర్యవిద్యలకు తగిన పోషణ కొంత వరకు ఇస్తూనే ఉన్నారు. ఆయా శాస్త్ర వేత్తలకు తగిన జీవనోపాధిని కల్పిస్తూనే ఉన్నారు. ఆయుర్వేదానికి బ్రిటిషుఇండియాలోకంటె మైసూరు, కొచ్చిన్, తిరువాన్కూరు మొదలైన స్వదేశసంస్థానాల్లోనే ఆదరణ యెక్కువగా ఉంది.

"తొలుత పాశ్చాత్యవైద్యం ఈ దేశంలో ప్రవేశపెట్టబడినప్పుడు ఈ దేశస్థులు పాశ్చాత్యవైద్యులనుండి యెక్కువ లాభం పొందగల మనుకొనిరి. కాని, పాశ్చాత్య శస్త్రవైద్య, ప్రసూతితంత్రాలు మన శాస్త్రంతో పోల్చినప్పుడు ఎక్కువగా కనిపించినప్పటికిని కాయచికిత్సయందు మాత్రము పాశ్చాత్య చికిత్సకు డేమియు చేయజాలక తగ్గిపోవుచున్నాడు. ఇందులో వీరిద్దరిని సరితూచిన యెడల పాశ్చాత్యవైద్యుడు కొన్ని కాయచికిత్సలందు బొత్తిగా నిస్సహాయుడై పోతున్నాడు. ప్రజలకును దీనియందు నమ్మకము పోయి, దేశమం దెల్లెడలను మార్పుగలుగుచున్నది. దానిఫలితమే ఆయుర్వేద శాస్త్ర పునరుద్ధరణము."

అందాకా యెందుకు, ఆంధ్రదేశంలో వుండే జమీందారీసంస్థానాల విషయం తీసుకోండి. అంతో ఇంతో యింకా ఆయుర్వేద మంటే వీరికి తీపిఉంది. విత్తానికి విత్తులను దాచినట్టు,మహౌషధాలనూ, గ్రంథాలనూ, విద్వద్వైద్యులనూ ఆదరించి, వైద్యవిద్యాగౌరవం చెడకుండా, సంప్రదాయం పోకుండా వీరుకాపాడుతున్నారు. వీరింకా ఇట్టిమక్కువతో కాపాడబట్టేఆంధ్ర దేశంలో ఆయుర్వేదం సజీవంగా ఉంది. ముప్పైఏండ్లక్రితం నూజివీటి జమీందార్ల వారి యెస్టేటు పంచుకొనేటప్పుడు, చరాస్తులైన వెండి బంగారాలతోపాటు దోసెళ్లతో మందుకుప్పెలు పంచుకున్నట్లు వింటాం! అవే నేటికీ నూజివీటిమందు లనే పేరుతో ఆంధ్రదేశంలో చెల్లుబడిఅవుతూవున్నాయి. నేటికిన్నీ శ్రీ ముక్త్యాల జమీందారుగారు ఆయుర్వేదాభిమాను లన్నసంగతి ఆంధ్రదేశం ఎరుగనిది కాదు. ప్రశస్తమైన ఔషధాలూ, అపూర్వములైన గ్రంథాలూ వారి సంస్థానంలో దొరకుతాయి.

పూర్వం బొబ్బిలి, విజయనగరం, కాళహస్తి, తుని, పెద్దాపురం, పిఠాపురం, చల్లపల్లి ఈమొదలైన సంస్థానాలన్నీ ఆయుర్వేద వైద్యులను ఆదరించి, శాస్త్ర సంప్రదాయాలనుకాపాడి, మహౌషధాలను తయారు చేయించి, నిలవజేసినవే. ఎటొచ్చీ, ఈకాలపు జమీందార్లు కొందరు పట్టణవాసాలు, ఎలెక్షన్లు, వినోదక్రీడలు మరిగి, తుమ్ముకూ, దగ్గుకూ అల్లోపతీవైద్యంతో మునుగుతూ తేలుతూ పెద్ద పెద్ద డాక్టర్లకు వేలకువేలు ఫీజు కుమ్మరిస్తూ తంటాలు పడుతున్నారు. కాని పూర్వం వారి సంస్థానంలోనే తయారయిన అపూర్వౌషధాలు కోటలో వారి బీరువాల్లో బూజుపడుతూ ఉన్నాయన్న సంగతి వారికి తెలియదు. చూసే నాథుడుంటే వాటి విలువ వాటికి ఉండనే ఉంది.

దివంగతులైన పానుగంటి రామారాయణింగారు ఆయుర్వేదానికి మహోపకారం చేశాడంటే, పిచ్చిపట్టి చేశాడా? ఆయన సంస్కృత విద్వాంసుడు. ఆర్యవిద్యలందు ఆదరంగల సంస్కారి. పూర్వం వారి సంస్థానంలో ఆయుర్వేదవైద్యం అందలం ఎక్కి తిరిగింది. కాబట్టే ఆ మహనీయుని మంత్రిత్వంలో ఆయుర్వేదానికి పుట్టగతులు కలిగినాయి. ప్రాచీనకళలూ, శాస్త్రాలూ నేటికిన్నీ జీవంతో ఉన్నాయంటే, దేశాభిమానంగల శ్రీమంతులూ, సంస్థానాధీశ్వరులూ బాగా ఆదరించి పోషిస్తేనే ఉన్నాయి; ఇకముందుకూడా ఉంటాయి. ఇది ఎంత ప్రజాప్రభుత్వం రోజులైనా, అధికారం హస్తగతమైవున్న వ్యక్తికి ఒక విషయంలో అభిమానం లేకపోతే, ఆదరం పొందడం

కష్టంగానే ఉంటోంది! ఏదీ, కాంగ్రెసు 'పాలిసీ' రీత్యా ఆయుర్వేదం ప్రభుత్వాదరణ పొందవలసిందే–కాంగ్రెసు ప్రభుత్వం హస్తగతం చేసుకున్న రాజాజీ మంత్రి ఆయుర్వేదానికి ఏంజేశాడు!! తాబట్టిన కుందేటికి మూడేకాళ్లని, జనాభిప్రాయాన్ని తిరస్కరించాడు. జస్టిసు ప్రభువైన రామారాయణింగారే నయం అనిపించాడు.

## వైద్యవిద్యాప్రచారం

1901–వ సంవత్సరంలో గోపాలాచార్లు గారు మదరాసులో ప్రారంభించిన ఆయుర్వేదకళాశాల మన రాజధానిలోకల్లా మొట్టమొదటేది. వారు దీనిని మొదట శ్రీ కన్యకాపరమేశ్వరీధర్మసంస్థల యాజమాన్యాన్ని ప్రారంభింపజేశారు. కొంతకాలం గడిచినతర్వాత వారు భరింపలేమంటే, ఆభారమంతా శ్రీ ఆచార్లుగారే స్వయంగా వహించి, అప్పటికి సజీవులై ఉన్న సర్ సుబ్రహ్మణ్యఅయ్యరు, సర్ త్యాగరాయ శెట్టి, రాజరత్నం మొదల్యార్ మొదలైన పురపెద్దల నందరినీ ఒకబోర్డుగా ఏర్పాటు చేసి, ఆయుర్వేద ప్రచారిణీసభ అనే ఒక సంస్థను ఏర్పరిచి, వారిసలహాప్రకారం కళాశాలను నడుపుతూ, సంవత్సరానికి 10, 15 వేల రూపాయిల స్వంతఖర్చుతో తాము జీవించిఉన్నంతకాలం నిర్వహించారు. తదుపరి శ్రీ లక్ష్మీపతిగారు దీని భారం వహించి 1927–వ సంవత్సరం దాకా నిర్విఘ్నంగా నడిపారు. గవర్నమెంటుపాఠశాల ఏర్పడ్డతరువాత దీనిఅవసరం అంతగా కనపడక, మూసివేయడం కలిగింది.

ఈ కళాశాలలోంచి సుమారు 2:0 మంది ప్రసిద్ధవైద్యులు తయారై భారతదేశంఅంతటా కూడా ప్రఖ్యాతిని పొందుతున్నారు.

ఆంధ్రదేశానికి నడిబొడ్డు అయిన బెజవాడలో శ్రీ నోరి రామశాస్త్రిలుగారు వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాల అనే పేరుతో ఒక పాఠశాలను చిరకాలంనుంచీ నడుపుతున్నారు. కీర్తిశేషులయిన మాఢపాటి వెంకటేశ్వరరావుగారి దానధర్మాల నుండి దీని పోషణకై కొంతద్రవ్యం యేర్పాటయింది. దీని పోషణకును, ధర్మాదాయానికిని శ్రీరామశాస్త్రిగారి నిరంతరమైన కృషియే కారణమన్న సంగతి ఆంధ్రులు మరువతగదు.

> బ్రిటిషు ప్రభుత్వం మన దేశంలో పాతుకుపోయిన కొద్దీ ప్రభుత్వంతోపాటు ఇంగ్లీషు వైద్యులూ, ఇంగ్లీషువైద్యవిద్యా దేశంలో విరివిగా దిగుమతి కావడం సాగింది. భారతదేశ ప్రజలుకూడ కొత్త ఒక వింతగనుకమరీ పాశ్చాత్య నాగరకతా వ్యామోహితులై ఆర్యవిద్యలందు కొంత నిరాదరణ చూపినారు. అయినప్పటికీ దినదినం, ఇంటింటా, ప్రతిమనిషికీ అవసరమైన ఆయుర్వేద వైద్య శాస్త్రం మాత్రం పూర్వం మాదిరి అంత ఉచ్చదశలో లేకపోయినా, అనాగరక ప్రజలుగా భావింపబడే, పాశ్చాత్య సంపర్కం లేని పల్లెటూరి జనంలో మాత్రం జీవమాత్రావశిష్టమై ఇప్పటికీ ప్రాముఖ్యం పొందుతూ, కొనవూపిరితో నిలిచి వుంటూనేవుంది.

కొన్నాళ్లవరకు బెజవాడలో ఉండి, ఇప్పుడు గుంటూరులో స్థాపింపబడ్డ శ్రీరామమోహన ఆయుర్వేద కళాశాల మొదట కీ. శే. బొడ్డపాటి వెంకటప్పయ్యగారి ప్రబల ప్రయత్నంవల్ల ఏర్పాటైనది. వారు గతించిన తరువాత బెజవాడలో దీనికి సరియైన ఆదరణ లేకపోతే, ఇప్పుడు గుంటూరులో శ్రీమాన్ దీవి రంగాచార్లుగారు దీని నిర్వహణకై పాటుపడుతున్నారు.

ఇవిగాక పూర్వం తిరుపతిలో మహంతుగారి హయామున ఒక ఆయుర్వేద పాఠశాల ఉండేది. అది యిప్పుడు అంతరించినట్లున్నది.

నెల్లూరులో వేదసంస్కృత పాఠశాలలో ఆయుర్వేదశాఖ ఒకటి కలదు. కొవ్వూరు పాఠశాలలోకూడా ఇటువంటి శాఖ ఒకటి ఉన్నదని తెలుస్తుంది.

ఇవన్నీ ఆంధ్రదేశంలో ఆయుర్వేదవిద్యా ప్రచారం చేసి, సుశిక్షితులైన వైద్యులను తయారుచేసే విద్యాసంస్థలు.

## దేశీయవైద్యపాఠశాల

పానుగల్లురాజాగారి దయవల్ల మదరాసులో 1925 వ సం. లో దేశీయ వైద్య. పాఠశాల ఒకటి గవర్నమెంటువారువేర్పాటు చేశారు. అప్పటినుంచి ఇంతవరకు మనరాజధానిలో సుమారు 500 మంది వైద్యులు ఆ పాఠశాలనుండి తయారై వచ్చారు. ఇంకా వచ్చేవా రున్నారు. ప్రతిఏటా కొంతమంది ప్రవేశిస్తున్నారు. ఇక దేశానికి సుశిక్షితులైన వైద్యులకు కరువుండదు. కాని, ఏం కర్మమో, ఈ పాఠశాల ఏర్పడ్డప్పటినుంచీ, వైద్యలోకంలో గాని, జనసామాన్యంలో గాని, చివరకు గవర్నమెంటువారికే గాని ఈ విద్యాశాలపాఠ్యక్రమాన్ని గూర్చి సరియైన అభిప్రాయ మున్నట్టు తోచదు. అందుకనే కాబోలు ఈమధ్య పాఠ్యక్రమాన్ని గూర్చి విచారించి, లోపాలోపములు తెలియ పరచవలసిందని ఒకకమిటీని నియమించారు గవర్నమెంటువారు. ఇంతవరకు వారి పరిశ్రమ ఏమైందో ప్రజలకు యింకా తెలియ లేదు. దేశంలోకూడా, ఇప్పుడు జరిగే పాఠ్యక్రమాన్నిగూర్చి తీవ్రమైన ఆక్షేపాలు ఉన్నాయి.

దేశంలోగల అసంతృప్తికి తగ్గట్టుగానే, ఆయుర్వేదానికి 'త్రవ్వి తలకెత్తుతుంది' అనుకొన్న కాంగ్రెసు మంత్రిత్వం బద్ధశత్రువై, ఆయుర్వేదానికి– అందు ప్రత్యేకం ఈపాఠశాలకు – ఏమీ ఉపకారం చేయకపోగా, అసెంబ్లీసభలో ఆరోగ్యశాఖా

మంత్రి ఈపాఠశాలనుగూర్చియు, ఈవైద్యులనుగూర్చియుబహుచులకనగామాట్లాడాడు. లోపాలోపాలకు కారకులైన ప్రభుత్వమే ఆలా సెలవిస్తే, ఇక ప్రజల్లో ఏమైనా గౌరవ ముంటుందీ? ఈ పాఠశాలకూ, ఈ పాఠశాలాపట్టభద్రులకూ ఇయ్యవలసినన్ని సౌకర్యాలు ఇప్పటికీ ప్రభుత్వంవారు ఈయడం లేదు.

## అఖిలభారత విద్యాపీఠం

అఖిలభారతాయుర్వేద విద్యాపీఠం వారు ప్రతియేడూ భారతదేశం అంతటా ఆయుర్వేదపరీక్షలు జరుపుతారు. ఆయుర్వేదాచార్య, ఆయుర్వేదవిశారద, ఆయుర్వేద భిషక్ అనే మూడురకాల పరీక్షలున్నాయి. ఇందులో మొదటి రెండూ సంస్కృతంలోనూ, మూడవది దేశభాషల్లోనూ జరుగుతుంద. ఇప్పటికి సుమారు 20యేళ్ల నుంచీ, మంచి కట్టుదిట్టాలతో, అఖిలభారత ప్రాతినిధ్యంగల పరీక్షావర్గం యాజమాన్యం వహించి అన్ని రాష్ట్రాలలోనూ ఒకేసారి ఈ పరీక్షలు జరుపుతున్నారు. ఆంధ్రదేశంలో ఈపరీక్షల వ్యాప్తికై అకుంఠితమైన కార్యదీక్షతో పాటుపడుతున్నవారు శ్రీ నోరి రామశాస్త్రిల్లుగారు. వీరి కృషిచేతనే ఇప్పటికి ఆంధ్రదేశంలో ఈ పరీక్షాకేంద్రాల సంఖ్య ఒకటినుండి ఎనిమిదింటివరకు అభివృద్ధి అయింది. ప్రసిద్ధులైన విద్వద్వైద్యులవద్ద సుశిక్షితులైన విద్యార్థులు అన్ని కేంద్రాల్లోను పరీక్షలకు హాజరై, వైద్యవిద్యాభ్యాసము చేస్తున్నారు. ఈ పరీక్షలవల్ల భారతదేశంలోఉన్న ఆయుర్వేద వైద్యు లందరికీ ఒకేరకమైన ప్రపత్తి ఏర్పడి, సోదరభావంతో మెలగడానికి అవకాశం ఏర్పడుతుంది.

## పత్రికాప్రచారం

ఆంధ్రదేశంలో వైద్యసంబంధమైన పత్రికలు—మంచి వ్యాప్తిగలవిగాని, స్వయంపోషకమైనవిగాని, సుస్థిరమైనవిగాని లేవనియే చెప్పవచ్చును. మఖిలో పుట్టి పుబ్బలో మాయమైన పత్రికలు చాలాఉన్నవి. 1919-వ సం.లో గోపాలాచార్లుగారు 'శ్రీధన్వంతరి' అనేపేరుతో ఒక పక్షపత్రికను ప్రారంభించి, తాము జీవించి ఉన్నంతకాలం మంచి సమర్థతతో నిర్వహించారు. వారితరువాత ఆ పత్రికనే శ్రీలక్ష్మీపతిగారు 1929-వ సం.వరకు సాగించి తగిన ప్రోత్సాహం లేకపోవడంచేత ఆపివేశారు.

ఆంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనం తరఫున 'ఆంధ్రవైద్య సమ్మేళనపత్రిక' చాలాకాలం శ్రీమాన్ ప్రతివాది భయంకర కృష్ణమాచార్లుగారి సంపాదకత్వాన వెలువడుచుండేది. పిదప శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు కొంతకాలం సంపాదకులుగా ఉండి నిర్వహించారు. మొత్తం పదిసంవత్సరాల పాటు వీరిద్దరూ ఒకమాదిరిగా దీనిని నిర్వహించగలిగారే కాని, తదుపరి ఇది సక్రమంగా వెలువడడం లేదు. మండలివారు ఇకనైనా శ్రద్ధవూనడం అవసరం.

ఈమధ్య కొన్నాళ్లు ఆయుర్వేదాశ్రమం వారు 'సుధ'అనే పత్రికను సాగించి, కొన్నాళ్లు ప్రకటించి అంతటితో ఆపేశారు.

పెరిదేపి ఆయుర్వేద సమాజంవారి 'ఆయుర్వేదచంద్రిక', చక్రవర్తుల నరసింహాచారిగారి 'ఆయుర్వేదకళ', శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి'సుధ', శ్రీమాన్ కృష్ణమాచార్లుగారి 'కుమారమిత్ర', ఆనువంశికాయుర్వేద సమ్మేళనంవారి 'ఆయుర్వేదదీపిక'— ఇవన్నీ వారివారి వ్యాపారాభివృద్ధిని కాంక్షించి బయలుదేరిన పత్రికలైనను చిరస్థాయిగా వుండి, ఆయుర్వేద ప్రచారము చేయగలవని ఆంధ్రదేశము ఆశించుచున్నది. వీటి సంపాదకులు ఈ పత్రికలందు మంచి పరిశోధకవ్యాసాలు,ఆయుర్వేదరహస్యాలు, ప్రాచీనగ్రంథాలు ప్రకటించి, ఇంగ్లీషులో ఉన్న 'మెడికల్ జర్నల్సు'మాదిరిగా నడిపిస్తే బాగుంటుంది. తూర్పుగోదావరిజిల్లా దేశీయ వైద్యసంఘంవారు కొన్నాళ్లపాటు వారి సంఘపక్షాన 'ఆయుర్వేద ప్రభాతం' అనే పత్రికను మంచి పద్ధతులమీద నడిపించారు గాని అదీ ఇప్పుడు అంతరించినట్లే ఉంది.

## ఔషధ విక్రయశాలలు

ప్రథమంలో ఆంధ్రులకు ఔషధవిక్రయ వ్యాపారసరళిని నేర్పింది రెంటాలవారి విక్టోరియా డిపో, దేశోద్ధారకుని అమృతాంజనం డిపోలు రెండే అనడాని కెంతమాత్రం సందేహం లేదు. ఆంధ్రదేశంలో పూర్వం ఏది కావలసినా 'విక్టోరియాడిపో, మైలాపూరు, మదరాసు' అనే చిరునామా అందరికీ కంఠపాఠంగా వుండేది.

తరువాత శాస్త్రీయమైన ఔషధాలను తయారుచేసి విక్రయించే సంస్థల్లోకల్లా మదరాసు ఆయుర్వేదాశ్రమంవారూ, కేసరి కుటీరంవారూ ప్రసిద్ధిని పొందారు. ఇటీవల జమ్మివారున్నూ వీరితోపాటు పేరుపొందారు. 'జీవామృతం', 'లోధ్ర', 'లివర్ క్యూర్'—ఈ మూడూ అమృతాంజనంతో పాటు అన్నిచోట్లా మోగిపోతున్నాయి. ఆంధ్రులు ఈపాటి వ్యాపారం సాగిస్తున్నందుకు ఆంధ్రదేశం సంతోషించగలదు.

కోరంగిలో పొన్నాడవారి వైద్యశాల, చింతలూరు ద్విభాష్యంవారి వైద్యనిలయం, బెజవాడ నోరివారి ఆయుర్వేదనిలయం, ముక్త్యాల రసాయనశాల, బెజవాడ శ్రీపాదవారి ఫార్మసీ—ఇవన్నీకూడా దీర్ఘకాలం నుంచి ఔషధవ్యాపారాన్ని చేస్తున్నాయి. వీరివల్ల ఆంధ్రదేశంలో శాస్త్రీయౌషధాలకు కరువులేకుండా, ఆంధ్రదేశస్థుల కష్టంతో, భారీయెత్తున మందులు తయారై మనకు లభిస్తున్నాయి.

1921-వ సం.లో ఆంధ్రాయుర్వేద ఫార్మసీ జాయింటుస్టాకు కంపెనీగా వ్యాపారం ఆరంభించింది. ఏడెనిమిదేండ్లపాటు విస్తారంగా వ్యాపారం సాగించింది. వ్యాపారరీత్యా ఈఫార్మసీ వాటాదార్లకు మంచి లాభం పంచిపెట్టలేకపోయినా నిజంగా ఆయుర్వేదాభివృద్ధికై పనిచేసే

# చూచి తీరవలసిన 4 నూతన చిత్రాలు

## 1. హిందూస్థాన్ హమారా

పద్మ, జమున, నంద్రేకర్ మొదలయినవారితో

ధనాధికులు చూడ కంటగించుకునే చిత్రం. పాటకజనానీకం ఆనందించే చిత్రం. ఫిలిం కార్పొరేషనువారి అమూల్య చిత్రరత్నం. మద్రాసు బోర్డు ఆఫ్ సెన్సార్సుచే ఇప్పుడే ఆమోదింపబడింది.

## 2. మర్చెంట్ ఆఫ్ వెనిస్ (వెనిసు వర్తకుడు)

కుమారి కజ్జన్ తనదివ్యగానముచే మిమ్మల్ని ముగ్ధులనుచేస్తుంది. శ్రవణోత్సవంగా ఉంటుంది.

## 3 అబ్లా-కి-శక్తీ (అబలాశక్తి)

కుమారి కజ్జన్, మాస్టర్ ఖలీల్

## 4. జంగ్ - అజాడీ

తనకుతానే సాటిఅయిన చంద్రారావు (ఇండియన్ టార్జాన్). అతి సాహస కృత్యాలు, భయంకరదృశ్యాలు, ఇంకా లేనివేమిటి!




బుక్కింగులకు ఈ క్రిందివారికి వ్రాయగోరెదము:—

జనరల్ ఫిలిం డిస్ట్రిబ్యూటింగు

కంపెనీ,

టెలిఫోను : 86254. టెలిగ్రాం : "Genfilms"

పోస్టుబాక్సు 354.

19, వుడ్సురోడ్డు, మౌంటురోడ్డు మద్రాసు.

బ్రాంచీలు:

157/1, సుబేదార్ సత్రంరోడ్డు, బెంగుళూరు సిటీ.

గాంధీనగరం, బెజవాడ.

టెలిగ్రాం (అన్ని ఆఫీసులకు) "Genfilms"

సాధనాల్లో ఇది ఒకటిగా దిగ్విజయం పొందిందనే చెప్పాలి. ఒక 'ఫార్మకోపియా'ను నిర్మించింది. దానిని అనుసరించే చాలావరకు గవర్నమెంటువారు ప్రకటించిన యోగాలుకూడా వున్నాయి. వైద్యవిద్యార్థులకు కర్మపథం బోధించింది. వ్యాపారంలో ఇప్పుడు వెనుకపడిఉన్నసంగతేనూ, మంచి లాభాలు గడించడం లేదంటేనూ, అందుకు కారణం పోటీగా దేశంలో వెలసిన ఔషధ విక్రయశాలలు. అదిగాక ఆంధ్రులకుగల 'పొరుగింటిపుల్లకూర రుచి' కారణం! గుజరాత్, వక్కా దేశస్థుల మందులు మనకు రుచిస్తాయి గాని 'పెరటిచెట్టు మందుకు రాదు'గా మరి? ఇది మనకున్న గుణమే!!

## సెంట్రలుబోర్డు

ప్రస్తుతం ఆయుర్వేదోద్యమం వెల్లువగా పలుముఖాలు పొంది పాయలువారి, దారీ తెన్నూ కానకుండా పరుగెత్తిపోతూంది.

గవర్నమెంటువారు 'సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇండియన్ మెడిసన్' అనే ఒకసంస్థను ఏర్పాటుచేసి, దానిని యిప్పటికి సుమారు 7,8 ఏండ్లనుండీ నామినేషన్లతో నడిపించి, నేడు ఎన్నికలకుపెట్టి ఆయుర్వేదవైద్యులను అలజడిలోకి దించారు. దేశంలోఉండే ఆయుర్వేదవైద్యనామధేయులంతా తొందరపడి ఒక్కొక్కరు రు. 15/12/- చెల్లించుకొని, ఏతహశ్శీలుదారునో ఆశ్రయించి రిజిస్టరు చేయించుకున్నారు. వైద్యుల వైద్యానుభవాన్ని రివిన్యూ అధికారి సర్టిఫైచేస్తేనే గాని ఓటింగుఅర్హత కలుగలేదు. ఈ ప్రకారం రిజిష్టరైన వైద్యులను సుమారు 12 వేల మందిని రిజిష్టరులోకి ఎక్కించారు. వీరందరినీ నాల్గువర్గాలుగా విభజించారు. యల్. ఐ. యం. లు, డిప్లోమా హోల్డర్సు, అనుభవ వైద్యులు, వైద్యోపాధ్యాయులు. వీరందరూ ఓటర్లు. కాండిడేట్లు, నామినేషన్లు, ఎలెక్షన్లు, ఓట్లు—చివరకు ఈబోర్డు ఏం జేస్తుందో, వీరికుండే అధికారా లేమిటో కాలమే తెలపాలి. కాలగర్భంలో ఏముందో!!

ఈ ఎలెక్షన్ తంతు నడవటానికి అనేక ఆయుర్వేదసంఘాలు బయలుదేరినయి. మొదటినుంచీ ఆంధ్రదేశంలో ఉన్నది ఆంధ్ర ఆయుర్వేదవైద్య సమ్మేళనం; దాని అంగం ఆంధ్రవైద్యమండలిన్నీ. తరువాత ఆనువంశికాయుర్వేదసంఘం, విశ్వవిద్యాలయం, దేశీయవైద్య సంఘం, రిజిస్టర్డు దేశీయవైద్య సంఘం, నాన్ యల్. ఐ. యం. సంఘం, విద్యాపీఠం—ఇత్యాదులనేకాలు ఉన్నాయి. ఇవన్నీ ఆయుర్వేదానికి బలుపో, వాపో కాలమే నిర్ణయించగలదు. అన్నీ మంచికే అంటారుగనుక ఇవన్నీ మంచికే వచ్చినవని మనం నమ్మదాం!






# ఆకలిచిచ్చు

శ్రీ కొడాలి రాజారావు

పిడికెడుబిచ్చం
కోసం వేసిన
పిశాచవేషం
చూశారా ?

మాంసం లేనీ
బొమికలగూట్లో
నరాల మాయను
చూశారా?

ఎముక ఎముకకూ
రుద్రాక్షలులా
విచిత్రసంధులు
చూశారా ?

శిరస్సుపైనా
చిందులుత్రొక్కే
దరిద్రదేవిని
చూశారా ?

ముక్కూ చెవులూ
మూల్గే బుగ్గలు
చేసే నాట్యం
చూశారా ?

గుంటూర్ నూతుల
లోతుల సామ్యం
అగాధనయనాల్
చూశారా ?

అర్థంలేని
అందంలేని
దెయ్యపు ముఖమును
చూశారా ?

"అటమట" "చిటచిట"
"కిటకిట" "పటపట"
ఆకలిచిచ్చును
చూశారా ?

హరుని త్రినేత్రా
విస్ఫులితాగ్నుల
నెదుర్చు మంటను
చూశారా?

పిశాచదేహం
విశాలదాహం
నిశాస్వరూపం
చూశారా?

పిడికెడుబిచ్చం
కోసం చేసే
రక్షోనృత్యం
చూశారా ?

# చేతికాగితపు పరిశ్రమ

## పుట్టు పూర్వోత్తరములు

సామర్కండులో క్రీ. శ. 704 నాటికి ఈ పరిశ్రమ ప్రవేశించినది. హిందూదేశములో 10-వ శతాబ్దములో గజినీ మహమ్మదువలన ఈ పరిశ్రమ నెలకొని యుండవచ్చును. 1336 లో జర్మనీలో ఒక కర్మాగారము నెలకొల్పబడెను. అక్కడనుండి స్విడ్జర్లాండుకు, అక్కడనుండి హాలెండుకు, తర్వాత ఇంగ్లాండుకును ఇది ప్రాకెను. అమెరికాలో 1690 లో మొదటి కాగితపు పరిశ్రమ కర్మాగారము నెలకొల్పబడెను. 1801 వరకు ఇంగ్లండులో కాగితము చేతితోనే చేసెడివారు. 1840 కి పూర్వము ఇండియాకు కావలసిన కాగితములో చాలభాగము చీనానుండి దిగుమతి యగుచుండెను. తర్వాత ఈ దేశములో ఈకాగితపు పరిశ్రమయందు శ్రద్ధపుట్టి అన్ని రాష్ట్రాలలోను అనేక కార్ఖానాలు పనిచేయ మొదలు పెట్టెను. కాని ఇది త్వరలోనే మూలపడెను.

## ★ శ్రీ భావరాజు వీర్రాజు ★

కాగితము అనే మాట హిందీభాషలోని 'కాగజ్' అనే మాటలోనుంచి పుట్టి వుండవచ్చును. పూర్వము 'పాపిరస్సు' అనే మొక్కతో కాగితం చేసేవారు. దానిలోనుంచి యింగ్లీషులో 'పేపరు' అనే మాట పుట్టినది. కాగితం కనిపెట్టకపూర్వం తాటియాకులమీదను, భూర్జపత్రములమీదను వ్రాయుచుండెడివారు.

సామర్కండు (Samarkand) లో క్రీ. శ. 704-వ సం. నాటికి యీ పరిశ్రమ ప్రవేశించినది. హిందూదేశములో 10-వ శతాబ్దములో గజినీమహమ్మదువలన ఈపరిశ్రమ నెలకొనియుండుననియూహించుచున్నారు. క్రీ. శ. 1336 లో జర్మనీలో ఒక కర్మాగారము నెలకొల్పబడెను. అక్కడనుంచి స్విట్జర్లాండుకు, అక్కడనుంచి హాలెండుకు, తర్వాత ఇంగ్లండుకు ఈ పరిశ్రమ ప్రాకినది. అమెరికాలో 1690-వ సం.న మొదటి కాగితపు పరిశ్రమ కర్మాగారము నెలకొల్పబడినది. 1801-వ సం. వరకు ఇంగ్లండులో కాగితము చేతితోనే చేసెడివారు. 1840-వ సం. కు పూర్వము హిందూదేశమునకు కావలసిన కాగితములో చాలభాగము చైనానుంచి దిగుమతి అయ్యేది. తర్వాత యీ దేశములో కాగితపుపరిశ్రమయందు శ్రద్ధ గలిగి అన్నిరాష్ట్రములలోను అనేక కార్ఖానాలు పనిచేయ మొదలుపెట్టెను. సర్ చార్లెస్ వుడ్డుగారు ఇండియా మంత్రిగా వున్న కాలంలో ఇండియా గవర్నమెంటుకు కావలసిన యావత్తు కాగితములు గ్రేటుబ్రిటనునుండి కొనవలసినదిగా వుత్తరువులు చేయుటచే హిందూదేశములోని కాగితపరిశ్రమ మూలపడినది. ఇప్పటికిని కొంతమంది పార్శీవర్తకులు పూర్వాచారప్రకారం తమ చిట్టా ఆవర్జాలకు చేతితో చేసిన కాగితములనే వాడుచుండుటచే కాగితపుపరిశ్రమ చేయు కుటుంబములు కొన్ని నేటికిని నిలిచియున్నవి. ఆంధ్రదేశములో కొండపల్లిలో చేసెడివారు. అనంతపురంజిల్లాలో న్యామద్దల గ్రామంలో 16 కార్ఖానాలలో ఒక్కొక్క కార్ఖానాలో 10 మంది కూలీలు పనిచేసెడివారట. మిల్లుకాగితము వచ్చినతర్వాత యీ పరిశ్రమ మూలపడినది. మరల కొంతకాలమునకు ఒక బళ్లారివర్తకుడు కాగితములు చేయించి అమ్మకము లేక మానివేసెను. 1925-వ సం. ప్రాంతముల అనంతపురం కో ఆపరేటివు బ్యాంకువారు రు. 100 ముందు బదులు యిచ్చి రెండు తావుల(Double foolscap) సైజు కాగితం రెండు రూపాయిలకు 5 దస్తాల చొప్పున పుచ్చుకొనుటకు కంట్రాక్టు చేసుకొని పనిచేయించిరి. యీ కంట్రాక్టు అయిపోగానే వాటాదార్లలో భేదాభిప్రాయాలు వచ్చి పని నిలిపివేసిరి. ఇపుడు గాంధీ మహాత్ముని నిర్మాణకార్యక్రమవిధానంలో అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘంవారియొక్క కృషివలన మరల అనేకప్రాంతములలో చేకాగితపరిశ్రమ పునరుద్ధరింపబడుచున్నది.

యంత్రములు ఎంత అభివృద్ధి చెందినను ఇంకా అమెరికాలోను, యూరపులోను, చైనాలోను, జపానులోను, ఇండియాలోను చేతితో కాగితము చేయుచున్నారు. యంత్రములలో కూడా తయారుకానంత నాణ్యమైన కాగితం కావలసివచ్చినపుడు విదేశాలలో చేతితోనే చేస్తారు. చిరకాలము వుండవలసిన దస్తావేజులు, చిత్తరువులు మొదలైనవి వ్రాయుటకు చేతితో చేసిన అట్ట కాగితాలు చాలా ఖరీదు పెట్టి కొంటారు. మన దేశంలో చేతితో చేసిన కాగితం సామాన్యంగా నిత్యకృత్యాలకుమాత్రమే పనికివస్తుంది.




1-వ చిత్రము

### కాగితము

ప్రతిఉద్భిజ్జములోను ప్రత్తివంటియేసులు (**Cellulose**) పిండి, జిగురు మొదలైన పదార్థములతో కప్పబడివుండి కంటికి కనిపించవు. అవి పడుగు పేకలై కాగితంగా యేర్పడును. రసాయనముల (**Chemicals**) సహాయముతో పిండి, జిగురు మొదలైన పదార్థములను తీసివేసి స్వచ్ఛమైన తెల్లని యేసులను తీయుటకు గుజ్జు (**Pulp**)తీయుట అనియు,గుజ్జును కాగితములుగా చేసి వ్రాత మొదలైన పనులకు అనుకూలముగా చేయుటకు కాగితము చేయుట అనియు అందురు.

### ముడిపదార్థములు

ఈప్రక్కపుటలోచూపిన పట్టికలోని ముడిపదార్థములు కాగితములు చేయుటకు పనికి వచ్చును. ఏవస్తువులోనుంచియెంతగుజ్జు వచ్చునదీ,ఏరసాయనము యెంతకావలసినదీ,యెంత సేపు వుడకబెట్టవలసినదీ, యెంతకాలముదంచవలసినదీ కూడా అందులో తెలుపబడెను. ఇవిగాక యేవైనా నారలుగాని, గడ్డిగాని దొరికేయెడల వానియొక్క స్వభావమననుసరించి రసాయనములు మొదలైనవి నిర్ణయించుకోవలెను. ముడిపదార్థమునుబట్టిన్నీ, రసాయనముల నాణ్యమునుబట్టిన్నీ యీ పాళ్లు మార్చుకోవచ్చును.

### ముడిపదార్థమును నిర్ణయించుట

ముడివస్తువును నిర్ణయించేటప్పుడు మనం చేయవలసిన కాగితంయొక్క రకమునుబట్టీ, మనకు చవుకగా, సమృద్ధిగా దొరుకుటనుబట్టీ నిర్ణయించుకోవలసి వుంటుంది. తక్కువ ఖర్చుతో గుజ్జు తయారుకావడం ముఖ్యం. ఉదాహరణ:— గుడ్డముక్కలకు రసాయనముల ఖర్చుతక్కువ.గుజ్జుచేయుటకును దంచుటకును ఖర్చు యెక్కువ. వాటిని సంపాదించుటకు ఖర్చు యెక్కువయినా గుజ్జుమాత్రం యెక్కువవచ్చును. గడ్డి చవకగానే దొరుకుతుందిగాని అందులో వేసే రసాయనములకు ఖర్చు యెక్కువవుతుంది కాని గుజ్జుచేయుటకు ఖర్చు తక్కువవుతుంది. దిగుబడిమాత్రం గుడ్డముక్కలకంటె తక్కువ వస్తుంది. యీ రెంటిలో కూలి చవకగావుండి విరివిగా దొరికితే గుడ్డముక్కలతో చేయడమే మంచిది. కూలి తక్కువగావుండే పక్షంలో రసాయనముల ఖర్చు యెక్కువ అయినా గడ్డితో చేస్తేనే చవకగా కిట్టును. ప్రతిగ్రామంలోను గుడ్డముక్కలు కావలసినన్ని దొరకవు. పట్టణములనుంచి తెచ్చుకోవలెను. వరిగడ్డి అంటారా, పల్లెలలో కావలసినంత! పశువుల శాలలనుండి పారవేసే చెత్తకు మితమే వుండదు. చేలో కోతకోయగా మిగిలేమోళ్లు కూడా సమృద్ధిగా దొరుకుతవి. అందుచేత వరిగడ్డితో చేయు విధానము వివరించుచున్నాను. మిగిలిన పదార్థములతో చేయు విధానము కూడా యింతే. రసాయనముల భాగములు మొదలైనవిమాత్రం తేడా వుంటాయి. మంచినీరు సమృద్ధిగా దొరకు ప్రతి గ్రామంలోను యీ పరిశ్రమ చేయవచ్చును.

### వరిగడ్డితో గుజ్జుచేయు విధానము

పశువులశాలలలోనుంచి పారవేసే గడ్డి, చేలో వదిలివేసిన మోళ్లు అయితే ముందు శుభ్రముగా కడిగి యెండవేయవలెను.

**ఏరుట:**—వరిగడ్డితప్ప మిగిలిన యితర పదార్థములు వుంటే యేరివేయవలెను. గడ్డిలోని వెన్నులు (1-వ చిత్రము'ఉ')యేరివేయవలెను. యితర చెత్త వుంటే తయారైనకాగితంలో నలకలు వుండును. (గుడ్డముక్కలు, చిత్తుకాగితాలు అయితే రంగువీ తెల్లవీ విడివిడిగా యేరవలెను) తర్వాత చిన్న ముక్కలుగా కోయవలెను.

**కోయుట:**—ముడిపదార్థము రసాయనపునీటిలో బాగుగా నానుటకు, వుడుకుటకు చిన్న ముక్కలుగా కోయవలెను. యేరిన వరిగడ్డ 1-వ చిత్రంలో 'ఈ' వంటి కక్కుల కత్తితో 1 అంగుళము పొడుగు ముక్కలుగా కోయ్యాలి. జనపనార, గుడ్డ ముక్కలు మొదలైనవి కక్కులులేని కత్తితో కోయ్యాలి. వెదురు మొదలైనవి చిన్న గండ్ర గొడ్డలి (అ) తో కర్రదిమ్మ (ఇ) మీద నరకవలెను. తరువాత దులపవలెను.

**దులుపుట:**—చిత్రము 2. కోసిన ముక్కలలోకి యిసుక దుమ్ము చేరును. దుమ్ము రసాయనములపనికి కొంత ఆటంకముచేయును. కాగితం తయారైనను ఇసుక పోదు. అందుచేత కోసినముక్కలను నులకమంచము మీద వేసి కర్రతోకొట్టి దులపవలెను. ఇసుక క్రింద రాలిపోవును. పిమ్మట రసాయనపు నీటిలో నాన వేయువలెను.

**నానవేయుట:**—దులిపిన గడ్డిముక్కలను తూచి ఆ తూనికమీద నూటికి 20 భాగముల చొప్పున కాస్టిక్ సోడాను (Caustic soda) తీసుకొని, ఒక సిమెంటుగోలెములో (3వ చిత్రంలో 3వ బొమ్మ) వుజ్జాయింపుగా గడ్డిముక్కలు మునుగునంత నీరు వడియకట్టి, కాస్టిక్ సోడాను అందులో వేసి కర్రతో బాగా కలపవలెను (కాస్టిక్ సోడా శరీరానికి తగిలితే పుండుపడుతుంది. చాలజాగ్రత్తగా వుండాలి.) పిమ్మట కొంచెము కొంచెము గడ్డిముక్కలు వేయుచు కర్రతో అణచవలెను. పైకి తేలిపోకుండా పైన బరువుపెట్టవలెను. లేనియెడల పైభాగమునవున్న ముక్కలు బాగా నానవు. నీరు చాలనియెడల కొద్దిగా నీరు చేర్చవచ్చును. ఇట్లు 12 గంటలు నాననిచ్చి పిమ్మట వుడకబెట్టవలెను.




2-వ చిత్రం

1-వ పట్టిక

| ముడిపదార్థము | నూరు భాగముల ముడి పదార్థమునకు | | | 10 పౌనుల ముడిపదార్థము వుడకబెట్టవలసిన కాలము | 10 పౌనుల ముడిపదార్థము దంచుటకు పట్టుకాలము. | 10 పౌనుల ముడిపదార్థము త్రొక్కుటకు పట్టుకాలము | వరా |
|---|---|---|---|---|---|---|---|
| | గుజ్జుదిగుబడి | 98 % కాస్టిక్కు సోడా | 35 % బ్లీచింగు పౌడరు | | | | |
| | భా. | భా. | భా. | గం. | గం. | గం. | |
| తెల్లగుడ్డముక్కలు ... | 80 | 5 | 3 | 5 | 93 | ... | |
| జనపనార / గోగునార ... | 60 | 12 | 7 | 5 | 30 | ... | |
| పాతగోనెలు ... | 55 | 15 | ... | 8 | 46 | | తెల్లబడుట కష్టము |
| వెదురు ... | 43 | 20 | 18 | 6 | 42 | | |
| వరిగడ్డి ... | 40 | 20 | 8 | 3 | ... | 3 | |
| అరటిచొప్ప ... | 40 | 12 | ... | 6 | 18 | | డిటో |
| ప్రత్తినార ... | 37 | 12 | 7 | 5 | 30 | | |
| చెరుకు పిప్పి ... | 33 | 20 | 10 | 6 | 42 | | |
| చిత్తుకాగితాలు ... | 75 | 3 | 2 | 2 | ... | 2 | |

**ఉడకబెట్టుట:**— చిత్రం 4. ఒక డబ్బాలో నానిన గడ్డిని కాస్టిక్ నీళ్లతోసహా వేసి పొయ్యిమీద పెట్టి, బాగా మూతపెట్టి సుమారు మూడుగంటలు వుడకబెట్టవలెను. మధ్యమధ్య కలియబెట్టుచుండవలెను. గడ్డి కణుపులు అన్నపు మెతుకులవలె మెత్తగా వుడికినయెడల గడ్డి వుడికినదని తెలుసుకోవలెను. చల్లారనిచ్చి మడ్డినీరు వడకట్టి వుంచవలెను. దీనిలో మరల గడ్డి నానవేసి వుడకబెట్టవచ్చును. వుడికిన గడ్డిని కడిగివేయవలెను.

**కడుగుట:**— 5-వ చిత్రము. ఈ పనికి ముగ్గురు మనుష్యులు వుండవలెను. రసాయనప్రక్రియ (Process) చేసినపుడల్లా కడిగివేయుచుండవలెను. దీనికి 3 గజముల పొడవు, 48 అం. వెడల్పు గల పల్చని నేతగల ముతకగుడ్డ వుండవలెను. చిక్కనినేత అయితే నీరు త్వరగా దిగదు. గుడ్డను చిత్రములో చూపినట్లు నేలకు తగులునట్లు పట్టుకొని, వడియకట్టిన ముద్దను గుడ్డలోవేసి ఒకమనిషి నీరుపోయుచు గుడ్డపట్టుకున్న యిద్దరును వెనక ముందులకు యిసుకజల్లెడను జల్లించినట్లు గుంజవలెను. ఇట్లు మడ్డినీరు పోయి స్వచ్ఛమైననీరు వచ్చువరకు చేయవలెను. కాస్టిక్ సోడా నీటిలో కరగిన యావత్తుమలినము పోయి స్వచ్ఛమైన గుజ్జు గుడ్డలో మిగులును. తర్వాత త్రొక్కవలెను.

త్రొక్కుట:—3-వ చిత్రము, 2-వ బొమ్మ. త్రొక్కుటకు ఒక సిమెంటు గొయ్యి కావలెను. 24 అం. వెడల్పు, 18 అం. లోతు గలిగి అర్ధచంద్రాకారముగా వుండాలి. లోపల గరకుగా వుండాలి. నున్నగా వుంటే గుజ్జు నలగక జారిపోవును. అడుగు భాగమున తూము వుండాలి. కడిగిన ముద్దను గోతిలోవేసి, కాళ్లు శుభ్రముగా కడుగుకొని ఇసుక అంటుకోకుండా గోతిలో దిగి, పైన వ్రేలాడకట్టిన త్రాడు పట్టుకొని, అడుసు త్రొక్కినట్లుగా త్రొక్కవలెను. సుమారు రెండుగంటలు త్రొక్కి, గచ్చకాయంత ముద్ద తీసి ఒక గాజుగ్లాసులో వేసి నిండా నీళ్లుపోసి బాగా చిలకరించి చూచినయెడల పొడుగుపాటి యేసులు కనిపించకుండా వుంటే త్రొక్కుట సరిపోయినదని తెలుసుకోవలెను. పొడుగుపాటి యేసులు యెక్కువగా వుంటే ఇంకా త్రొక్కవలెను. తర్వాత మొదట కడిగినట్లే కడిగివేయవలెను. చిత్తుకాగితాలు కూడా అట్లే త్రొక్కవలెను. మిగిలిన ముడిపదార్థమున్న దంచవలెను.

దంచుట:—3-వ చిత్రములో 1-వ బొమ్మ. దీనికి హిందీలో 'ఢెంకి' అని పేరు. 'అ' 9 అంగుళముల లావు,10 అడుగులపొడవు గల దూలము. దీనికి 'క' వద్ద ఒక ఇనప యిరుసు వుండాలి. రెండు గుంజలమీద యినప యిరుసు ఆని వుండును. దీనికి 'ఆ' రోకలి బిగించవలెను. రోకలి 1 గజం యెత్తు, 9 అం. మందము వుండవలెను. దీని అడుగున 'ఉ' నాల్గుఅంగుళముల మందముగల ఇనప పొన్ను వేయవలెను. రోకలిచుట్టూ యినుపకట్టు బిగించవలెను. యీ పొన్నుక్రింద 'ఇ' నల్లరాయి 18 అంగుళముల చతురం, 18 అం. ఎత్తు వుండాలి. దీనిని భూమిలో బిగించవలెను. చుట్టూ గోలెమువలె 18అంగుళముల ఎత్తు కట్టవలెను. దీనికి తూము వుండాలి. వుడికిన పదార్థము యీ గోలెములో వేసి, 'అ' వద్ద మనిషి యెక్కి నిలుచుంటే 'ఆ' రోకలి పైకి లేచును. అప్పుడు మనిషి ప్రక్కన వున్న దిమ్మమీదకు తప్పుకుంటే రోకలి 'ఇ' రాయిమీద పడి అందులోని వస్తువు గుజ్జుగా నలుగును. ఒక మనిషి కర్రతో రోటిలోని వస్తువును తిరగవేయుచుండాలి. ఈ పద్ధతి చాలా పురాతనమైనది. 'హాలెండరు'అను మరియొక సాధనముగలదు. యిది ఖరీదు యెక్కువ. చాల సులువుగా పని జరుగును. దంచుట సరిపోయినదీ లేనిదీ పైన చెప్పినరీతిగా పరీక్షించవలెను. తర్వాత కడిగివేయవలెను. తర్వాత చలువ (Bleaching)చేయవలెను. చలువచెయ్యని గడ్డిగుజ్జు కవర్లు చేయుటకు చాలా బాగుగా వుండును.




3-వ చిత్రం

చలువ చేయుట:—గుజ్జును తెలుపు చేయుటకు బ్లీచింగు పొడరు కావలెను. దీనిలో రెండు రకాలు వున్నాయి. 1. పెర్క్లొరాన్ (Perchloran). యిది బజారులలో అమ్మేది. దీనినికూడా బజారులో బ్లీచింగుపొడరు అనే అంటారు. యిది గాలికి చప్పున చెడిపోదు. దీనిలో నూటికి 75 భాగములు బ్లీచింగుచేయు శక్తి వుండును. నీటిలోకరగిపోవును. 1-వపట్టికలో వివరించిన భాగములలో యిది 3వ వంతు సరిపోవును. యిది నీటిలో బాగా కలిపి వడపోసినచాలు. 2. బ్లీచింగు పొడరు. దీనిలో నూటికి 35 వంతులే బ్లీచింగుచేయుశక్తి వుండును. ఇది గాలికి చెడిపోవును. అందుచేత జాగ్రత్తగా మూతలు బిగించి దాచవలెను. యిది అంతా నీటిలో కరగదు. అందుచేత ముందు కొద్ది నీటితో ముద్దలు లేకుండా బాగా కలిపి తర్వాత కొంత నీరు చేర్చి, బాగా కలిపి, తేర నిచ్చి ఆ తేటను ఒక పాత్రలో పొయ్యవలెను. మిగిలిన మడ్డిలో మరల నీరు కలిపి తేరనిచ్చి మొదటిసారివలెనే ఆ తేటను మొదటితేటలో పొయ్యవలెను. యిట్లు మూడుసార్లు చేసి ఆ తేట అంతా కడిగి వుంచిన గుజ్జులో వడపోసి బాగాకలపవలెను. నీరు చాలకపోతే కొంచెం నీరుచేర్చవచ్చును. అప్పుడప్పుడు గుజ్జును తిరగవేయుచుండవలెను. బ్లీచింగుపని లోహపాత్రలలో చేయకూడదు. సిమెంటుతొట్లుగాని, కర్రతొట్లుగాని పనికివచ్చును. బ్లీచింగుపొడరు నీటిలో కలుపుకొనుటకు బాల్చీలు వుపయోగించవచ్చును. కాని వెంటనే కడిగి శుభ్రము చేయవలెను. నిల్వ యుంచరాదు. బ్లీచింగు నీటిలో గుజ్జు 24 గంటలు వుంచి తర్వాత కడిగివేయవలెను. పిమ్మట బ్లీచింగుకు విరుగుడు పెట్టవలెను.

బ్లీచింగుఘాటుకు విరుగుడు:— ఎంత బాగా కడిగినను బ్లీచింగుఘాటు వుంటుంది. దీనివలన కాగితంనిల్వవుండదు; చెడిపోవును. గనుక వెయ్యిభాగముల ముడిపదా

ర్థమునకు 1 భాగము 'హైపో' చొప్పున లెక్క కట్టి హైపోను నీటిలో కలిపి చలువచేసి కడిగియుంచిన గుజ్జులో పోసి బాగా కలిపి అరగంటవుంచి కడిగివేయవలెను. దీనితో గుజ్జు చేయుట పూర్తి అయినది. ఇట్లు చలువ చేసిన గుజ్జులో పొడుగుపాటి యేసులు, పెద్ద నలకలు వుండును. వీనిని తీసివేయుటకు గుజ్జును జల్లించవలెను.

**జల్లించుట:**—6-వ చిత్రము. 'క' జల్లెడ. యిది $\frac{1}{2}$ అం. దళసరిగల టేకుబద్దలతో 20 అం. పొడవు, 12 అం. వెడల్పు, 6 అం. ఎత్తు వుండేలాగు పింజపెట్టి తయారు చేయవలెను. అడుగున 1/16 అం. అడ్డు కొలతగల గుండ్రని రంధ్రములుగల కళాయి రేకును బిగించి మధ్య వంగిపోకుండా అడుగున సన్నని బద్దలు బిగించవలెను. ప్రక్కల యందు 'చ' కర్రముక్కలను బిగించవలెను. యివి చేతితో పట్టుకొనుటకు వీలుగా వుండును. జల్లెడకు తీగెతో అల్లిన జల్లెడ పనికి రాదు. యేసులు దిగవు. 'గ' పెద్దతొట్టి. దీనిని చిన్న యిటికతో కట్టి సిమెంటుచేయ వచ్చును. దీనినే కాగితములు ఎత్తుటకు కూడా ఉపయోగించదలచుకొన్న యెడల 4 అడుగుల పొడవు, 3 అడుగుల వెడల్పు, 3 అడుగుల ఎత్తు వుండులాగున కట్టి, లోపలి వైపు అడుగుభాగమున $3\frac{1}{2}$ అడుగులపొడవు, 1 అడుగు వెడల్పు వుండులాగున కట్టి సిమెంటు చేసి నునుపుచేయవలెను. మూలలు గుండ్రముగా వుండాలి. అడుగున తూము వుండాలి. తొట్టి నిలువుగోడలోపలి అంచుకు 3 అంగుళముల దిగువ నింకొక అంచు కట్టించవలెను. దీనిని పటములో చూపలేదు. ఈ తొట్టిలో పై అంచుకు 6 అంగుళములు తక్కువగా నీరు వడపోసి, ప్రక్కన వున్న గోలెములో గుజ్జును పల్చగా కలుపుకొని, ఒకమనిషి బాల్చితో జల్లెడలో పోయవలెను. ఒక మనిషి జల్లెడను నీటిలో అరఅంగుళము మునిగేలాగు వుంచి గుజ్జుపోయగానే క్రిందకు, పైకి నీటిమీద కొట్టవలెను. సన్ననియేసులు పెద్దతొట్టిలోనికిదిగిపోవును. పొడుగుయేసులు చెత్త జల్లెడలో వుండును. యీ మడ్డిపోవుటకు జల్లెడ మునుగు మరియొక తొట్టిలో నీరు పోసి అందులో జల్లెడను తిరగవేస్తే మడ్డి ఆ నీటిలోనికి దిగిపోవును. యిట్లు గుజ్జు అంతా జల్లించవలెను. పైనుంచి గుజ్జు పడకుండా జాగ్రత్తగా పనిచెయ్యాలి. ఇక యీ గుజ్జుతో కాగితములు చేయవచ్చును. తెల్లకాగితాలకు అయితే, చాకలి గుడ్డలకు నీలిమందు పెట్టినట్లు, కొంచెము నీలిరంగు కలపవలెను. రంగుకాగితాలకైతే కావలసిన రంగు కలుపవలెను. రెండురకముల ముడిపదార్థములతో చేసిన గుజ్జును యిప్పుడు కలుపవచ్చును.

**గుజ్జును కాగితములు చేయుట:**— ఈ పనికి ముందు కాగితముల యొక్క సైజు (పరిమాణము)ను తెలుసుకోవాలి. 2-వ పట్టికను గమనించవలెను. చిత్రము 7. కాగితములు చేయుటకు 'ఆ'అనే జల్లెడ కావలెను. దీనిని పూచికపుల్లలనుగాని, సన్నని వెదురుబద్దలనుగాని పట్టుదారముతోనైనా, గుఱ్ఱపువెంట్రుకలతో నైనా 9-వ చిత్రములోని 'ఇ' చట్రముయొక్క సహాయముతో దర్భాసనములు, వెదురుపుల్లల తడికలు అల్లునట్లుగా అల్లవలెను. పుల్లల అతుకులు దగ్గరగావున్న దారములమధ్యకు రావలెను. దారముల ముడులన్నీ ఒకవైపునకే రావాలి. యీ అల్లికయొక్క నేర్పరితనమునుబట్టి కాగితం సరిసమానంగా వచ్చును. ఇటువంటివి 2 చాపలు కావలెను. ఈ చాపకు కాగితం కంటె 5 అంగుళముల వెడల్పు, 7 అంగుళముల పొడుగు యెక్కువ పెట్టాలి. ఎందుచేతననగా, తయారుచేయు కాగితం ఎండినతర్వాత ఈసిపోవును. సమమట్టముగా కోయుటకు కొంచెము పెచ్చువుండాలి. ఉదాహరణ:— సింగిలుఫూల్సుకేప్ కాగితం చెయ్యాలంటే $18\frac{1}{4}$ అం. వెడల్పు, $23\frac{1}{2}$ అం. పొడవు పెట్టి చాప అల్లాలి. దీనికి 'ఉ' రెండు టేకుబద్దలు $\frac{1}{2}$ అం. వెడల్పు, $\frac{1}{4}$ అం. దళసరిగలవి తీసుకొని ఒకవైపున గుండ్రముగా చేసి, 2 అంగుళములకు ఒక్కొకరంధ్రము వేసి, చాపకు క్రింద ఒకటి, పైన ఒకటి వేసి లావుపాటిదారముతో కుట్టవలెను. ఇప్పుడు వెడల్పు $18\frac{1}{4}$ అం. లో 'ఉ' బద్దలు 1 అంగుళమును, పొడవు $23\frac{1}{2}$ అం.లో 'ఇ'బద్దలుమూడు అంగుళముల ప్రదేశమును ఆక్రమించును గనుక $17\frac{1}{4}$అం. వెడల్పు, $20\frac{1}{2}$ అం. పొడవుగల కాగితం దిగును. 'అ' చట్రము చాపవెడల్పుకంటె 1 అంగుళము యెక్కువ వుండాలి. చట్రముతో నీరును తోయునపుడు ఆకాళీలోనుంచి నీరుపోవును. 'అ'చట్రము $\frac{1}{2}$ అం. దళసరి $1\frac{1}{2}$ అం. వెడల్పుగల టేకుబద్దలతో కుసిపెట్టి చెయ్యవలెను. 'ఇ' కమ్ముల మధ్య మూడేసి అంగుళముల దూరములో $\frac{1}{2}$ అం. చవుకముగల టేకుబద్దలు కోణములు పైమట్టముకు సరి



4వుడకబెట్టుట

4-వ చిత్రం

## 2-వ పట్టిక

| కాగితం పేరు | కొలతలు | | |
|---|---|---|---|
| | వ్రాతకాగితాలు | డ్రాయింగు కాగితాలు, పుస్తకముల కాగితాలు | అచ్చువేయు కాగితాలు |
| | అంగుళములు | అంగుళములు | అంగుళములు |
| 1. పాట్ ... | $12\frac{1}{2} \times 15$ | .... | ... |
| 2. డబుల్ పాట్ ... | $15 \times 25$ | | $15 \times 25$ |
| 3. ఫూల్సుకేప్ ... | $13\frac{1}{4} \times 16\frac{1}{2}$ | $14 \times 18\frac{3}{4}$ | ... |
| 4 డబుల్ ఫూల్సుకేప్ ... | $16\frac{1}{2} \times 26\frac{1}{2}$ | ... | $17 \times 27$ |
| 5. డెమ్మీ ... | ... | $15\frac{1}{2} \times 20$ | $17\frac{3}{4} \times 22\frac{1}{2}$ |
| 6. మీడియం ... | $18 \times 22\frac{1}{2}$ | $17\frac{1}{2} \times 22\frac{1}{2}$ | $18\frac{1}{4} \times 23$ |
| 7. రాయలు ... | ... | $19 \times 24$ | $20 \times 25$ |
| 8. సూపర్ రాయలు ... | | $19\frac{1}{4} \times 27$ | $21 \times 27$ |
| 9. ఇంపీరియల్ ... | | $22 \times 30\frac{1}{4}$ | |
| 10. యెలిఫెంటు ... | | $23 \times 28$ | |
| 11. డబుల్ యెలిఫెంటు ... | | $26\frac{1}{2} \times 40$ | |
| 12. అట్లాసు ... | | $26\frac{1}{4} \times 34$ | |
| 13. కొంబియర్ ... | | $23\frac{1}{2} \times 24\frac{1}{2}$ | |
| 14. ఏన్టిక్వారియన్ ... | | $31 \times 53$ | |

పోవులాగున చెయ్యాలి. ఈ చట్రము చాల నేర్పరితనముతో చెయ్యాలి. లేనియెడల చట్రముయొక్క మెరకపల్లములనుబట్టి కాగితం ఒకచోట పలచనగాను, మరియొకచోట దళసరిగాను వచ్చును. 'గ' గుజ్జుజల్లించిన తొట్టి. దీనిలోనుంచి పైన చెప్పినచాపతోను, చట్రముతోను కాగితాలు చెయ్యాలి. దీనికి కాగితములు యెత్తుట అని పేరు.

**కాగితములు యెత్తుట :—** ఈ పనికి యిద్దరు మనుష్యులు కావాలి. వీరిలో 'ఒ' చట్రముతో కాగితములు తీయువానికి వేట్‌మన్ (Vatman) అనియు, చాపతో కాగితాలను తిరగవేయువానికి 'కోచరు' (Coucher) అనియు పేర్లు. వేట్‌మన్‌కు కోచరు యెదురుగా '1'వద్ద నిలబడవలెను. 'గ' పెద్దతొట్టిమీద ఒక వెదురుకర్ర యెడమనుండి కుడికి పడవెయ్యవలెను. వేట్‌మన్ 'అ' చట్రమును తీసి ఆ వెదురుకర్ర మీదను, తొట్టిలోపలి దిగువ అంచుమీదను ఆనించివుంచవలెను. తర్వాత 'ఆ' చాపను తడిపి చట్రముమీద వేసి సమానముగా సద్దవలెను. అప్పుడు కోచరు 'క' స్టాండుమీద వున్న గుడ్డను (యివి తడిపి సాపుచేసి వుంచుకోవాలి) తీసి వేట్‌మనుకు అందించి యిద్దరును కలసి ముడతలు లేకుండా సాగలాగి చాపమీద పరచవలెను. వేట్‌మను చేతితో ముడతలు లేకుండా సరిచేసి, 'ఇ' అను బద్దలు చట్రము యొక్క 'ఇ' కమ్ములతో సమానముగా చాప యొక్క 'ఉ' బద్దల మధ్య వుంచి, చట్రము యొక్క బద్దలతో యీ బద్దలను నొక్కిపట్టి (జల్లెడవలెవుండును) చట్రమును చాప, గుడ్డతోసహా తీసి నిలువుగా పట్టుకోవలెను. అంతట కోచరు వెదురుకర్రను తనవైపునకు లాగుకోవలెను. వేట్‌మను చట్రముతో తొట్టిలోని నీటిని యెదటివైపునకు తోలగ ద్రోయుచు, గుజ్జు పైకిరాగానే, నిలువుగా పట్టుకొన్న ఆచట్రమును తనవైపునకు ఏటవాలుగా పైఅంచు నీటిమట్టమువరకు మునుగువరకు నుంచి నీటిలో మునిగిన చట్రమును నీటిమట్టముతో సమముగా యెత్తవలెను. ఈ యెత్తడంలోనే కాగితాలు పల్చగాను, దళసరిగాను వచ్చును. యిప్పుడు నీటిలో కలసి యున్న గుజ్జు 'ఉ' బద్దలు 'ఇ' బద్దలమధ్య వుండును. చట్రమును నీటిలోనుంచి పైకి తియ్యక పూర్వమే గుజ్జును నాలుగుమూలలకు సమముగా వ్యాపించులాగున చట్రమును కదల్చుచు సద్ది, దానితరువాత మరల చట్రమును అడ్డముగను, నిలువుగను నెమ్మదిగా కదల్చవలెను. దీనివలన యీసులు బాగుగా చిక్కుపడి కాగితము జిగిగా వుండును. అట్లు కదల్చుట కాగానే చట్రమును నీటిలోనుంచి పైకి తీసి పట్టుకొనివుండవలెను. ఈలోగా కోచరు వెదురుకర్రను ముందుకు నెంటవలెను. అప్పుడు వేట్‌మను చట్రమును వెదురు మీదను, తొట్టిలోపలి అంచుమీదను ఆనించి వుంచి 'ఇ' బద్దలను తీసి, యేచేతివైపుబద్ద

జీవకళ ఉట్టిపడుచున్న కొన్ని దంతపుబొమ్మలు



3. గీతోపదేశము



4. విధి నిర్వాహణము






5-వ చిత్రం

ఆచేతినూలమీద వుంచవలెను. కోచరు చట్రమును వదలి చాపయొక్క 'ఉ'బద్దను ఒకచేతితోను, రెండవచేతితో అడుగు బద్దను పట్టుకొని'2' ప్రక్కన గుడ్డపరచివుంచిన బల్ల మీద బోర్లించవలెను. పిమ్మట గుడ్డనువిడిచి చాపనుమాత్రము తీసి తొట్టిమీద ఒకనూల వుంచవలెను. ఈలాగా వేటోమను రెండవ చాపను తీసుకొని మొదటిసారివలెనే కాగితం యెత్తవలెను. కోచరు దానిని మొదటిసారి వలెనే తీసి మొదట వేసినదానిమీద వేయు చుండవలెను. యీపని అంతా ఒకనియమములో అగును. ఇట్లు సుమారు 100 కాగానే 2-వ బొమ్మలోని ప్రెస్సులో పెట్టి మరలు త్రిప్పినయెడల నీరంతా పోవును. 12 గంటలు ప్రెస్సులో ఉన్నతర్వాత యెండవేయవలెను. ఒక్కొక్క కాగితానికి ఒకగుడ్డ వుండాలి. ఈగుడ్డలు 40 నెంబరు నూలుతో పల్చగా సరాసరి నేత నేయించవలెను. జములిపోగులు వుంటే కాగితంలో జాడలు వస్తాయి.

ఎండవేయుట:— చిత్రము 8. ప్రెస్సులోనుంచి తీసిన దొంతర అంతా అడుగుకాగితం పైకి వచ్చులాగున తిరగవేసి రెండేసి గుడ్డలు తీసి '1' తాళ్లమీద ముడతలు లేకుండా ఆరవేయవలెను. నున్నగా అద్దంవలె గచ్చుచేసిన గోడ వుంటే దానికి కాగితం గోడపై పునకు వుండులాగున గోడకు ఆన్చి సాలీలు పడుగుచేసుకునే చిన్నకుంచె వంటి కుంచెతో గుడ్డమీద అదిమి గోడకు అంటించవలెను. కాగితంలోని తడికి గోడకు అంటుకొనును. ఈపద్ధతివలన ముడతలురాక సాఫుగా వుండును. బాగా ఆరినతర్వాత గుడ్డలను నాలుగువైపులను మెల్లగా లాగి వదులుచేసి ఒకరు గుడ్డను పట్టుకొని, రెండవవారు కాగితమును నెమ్మదిగా ఊడతీయవలెను. ఇవి అద్దుడుకాగితాలవలె సిరాను పీల్చును. అట్లు పీల్చకుండ చేయుటయే 'సైజింగు.'

సైజింగు :— ఈపని రెండువిధాలు : 1. గుజ్జులో కాగితాలు యెత్తకపూర్వము చేయుట; 2. కాగితాలు యెండిన తర్వాత చేయుట.

గుజ్జులోనే సైజింగుచేయుట:— ఈ పద్ధతివలన కాగితం ఎత్తినతర్వాత యెండగానే సిరా పీల్చదు. దీనిని అరపూస (Rosin) సైజింగు అంటారు. 1 భాగం చాకలిసోడా (Soda Ash), 6 భాగములు అరపూస, 12 భాగముల నీళ్లు తూనిక ప్రకారం తీసుకోవలెను. నీరు కాగనిచ్చి అందులో సోడాను కరగబెట్టిన తర్వాత పొడుముచేసిన అరపూసను కొద్దికొద్దిగా చేర్చుచు కలియబెట్టుచుండవలెను. ఇది పొంగు వచ్చును. అందుచేత నీటికి 4,5 రెట్లు కాళీగల పాత్ర వుపయోగించవలెను. సుమారు 2 గంటలు వుడకగానే జావవలె అగును. అప్పుడు దించి వేయవలెను. నీరు యిగిరిపోతే నీరు చేర్చవచ్చును. దీనిని రోజిన్‌సబ్బు అంటారు. దీనిని ఒకమారు చేసి నిల్వవుంచుకోవచ్చును. ఎంతగుజ్జుకు యెంతసబ్బు వేయవలెనో వివరించెదను. బ్లీచింగుఅయిన గుజ్జు నీటితో కలిసివుండును. ఇది ఎండినతర్వాత ఎంతవుండునో మనకు తెలియాలి. ఎండబెట్టితే గడ్డకట్టుకొనిపోవును. అందుచేత తడిగుజ్జు అంతా తూచి ఆ మొత్తంలోనుంచి 10 తులాలు తీసి ఎండవేసి, ఆ పదితులాలకు ఎంత ఎండుగుజ్జు వచ్చునో తూచి దానినిబట్టి మొత్తమెంత ఎండుగుజ్జు వున్నదీ లెక్కకట్టుకొని తెలుసుకోవలెను. అప్పుడు యెండుగుజ్జుమీద నూటికి 2 మొదలు 3 భాగములవరకు కాగితముయొక్క రకమునుబట్టి అరపూస తూచి




6-వ చిత్రం

పైవిధముగా సబ్బుచేసుకోవలెను. ఒక్కమారే సబ్బుచేసుకొన్న యెడల ఎంత అరపూసకు ఎంతసబ్బు అయినదీ తూచుకొని, దానినిబట్టి కావలసిన అరపూసకు ఎంతసబ్బు వస్తే అంత తీసుకోవలెను. తీసుకున్న సబ్బును కొంచెము నీటితో బాగా ముద్దలు లేకుండా కలిపి, తర్వాత ఒకకుంచెడునీళ్లు పోసి బాగాకలిపి గుజ్జు జల్లించిన తొట్టిలోకి వడపోయవలెను. కర్రతో బాగా 1 గంటసేపు తొట్టిలోని గుజ్జును చిలకవలెను. తర్వాత అరపూసకు (సబ్బునకుగాదు) 4 రెట్లు పటిక తూచి వేడి నీటిలో కరగించి ఆ నీరు మరల గుజ్జులోకి వడపోయవలెను. మరల 1 గంటసేపు విడవకుండా చిలకవలెను (పటికనీరు ఎప్పుడూ ముందు పోయరాదు). తేరనిచ్చి వెనుక చెప్పిన విధముగా కాగితాలు యెత్తవలెను. కాగితం ఆరగానే సిరా యింకదు. ఈ సైజింగువలన కాగితంయొక్క తెలుపు తగ్గదు; శ్రమలేనిది; ఖర్చుతక్కువతో అగును. మామూలు రకాలకు మాత్రమే ఈ సైజింగు చెయ్యవలెను.

కాగితము ఎండిన తర్వాత సైజింగు చేయు పద్ధతి:—మన దేశంలో పూర్వంనుంచీ బియ్యపుపిండితో గంజి తయారుచేసి కాగితాలకు పూసి సైజింగు చేయుచున్నారు. తెల్లనిబియ్యము ఒకరాత్రి నీళ్లలో నానబోసి మర్నాడు 2, 3 సార్లు బాగా కడిగి ఎండబోసి పిండి విసరవలెను.




8-వ చిత్రం

1 భాగము పిండికి 12 మొదలు 15 భాగములవరకు నీళ్లు కాచి పోసి జిగురువచ్చులాగున వుడికించవలెను. పిండితూనికమీద నూటికి 10 భాగములు పటిక, 2 భాగములు మైలతుత్తము పొడిచేసి వేరే నీటిలో కరగించి 10 నిముషాలకు పిండె దించివేయునుమనగా ఈ నీళ్లు పోయవలెను. చల్లారిన తర్వాత వడకట్టి గుడ్డముక్కతోగాని, మెత్తని కుంచెతోగాని కాకితాలకు పూసి ఆరవేయవలెను. ఆరినతర్వాత నునుపు చేయవలెను. మైదాపిండితోకూడా సైజింగు చేయవచ్చును. మైదాపిండి నీటిలో పల్చగా బాగా కలిపి తేరనిచ్చి ఆ నీరు పారబోయవలెను. ఇట్లు నాలుగైదుసార్లు చేసి ఆ పిండితో పై విధముగానే చేయవలెను.

సర్వేసు (Glue) సైజింగు:—సర్వేసుఅనేది తోలుముక్కలు, కొమ్ములు మొదలైనవానితో తయారుచేయుదురు. దీనితో శాశ్వతరికార్డులకు వుపయోగించే కాగితాలకు, డ్రాయింగుకాగితాలకు, దస్తావేజు కాగితాలు మొదలైనవానికి సైజింగు చేయుదురు. దీనితో సైజింగుచేసిన కాగితంమీద ఒకసారి రబ్బరుతో చెరిపినచోట మళ్లా సిరాతో వ్రాసినా సిరా పాకదు. చేయువిధానమెట్లనిన: సర్వేసును తెచ్చి చిన్న చిన్న ముక్కలుగా కొట్టి, 100 భాగముల నీళ్లకు (తూనిక) 2 మొదలు 3 భాగములవరకు సర్వేసు తీసుకొని 12 గంటలు నీళ్లలో నానబెట్టి పిమ్మట ఆవిరిమీద జున్నుపండినట్లు వేలు ఓర్చుకోలేనంత వేడి యెక్కువరకు కాచవలెను. మరగకాచరాదు. సర్వేసు తూనికమీద నూటికి 10 భాగముల పటిక తూచి వేరే వేడినీటిలో కరగించి, 10 నిమిషాలకు సర్వేసునీళ్లు దింపుతా మనగా యీ పటికనీళ్లు చేర్చవలెను. పిమ్మట 9-వ చిత్రములోని 'అ' తొట్టి 36 అం. పొడవు, 24 అం. వెడల్పు, 8 అం. లోతు వుండులాగున సిమెంటుతోగాని, కర్రతోగాని చేయించవలెను. ఇందులో పైనజెప్పిన సర్వేసునీళ్లు పోసి నాలుగేసికాగితాలు తీసి ఈ నీటిలో ముంచి ఒకబల్లమీద పెట్టవలెను. ఇట్లు సుమారు 200 వరకు దొంతరగా పెట్టి




7-వ చిత్రం

ప్రెస్సులో పెట్టి నొక్కి వేయవలెను. తర్వాత నాలుగేసి కాగితాలు దొంతరగా తీసి తాళ్లమీద ఆరవేయవలెను. ఎండిన తర్వాత ఒక్కొక్క కాగితము తీసి నునుపు చేయవలెను.

నునుపు చేయుట (Glazing):— కాగితముమీద కలము సాఫీగా నడచుటకు సైజింగుఅయినతర్వాత నునుపు చేయవలెను. ఈపని మూడురకాలుగా చేయవచ్చును.

రాయితో నునుపుచేయుట :— చిత్రము10, 1-వ బొమ్మ.'క' ఒక టేకుదిమ్మ 24 అం. పొడవు, 6 అం. వెడల్పు, 6 అం. యెత్తుగలది తీసుకొని, మనిషి కాళ్లపైపున




9-వ చిత్రం

రెండు అంగుళములు వుండేలాగున ఆడోకగా చెక్కి నున్నగా నునుపు చేయవలెను. 'గ' ఒక కర్రదిమ్మ 3 అం. వెడల్పు, 4 అం. పొడవు, 8 అం. దళసరిగలదానిలో 'చ' అను నున్నని బాదంకాయమాదిరి రాయి 1 అం. వెడల్పు, 3 అం. పొడవు, 2 అం. యెత్తు వున్నది పైకి ఒక అర అంగుళము కనిపించేలాగున 'గ' దిమ్మలో బిగించవలెను. 'క' దిమ్మమీద కాగితమును వుంచి 'గ' దిమ్మను చేతితో పట్టుకొని 'చ' రాయితో కాగితంమీద రుద్దవలెను. తిరగవేసి రెండవవైపున రుద్దవలెను. ఒకగుడ్డలో పొడి సున్నము మూటగట్టి అప్పుడప్పుడు కర్రదిమ్మమీద జల్లుచుండవలెను. దీనివలన కాగితము దిమ్మమీదనుంచి జారిపోదు. రాయి కాగితంమీద నున్నగా జారుటకుగాను కొంచెము కొబ్బరినూనె యెడమచేతిమీద రాసుకొని అప్పుడప్పుడు రాయిని ఆ నూనెకు తగిలించుచుండవలెను. ఈపద్ధతి చాలాపురాతనమైనది. 1 మనిషి రోజుకు యీవిధంగా నాల్గు దస్తాల సింగిలుఫూల్సుకేపుసైజు కాగితం గ్లేజింగు చేయగలడు. ఈపనిముట్లు సులభముగా చేసుకోవచ్చును.

అద్దములమీద నునుపుచేయుట:— ఇది నేను కనిపెట్టినది. ఈపద్ధతివలన ఒకకుర్రవాడిసహాయముతో 2 గంటలు పని చేసిన యెడల 4 దస్తాల కాగితాలు సునాయాసముగా నునుపుచేయగలము. ఈరెండు గంటలలో మామూలుపద్ధతిలో గుడ్డనుండి కాగితములను తీయుకాలము కూడా కలసియున్నది. ఈపద్ధతిలో గ్లేజింగుచేసిన కాగితం చాలగట్టితనము గలిగియుండును. తెలుపు యెంతమాత్రం తగ్గదు. రాయితో రుద్దితే తెలుపు తగ్గును. అరపూససైజింగుచేసి, అద్దములమీద నునుపు చేస్తే మిల్లుకాగితంతో సమానముగా నుండును.

చేసేపద్ధతి :—సింగిల్ ఫూల్సుకేపు సైజు కాగితం గ్లేజుచేయుటకు 16 " X 20" అం.అద్దములు చాలును. రెండు అంగుళముల లావు, తొమ్మిది అంగుళముల పొడవుగల నున్నని మెత్తని రబ్బరురోలరు కావలెను. సైక్లోస్టయిల్ రోలరు పనికివచ్చును. కాగితము తాళ్లమీద ఆరవేసినతర్వాత కొంచెము పచ్చిగా వుండగా అన్ని గుడ్డలు తీసి దొంతరగా పెట్టి వుంచవలెను. కాగితము బాగా యెండిపోతే అద్దానికి అంటుకోదు. ఎక్కువ తడిగా వుంటే అద్దానికి అంటుకొని వూడిరాక చెడిపోవును. ఇది అనుభవమువలన తెలుసుకోవలెను. ఒక బల్లమీద యెనిమిది పదిగుడ్డలు మెత్తవలె పరచి, దానిమీద అద్దమును వుంచి (అడుగున ముడతలు లేకుండా చూడవలెను), 'సురఫ్' తో శుభ్రపరిచి, కాగితముతో సహా గుడ్డను తీసికొని, కాగితం అద్దంవైపునకు వుండేలాగున అద్దంమీద బోర్లించి, చేతులతో ముడతలు లేకుండా సాఫుచేసి, గుడ్డమీద రబ్బరురోలరును మెల్లిగా నొక్కుచు ఇన్నివైపుల సమముగా దొర్లించవలెను. తరువాత గుడ్డను నాలుగువైపుల మెల్లిమెల్లిగా లాగి వదులుచేసి గుడ్డను జాగ్రత్తగా తీసివేయవలెను. కాగితము అద్దానికి అంటుకొని గుడ్డ వూడివచ్చును. గుడ్డను తీసిన తర్వాత మరల రోలరును కాగితంమీద నొక్కి దొర్లించవలెను. దీనివలన గుడ్డయొక్క జాడలు పోయి సాఫు అగును. దీనివలననే కాగితానికి జిగివచ్చును. అద్దమును కాగితంసహా తిరగవేసి రెండవవైపున మరియొకవైపున కాగితం అంటించవలెను. డబుల్ ఫూల్సుకేపు సైజు కూడా ఈఅద్దముమీద నునుపుచేయవచ్చును. కాని మధ్య మడతవచ్చును. డబుల్ ఫూల్సుకేపు సైజుఅయినచో మధ్యగా మడతపెట్టిన అద్దానికి రెండువైపుల సరిపోవును. తర్వాత ఎండలో పెట్టవలెను. కాగితం బాగా ఎండిన తర్వాత అద్దంనుండి సులువుగా వూడివచ్చును. అద్దంవైపు నున్నగా తళతళలాడుచుండును. రెండవవైపు అంత నున్నగా వుండదు. ఈ రకం కాగితం కవర్లుచేయుటకు బాగావుంటుంది. రెండవవైపున నునుపు చేయుటకు రోలర్లతో చేయవలెను.

రోలర్లతో నునుపుచేయుట:— 10-వ చిత్రము, 2-వ బొమ్మలోమాదిరి. 6 అం. లావుగల గట్టిరకం కర్ర 26 అంగు

ళములు తీసుకొని 20 అం. పొడవు లావుగా వుంచవలెను. రెండురోలర్లు బొమ్మలో మాదిరిగా చేసుకొని ఒత్తిడిహెచ్చించుటకు తగ్గించుటకు ప్రత్తిరాట్నానికిమల్లె 'చ' చీలలు అమర్చవలెను. పలుచని యిత్తడిరేకులుగాని, సత్తురేకులు గాని తళతళలాడులాగున మెరుగు పెట్టి ఆరేకులమధ్య కాగితంపెట్టి రోలర్లలో కరిపించి రోలర్లను త్రిప్పవలెను. రేకులకొసలు రోలర్ల మధ్యనుంచి పోకుండానే రోలర్లను మరల వెనకకు త్రిప్పవలెను. ఇటుల రెండుసార్లుచేసి కాగితమును రేకులకు కుడివైపునుండి ఎడమవైపునకు త్రిప్పి మరల రెండుసార్లుమొదటిసారిలాగుననే చేయవలెను. త్రాళ్లమీద ఆరవేసిన కాగితాలు అయితే కొంచెము తడిగుడ్డతో పదునుచేసి రేకలమధ్య పెట్టి కరిపించవలెను. అద్దములమీద ఆరినవైతే పదును అక్కరలేదు. ఈప్రకారం 1 గంటకు ఒకమనిషి 3 దస్తాలు చేయగలడు. నునుపుచేయుట ఐనతర్వాత కోయవలెను.

**సైజు ప్రకారం కోయుట:—** అచ్చుపనులకును, వ్రాతపనులకును కొన్ని సైజులు వాడుకలో వున్నందున మనంకూడా కాగితమును ఆసైజుకుసరిపెట్టి, 2-వపట్టికలో చూపించిన సైజుల కొలతలప్రకారం యే సైజు కావలిస్తే ఆ సైజునకు 1 అంగుళము వళసరిగ బల్ల చేయించి, చుట్టూ యినపరేకు కట్టించి, దానిని సుమారు 2 దస్తాల కాగితాలమీద పెట్టి, పైన గట్టిగా నొక్కిపెట్టి, బల్లచుట్టూ యెక్కువవున్న మించును పొడుగుపాటి కత్తితో కోయవలెను. టావులలో చిరుగులు వుంటే అరటావులుగాను, అరటావులలో చిరుగులు వుంటే పావుటావులుగాను కోయవలెను. తర్వాత మంచివన్ని యేరి కట్టలు కట్టవలెను.

## రకరకముల కాగితములు

**శాశ్వతరికార్డులకు పనికివచ్చే కాగితం:—** గుడ్డముక్కలతో చెయ్యాలి. సర్వేసుసైజింగు చేయవలెను. డ్రాయింగు కాగితంకూడా ఇంతే కాని నునుపు తక్కువ చేయవలెను.

**అద్దుడుకాగితం:—** ముడిపదార్థం ½ అంగుళము ముక్కలుగా కోసి గుజ్జు చేయవలెను. ఏసైజింగున్ను చేయరాదు. ప్రెస్సులో గట్టిగా నొక్కివేయరాదు. గ్లేజింగు అక్కరలేదు.

**మామూలు వ్రాతకాగితం:—** బ్లీచింగు అయ్యే యే ముడిపదార్థంతోనైనా చేయవచ్చును. అరపూససైజింగు చేయవచ్చును. బాగా నునుపుచేయవలెను.

**అచ్చువేయుకాగితం:—** మామూలు వ్రాతకాగితంవలె చేయవలెను. సైజింగు కొంచెము తక్కువ చెయ్యాలి. బహుకొద్దిగా సిరా యింకు గుణం వుండాలి.

**కవరుపేపరు:—** పాతగోనెపట్టాలు, అరటిచొప్ప, వరిగడ్డి వీనితో, చలువచేయకుండా, చేయవచ్చును. ఒకవైపున గ్లేజింగు వుంటే చాలు. అద్దాలమీద చేస్తే చాలును.

**రంగుకాగితం:—** బట్టలకు వేయు కచ్చారంగులు (Direct colours) పనికివచ్చును. ఎండుగుజ్జు లెక్కమీద నూటికి ½ భాగము మొదలు మనకు కావలసిన ఛాయనుబట్టి 5 భాగములవరకు వేయవచ్చును. మనకు కావలసిన రంగును వేడినీళ్లలో బాగా కరగించి, సైజింగు చెయ్యకపూర్వము కాగితాలు యెత్తుతొట్టిలోకి వడపోసి గుజ్జును బాగా చిలకవలెను. తర్వాత సైజింగు పదార్థములు కలపవలెను.

ఇంకను అనేకరకాల కాగితాలున్నాయి. ఇక్కడ వ్రాయుటకు చోటు చాలదు.

## కిట్టుబాటు

ఈ వ్యాసంలో వ్రాసిన పద్ధతికి సుమారు రూ. 100 పనిముట్లు సరిపోవు. 4 గురు మనుష్యులు పనిచేయవచ్చును. మనిషి 1 కి రోజుకు దామాషాయిని 1 దస్తా సింగిల్ ఫూల్సుకేపు సైజు కాగితం చేయగలడు.

16 పౌనుల కాగితం, సింగిలుఫూల్సుకేపు సైజు 1 రీము తయారుచేయుట కగు ఖర్చు:-




10-వ చిత్రం

| | | |
|---|---|---|
| వరిగడ్డి | 40 పౌనులు | 0- 3-0 |
| కాస్టిక్ సోడా | 6 ,, | 1- 2-0 |
| బ్లీచింగు(పెర్‌క్లోరాన్)1 | ,, | 0- 3-0 |
| సైపో | 1½ తులం | 0- 0-8 |
| నీలిరంగు | ½ ,, | 0- 0-6 |
| అరపూస | ½ పౌను | 0- 1-6 |
| పటిక | 2 పౌనులు | 0- 4-0 |
| వంటచెరుకు | | 0-10-0 |
| సామానుల అరుగుదల మొదలైనవి | | 0- 2-9 |
| వస్తువుల ఖరీదు | | 2-11-0 |
| మనిషి 1కి రోజుకు 0-4-0 చొ.న రీము తయారుచేయుటకు కూలి | | 4-13-0 |
| మొత్తం రీముఖరీదు | | రు. 7- 8-0 |

మిల్లుకాగితంకంటె రీముకు రు 2-8-0 ఖరీదు యెక్కువ. చేతితో చేసిన కాగితం ఖద్దరుబట్టవలెనే ఖరీదు యెక్కువ అగుట సహజము. ఇది నిర్మాణకార్యక్రమంలో గ్రామపరిశ్రమలు ముఖ్యావసరము గనుక, గ్రామములో వృథాగా పోవుచున్న చెత్తను డబ్బుగా మార్చు యీపరిశ్రమ ప్రతిగ్రామంలోనూ నెలకొల్పుటకు తగిన ప్రయత్నములు చేసి, చేతితో చేసిన కాగితం వాడుటకు ఎక్కువగా ప్రచారం చేయవలసియున్నది. మున్సిపాలిటీలు, జిల్లాబోర్డులు మున్నగు స్థానికసంస్థలు ఈవృత్తినేర్పు సంస్థలకు పెట్టుబడి పెట్టియు, అచట తయారైన కాగితమును కొనియు, విద్యార్థులకు స్టయిపెండుల నిచ్చియు సర్వవిధముల తోడ్పడుట అవసర మని మనవిచేయుచున్నాను. ఆంధ్రదేశములో మచిలీపట్టణంలో ఆంధ్రజాతీయకళాశాలలోను, గుంటూరులో శ్రీకృష్ణాశ్రమంలోను చేతితో కాగితంచేయుట వుచితంగా నేర్పుచున్నారు. చేకాగితపు పరిశ్రమాభివృద్ధిని గురించి సోడెపూరులో ఖాదీప్రతిష్ఠాపనంవారున్ను, వార్ధాలో అఖిల భారతగ్రామపరిశ్రమల సంఘంవారున్ను, కాశీలో హిందూ యూనివర్సిటీవారున్ను, డెహరాడూనులో గవర్నమెంటు ఫారెస్టు రీసెర్చి ఇన్‌స్టిట్యూటువారున్ను, బెంగాలు గవర్నమెంటు ఇండస్ట్రియల్ రీసర్చి లేబరేటరీవారున్ను కృషిచేయుచున్నారు. నేనెరు గున్నంతవరకు చెప్పితిని.

ఈ వ్యాసమునందు వ్రాసిన పద్ధతులకంటె, బుద్ధిమంతులైనవారు నూతనమార్గములు కనిపెట్టి మిల్లుకాగితంతో సమానముగా అమ్మేలాగున కృషిచేయవలసిన దని ప్రార్థించుచున్నాను. దేశాభిమాను లందరును చేతితో చేసిన కాగితములను కొనుచున్నయెడల అచిరకాలములోనే యీ పరిశ్రమ గ్రామగ్రామమునకును వ్యాపించి గ్రామసౌభాగ్యమును చేకూర్చును.



# దేవీ స్తవము

[దీని మాతృకయగు సంస్కృతస్తోత్రము శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్యవిరచిత మని ప్రతీతి కలదు. ఈ ప్రతీతి అవిశ్వసనీయ మని కొందఱు విమర్శకుల మతము. నిజ మెద్దియయినను రచయిత భక్తాగ్రేసరుఁ డనుటయు, స్తోత్రము భావపుష్టిచే సర్వభక్తజన హృదయరంజక మనుటయు నిర్వివాదాంశములు. అకృత్రిమభక్తుల కనుభవవేద్యమగు హృదయోద్వేగ మీస్తోత్రమునకుఁ బ్రాణము.]

ఎఱుఁగను యంత్రమంత్రముల నే నకటా యెఱుఁగన్ ధ్యానవిధుల్,
ఎఱుఁగను నిన్నుఁ బిల్వ, మది నెంచు, స్తుతించు విధంబు లించుకే,
నెఱుఁగను యోగముద్రలను, నేడ్చుటనైన నెఱుంగఁ గాని, నే
నెఱుఁగుదు నొండు, నిన్గొలువ నేపఱుఁ దాపము లంచు నమ్మరో!

తెలియమిచే విధానము, విధిక్రమసేవ లశక్య మౌటచే,
నలసతవేర్మి, ద్రవ్యవిరహంబునసహింపమి, నీపదాంబుజం
బుల కెడమైతి నమ్మరో! విమూఢుఁడఁ, దప్పులు సైఁపఁగాఁ దగున్
కలరు కుపుత్రు లెందఱో జగంబున నొక్క కుమాత కల్గునే?

ఇలను నీపుత్త్రు లెందఱో కలరు ధీవి- శాలు, రేన నికృష్టుండఁ, జపలమతిని,
ఐన న న్నిట్లు విడనాడ నగునె జనని? మహిఁ గుపుత్త్రులు గలరు కుమాత గలదె?

సలుపనైతిని జనని నీచరణసేవ- విత్తమేనియుఁ గడు సమర్పింపనైతిఁ,
గాని నను బ్రోతు వసమానకరుణ జననీ!- మహిఁ గుపుత్త్రులు గలరు కుమాత గలదె?

తావకమంత్రవర్ణము లదాటున విన్న శ్వపాకుఁడేని స
ద్యోవిధిఁ గమ్మతేనియల నొల్కెడు పల్కులఁ జిల్క వక్తయౌ
లేవడి స్రుక్కువాఁడు నెనలేని సిరిన్ విలసిల్లు, నౌర! త
త్పావనమంత్రసత్క్రమజపంపుఫలం బెఱుఁగంగ శక్యమే?

గరళాహారి, దిగంబరుండు, జటి, నాగస్రగ్విభూషుండు, క్ర
త్వరి, భూతేశుఁడు, పుఱ్ఱదాల్చు, చితిభస్మాలేపుఁడౌ వెఱ్ఱి, నీ
కరముం బట్టినయంతమాత్ర జగదేకప్రార్చితుండై, మహే
శ్వరుఁడై మించె, భవన్మహత్త్వ మెఱుఁగన్ శక్యంబె? సర్వేశ్వరీ!

అభిలషింప సుఖంబేని విభవమేనిఁ - గాంక్ష్యములు గావు మోక్షవిజ్ఞానములును,
అమ్మ! నీ దివ్యనామజపమ్ము వలతు - వలతు జన్మాంతరం బౌజపంబులోడ.

సకలవిధిహితసేవలు సల్పనైతిఁ - బల్కితిని రోషదూషితభాషణములు
కాని మాత! యనాథుండ నైన నన్ను-నీవ కృపఁ జూడవలయు వేఱెఱుఁగ దన్య!

విపదావళి మునిఁగిన నేఁ-గృపాంబునిధి! దుర్గ! నిను స్మరించుటఁ దగే
కపట మని? డప్పి, నాఁకటఁ- దపించునెడ శిశువు తల్లిఁ దలఁచున్ గాదే?

అరుదె జగదంబ ననున్- బరికించుట నీవు పరమవాత్సల్యముతో,
నిరతం బపరాధపరం-పర లొనరుచు సుతుఁ ద్యజించు మాతయుఁ గలదే?

పాపములు నాయటు లొనర్చువారు లేరు;- వాని నీయట్లు పరిమార్చువారు లేరు;-
ఈనిజ మెఱింగి యుక్తమౌ నెటులు సేయ-నటులు సేయఁగదమ్మ లోకైకజనని!

శ్రీ క. మల్లికార్జునం



మునకు వెన్నెముకయగు రైతు శిథిలమై, వ్యవసాయ పరిశ్రమ గూడ శిథిలమై పోవుననియు తెలిపియుండిరి.

మనదేశపు రైతు ఆదాయం సగటున తలకొక రూ. 42 లుండునని సెంట్రల్ బాంకింగు కమిటీ వారు అంచనా వేసియుండిరి. ఈ అంచనా వేసినతరువాత పంటసరకుల ధరలు సగానికి సగము పడిపోయినవి. ఈకొద్ది ఆదాయముతో మనిషి జీవించవలెనన్న ఎంతకష్టమో, వాని దారిద్ర్య మెంత దుర్భరమో ఊహింపవచ్చును.

వ్యవసాయకులను ఈదుస్థితినుండితప్పింపవలెనన్న అతని వృత్తి లాభకారియగునట్లు చేయవలెను. సగటు ఆదాయము హెచ్చవలెను.

# వ్యవసాయము – పరపతి

## రైతుల దుస్థితి నివారణోపాయాలు

శ్రీ మోచర్ల దత్తాత్రేయులు

మనదేశంలో పరిశ్రమలకు–అందు ముఖ్యముగ వ్యవసాయమునకు కావలసిన పరపతిసౌకర్యాలనుగురించి ఇంతవరకనేక కమిటీలు పదేపదిగ చర్చించి యున్నాయి. 1926 లో, ప్రస్తుతము రాజప్రతినిధిగనున్న లిన్లిత్గో ప్రభువుగారి అధ్యక్షతను నియమింపబడిన రాయలుకమిషనువారు వ్యవసాయపరిశ్రమాభివృద్ధికిగాను పెక్కుసలహాలను గావించియున్నారు. 1929 లో మదరాసు రాష్ట్రీయ బ్యాంకింగు విచారణ సంఘమువారు ప్రత్యేకంగా ఈ రాష్ట్రములో పరిశ్రమలకును, వాణిజ్యమునకును గావలసిన ఆర్థిక సహాయాలనుగురించి సూచనలు గావించి యున్నారు. అదేవిధంగా సెంట్రలు బ్యాంకింగు విచారణ సంఘంవారు భారతదేశమునకంతకును సంబంధించిన సూచనలను చేసియున్నారు. తరువాత 1934 లో చెన్నపట్టణప్రభుత్వముచే ప్రత్యేకంగా అందుకు నియమింపబడిన సత్యనాథన్ గారి రాష్ట్రమందలి వ్యవసాయకుల ఆర్థికస్థితినిగురించి విచారణ జరిపి ఒకనివేదికను ప్రకటించియున్నారు. ఈ కమిటీలన్నియు గూడ దేశములోని వ్యవసాయకుల స్థితి రాను రాను దుర్భర మగుచున్న దనియు, ఈస్థితిని వెంటనే చక్కబరుపకపోయినయెడల దేశ

### రైతులదుస్థితి తొలగవలెనంటే...

ప్రస్తుతం వ్యవసాయం చేసేవారు ఆవృత్తి నవలంబించటానికి కారణం, అది లాభప్రదమైనదని కాదు; వేరేవృత్తి లేకపోవటంవల్లా, కొద్ది నేలకున్ని కాసిని గింజలు పండించితే కొన్నినెల్లయినా కాలం గడపవచ్చుననీ వ్యవసాయం చేస్తున్నారు ఇతర పరిశ్రమలవారు లెక్కలు వేసినట్లు లెక్కలువేస్తే వ్యవసాయంవల్ల లాభంలేదనీ, కూలికూడా గిట్టదనీ ప్రతివాడును గ్రహించగలడు. నష్టంవస్తూవున్నట్లు తెలిసికూడ గత్యంతరంలేక ఈ వృత్తి నవలంబించుచున్నారని ఆర్థికపండితు

లందరును ఒప్పుకొనియున్నారు. రిజర్వు బాంకువారు తమ **Statutory report on agricultural credit** లో గూడ ఈస్థితిని గూర్చి వ్రాసిరి. ఏ వ్యాపారమైనను లాభకారి కావలెనంటే సరకు వుత్పత్తిచేయుట కగు ఖర్చు సాధ్యమైనంత తక్కువగావుండవలెను. దానికిని, అమ్మేధరకును వున్న తేడాయే వుత్పత్తిదారుని లాభం. వ్యవసాయ పరిశ్రమ వృద్ధిపొందా లంటే పంట పండించటానికయ్యేఖర్చు సాధ్యమైనంత తగ్గాలి. పంటను మంచిధరకు అమ్మాలి. వ్యవసాయంవల్ల గాని, ఇతర పరిశ్రమలవలనగాని రైతుల ఆదాయం వృద్ధిపొందాలి. అప్పుడుగాని రైతుల ప్రస్తుత దుస్థితి తొలగదు. వ్యవసాయం మనదేశంలో ముఖ్యమైన పరిశ్రమ కాబట్టి ఈదుస్థితిని తొలగించటానికి సర్వవిధములా ప్రయత్నం చెయ్యటం ప్రభుత్వమువారి యొక్కయు, పెద్దల యొక్కయు (**Public men**) ముఖ్య కర్తవ్యం. వ్యవసాయపు ఖర్చులను లెక్కవేసేటప్పుడు కేవలం విత్తులకు, కూలి పనులకు అయ్యే ఖర్చులు గాక వాటికొరకు తెచ్చిన అప్పు మీద రైతు ఇచ్చే వడ్డీకూడా లెక్కవెయ్యాలి. ధరలు బాగా వుండే రోజులలో పల్లపుసాగును చెయ్యటానికి మొత్తం ఆదాయంలో సగం కర్చగునని అంచనాలువేసినవారు తెల్పియున్నారు. అంతమొత్తంమీద ఇచ్చే వడ్డీరేట్లు ఎక్కువ అయినట్లయితే వుత్పత్తి ఖరీదు ఎక్కువ అవుతోందన్నమాట. ఆఖరీదు తగ్గితేగాని రైతుకు ఎక్కువలాభం మిగలదు. అందువల్ల ఇతర దేశాలలో వ్యవసాయపరిశ్రమకు కావలసిన డబ్బును చౌకరేట్లకుసప్లయిఅగునట్లు సదుపాయములు చేసియున్నారు. మన దేశములో పరపతిపద్ధతులు వడ్డీరేట్లు తగ్గించి యుంచుటకు వీలైనవి కావు. వ్యవసాయంలో లాభము లేదు. అందువలన వ్యవసాయపు ఖర్చులకొరకు చేసిన ఋణములు తీరక క్రమేణ స్వల్పవాయిదారుణములు దీర్ఘవాయిదాలమీదగాని తీర్చలేని ఋణములుగా మారిపోయినవి. ఇట్టి అప్పులుగాక భూముల మరమ్మతులకును, మోటబావులు కట్టుటకును రైతులకు దీర్ఘవాయిదా ఋణములు కావలెను.

## రైతుల ఋణభారము

ఈ రాష్ట్రమునందలి వ్యవసాయకుల ఋణభారము 150 కోట్లుండు నని చెన్నరాష్ట్రీయబ్యాంకింగు విచారణసంఘమువా రంచనావేసిరి దానికి అయిదు సంవత్సరముల అనంతరము సత్యనాధనుగారు ఈ ఋణభారము రు. 200 కోట్లవరకు పెరిగినదని లెక్కించిరి. ఈ ఋణమున నత్యధికభాగము తరతరములుగా వచ్చుచున్నది. దీనిని రైతు లెంత ప్రయత్నించినను గూడ తీర్చుకొని బయటబడగల్గుట దుస్సాధ్యము. 1929-వ సం. నుండియు పంటసరకుల ధరలు విపరీతముగ పడిపోవుటచేత రైతున కీఋణభారము మరింత అధికమైనది పుట్టెడు ధాన్యముతో తీరెడి బాకీలకిపుడు మూడుపుట్ల ధాన్యము కావలసివచ్చెను. అందుచేత చాలామంది రైతులు తమఆస్తుల నన్నిటిని గోల్పోయి, కేవలము పాటకజను లైపోవలసివచ్చెను.

కాంగ్రెసుమంత్రివర్గమువారి టీవల గావించిన రైతుఋణభారవిమోచనశాసనమువలన నీబరువు కొంత తగ్గినది. అయినను ఇంకను చాలాభాగ మటులనే యున్నది. ప్రాతఋణములను తగ్గించుటకు శాసనము చేసినను ఆ తగ్గింపబడిన సొమ్ము చెల్లించుటకు వలయు సదుపాయము ప్రభుత్వమువారు చేసి యుండలేదు. శాసనము ప్రకారము చెల్లించవలసిన మొత్తమునకు షావుకార్లతో ప్రభుత్వమువారు డిబెంచరు పత్రముల నిచ్చి, ఆసొమ్మును రైతులవద్దనుండి కిస్తులతో బాటు వసూలుచేసికొనియుండిన యెడల ఆసమస్యను కొంతవరకు పరిష్కరించియుండెడివారు. ఈ ఋణభారమునుండి రైతు బయల్పడవలెననినచో, దానిని తీర్చుటకు సాధనాంతరముల నాలోచించు టవసరము.

## పరపతి సౌకర్యముల ఆవశ్యకత

అదిగాక, పొలముల మరమ్మతులకును, పశువులుకొనుటకును, పనిముట్లను సంపాదించుకొనుటకును గూడ రైతులకు పరపతిసౌకర్యము లవసరము. ఇందుకు రైతు గావించు ఋణమునంతను అతడా సంవత్సరపు పంట నమ్మియే తీర్చుకొనజాలడు. మరమ్మతుయొక్క స్వభావమునుబట్టియు, కొను పశువులనుబట్టియు, కొన్ని సంవత్సరములవరకుగూడ వాని ప్రయోజనమును రైతు అనుభవించుచునే యుండును. అందుచే ఈ ఋణములు కొలది సంవత్సరముల వాయిదామీద రైతు తీర్చుకొనుటకు వీలైనదిగ నుండవలెను.

సాగు ప్రారంభించి, ఫలసాయము రైతు చేతికందువరకునుగూడ వ్యవసాయపుఖర్చుల కొరకుగాను రైతులు చాల మొత్తమును వెచ్చింపవలసియున్నది. ఈ ఖర్చులకు గూడ రైతుకు పరపతిసౌకర్యము లుండవలెను. అటుచో ఈ ఋణములు తీర్చుటకు రైతున కెక్కువ వ్యవధి యక్కరలేదు. పంటలు చేతి కందినంతనే విక్రయించి ఆ ఋణములను తీర్చివేయవచ్చును. పంటల రోజులలో సరియగు ధర రానికారణముచేత, మరికొంతకాలము సరకు నిలువయుంచుకొనినను గూడ వ్యవసాయపు ఖర్చుల ఋణములను రైతు 6-12 నెలలలోపున తీర్చివేయవచ్చును. మదరాసు బ్యాంకింగు విచారణసంఘమువారి నివేదిక ప్రకారము పల్లపు పైరునకు రైతు యకరము 1 కి రు. 30 నుండి రు. 50 వరకు వ్యవసాయపు ఖర్చుల కొరకు వెచ్చింపవలసియుండును. మెరక పైరులకు యకరా 1 కి రు. 10-15 ల వరకు వెచ్చింపవలసియుండును. ఈ రాష్ట్రమున నిపుడు సుమారు 31383 వేల యకరములు సాలీనా సాగగుచున్నవి. ఇందు 10495 వేల యకరములు పల్లపుసాగుక్రింద నున్నవి. వీని సేద్యపు ఖర్చులక్రింద రైతులకీ రాష్ట్రమున ప్రతిసంవత్సరము రు. 60 కోట్లకు పైగా స్వల్పవాయిదా ఋణసౌకర్యము లవసరము,

## ప్రస్తుత సౌకర్యములు

వ్యవసాయకులకు గావలసిన ఈ మూడు విధములగు ఋణములకును ప్రస్తుతమున్న సౌకర్యముల నించుక పరిశీలించు టవసరము. ఇదివరకువలెనే ఇప్పుడుగూడ గ్రామస్థులకు, అందు ముఖ్యముగ వ్యవసాయకులకు ఋణసౌకర్యము లొసగుచున్నది షాహుకారులు. స్థానికులగు షాహుకారులకు దోడు ఇటీవల మార్వాడీలు, ముల్తానీలు మొదలగువారుగూడ చేరిరి. వీరి వడ్డీరేటు నూటికి సాలుకు రు 9 నుండి రు. 24 వరకుగూడ నుండును. రైతు పేదవాడైన కొలదియును అతను చెల్లింపవలసిన వడ్డీరేటు హెచ్చుచుండును. మరీ పేదలగు రైతులు, పాటకజనులును తిండికిని, కూలిపనులకును ధాన్యమువగైరాలను నాములకు తెచ్చుకొనుచుందురు. ఇట్టి జట్టీఋణములను పంటలలో తీర్చవలెను. వీరికొలదినెలల కాలమునకు నూటికి రు. 50 చొప్పునగూడ వడ్డీ చెల్లించుచుందురు. అనగా, నిది సాలుకు నూటికి నూరుచొప్పున వడ్డీయగును. వీరుగాక ఇంపీరియలుబ్యాంకు మొదలగు జాయింటుబ్యాంకులుగూడ కొన్ని పంటల ధాన్యములను కుదువపెట్టుకొని రయితులకు ఋణము లొసగుచున్నవి. కాని వీ రొసగునది, పంటలు వచ్చినతరువాత, సదరుపంట సరకునకు హెచ్చువెల వచ్చువరకును నిలిపియుంచుకొనుటకు మాత్రమే యుపయోగించును. రైతులలో కొందరు ధాన్యమును కుదువపెట్టి తమఖర్చులకును, శిస్తులు మొదలగువానికిని అవసరమగు మొత్తమును బ్యాంకుల నుండి ఋణము దీసుకొనుచుందురు. ఈ ఋణములు రైతులకు హెచ్చువెల రాబట్టుటకు తోడ్పడుచున్నవేగాని, నిజముగ వ్యవసాయపరిశ్రమాభివృద్ధికి తోడ్పడుచుండుట లేదు. అందుచేత దీనిని వ్యవసాయపరిశ్రమకొనర్పబడిన పరపతిసౌకర్య మని చెప్పవీలులేదు.

వీనితరువాత, రైతులకు ఋణసౌకర్యము లొసగువానిలో సహకార పరపతిసంఘములను పేర్కొనవలసియున్నది.

1939-వ సం.న కీరాష్ట్రమున 13759 సహకారసంఘములు పనిచేయుచుండెను. వీనిలో వ్యవసాయకులకు పరపతికొరకేర్పడిన వాని సంఖ్య 10784. ఈ సంఘములు ప్రజలకిచ్చిన ఋణముల నిలువ మొత్తము 1936-37 లో రు. 35199 వేలు.

## పరపతి సంఘాలు, భూమితణఖా బ్యాంకులు

రైతులకు ఋణముల నొసగు సహకార సంఘములలో పరపతిసంఘము లనియు, భూమితణఖా బ్యాంకు లనియు రెండువిధములగు సంఘములు గలవు. వీనిలో పరపతి సంఘములు 1 సం.నుండి 5-6 సం లవరకు వాయిదాలలో తీర్చదగు ఋణము లొసగుచుండును. అనగా, వీనియందొసగబడు ఋణములు వ్యవసాయపు ఖర్చులకును, చిన్న మరమ్మతులకును, పశువులను, పనిముట్లను కొనుటకును మాత్రముపయోగించును. ఇక భూమి తణఖా బ్యాంకులు: ఇవి మొదట 1925 సంవత్సరాంతమున ప్రారంభింపబడెను. 1940-వ సంవత్సరమునకు ప్రైమరీభూమితణఖా బ్యాంకులసంఖ్య 120 కి పెరిగెను. ఇవి రాష్ట్రమునగల 220 తాలూకాలలో 141 తాలూకాలకును, రాష్ట్రమున గల 35703 గ్రామములలో 15404 గ్రామములలోను గల రైతులకు 20 సంవత్సరముల వాయిదామీద తీర్చదగు ఋణముల నొసగుచున్నవి. ఇంతవరకీబ్యాంకులు 300 లక్షల మొత్తమును నూటికి సాలుకు రు. 6 లకు మించని వడ్డీకి రైతునకు సప్లైచేసినవి.

సహకారసంస్థలు గాక, ప్రభుత్వమువారు గూడ, భూమి మరమ్మతుల శాసనము క్రిందను, వ్యవసాయకుల ఋణముల శాసనము క్రిందనుగూడ రైతులకు నూటికి 5½, 6, 7, 7½వడ్డీరేటులకు ఋణముల నొసగుచున్నారు. ఇటీవలివరకును వీరు భూమిమరమ్మతులకును, పశువులు మొదలగువానిని, వ్యవసాయపుపనిముట్లను కొనుటకును మాత్రమే ఋణము మొసగుచుండిరి. ఇప్పుడు ప్రభుత్వము వారికి భూమి మరమ్మతుల చట్టముక్రింద రు. 1,05,31,531లు రావలసియున్నది; వ్యవసాయకుల ఋణముల శాసనముక్రింద రు. 26,23,297 లు రావలసియున్నది. గత సంవత్సరము ప్రభుత్వమువారు చట్టమును సవరించి, ప్రాత ఋణములను తీర్చుకొనుటకుగూడ రైతులకు ఋణ మొసగుటకు నిశ్చయించుకొనిరి. కాని గత సంవత్సర మీ చట్టముక్రింద నొసగిన ఋణముల మొత్తము 120 వేలను మించలేదు.

## గ్రామప్రజల ఆర్థిక సమస్యలు

వ్యవసాయకులకు చవుకవడ్డీకి ఋణసౌకర్యములు లభించుటతోనే గ్రామప్రజలఆర్థిక సమస్యలు తీరిపోవు నని తలచుట పొరపాటు. మన వ్యవసాయకులసమస్య అంతకంటె చాల క్లిష్టమైనది. ఈ రాష్ట్రమునగల 797.95 లక్షల యకరముల విస్తీర్ణములో 131.91 లక్షల యకరములు అడవి. 144.97లక్షల యకరములభూమి సాగుయోగ్యముగాదు. ఇదిగాక మరి య. 208.86 లక్షలు బంజరుగనున్నవి. మిగత 313.83 లక్షల యకరములు మాత్రమే సాగునందున్నది. రాష్ట్రమునగల 480 లక్షల ప్రజల నీవిస్తీర్ణముగల సాగుభూమి పోషింపవలసియున్నది. ప్రజలలో నూటికి 70 వంతులమంది వ్యవసాయ పరిశ్రమపై నాధారపడియున్నారు. ఇంతమంది జనులు సాగుచేయుటకు తగినంత విస్తీర్ణముగల సాగుభూమి లేదు. వ్యవసాయము లాభకరముగ నుండవలెను. కనీస మొక్కొక్క కుటుంబమునకు 10 యకరము లైన నుండవలెను. అంతకు తక్కువ సేద్యమొనర్చుచో రైతులకు నిజముగ గిట్టుబాటుగాదు. ఈ విషయమున వ్యవసాయపరిస్థితు లెంత అసంతృప్తికరముగ నున్నవో 1345 ఫసలీ తాలూకు ఈ క్రింది పట్టావిస్తీర్ణముల లెక్కలవలన దెలియనగును. (చూడు: ప్రక్కపుటలోని పట్టిక)

పట్టాదారులలో నూటికి 97 వంతులు 50 రూపాయలకు తక్కువ శిస్తు చెల్లించువారనియు, 77 వంతులు 10 రూపాయలకు

## పట్టా విస్తీర్ణముల లెక్కల పట్టిక

| పట్టాల తరగతి | పట్టాల సంఖ్య లక్షలు | మొత్తం విస్తీర్ణం యు/లు. లక్షలు | సగటు పట్టా విస్తీర్ణం యు/లు. లక్షలు |
|---|---|---|---|
| ఒకరూపాయి అంతకంటె తక్కువ శిస్తు చెల్లించు పట్టాలు ... | 13.60 | 7. 46 | 0.55 |
| రు 1—10 ల శిస్తుచెల్లించు పట్టాలు ... | 34.70 | 102. 35 | 3.00 |
| రు 10—30 ల శిస్తుచెల్లించు పట్టాలు ... | 10.37 | 75.05 | 7. 2 |
| రు 30—50 ల శిస్తుచెల్లించు పట్టాలు ... | 2.24 | 27.86 | 12.4 |
| రు 50—100 ల శిస్తుచెల్లించు పట్టాలు ... | 1.25 | 25.43 | 20 4 |
| రు 100—250 ల శిస్తుచెల్లించు పట్టాలు ... | 0.475 | 19.86 | 40 5 |
| రు 250—500 ల శిస్తుచెల్లించు పట్టాలు ... | 0.105 | 8.80 | 84 00 |
| రు 500—1000 ల శిస్తుచెల్లించు పట్టాలు... | 0 03 | 5 63 | 184,7 |
| రు 1000 ల పైగా శిస్తుచెల్లించు పట్టాలు ... | 0.013 | 7 30 | 555.7 |

తక్కువ శిస్తు చెల్లించువారనియు పైసంఖ్యల వలన దెలియవచ్చును. వీరికి గల భూమి తల 1 కి 3 యకరములకు మించదు. ఈ రైతులు కేవల మీ భూమిసాగుపైననే ఆధారపడి యుండుచో గిట్టుబాటుగాదు. రైతునకు పని గూడపూర్తిగనుండదు. దానికిదోడు మరి ఇతర జీవనోపాధులుగూడ అవసరము. అందు కవసరమగు గృహపరిశ్రమలకును చవుక వడ్డీలకు పరపతిసౌకర్యముల నేర్పరచిననేగాని వ్యవసాయకులుగాని, గ్రామీణులగు ఇతరప్రజలు గాని సుఖముగ జీవింపగల్గుట కష్టసాధ్యము. పరపతిసౌకర్యములు గ్రామములలో నుండు రైతు లందరకును అందుబాటులో నుండవలెనన్న సహకారపరపతిసంఘములే దానికి మార్గము. ఇతర సంస్థలద్వారా గ్రామములలో నున్న రైతులకీ సౌకర్యములు కలుగ జేయుట కష్టసాధ్యము.

### ప్రస్తుత కర్తవ్యం

ప్రస్తుతము సహకారసంఘములును, ప్రభుత్వమువారును నొసగు ఋణములపై దప్ప ప్రైవేటు ఋణములన్నిటిపైనను బీదరైతులు దుర్భరమగు వడ్డీరేటులు చెల్లింపవలసి యున్నారు. అందుచేత వ్యవసాయము రైతులకు గిట్టుబాటుగుట లేదు. సాగుఖర్చులుపోను, రైతునకు కూలిగూడ గిట్టనిస్థితిలో నున్నది. కనుక, ఈ రాష్ట్రమునందలి వ్యవసాయ పరిశ్రమతో బాటు ఉపపరిశ్రమలను నెలకొల్పుటయేగాక, అంతకంటెను చాల త్వరితముగా వ్యవసాయకులకు సమృద్ధిగ పరపతి సౌకర్యాలను కల్పించి నిలబెట్టవలసివున్నది. వ్యవసాయకులు ప్రాతఋణములను తీర్చుకొనుటకును, భూమి మరమ్మతులకును కావలసిన దీర్ఘవాయిదాల ఋణసౌకర్యములు భూమి తణఖా బ్యాంకులమూలమునను, ప్రభుత్వమువా రొసగు ఋణములవలనను త్వరలోనే పూర్తిగ సంతృప్తిపరుపబడు నని చెప్పవచ్చును. 59 తాలూకాలకును, 22 వేల గ్రామములకును భూమితణఖా బ్యాంకులను నెలకొల్పవలసియున్నది. ఇతర ఆటంకములు లేనియెడల, మూడునాల్గు సంవత్సరములలో వీనికిగూడ భూమి తణఖా బ్యాంకు లేర్పరుపబడును. పిమ్మట నా ప్రాంతములందలి రైతులందరునుగూడ క్రమముగ భూమితణఖా బ్యాంకులనుండి తమకు కావలసిన దీర్ఘవాయిదాల ఋణసౌకర్యములను బడయగలరు. భూమితణఖా బ్యాంకులు ఇంతవర కొసగిన ఋణముల మొత్తము స్వల్పమే యైనను, క్రమముగా నీబ్యాంకులు రైతులకు కావలసిన దీర్ఘవాయిదాల ఋణసౌకర్యముల నన్నిటిని కల్పింపగలవు.

ఇక సాగుఖర్చులకొరకును, పంటసరకులకు సరియగు ధర రాబట్టి విక్రయించుకొను వరకును కావలసిన ఋణసౌకర్యముల గురించియే ఆలోచింపవలసియున్నది. ఈ పనుల కొరకుగాను ఒక్క చెన్నరాష్ట్రమునకే రు. 60 కోట్లు కావలసియున్నది. వ్యవసాయక పరపతిసంఘములన్నియు కలసి ఇపు డొసగుచున్న మొత్తము 4 కోట్లయిన నుండదు. ఇందుకుగాను గ్రామమున కొక్క పరపతి సంఘము కావలె ననినను 35 వేల సంఘము లుండవలెను. ఇపుడు 10 వేలకంటె నెక్కువ లేవు. గ్రామప్రజలలో నూటికి 8 మందికంటె ఎక్కువమంది ఈసంఘములలో సభ్యులు గారు. ఇంకను సుమారు 25 వేల సంఘముల నేర్పరచిననే గాని గ్రామమున కొకొక్క సంఘ మేర్పడదు.

### విదేశాలలోని పరపతిసౌకర్యాలు, హుండీ పద్ధతి

ఈసందర్భమున పరిశ్రమలును, వాణిజ్యమును విరివిగ విజృంభించియున్న ఐరోపాఖండదేశములందును, అమెరికాయందును చవుకపరపతిసౌకర్యములను కల్పించుట కనుసరించుచున్న పద్ధతులను గమనించుట అవసరము. వానిలో హుండీపద్ధతి ముఖ్యమైనది. ఆపద్ధతివలన, నగదుతో ఏవిధమగు ప్రమేయమును లేకయే వారు కోట్లకొలది విలువగల వ్యాపారమును సాగించుకొనుచున్నారు; బ్రహ్మాండమగు పరిశ్రమల నిర్వహించుకొనుచున్నారు. ఆపద్ధతిక్రింద వర్తకుడు ఒక వెయ్యిరూపాయిల సరకును ఖరీదుచేసి వ్యాపారము సాగింపదలచెనను కొనుడు. అతడు తాను ఖరీదుచేసిన సరకునకు వెయ్యిరూపాయిల నగదును చెల్లింపడు. 60 రోజులనాటికో, 90 రోజులనాటికో

సదరు పారిశ్రామికునకు వెయ్యిరూపాయిలు చెల్లింపవలసిన దని తన బ్యాంకువారికి ఒక హుండీ నొసగును. పారిశ్రామికుడు ఆబ్యాంకునకా హుండీని పంపుచో, వారు ఆవాయిదా నాటికి సొమ్మునకు తాము బాధ్యులమై చెల్లింతుమని అంగీకరించెదరు. అట్టి అంగీకారము బడసిన హుండీని పారిశ్రామికుడు తనబ్యాంకున కొసగుచో వారు వాయిదా వరకునగు వడ్డీని త్రోసివేసికొని నగదును చెల్లించెదరు. దీనినే 'డిస్కౌంటింగు ఆఫ్ ఎ బిల్' అనెదరు. వాయిదాలోగా నావర్తకుడు సరకు విక్రయించుకొని, తనలాభమును తీసుకొని, బ్యాంకువారికి డబ్బుకట్టును. బ్యాంకువారును, అంతవరకు తమ హామీ మొత్తమునకు నిర్ణయించుకొనినవడ్డీని జమ కట్టుకుని, హుండీకి చెల్లింపవలసిన బాకీని తీర్చివేసెదరు. ఈవిధముగ నావర్తకుడుఒక్క దమ్మిడీ నగదులేకయేవేలకొలది రూపాయల వ్యాపార మొనర్చి లాభము సంపాదించుచున్నాడు. బ్యాంకును, నగదుపెట్టుబడి చేయకయే మాటహామీమీద తమకు రాదగు లాభము పొందుచున్నది. పారిశ్రామికుడు గూడ బాదరబందీ లేకయే తనకు రావలసిన సొమ్మును వసూలుచేసుకొనుచున్నాడు.

వస్తువులుతయారుచేయు పరిశ్రమలుగూడ ఇట్టి పద్ధతులలోనే తమకు కావలసిన ఆర్థిక సౌకర్యముల నందుచున్నవి. డిస్కౌంటు చేసిన బ్యాంకునకే మరల సొమ్మవసరమగు నెడల ఆహుండీని మరియొక పెద్దబ్యాంకునకుగాని, మన రిజర్వుబ్యాంకువంటి సెంట్రలు బ్యాంకునకు గాని విక్రయించి తనసొమ్మును రాబట్టుకొనును. ఈవిధముగ హుండీలమీద వ్యాపారము చేయుటవలన వ్యాపారము చురుకుగా వృద్ధియై దేశసంపద వేగముగ నభివృద్ధిచెందును.

పాశ్చాత్య దేశములలో బ్యాంకింగు సౌకర్యములు వృద్ధియగుటవలన, నాణెములు, కరెన్సీనోట్ల వాడుక చాలతక్కువ. వ్యాపార పరిశ్రమలు అత్యధిక భాగ మీ 'హుండీ'ల పద్ధతిమీదనే జరుగుచున్నవి. ప్రతివ్యాపారమునకును కరెన్సీనోట్లను, నాణెములను నుపయోగింపవలసివచ్చుచో ఇప్పటికంటె అనేకరెట్లు విలువగల నాణెములు, నోట్లు కావలసియుండును. మనదేశమున నిపుడు వ్యవసాయకులును, ఇతరులునుగూడ తమకు కావలసిన ఋణములకు ప్రామిసరీ నోటుమీద గాని, తాకట్టుమీదగాని నగదు తెచ్చుకొని ఉపయోగించుటయే అలవాటైపోయినది. చాలభాగము బ్యాంకులుగూడ ఈ పద్ధతినే అనుసరించుచున్నవి. ఈబ్యాంకులు చేయుపనికిని, షాహుకారులు చేయు వడ్డీవ్యాపారమునకును ఎక్కువభేదము కనుపించదు. ఈపద్ధతి తొలగి మన దేశమునగూడ 'బిల్లు డిస్కౌంటింగు' పద్ధతి విరివిగ వ్యాప్తిలోనికి వచ్చినగాని చవుకవడ్డీరేటులకు వ్యవసాయపరిశ్రమకు పరపతి లభింపదు.

## హుండీపద్ధతే మనకు తారకం

మనదేశమునగూడ ఇటీవల పెద్ద పారిశ్రామికులును, వర్తకులును హుండీ డిస్కౌంటింగు పద్ధతిలో వ్యాపారము సాగించుచు తగులాభములను పొందుచునే యున్నారు. గ్రామములందలి వ్యవసాయకులకును, చిన్న పారిశ్రామికులకును, వర్తకులకునుగూడ నీపద్ధతిని అమలులోనికి దెచ్చినగాని వ్యవసాయముగాని, గ్రామపరిశ్రమలుగాని అభివృద్ధి చెందజాలవు. ఇట్టి సౌకర్యము లొసగుటకు సహకారపరపతిసంఘములకంటె అనుకూలమగు సంస్థలు లేవు. ప్రతిగ్రామమునందును నెలకొల్పబడు సహకార పరపతిసంఘమున అచటి రైతు లందరును సభ్యులుగ జేరి తమకు వ్యవసాయపు ఖర్చులకు గావలసిన మొత్తములకు 9 నెలల వాయిదాకు పరపతిసంఘమునకు ప్రామిసరీనోటు వ్రాసిఇచ్చుచో, ఆ సంఘము దానిని సెంట్రలు బ్యాంకునకు విలియావేసి కావలసిన సొమ్మును దెచ్చి చవక వడ్డీకి రైతుల కొసగవచ్చును. జిల్లా సెంట్రలు బ్యాంకులు అవసరమగుచో ఆనోట్లను రాష్ట్రీయ బ్యాంకువారికి అమ్మి, అనగా డిస్కౌంటుచేసి తమకు కావలసిన సొమ్మును తెచ్చుకొనవచ్చును. రాష్ట్రీయబ్యాంకు యే యితర జాయింటుస్టాకు బ్యాంకునుండిగాని, రిజర్వు బ్యాంకునుండిగాని సొమ్ము సర్దుబాటు చేసుకొనవచ్చును.

పాశ్చాత్యదేశములయందును, అమెరికాయందును ఇతర పరిశ్రమలయందు 'బిల్లు డిస్కౌంటింగు' పద్ధతి చిరకాలముగ నున్నను వ్యవసాయ పరిశ్రమయందు గత 20, 25 సంవత్సరములలోనే అనులులోనికి వచ్చినది. అమెరికాలో రైతులు 6 మొదలు 9 నెలలలోగా తీర్చు షరతుతో తమ బ్యాంకులకు హుండీలు వ్రాసి యిచ్చెదరు. ఫెడరలు రిజర్వుబ్యాంకులు వానిని 'డిస్కౌంటు'చేసి నగదు చెల్లించి పుచ్చుకొనును. ఫెడరలు రిజర్వుబ్యాంకు వారు ఇతర పరిశ్రమల సందర్భమున 6 నెలల కంటె మించిన వాయిదా గల హుండీల నంగీకరింపరు. వ్యవసాయకుల సందర్భమున మాత్రము 12 నెలల వాయిదాగల హుండీలనుగూడ నంగీకరించెదరు. అట్టి పద్ధతి నీ దేశమునగూడ అనుసరించుచో, వ్యవసాయకునికి సక్రమమైన రేటుకు పరపతి లభించును. సకాలములో బాకీని చెల్లించి పరపతిని నిలబెట్టుకొనవలసిన ఆవశ్యకత తెలుసుకొనును. ఇప్పటివలె నిద్రమత్తుగా గాక తన పరిస్థితులను ఎప్పటి కప్పుడు గమనించి వలయు సహాయమును తరుణములో ప్రభుత్వమునుండి పొందుటకు ప్రయత్నించును.

గ్రామస్థులకు వ్యవసాయము పూర్తియగు పని కల్పింపజాలకున్నదనియు, దానికితోడు ఇపుడు వ్యర్థపరచుకొనుచున్న కాలమును సద్వినియోగపరచుకొనుటకు గృహపరిశ్రమలను, చిన్నచిన్న గ్రామపరిశ్రమలను గూడ నెలకొల్పుకొనవలసియున్నదనియు పైన గమనించియుంటిమి. తగిన పరపతి సౌకర్యములు లేక గ్రామములం దిదివరకు గల పరిశ్రమలు, వాణిజ్యముగూడ శిథిలమగుచున్నవి. గ్రామములందలి చేనేతగాడు మొదలగు చిన్న పారిశ్రామికులు తమకుకావలసిన ముడిసర

కులను దెచ్చుకొనుటకు గొక్కుము నొసగికొని తెచ్చుకొనవలసియున్నది. పెద్దవర్తకుల కుండు మూడు నెలల వాయిదాకు సరకులను దెచ్చుకొను సౌకర్యము లుగూడ వీరికి లేవు. పెద్ద పరిశ్రమలకు, వర్తకులకు తమకు కావలసిన సరకును అరువునకు కొని వానితో తయారుచేసుకొనిన వస్తువులను అమ్ముకొని అపుడు ప్రాతఅప్పు తీర్చుకొనుటకు ఇరవులు కలిగియుండగా గ్రామపారిశ్రామికుల కట్టివి లేవు. ఇట్టి పరిస్థితులలో వారికి హుండీల ద్వారా పరపతిసహాయము చేయుట సులభము. మదరాసురాష్ట్ర చేనేతపరిశ్రమసంఘము వారు తమ సొసైటీల సభ్యులకు వలయు సామగ్రులను సప్లై చేయుట కీక్రిందిపద్ధతుల నవలంబించుచున్నారు. ప్రతి సొసైటీకిని ఎంత పరపతి ఇవ్వవచ్చునో వారు ముందుగా నిర్ణయించిరి. ఆ మొత్తమువరకు నూలు సప్లై చేయవలసినదని కొన్ని నూలుమిల్లులకు హామీ ఇచ్చిరి. అందువలన నాసొసైటీల సభ్యులు పెట్టుబడులతో నిమిత్తములేకయే నూలు తెచ్చుకొని నేసి, మూడు నెలలలో సరకు విక్రయించుకొని, నూలువెలను జమకట్టి, తమకు వచ్చిన కూలితోడను, లాభములతోడను సౌఖ్యముగ జీవింపగలుగుచున్నారు. ఇట్టి పరపతిసౌకర్యము లేనిచో ఆనేతగాండ్రు అల్లాడవలసిన వారేగదా? ఇట్టిపరపతియే హుండీల పద్ధతివలన లభించును.

హుండీ వ్యాపారమున కలవాటుపడి గ్రామస్థులాపద్ధతిలో నడుచుకొనువరకును ఇట్టి పరపతిసౌకర్యములను కల్పించుట కష్టసాధ్యమేయగును. వాయిదానాటికి బాకీని చెల్లించుటకు ప్రజ లలవడునపుడే ఈపద్ధతి జయప్రదముగ సాగును. మన గ్రామస్థుల యందు ప్రస్తుత మట్టి లక్షణము లెక్కువగ గనుపింపవు. కాని, ప్రతిసహకార పరపతి సంఘమునందును బ్యాంకింగువ్యాపారమునందు సుశిక్షితులైనవారిని కార్యనిర్వాహకోద్యోగులుగా నియమించి, వారిద్వారా, పరపతి నిలుపుకొనుటవలన గలుగు మేళ్లనుగురించి ప్రజలకు బోధించియు, వాయిదానాటికి వసూలు చేయుటయందు శ్రద్ధ వహించియు ప్రయత్నించునెడల నిది కష్టసాధ్యమగు కార్యముగాదు.

## దళారీ కమీషన్ల దండుగ

పంట పండించటము ఒక ఎత్తూ, దానిని సరియైన ధర కమ్మటము ఒక ఎత్తూను. పంట పండించిన రైతువద్దనుండి దానిని అనుభవించే మనుష్యునివద్దకు ఆసరకు చేరునప్పటికది ఎన్ని చేతులలోనో మారవలెను. ఈదళారీలందరును తమ లాభములను తీసుకోగా మిగిలినదే రైతుకు దక్కుచున్నది. ఖాయిదా వర్తకుని కమిషను, ఎగుమతి వ్యాపారస్థుని ఏజెంటుకు, ఎగుమతివ్యాపారికి, వానికి పరపతి సప్లయిచేసే బ్యాంకుకు, దిగుమతివ్యాపారికి, వానిఏజెంటుకు, సరకులను అమ్ముకొను చిన్నవ్యాపారికి, ఇంకను ఇతరులకు కమిషనల క్రింద పోవుచున్నది ఖరీదులో నూటికి 25 మొదలు 50 వంతుల వరకును వుండునన్న అతిశయోక్తి కాదు. పంట పండించే రైతు సంస్థకును, అనుభవించేవారి సంస్థకును సన్నిహితసంబంధం ఏర్పరచేవరకూ ఈదళారీలకు కమిషనలు చెల్లించవలసినదే. అమెరికా సంయుక్తరాష్ట్రములలోను, కెనడాలోను ఇట్టిసంస్థలను ఏర్పరచి ఈదళారీ కమిషను చాలవరకు తగ్గించిరి. మన దేశములో సరకును సరియగు ధర వచ్చువరకును నిలవచేసి వాటితాకట్టుమీద జాయింటుస్టాకు బాంకుల లోను, సహకార సంఘములయందును (లోన్ అండ్ సేల్ సొసైటీలు) అప్పుచేయుట కద్దు. గిడ్డంగిసౌకర్యములు విరివిగా లేకపోవుటచేతను, ప్రజలకు దానివలన లాభములు పూర్తిగా తెలియకపోవుటవల్లను, పెట్టుబడిదారులు పంటను ముందే జట్టిగా చౌకధరలకు కొనివేయుటవల్లను రైతులు తగు లాభములను పొందుటలేదు. అదిగాక ఈ సంస్థలు కేవలము తమ డబ్బుకు తగు హామీయున్నదా అని చూచుటేగాని సరకును తగు ధర కమ్ముటకు వలయు పనులను చేయుటలేదు. అందువలన సహకారశాఖవారి లోన్ అండ్ సేల్ సొసైటీలు కేవలము లోను సంఘములేగాని సేలు సంఘములుగా పనిచేయుటలేదు.

దూర దేశములోనివారు సరకులను కొనవలెనన్న ఆ సరకుల మాదిరీలు చూచుకొని బేరము పరిష్కారము చేసుకొని ఇంతసరకు కావలె నని ఆర్డరిత్తురు. ఇట్టి వ్యాపారము సక్రమముగా జరగవలెనన్న మాదిరి చూపిన సరకు ఎట్టిదో తరువాత సప్లయిచేసిన సరకు అట్టిదిగా యుండవలెను. ఇందేమైనామార్పిడి యున్న అది మోసముగా భావింతురు. అట్టి నమ్మకము లేనిచోట వారి ఏజెంట్లను నియమించి వారికిచ్చు కమిషనుధరలో తగ్గింతురు. ఈ కమిషను తప్పవలెనంటే మాదిరీలమీద అమ్మకము (Sale by Samples) వృద్ధికావలెను. దానికొరకు సరకును తరగతుల వారీగా విభజించి, ఆప్రకారము నిలవచేసి మాదిరీలు పంపవలెను. తరగతులు సరిగా నుండవలెనన్న విత్తులు మంచివిగా నుండవలెను. పంట కైటచేసినతరువాత మంచిచెడ్డ వేరుచేసి నిలవచేయవలెను. మోసముచేసి ఎట్లయినను చెడ్డసరకును మంచిదానితో కలప ప్రయత్నించిన సరకంతకును చెడ్డపేరు వచ్చును. ఆసరకును అమ్మిన సంస్థను దూర దేశస్థులు నమ్మి వ్యాపారము చేయరు. సరకును మంచిచెడ్డలను తరగతులవారీగా విభజించవలసిన ఆవశ్యకతను గూర్చియు, అట్లు చేయకపోవుటవలన వచ్చు నష్టమునుగూర్చియు రైతులకు నచ్చచెప్పవలెను. సరకు సరిగా విభజించుట మొదలగు వివరములనుగూర్చి ప్రజలకు చెప్పుటకు సుశిక్షితులగు ఉద్యోగు లవసరము. వీరు తరచు రైతులను కలుసుకొని తగుసలహాల నొసగవలెను. ఈ విధముగా వుత్పత్తిదారుల సంస్థలవద్దనుండి అనుభవించువారల సంస్థలు సరకులను కొన్నయెడల ఉభయులకును తగు లాభము వచ్చును. వ్యవసాయపరిశ్రమ, వర్తకము అభివృద్ధిచెంది ప్రజాజీవితము సౌఖ్యప్రదమగును.

---

# ఇం కెన్నాళ్లు?

'ఆనంద'



ఈ ప్రశ్నకే నేమి చెప్పేది కృష్ణ?
నను జూచి నిను జూచి నవ్వుకున్నాను
ఎన్నాళ్లు అను ప్రశ్నకే మందు సఖుడ
ఆలోచనకె కళ్లు అప్పగించాను.
పాలేటిపొంగులో పూలేరిపోతు.

౧

నడిసముద్రములోన నావనైతేమి ?
తెరచాపచుక్కాని పరు లూనలేరు
మునిగిపోతుం దంచు మూగేరు జనము
నను జూచి నిను జూచి నవ్వుకున్నాను
వారి కర్థముకాదు బాలకృష్ణమ్మ.

ఒడ్డుకే రాదంచు ఉసిగేరు జనము
ఉట్టినావేనంచు ఊగేరు సతము.
గట్టుకే రాకున్న, ఉట్టిదైతేమి ?
అలగన్నగట్టునా కలగాంతు నేను
కెరటాల నుర్వులో కేరి నిన్గూడి
ఆటలాడెద నన్నపాటపాడెదర.
మురళిమోహనగీతి మొరయించుకృష్ణ
ఆలపించిన రాగ మనుగమించెదర
ఆలాపగతికేను ఆడిపోయెదర
భవసాగరోర్మల పవ్వళించెదర
ఆనంద నీతోడ ఆడుకుందునుర.
మతిలేదు నాకంచు మూరాడ రెవరు.
నను జూచి నిను జూచి నవ్వుకున్నాను.

౨

ఎన్నాళ్లు అను ప్రశ్నకేమందు సఖుడ ?
రాలిపోయిన చుక్క రాలునం చెవడు

(4-వ పుట చూడుడు.)




# ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ.

## రెండు కోట్ల వ్యాపారం ఈ దినం అమలులో ఉంది

మీరేవస్తువును కొనదలచినా నాణ్యము, ధర బట్టియే మీకు కావలసినదాన్ని నిర్ణయించుకుంటారు. భీమావిషయంలోకూడా ఇంతే. భీమాపట్టాను కొనగోరేవారిలో తెలిసినవారును, జాగ్రత్తకలవారును వివిధకంపెనీల వ్యాపారపు అంకెలనూ విషయములనూ అవగాహనంచేసికొని తమకు తక్కువధరలో ఎక్కువసదుపాయము నిచ్చేకంపెనీని ఏరుకుంటారు. వారినిర్ణయం ఒకరి ఇచ్ఛకానికిగాని స్నేహానికిగాని గాక కేవలం గుణాధిక్యతపైనే ఆధారపడి ఉంటుంది. ఈ విశాలభారత దేశంలో మూలమూలలనుండి 'ఆంధ్ర'కు లేశమైనా కాంక్షించకయే వ్యాపారం వస్తున్నదంటే కంపెనీయొక్క సౌష్టతకూ, బలిష్టతకూ, క్లెయిములుచెల్లించడంలో దానికున్న నిర్దుష్టమయినపేరుకూ, పట్టాదార్ల కదిచూపే న్యాయాదరణలకూ నిశ్చయమయిన నిదర్శనం.

కనీసమయిన ప్రీమియం రేట్లూ అత్యధికమయిన లాభాలూ కలిగి గణ్యత కలిగియుండుటచేతనే, హిందూదేశమంతట నుండి, శ్రద్ధావంతులయినవారు వేనవేలు, ఆంధ్ర ఇన్స్యూరెన్సును కోరుచున్నారు. దానికున్న కఠినమయిన నిబంధనలన్నిటితోను, 'ఆంధ్ర'కు ఇప్పుడు రెండుకోట్లపైన లక్షణమయిన వ్యాపారం అమలులో ఉంది.


చైర్మన్.


మేనేజింగ్ డైరెక్టర్.


సెక్రటరీ.


అసిస్టెంట్ సెక్రటరీ, యాక్చుయరీ.

బ్రాంచీలు:- ఆంధ్ర ఇన్సురెన్స భవనము,
తంబుచెట్టి వీధి, మద్రాసు.
8, చౌరింగీస్క్వేర్, కలకత్తా.
ఆంధ్ర ఇన్సురెన్స భవనము,
ధంతోలి, నాగపూర్.
ఎర్నాకులం, అనంతపురం, బరంపురం,
సబ్ ఆఫీసులు, చీఫ్ ఏజన్సీలు:—
బెజవాడ, విశాఖపట్నం, బొంబాయి,
సికింద్రాబాదు, లాహోరు, పాట్నా,
బెల్గాం మొదలయినవి.

# ఆంధ్ర
## ఇన్స్యూరెన్సు కంపెని లిమిటెడ్

హెడ్డాఫీసు:— మచిలీపట్నము.

ఆస్తులు రు 36,00,000 మించియున్నవి
ప్రీమియంరాబడి రు 8,52,530
జీవితనిధి రు 31,00,000 మించియున్నది
అమలులోనున్న వ్యాపారం 2 కోట్లకు పైగా
బోనసు 1,000 కి సాలుకు రు. 15



ఆంధ్ర ఇన్‌షూర్యెన్సు భవనములు, మద్రాసు

## 1941 మా వాల్యుయేషను సంవత్సరము

కంపెనీ నాల్గవ వాల్యుయేషను 31-12-41 తేదీ నాటికి చేయబడును. ఇంతకుపూర్వం జరిగిన వాల్యుయేషనులలో లాభములువచ్చి బోనసులు పంచిపెట్టబడినవి. మా ఆక్చుఅరీ రిపోర్టులలోనుంచి కొన్ని భాగములీక్రింద తెల్పబడినవి.

**మొదటి వాల్యుయేషను 1929:**—"ఒక జీవిత భీమాకంపెనీ ఇంత అల్పవయస్సులోనే ఇట్టి ఫలితములను సంపాదించగలగడం చాల అరుదు. ఇందుకు మీరుమిక్కిలి అభినందనీయులు."

**రెండవ వాల్యుయేషను 1933 :**—"ఈ వాల్యుయేషనులో వచ్చినలాభం గత వాల్యుయేషను ఫలితంమీద చక్కని అభివృద్ధి కనబరచుచున్నది. ఇందుకు కారణం సమర్థమయినమీ మానేజిమెంటున్నూ, జాగ్రత్తయున్నూ అని చెప్పగలను......ఎంతటి ఖర్చయినా పెట్టి ఎక్కువ వ్యాపారంతేవాలనే వ్యామోహానికి లోబడకుండా ఉండాలంటే మీ కంపెనీల వంటివందుకు దారిచూపవలసిన అవసరం ఉంది. కంటికి అదురుగాతగిలే పెద్దమొత్తములకన్న సాత్వమయిన వ్యాపారమంగుండే గుణాధిక్యత మీకు తెలిసియున్నట్లు విశదమగుచున్నది. తుదకు మీపద్ధతే లాభకారియనినిర్ణయమగుతుందనినేనునిశ్చయంగా చెప్పెదను".

**మూడవ వాల్యుయేషను 1937 :**— "మీ కంపెనీ మానేజిమెంటు జయప్రదంగా నడుస్తున్న అనేకఇతర కంపెనీల మానేజిమెంటుకన్న పొదుపుగా నున్నదనీ, మీజాగ్రత్తకు ఫలంమీకు చేకూరిందనీ కనబడుచున్నది."

—జి. యస్. మరాతే, ఆక్చుఅరీ.

**'ఆంధ్ర' ఏజంటుగా చేరండి** ఉత్సాహవంతులైన యువతీయువకులు ప్రతిదినము ఆంధ్ర ఏజంట్లుగ చేరుతున్నారు. పరిపూర్ణమయిన తరిబీయతూ, సలహా ఇచ్చి వీరి నంతకంత కెక్కువగా సంపాదించుకొనగలుగ జేస్తున్న కంపెనీ వారిపద్ధతే ఇందుకు కారణము. నెలనెలకూ ఎక్కువప్రతిఫలం ఇస్తూ భావిజీవితంలో అత్యున్నతస్థితి నందటాని కనంతావకాశాలు కలిగిన ఈ వ్యాపారమున స్వతంత్ర జీవనంచేయ నాశయులయిన వారికి మా కంపెనీలో అవకాశాలు కలవు.




## 14 లక్షలకుపైన గవర్నమెంటు, తదితర గిల్టు-ఎడ్జుడు సెక్యూరిటీలలోకలదు.

'ఆంధ్ర' ఏజంటుగా చేరండి. స్వతంత్రమయిన వ్యాపారంలో నెలకు రు. 100 నుండి రు 500 ల వరకు సంపాదించ నుత్సాహం గల యువతీయువకులను మా ఏజన్సీలకు దరఖాస్తు చేసికొన ప్రోత్సహించెదము.

ఆతావు ఆకాల మానమా లేవడు
ముందుగా ఊహించి కందిపోతాడు.
తారకాసతులార మీర లెందాక
మిన్నేటితీరాల వెన్నెల్లలోన
ఆటలాడెదరన్న మాటాడుతార
జ్యోతులై మెఱుపులై ఊరించుగాని.
ఈవత్తి తైలాన ఎవడు వెల్గించె ?
తైల మున్నంతకే మేలు తేజమున
తా మండి వెల్గిచ్చి తరలిపోతుంది.
రేబవ లీరీతి ఈబలి యొసగు
పొగలేచి తావులై సొగయికగూర్చు.

3

నవ్వులో భువనాలు నాట్యమాడేను
తుమ్మిపూవులు కోసి తమ్మిపాత్రికల
అరవిప్పకనులతో అర్చించి నిలతు
ఎందాక నిలచేవు విం దారగించు
అను ప్రశ్న కేమందు మన సిచ్చి తెల్పు.
ఈ పూల పూజించి రేపుమాపులను
నీరూపు ధ్యానించి నిలచి నే నుంటి.
ఎవరికై యీపూలు సవరింతు వంచు
ఏమేమొ అడిగెద రేనేమిసేతు ?

నను జూచి నిను జూచి నవ్వుకున్నాను.
విం దారగించనా ? వెఱ్ఱి నాకృష్ణ
వెల్గేవు నాలోన వెఱ్ఱి నాకృష్ణ
హృత్పుండరీకాన ఇంచుపూదేనె
నీచిన్ని బొజ్జలో నింపికొన్నావు
ఆకలింకేలాగు అగు నాకు కృష్ణ.

* * *

ఎందాక నిలచేవు మందారసుమమ
తొడిమప ట్టూడితే తొలగిపోదన్న.

* * *

కలగిపో నీకేల కారుణ్యపదము.

---



శ్రీ

## పి. టి. రామచంద్రనాయని వారు (నగరి)

వీరు అల్లికూరు మహానాడు మార్యక్షత్రియ పాళయపట్టు వంశీకులు. చిత్తూరుజిల్లా నగరి గ్రామ వాస్తవ్యులు. ప్రాయ మిరువదిరెండు వర్షములు. ఆంధ్ర, ఆంగ్ల, తమిళ భాషలలో ప్రవేశము గలదు. పసితనమునుండియు నాట్య కళారాధనయం దెక్కువ యుత్సాహము. కర్ణాటక సంగీత మవలంబింప కొంతకాలము గురుకులవాసము చేసిరి. నగరి గ్రామములో ఒక పెద్ద హైస్కూలు, బాటసారుల సౌకర్యార్థము కొన్ని కొన్ని వసతులు, వీరి తాత గారిచే నిర్మింపబడి ప్రస్తుతము శ్రీ నాయని వారి యాజమాన్యమున అవిచ్ఛిన్నముగ పోషింపబడుచున్నవి. ప్రస్తుతము శ్రీ నాయని వారు మదరాసు "శ్రీ రేణుకా ఫిలిమ్సు" పోషకవర్గములో యొకరై యున్నారు.

# ఆంధ్రదేశములోని అద్దకపు పరిశ్రమ

## చరిత్ర ప్రఖ్యాతమైన మచిలీపట్టణపు కలంకారీలు

శ్రీ ఆచంట లక్ష్మీనరసింహం

### పూర్వచరిత్ర

మన నాగరికతకు విశిష్టలక్షణమై, మన వేద వేదాంగములతోబాటు ఖండ ఖండాంతరముల ఖ్యాతి నార్జించిన దీ దేశపు చిత్రకళా సమన్వితమైన వస్త్రపరిశ్రమ. సుమారు 150 సంవత్సరముల క్రిందటివరకు, దేశీయు లందరికి సరిపోవు వస్త్రములే గాక, పర్షియా, ఈజిప్టు, అరేబియా, జావా, సుమత్రా, మధ్యధరా ప్రాంతములు, యూరపు దేశములకు కోట్లకొలది రూప్యముల విలువగలవి ఎగుమతియగుచు, దేశ సంపద వృద్ధియగుచుండెను. మరియు నీపరిశ్రమ జాతి, మతవిచక్షత లేకుండ బ్రాహ్మణు నుండి పంచమునివర కందరను బంధించునదై, దేశములో నూటికి 30 నుండి 60 మంది వరకు వృత్తినిగల్పించు ప్రధాన జాతీయ పరిశ్రమయై దేశదేశముల వర్తకులకు నత్యంత లాభదాయియై యొప్పారినది.

దిగ్భ్రమకలిగించు సున్నితములగు వస్త్రములతోబాటు, అత్యంత నేర్పరులగు నీ దేశపు అద్దకపుబనివారు రకరకముల రంగు లద్దియు, చిత్రవిచిత్రములగు నద్దకములు వేసియు, పలువిధములగు రుచులు గల్పించి నేతపరిశ్రమకు స్థిరత్వము గలిగించిరి. డాక్టరు బుకాననుగారి లెక్కలప్రకారం, రంగు లద్దుట, బుటేదారీ లద్దుట చేయుపనివారు దేశజనాభాలో నూటికి ఒక్కరు వంతున నుండిరి (అనగా మన వస్త్ర పరిశ్రమ బాగున్న రోజులలో యీపనులవల్ల 25, 30 లక్షలమంది బ్రతుకుచుండి రన్నమాట).

శ్రీ పట్టాభిగారు తెలిపినటుల "అద్దకం పరిశ్రమ నేతపరిశ్రమ కుపాంగముగా నుండి, ఆయాకులములవారికి, ఆయా ప్రాంతముల వారికి వారివారి రుచుల ననుసరించి రంగులు, అద్దకములు ఏర్పడుచుండిన 18 లక్షల చతురపు గజముల వైశాల్యము, 32 కోట్ల జనాభా గల యీ దేశమున గత 5 వేల సంవత్సరములలో ఎన్నిరకముల రంగులు, ఎన్నిమాదిరిల అద్దకములు వుద్భవిల్లెనో వూహించుట కష్టసాధ్య"మైనపని.

ఇందులో దక్షిణదేశము — విశేషించి ఆంధ్రదేశము, ఆంధ్రనగరములు, పల్లెలు అత్యంత ప్రాముఖ్యము వహించినవి (నేటికిని దేశములో 20 లక్షల మగ్గములు పని చేయుచు, దేశమునకు వలయు 3-వ వంతు వస్త్రములు సరఫరా చేయుచుండుటయు, అట్టి మగ్గములు మనరాజధానిలోనే మూడు పాళ్లుండుటయు గమనించదగినది). మన వస్త్ర, అద్దకం పరిశ్రమలు పాశ్చాత్యుల నెట్లాకర్షించి యూరపున కెగుమతులు సాగినదియు, తొలుత వారు వాటిని ఆత్మరక్షణ కొరకును, స్థావరము చిక్కినతరువాత వారి లాభముకొరకును క్రూరశాసనములు, నిర్బంధములద్వారా లొంగదీసి, చివరకు 19-వ శతాబ్దమున వారి దిగుమతులతో మన మార్కెట్లు నింపి, ఎట్లు క్షీణింపచేసినదియు చరిత్రప్రసిద్ధము. వీనిలో ఆంధ్రదేశమునకు సంబంధించి నంతవరకు వివరములును, యిటీవలిస్థితిని, ప్రస్తుతస్థితిని సంగ్రహముగా దిగువ వ్రాయుచున్నాను.

### ప్రస్తుతం లభించుచున్న ప్రపంచ ప్రాచీనవస్త్రములు

ప్రస్తుతం ప్రపంచములో మనకు కాన్పించు ప్రాచీన అద్దకం వస్త్రములు క్రీ. పూ. 1594 లోను, క్రీ. శ. 1-వ శతాబ్దములోను ఇటలీలో తయారైనవై యున్నవి. ఇవి 15" × 18" సైజులో అద్దకములు, బొమ్మలు గలిగియున్నవి. ఇవి బహుశ జెండాలుగానో, తెరలుగానో వాడబడియుండును. వీనిలో ఎరుపు, నీలంరంగులు ఎక్కువ ప్రాముఖ్యం వహించుచున్నవి.

మనదేశపు రంగువస్త్రములను గురించిన తొలుతటిప్రశంస అత్యంత ప్రాచీనమైన ఋగ్వేదములో నున్నది.

"పరాపతి భద్రా వస్త్రా తన్వతే దంసు రశ్మిషు చిత్రా నవ్యేషు రశ్మిషు"

(మంగళకరములైన వస్త్రములు నీకొరకు విస్తరించబడినవి, కిరణములచేత నానా వర్ణ వస్త్రములను పరచుచున్నవి.)

### ఆంధ్రదేశపు టద్దకములను గూర్చిన తొలి యాధారములు

క్రీ. శ. 131-135 సంవత్సరములలో నీ దేశమును దర్శించిన 'ఆరియన్' అను గ్రీకు పండితుడు మచిలీపట్టణపుకలంకారీ వ్యాపారం విరివిగా జరుగుచున్నదనియు, యీ దేశీయులుసాధారణముగా రెండువస్త్రములు ధరింతురనియు, తరుచుగా అనేకరకముల పూలుఅద్దిన రంగువస్త్రము లుపయోగింతురనియు వ్రాసెను.

అలెగ్జాండరుచక్రవర్తి పర్షియా రాజభవనములలో కలంకారీ యద్దకములనుగాంచి ముగ్ధుడయ్యెనని ప్రతీతి! ('కలం' అనునది

అరబ్బీపదమని, 'కారీ' యనునది పెర్షియన్ పదమని, యీరెండు పదములనుచేర్చిన 'కలంకారీ' యను పదమును కలములతో వ్రాయు నద్దకముల కుపయోగించెడివా రని తెలియుచున్నది.)

క్రీ. శ. 1590 సంవత్సర ప్రాంతములో వ్రాయబడిన 'ఎయినీ-అక్బరీ'లో 'చీటీ' లనుగూర్చిన ప్రశంసయున్నది. 17-వ శతాబ్దపు గ్రంథములలో అద్దకములనుగూర్చి కావలసినన్ని యుదాహరణ లున్నవి.

### ఈ పరిశ్రమను సాగించిన యాంధ్రనగరములు, ప్రాంతములు

మనకు లభించుచున్న చరిత్రాధారము లనుబట్టి అద్దకం పరిశ్రమ తూర్పుకోస్తాను, మచిలీపట్నంలోను, పరిసరములను, గోల్కొండ రాజ్యములోను విరివిగా జరుగుచుండె నని తెలియుచున్నది. మరియు తరువాతిరికార్డు లనుబట్టి నెల్లూరుజిల్లాలోని ఆర్మగాన్, నిజాంపట్టణం, కాళహస్తి, జగ్గయ్యపేట, జమ్ములమడుగు, పామిడి, నర్సాపురం, పొన్నేరి, కాకినాడ, ప్రస్తుత మద్రాసు ప్రాంతమను సాంతోము లుదాహరించబడి యున్నవి. వీటినిగూర్చిన వివరములు ముందు వ్రాయుదును.

ఈ సందర్భమున ఆంధ్రదేశము అనాది నుండివస్త్రపరిశ్రమకు బంగారుగనియనియు, అద్దకములకు, ఎగుమతులకు మచిలీపట్నం ప్రధానస్థానమై యుండెననియు ముఖ్యముగా గమనించవలసియున్నది. ఆకాలపు గ్రీకులు మన్నగువర్తకు లీపట్టణమును 'మసాలియా' యని వాడియున్నారు.

### ఆ కాలమున తయారగుచుండిన అద్దకములు

కృష్ణాజిల్లా మాన్యుయలునుబట్టియు, 'హాబ్సన్ - జాబ్సన్' 'ఇండియాలోని ఫాక్టరీ'లను గ్రంథములనుబట్టియు 125 రకములకు పైగానే అద్దకములు రవానాయగు చుండెనని తెలియుచున్నది. వానిలో ముఖ్యమైన కొన్నిటిని దిగువ పేర్కొనుచున్నాను.

1. "చీటీలు" - ఇవి పలుచోట్ల కాన్పించుచున్నవి. వీనియర్థము నేడు వాడుకలో నున్న స్త్రీల రవికల యద్దకములకేగాక, చుక్కఅద్దకములన్నిటికినీ వాడెడివారు.

2. సాలంపోర్లు (కొన్నిరకముల చీటీలు)

3 పింటాడోలు. ఇది పోర్చుగీసుపద మనియు, చాల రకముల అద్దకములకు వాడుచుండిరనియు తెలియుచున్నది.

3. "కాలికట్లు" లేక "కాలిమండర్లు" (కొన్నిరకముల అద్దకంచీటీలు)

4. పాలంపోర్లు (ఇది పాలన్ పోష్ యొక్క అపభ్రంశము. అద్దకం, దుప్పట్లు, తెరలకు యీపదము వాడబడుచుండె నని యు, మచిలీపట్నంలో తప్ప యితరచోట్ల వాడుకలో లేదనియు 1899లో కాఘరుగారు వ్రాసియున్నారు)

ఇవిగాక "కలంకారీలు," సదంజీలు, "సాసర్ గంజీలు," దుప్పట్లు, రుమాళ్లు, "అల్లీజాలు", "కలువ పువ్వులు," పరకణాలు, లుంగీలు, సెల్లాలు, ఇజారీలు వగైరా రకము లెన్నో ఎగుమతి యగుచుండెను.

### మచిలీపట్నంకలంకారీల ప్రాశస్త్యము, మొగలుచక్రవర్తుల మన్నన

ఈ యద్దకము లన్నిటిలోను కలంకారీ లనబడు అద్దకములు చిత్ర విచిత్రములగు దేశీయరంగులతో, కలములతో వ్రాయబడుచు, ఓపికతో నెలలతరబడి చేయు కృషిఫలిత మై, అత్యద్భుత కళాదర్శములై, మిగుల రమణీయములై కన్నులు మిరుమిట్లు గొలుపు చుండెడివి. నేటికిని ఈ యద్దకములు కళాప్రియు లందరకును, విదేశీయులకును అచ్చెరువు గలిగించుచున్నవి.

ఇవి మిక్కుటముగా ముస్లిములకు ప్రీతిపాత్రము లై, అరేబియావర్తకులద్వారా పర్షియాకు మిక్కుటముగా చాల యిటీవల వరకును రవానా యగుచుండెను.

ఈ పరిశ్రమను పర్షియాకు గొంపోవలె నను యత్నము విఫలమైనపిమ్మట కొందరు చొరవగల పర్షియన్ వర్తకులు తమకుటుంబములతో మచిలీపట్నమునకు వలసవచ్చి, యిచ్చట నివాసము లేర్పరచుకొని, బుద్ధి కుశలులగు యిచటి పనివారి సాయమున, తమవారికి రుచించు పెక్కు క్రొత్తరక అద్దకములను ప్రవేశపెట్టి, విరివిగా ఎగుమతులు సాగించుచుండిరి.

స్థానిక వర్తకులలో "విన్నకోట" కుటుంబమువారు యీ పరిశ్రమద్వారా విస్తారముగా ద్రవ్యమును, ఖ్యాతిని ఆర్జించియుండిరి. పని బాసుగా సాగుచున్న రోజులలో, యీ ఒక్క పరిశ్రమవల్లనే, మచిలీపట్నంలో 3000 మంది జీవించెడివా రని తెలియుచున్నది.

వైభవోపేతులగు మొగలుచక్రవర్తుల కాలమున యితర కళలతోబాటు అద్దకం పరిశ్రమకు చాల ప్రోత్సాహము కలిగెను. అక్బర్ పాలనమున రవసెల్లాలు, రంగు అద్దకముల వుత్పత్తి యధికముగా నుండెను.

షాజహాన్ చక్రవర్తి "మచిలీ అద్దకములను" మిక్కిలి ప్రోత్సహించు చుండె ననుటకు 1663-వ సం.లో బెర్నియ రగు యిచ్చిన — చక్రవర్తి పటకుటీరములోని దిగువ స్వాగతవర్ణనను బట్టి తెలియుచున్నది.

"ఆ ప్రాంగణమంతయు మచిలీపట్నం కలములతో వ్రాయబడిన చీటీలతో అలంకరించబడెను. వింత వింతరంగులు, పుష్పములతో, సహజరామణీయకములగు వందల కొలది యాకృతులతో నాప్రదేశము సహజమైన యుద్యానమువలె నుండెను!"

చక్రవర్తి యీ పరిశ్రమను ఢిల్లీలో స్థాపించదలచి, నేర్పరులైన పనివారిని రప్పించి, కొన్ని కలంకారీలను తయారు

చేయించెనట! కాని వానికి "మచిలీ కలంకారీల" తళుకు రాలేదు. ఈ తళుకునిచ్చు విశేషం మచిలీపట్నంనీటిలో నున్నదని నేటికిని తలచబడుచున్నది.

అదివరకు దేశములో నెన్ని రాజకీయ సంక్షోభములు జరిగినను, వానివల్ల మన గ్రామీయుల జీవితములుగాని, వారివృత్తులు గాని చెక్కు చెదరలేదు. తరతరములుగా నీ వృత్తులు తండ్రినుండికొడుకునకు సాగుచు, ప్రశాంతముగా వారు వేలకొలది సంవత్సరములనుండి జీవించుచుండిరి.

కాని యీ దేశముతో పాశ్చాత్యుల సంపర్కముమాత్రము భిన్నమై, దేశీయ నాగరికతను, వృత్తులను మొదలంట కలచి, తారుమారొనర్చెను. ఇందును గూర్చిన వివరములను మనము ముందు చూడగలము.

## చారిత్రాత్మకమైన కలంకారీపరజా

లండన్ యిండియన్ మ్యూజియంలోని 17-వ శతాబ్దపు మచిలీ కలంకారీ పరజా యొకటి చిత్రవిచిత్రములగు రంగులతో వింత గొలుపుచుండుటేగాక, యొక చారిత్రక సన్నివేశమును చిత్రిత మొనర్చియున్నది. రంగులలో ఎరుపు ప్రాధాన్యము వహించినది. వివరము లీ దిగువ విధముగా నున్నవి.

పై భాగమున యిరువురు రాజులు మహారాష్ట్రపద్ధతిని పాగాలు ధరించి, ఆసీనులై యున్నారు. వీరి ముందు యిరువురు యువకులు వేరుగా నున్నారు.

వీరికి దిగువను యిరువురు పురుషులు, నొక స్త్రీ యున్నారు. ఆకృతులను బట్టి పురుషులు పాశ్చాత్యులు; 17-వ శతాబ్దపు దుస్తులలో నున్నారు. స్త్రీ యాకారములో చీర, హారము, అడ్డిగలు ధరించి, యూరపియన్ ముఖము, జాకెట్టు, పాశ్చాత్య పద్ధతిని తలదువ్వుకొనుట గలిగి వింతగానున్నది. పురుషులలో నొకనిచెంత పెద్ద కుక్క యున్నది.

వీరికిని, రాజులకును నడుమ కూజాలు, కత్తులు వగైరా కానుక లున్నవి. రాజుల యాకృతులు మిగతవారికంటె 3 రెట్లు పెద్దవి. కొలువు వైభవముగా నున్నది. చుట్టును 20 మందికి పైగానే, పరివారము, అలంకారములతో నున్నారు. ఈ బట్టలో ప్రతి యంగుళమును ఆకర్షకముగా నద్దబడినది. అడుగునగల వేటసీనుకూడ చక్కగా నున్నది.

ఈ తెరకు రెండు ప్రక్కలను పై భాగమునను చేర్చిన యంచులు వేరు అద్దకమై యున్నవి. ఈ పరజాయందలి కథావస్తువు దేనికి సంబంధించినదో చరిత్రపరిశోధకులు నిర్ణయించవలసియున్నది.

## పరిశ్రమ వృచ్ఛదశ —
## ఇంగ్లాండుకు యెగుమతులు

ఈ దేశపు వస్త్రములు చిరకాలము నుండియు అరేబియా, పర్షియా, ఈజిప్టు పెగూ, మలాకా, సుమత్రా, మధ్యధరా ప్రాంతములకు ఎగుమతి యగుచుండినట్లు నిదర్శనములు కొల్లలుగా నున్నవి. ఈవస్త్రములను ధరించుటకు ప్రపంచవాసు లత్యంత కుతూహలము చూపుచుండుటచే, ఆయా దేశముల వర్తకులు పెక్కు శ్రమలుపడి యీ దేశమునకు వచ్చి, మన వస్త్రములను కొని, తమ దేశముల కెగుమతిచేసి, లాభపడుచుండిరి.

చివరకు పాశ్చాత్యులుకూడ ఆకర్షించబడిరి. ఇంగ్లీషువారు 1600-వ సం. న "ఈస్టిండియా కంపెనీని" స్థాపించి, 1612 లో యిండియా కంతటికి తొలుత మచిలీపట్నంలో ఫ్యాక్టరీ నిర్మించి, క్రమముగా ఎల్లెడల ఫ్యాక్టరీలు స్థాపించుకుని ఈ దేశపు వస్త్రములను గొని, విరివిగా యింగ్లాండునకు బంపుచుండిరి.

1669 లో కంపెనీ తరఫున "స్ప్రియన్ సన్ మాస్టర్, హాట్టన్, మేహాన్" అను మువ్వురు దొరలకును, కొందరు బందరు వర్తకులకును వస్త్రములకొరకు కంట్రాక్టు జరిగినట్లు కృష్ణాజిల్లా మాన్యుయల్ తెలుపుచున్నది.

కంపెనీవారు మన వస్త్రములమీద యింగ్లాండులో 100 టికి 600 వందల వరకు లాభములు సంపాదించుచుండిరి. ఒక సంవత్సరం షేరు మొత్తముతో సమానముగా లాభములు పంచుటచే నా దేశములో గగ్గోలు పుట్టెను.

ఇంగ్లండులో అద్దకములకు మోజు హెచ్చుగా నుండుటచే 1665-వ సం. న కాలికోలు హెచ్చు పంపవలెనని కంపెనీ డైరెక్టర్లు ఆర్డర్లు పంపిరి.

1634-36 సంవత్సరములలో 1-వ ఛార్లెసురాజు అద్దకమువేయుట కొక పున్నివస్త్రము నిచటికిపంపెనని యు, అది దారిలో పోగా, దానిబదులు మరొకవస్త్రం నేయించి దానికి "ప్రఖ్యాతమైన మచిలీపట్నం అద్దకం" వేయించి పంపిరట!

(తూర్పిండియా కంపెనీ రికార్డులు)

1667-వ సం. న లక్షా అరవై వేలపౌనుల బరువుగలబట్ట యింగ్లాండులో దిగుమతి యయ్యెను.

1681 లో రగ్గులు, అద్దకంబట్టలు, తలుపులకు వేసికొను తెరలు 3 లక్షల రూపాయల విలువగలవి ఎగుమతి యయ్యెను.

తూర్పుయిండియా కంపెనీవారి రికార్డుల వల్ల నాటి ఎగుమతులనుగూర్చి దిగువవివరములు తెలియుచున్నవి.

"క్లోస్టర్" అనుఓడ తిరిగి వెళ్లునప్పుడు 4 గోవంతు అద్దకములు కొనిపోయెనట!

1637-41 సం. లలో చక్కని యద్దకం పరుపులు జత 1-కి 5 పౌనుల 5 షిల్లింగులనుండి 6 పౌనులవరకు అమ్ముచుండిరట.

1635-36 సం. లలో కంపెనీ ఫ్యాక్టరీని మచిలీపట్నంనుండి నెల్లూరుజిల్లాలోని "ఆర్మగాన్"కు మార్చవలెనని, అచట చక్కని యద్దకములు, సాదాగుడ్డ దొరకునని యీ రికార్డులే తెలుపుచున్నవి.

ఈ గ్రంథములలోనే యొకచోట "పర్షియాతో వ్యాపారము జరుగుచున్నదనియు, పర్షియారాజులకు అద్దకము లంపుచుండిరనియు" తెలియుచున్నది.

వీని యాధారముననే ప్రస్తుతము మద్రాసున్న చోటగల "సాంతోము"లోకూడ రకరకముల యద్దకములు తయారగుచున్నట్లు తెలియుచున్నది.

మరియు నీ యాధారములనుబట్టియే, యీ యద్దకములు ఎగుమతికి కావలసినన్ని దొరకెడివి కావనియు, "కాలమానం బాగులేక" తయారుకావనియు, (1640 సం॥) కావలసినప్పుడు దొరకవనియు, నదీతీరములలో చలువ చేయుటకు పరచిన బట్టలు ఆకస్మికముల వరదలకు కొట్టుకొనిపోయెడివనియు, దుర్మార్గులగు గవర్నర్ల బారినుండి పనివారిని తప్పించుటకు స్వతంత్ర దేశమున్నగాని పనులు సాగుట దుర్లభమయ్యెడిదనియు తెలియుచున్నది.

మనవస్త్రములపై ప్రజల వ్యామోహం పెరిగి, దిగుమతులు హెచ్చినకొద్దీ, యింగ్లాండులో వున్న వ్యాపారంతగ్గి, ఆ వృత్తివల్ల జీవించువారికి జీవనోపాధులు సన్నగిల్లుటచే వారిలో గగ్గోలుపుట్టి, 1688 లో యిండియావస్త్రములు దిగుమతి కాకుండ చేయవలెనని పార్లమెంటును ఒత్తిడిచేసిరి. అప్పటినుండి యీ దేశ వస్త్రములను నిషేధించు శాసనను లొకటివెంబడి యొకటిగా బయలుదేరెను. వానిని ముందు చర్చింతము.

## మన అద్దకములు, విదేశీయుల ప్రశంసలు

ఇటలీ యాత్రికుడు మార్కోపోలో యిట్లు వ్రాసియున్నాడు: "మచిలీపట్నం, పరిసరములున్న మజ్లినలకు చీటీ,అద్దకములకు బహుకాలమునుండి ప్రసిద్ధి గాంచినవి వీనిని ధరించని,మెచ్చుకపడని రాజుగాని, రాణిగాని ప్రపంచములో లేరు."

టావర్నియర్ (1676) "చీటీలు" లేక "అద్దకం కాలికట్లు" "కాళీఘండర్లు" అని పిలువబడు నని, "అవి పెన్సిలుతో వ్రాయబడు" నని, "గోలకొండ రాజ్యములోను, మచిలీపట్నం చుట్టు ప్రక్కలను తయారగుచున్న" వని వ్రాసినాడు.

డాక్టర్ ఫ్రయర్, పేటపోలి (నైజాం పట్నం) మచిలీపట్నములలో చక్కని రంగులు, అద్దకంరకములు దొరకుననీ, మచిలీపట్నం ఎగుమతులు తెలుపు, అద్దకం, కాలికట్లు, పాలంపోర్లు, తివాసులు నని వ్రాసినాడు.

మెలిబిడెన్ తినోనాట్ అను పరాసు యాత్రికుడు (1687) సెయింటుతోములో అద్దినవస్త్రములు చాల చక్కగా నున్నవని వ్రాసెను.

మ్యూరేయను ఆంగ్ల చరిత్రకారుడు "హిందూదేశపు వస్త్రములు ప్రపంచములో నెవరును, ఎన్నడును ప్రదర్శించలేని హస్తకళాకౌశలమును ప్రదర్శించుచుండెనని" వ్రాసియున్నాడు.

సీజరు ఫ్రెడరిక్ అను వెన్నిస్‌వర్తకుడు (1568) సాంతోము, పెగూలమధ్య వస్త్ర వ్యాపారము విరివిగా జరుగుచున్నదని, రంగులు వెలిసిపోక, కళాయిపూసినట్లు అతికి, వుతికినకొద్దీ ఛాయ యినుమడించుచున్నదని వ్రాసెను.

విన్గోటన్ (16 శతాబ్దం) "సాంతోము, మచిలీపట్నములలో అనేకరకముల నూలువస్త్రములుతయారగుచున్న" వని "మిక్కిలి పనితనముకలిగి, సున్నితముగా నుండుటచే పట్టువస్త్రములకంటె అందమై, ఎక్కువ విలువకలిగి, ఆదరించబడుచున్న"వని వ్రాసియున్నాడు.

మనదేశపు వస్త్రములపై నాంగ్లేయులకు గల వ్యామోహమునుగూర్చి డేనియల్ డీఫో యిట్లు వర్ణించియున్నాడు:

"ప్రజలమోజు అంతా యిండియానుడ్డల మీద పరుగెత్తుతోంది. ఈమోజు ఎంతవరకు వెళ్లిందంటే యిదివరకు నేలమీద పరచుకునే కంబళ్లుగను, పరుపులమీద పరచుకునే దుప్పట్లుగను, చిన్నపిల్లలకు, సామాన్యజనులకు యిచ్చేటట్టులుగను వుండిన కలంకారీలు నేడు మన నాగరిక నారీమణుల కలంకార భూయిష్ఠము లైనవి. ఫ్యాషన్ యిప్పుడు ఏ విధముగా మారినదో చూడండి! ఇదివరకు దాసీవాళ్లుకూడ తమకు పనికిరావనుచుండిన యిండియాచీటీ గుడ్డలు నేడు షోకిల్లా పుగుషులు ధరించు నాగరికదుస్తులైనవి. ఆహా! ఏమిమహిమ! నేలమీద పరచుచుండిన చీటీ గుడ్డలిప్పుడు నాగరికుల వీపులపైనను, భుజములపైనను ఎక్కినవి!

నడచునప్పుడు కాళ్లక్రింద నేలకొనుచుండిన చీటీనుడ్డలిప్పుడు నాగరిక నారీమణుల కంచుకములైనవి!

ఇండియానుండి వచ్చిన బట్టలిప్పుడు మన పడకటింట్లలోనికీ, మన్యమందిరములలోనికీ, పరుపులమీదికీ, కిటికీలమీదికీ, కుర్చీలమీదికీ కూడ ప్రాకుచున్నవి! చివరకు! స్త్రీలదుస్తులలోగాని, గృహ పరికరములలోగాని, యిదివరకు వున్నితోను, పట్టుతోను తయారగుచుండిన వస్తువులన్నియు యిప్పుడు యిండియానుండి దిగుమతి యగుచున్నవి" అని పండితుడు "ఇదివరకు నేలమీద పరచబడుచుండిన కలంకారీ గుడ్డలిప్పటి [illegible] వచ్చి, కుర్చీలమీదను, పరుపులమీదను, ధరించి తెక్కినవారందరికి [illegible] మాలిన ఫ్యాషన్ నేర్పినది" అని పలికెను.

దేశము [illegible]!
(గాంధీ - [illegible])

## నిర్బంధ శాసనముల ద్వారా నిరోధము

ఇంగ్లాండులో ప్రవేశించిన హిందూదేశ [illegible] బయలుదేరి వస్త్రములకు నిర్బంధ శాసనములు ప్రారంభమయ్యెను.

భారతీయ వస్త్రములపై నాగరికమైన పాశ్చాత్య దేశము నూటికి 10 నుండి [illegible] వరకు పన్నులు విధించెను.



శ్రీకృష్ణ పాత్రధారి సి. హొన్నప్ప భగవతార్.

విడుదలతేదీ నిరీక్షించండి!

సాధనవారి పౌరాణిక చిత్రము

# కృష్ణకుమార్

# KRISHNA KUMAR

మహోన్నతమైన తారాగణం

* సి. హొన్నప్ప భగవతార్ * కె. తవమణిదేవి
* వి. ఎ. చెల్లప్ప * టి. ఎస్. రాజలక్ష్మి
* నాగర్‌కోయిల్ మహాదేవన్ * పి. ఆర్. మంగళం
* ఆర్. బాలసుబ్రహ్మణ్యం * పి. ఎస్. జ్ఞానం
* ఎస్. డి. ఆర్. చంద్రన్ * జి. ఎస్. సరస్వతి
* కాళి ఎన్. రత్నం * కె. వి. జీవ
* " అజక్తన్ " క్రిష్ణయ్యర్ * కె. టి. ధనలక్ష్మి
* వి. ఎస్. కిట్టప్ప అయ్యర్ * బేబీ శకుంతల

దర్శకత్వం: ఎస్. డి. ఎస్. యోగి

కీర్తనలు హెచ్. ఎం. వి.
రికార్డులలో నున్నవి.

## సాధన ఫిలిమ్స

లిమిటెడ్.

సేలంటౌను, సేలం.

కేరళ సర్క్యూటుకు సోల్ డిస్ట్రిబ్యూటరులు :—

కనక ఫిలింస్, లిమిటెడ్.

సేలంజంక్షన్.

1666 లో శవము లన్నిటిని ఇంగ్లాండు వున్ని దుస్తులతో కప్పవలెనని శాసించిరి.

1700-వ సం.న ఇండియా ప్రత్తివస్త్ర ములు ధరించరాదని శాసించిరి. అంతేగాక కొన్నవారికి 5 పౌ. చో., అమ్మువారికి 20 పౌ. చో. అపరాధము లేర్పరచబడెను.

1700-వ సం.రననే "ఇండియా కాలికోలు" యింగ్లాండుకు రారాదని శాసించిరి. అటుపిమ్మట తెల్లగుడ్డ రవానా కొనసాగగా, 1721 లో తెల్లగుడ్డయు నిషేధించబడెను.

1721 సం.లో రంగు అద్దకం, గుడ్డలకు చతురపు గ 1కి 0-6-0 చో. పన్ను విధించిరి.

1724 లో యింగ్లాండులో వడికి, నేసిన వస్త్రములను ధరించ వలె నని శాసనము చేసిరి.

1737 లో భారతీయ వస్త్రములను ధరించిన వారికి జుల్మానా లేర్పరచి, నూలువస్త్రములనే ధరించ రాదనిరి.

తరువాత దేశములో వాడుకకుగాక, రవానాకొరకు భారతీయ వస్త్రములు తెప్పించవచ్చునని మరొక శాసనమొనర్చిరి. కాలికోలమీద నూటికి 67, $67\frac{1}{2}$ వరకు పన్ను విధించిరి.

ఈ శాసనముల ఫలితమునుగూర్చి వేరుగా వ్రాయ నక్కరలేదు. ఇండియా ఎగుమతులు క్రమముగా క్షీణించి, ఆ దేశపుటుత్పత్తి పెరుగసాగెను. ఇటీవల పెర్షియా దేశీయులు కూడ నూటికి 80 చో. పన్నులు విధించి, మన కలంకారీలను నిషేధించిరి.

## మన దేశమున కంపెనీనౌకర్ల నిర్బంధము

ఈ విధముగా నిరోధ చట్టములద్వారా దిగుమతులను నిరోధించుటేగాక, కంపెనీ నౌకర్ల నిర్బంధ చర్యలద్వారా, యీ దేశములోకూడ వడుకు, నేతలును, అద్దకం పరిశ్రమయు కుంటువడజొచ్చెను. ప్రత్తిరాటం, మగ్గం, ఆసు, నేత పరికరములపైనను భారమగుపన్నులు విధించబడెను. దేశీయరాజుల కంట్రాక్టులలో, వారి రాజ్యములలో తయారగు వస్త్రము లన్నిటిని కంపెనీవారి కీయవలెనను షరతులు విధించుచుండిరి. కంపెనీనౌకర్లు బహు తక్కువ ధరలకు వస్త్రముల నీయవలెనని నేతగాండ్రను నిర్బంధించుచు, అంగీకరించనివారిని తుపాకి మడమలతో నొప్పించుచుండిరి. దేశీయవర్తకు లీ వస్త్రములను గొనరాదని శాసించిరి. దేశములో వ్యాపారమునకు లైసెన్సు లేర్పరచిరి. దేశములోని నేతగాండ్రను పంచుకొనుటకు సైతము యత్నించిరి.

ఈచర్యల ఫలితముగా నేతగాండ్రు బానిసలైరి. చాలమంది యీ బాధలు పడలేక, యితరవృత్తు లవలంబించిరి.

1813 సం. నాటికి వడుకు పరిశ్రమ పూర్తిగాను, నేత పరిశ్రమ దాదాపుగాను అంతరించెను. వీనితోబాటు అద్దకం పరిశ్రమ కూడ పూర్తిగా దెబ్బతిని కొనయూపిరితో నుండెను. (1850, 1860 సం.లలో కూడ అద్దకముల ఎగుమతి నామకముగ ఉండెను గాని అది లెక్కలో చేరినది కాదు.)

1820 సం. నాటికి కథ యడ్డము తిరిగి యింగ్లాండునుండి 70 లక్షల రూపాయల వస్త్రము లీ దేశమునకు దిగుమతి యయ్యెను. ఆంగ్లేయులు 1814 సం.న ఆవిరి యంత్రములను కనుగొనుటతోపాటు మన అద్దకం పద్ధతులు, పనిముట్లు, జనుల యభిరుచులు వగైరా మిగుల జాగ్రత్తతో మనఖర్చుతోనే సంపాదించి, మన అద్దకములకు నకళ్లుగాను, కొద్దిమార్పులతోను తయారుచేసి, మనకు దిగుమతి చేయజొచ్చిరి. 1733 సం. విక్టోరియా ఆల్బర్టు మ్యూజియంలోనుంచిన యొక్క ఫ్రెంచి అద్దకం "ఇండియా పద్ధతినే తయారై"నట్లు తెలుపబడినది.

(1681లో గవర్నర్ ఏల్ ఎడింబరోనుండి "మేము మచిలీపట్నమునుమించిన రకములను చేయుచున్నా"మని సగర్వముగా వ్రాసెను.) క్రమముగా యూరప్ అద్దకముల పోటీకాగలేక, రక్షణలేని మనయద్దకం పరిశ్రమ యరికట్టబడెను. స్వాతంత్ర్య హీనమైన మన దేశము పనివారిని రక్షించలేకపోయెను.

## ఇటీవలిస్థితి (1885-88 సం.లు)

హోవెల్సు దొరగారి నివేదికను బట్టి 1885-88 సం.లలో అద్దకం పరిశ్రమ దిగువ విధముగా నుండెను.

1. బంగనపల్లె: 70 కుటుంబములు, ముదుగు తలపాగలు, రుమాళ్లు అద్దుచున్నారు.

2. కాకినాడ: 35 కుటుంబములు బ్లాకులతో అద్దుపాలంపోర్లు, తగ్గురకం రుమాళ్లు అద్దుచున్నారు (జగన్నాథపురం చేరి).

3. గొల్లపాలెం: మామూలు బ్లాకులతో తోరణాలు (చాందినీలు) అద్దువారు 1, 2 కుటుంబములు తగ్గురకం రుమాళ్లు చేయువారున్నారు.

4. జమ్మలమడుగు: ముస్లిములకు తగ్గురకంపాగా లద్దువారు 10 కుటుంబములవారున్నారు.

5. జగ్గయ్యపేట: తెల్లచీరలకు అంచులు అద్దువారు 17 కుటుంబములవారు పనిచేయుచున్నారు.

6. కాళహస్తి: పాలంపోర్లు, అద్దకములు చేయుచున్నారు.

7. మచిలీపట్నం: ఆర్డరులకు కలంకారీ దుప్పట్లు, పరజాలు, చాందినీలు అద్దువారు 3 కుటుంబములును, తోరణములు (చాందినీలు) తెరలు, ప్రార్థన వస్త్రములు, రుమాలాలు పాగాలు, ముస్లిమ్ స్త్రీలకు చీటీలు, చీరలు, బ్లాకులతో అద్దువారు 145 కుటుంబములు పనిచేయుచున్నవి.

8. నంద్యాల: ముదుగుపాగాలు, రుమాలాలు, అద్దువారు 32 కుటుంబములవారు.

9. నర్సాపురం: పాలంపోర్లు తయారుచేయు 50 కుటుంబము లున్నవి.

10. పామిడి: ముదుగు రుమాలాలు, పాగాలు, పరజాలు తయారు చేయుచున్నారు. కలముతో అద్దకంచేయు 1

మనిషి యున్నాడు. ముప్పది కుటుంబముల వారు 200 పనివారికి పని యిచ్చుచున్నారు.

11. పాలకొల్లు: పాలంపోర్లు, పాగాలు, రుమాలాలు, చీరలు అద్దువారు 15 కుటుంబములును, కలంకారీపనిచేయువారు ఒకరును వున్నారు.

11. విశాఖపట్నం: సాధారణ బ్లాకులతో తెలుపుబట్టలమీద అంచుల నద్దువారు 4 కుటుంబములు.

13. విజయనగరం: డిటో.

పొన్నేరిలో పనిజరుగుచున్నను యీ నివేదికలో చేరలేదు.

పై కుటుంబములలో 5 నుండి 7 గురు వరకు పనిచేయుచున్నట్లు తలచవచ్చును.

పాలంపోరనగా మామూలుగా అద్దకం దుప్పటికాని, పరజాలకుకూడ వాడబడినది. చాందినీలు లేక తోరణము లనగా పందిళ్లకు, పటకుటీరములకు, రథాలంకరణములకు నుపయోగించు వస్త్రములు. చాల అద్దకం విగ్రహము లుండెడివి. రుమా లనగా చిన్నచౌకము మొదలు 4 గజముల వస్త్రమువరకు నుపయోగించు పేరు. ఇవి హెచ్చుగా సంయుక్త రాష్ట్రముల దక్షిణమున నీగ్రోలు వాడుచుండిరట. 'ప్రార్థనవస్త్రములు' ముస్లిములు ప్రార్థనకుగాను, చాప లేక తివాసీకి బదులు వాడు అద్దకంబట్ట; చవుక.

ఈసమయమున హావెలుగారు సేకరించిన వస్త్రములు నేటికిని మద్రాసు మ్యూజియంలో నున్నవి.

1899-వ సంవత్సరమున జి.ఏ.కాఫరుగారు ప్రభుత్వసాయమున "అద్దకంపరిశ్రమ" ను గూర్చి పరిశోధన సాగించి, వివరముగా అద్దకంపద్ధతులు వాడుకలోనున్న పనిముట్లు వగైరాలనుగూర్చి సమాచారము సేకరించిరి. పలుప్రాంతములకు స్వయముగా వెళ్లిరి. అందులో మచిలీపట్నముండెను. ఆపట్టణమును గూర్చి ఆయన దిగువవివరములు తెలిపియున్నారు.

మచిలీపట్నం: 1864-వ సంవత్సరపు జలోపద్రవంవల్ల వ్యాపారమునకు గొప్పదెబ్బతగిలెను. కలములతోను, బ్లాకులతోనుకూడ అద్దకములు జరుగుచున్నవి. దిగుమతియైన ఎరుపు రంగులు వాడుచున్నారు.

విదేశరంగులవాడుక ప్రవేశించుట విశేషము. విదేశరంగులు తేలికయని తమ రంగుల వాడుక తగ్గించుచున్నారు. నీలిమందు వాడుకలోనే యున్నది.

## 1915-వ సంవత్సరంనాటి స్థితి

సామాన్యవస్త్రములు గాక విశేషరకములు యీదిగువ విధముగా తయారగుచుండెను.

1. జమ్మలమడుగు: పని మోటుగానున్నను అందమైన సలుపు అద్దకం చేయుచున్నారు.

2. మచిలీపట్నం: అద్భుతమైన వస్త్రములింకను తయారగుచునే యున్నవి. పరజాలు, చిన్నచేతిగుడ్డలు మొదలైనవి మామూలుగా అద్దుదురు. రంగులు అద్దకములు సుందరమైనవి.

3. పొన్నేరి: బ్లాకులతోను, కలములతోను అద్దకము లింకను హెచ్చుగా తయారగుచున్నవి.

## మచిలీపట్నం — ప్రస్తుతస్థితి

చిన్నకోటవారు "కలంకారీ" పరిశ్రమను నిశ్శేషము గాకుండ కాపాడుచువచ్చిరి. వీరి యద్దకములు 1903, 1909, 1924 సం. ల ప్రదర్శనములలో (వెంబ్లీ ప్రదర్శనంసహా) మెప్పు గాంచెను.

అయినను యించుమించుగా ఖాదీతో నస్తమించిన యీ పరిశ్రమను ఖాదీతో నుద్ధరించు భాగ్యము ఆంధ్ర చరఖాసంఘమునకు లభించెను. 1929-వ సం. లో నీ సంఘ ప్రధానకార్యస్థానము మచిలీపట్నమునకు మార్చబడినప్పటినుండి సంఘ కార్యదర్శిగారగు శ్రీ వేమూరి నారాయణమూర్తి పంతులుగారీ పరిశ్రమను లేవదీయుట కద్వితీయమగు కృషి సలిపిరి. అందుచే యీ పరిశ్రమ పునరుద్ధారణలో వీరి పేరు సువర్ణాక్షరములతో లిఖించవలసియున్నది.

అనాదికాలము నుండియు కలంకారీలు సన్నని ఖద్దరుపైననే అద్దబడుచుండెను. కాని రాట్నమంతరించిన పిమ్మట పనివారు విదేశపు మిల్లులమీద వాని నద్దుట కలవాటుపడి, అభ్యాసబలమువల్ల, వానిమీద తప్ప యీ అద్దకములు సరిపడవని భ్రమించుచుండిరి.

ఆంధ్ర చరఖాసంఘమువారీ భ్రమను తొలగించి, ఖద్దరుమీద కలంకారీదుప్పట్లు, తెరలు, టేబిలు గుడ్డలు వగైరా లద్దించి, మిల్లులమీదకంటె ఖద్దరుపై నీయద్దకములు మిగుల స్ఫుటముగాను, శోభావంతముగానుండు నని ఋజువుపరచిరి. మరియు వీరి ప్రోత్సాహఫలితముగా, ఒకే వస్త్రమునకు రెండు వైపుల రెండు రంగుల నద్దగల మేధావి యొకడు బయటపడి యీ శాఖ కెంతో ఖ్యాతి నార్జించెను. నాటినుండియు దేశములో ఆంధ్ర ప్రాశస్త్య సూచకములగు నీ కలంకారీలు, శ్రీకాకుళం సన్నముస్లిన్లు ప్రదర్శించబడని ప్రఖ్యాతప్రదర్శన మే లేదు!

కళాప్రియులందరీవస్త్రములను మిక్కుటముగా ప్రేమించుచు, కన్నుల కద్దుకొనుచున్నారు. శ్రీమంతులు, జమీందార్లు కూడ యిట్టి ప్రోత్సాహమే చూపవలసియున్నది.

ఆంధ్ర చరఖాసంఘమువారీ పరిశ్రమను చిరస్థాయిగా చేయుటకు శక్తివంచన లేకుండ పాటుపడుచున్నారు. 1939-వ సం. లో ప్రభుత్వపు సాయమున కలంకారీ శిక్షణ తరగతులు ప్రారంభించి, 6 గురు విద్యార్థులకు తర్ఫీదు నిచ్చిరి.

ప్రస్తుతం కలంకారీలు తయారు చేయుచున్నది ఒక్క మచిలీపట్నంలోనే నని రూఢిగా చెప్పవచ్చును.

మరియు నీపట్టణమున, కలంకారీలుగాక, బ్లాకులతో సుందరములగు పెక్కు విధ

ముల చీటేలు, చీరలు, శాలువలు, ప్రక్కదుప్పట్లు, తెరలు, టేబిలుగుడ్డ్లు, జేబురుమాళ్లు, లుంగీలు వగైరా అద్దకము లెన్నో ఖాదీమీద తయారై, అఖిల భారత ప్రదర్శనములందు సైతము తమ ప్రత్యేకతను ప్రకటించుచు ప్రశంస నొందుచున్నవి.

అటులనే తునిలోను, గొల్లపాలెంలోను సాధారణపు బ్లాకులతో పైరకములు ఖాదీమీద తయారగుచున్నవి. మిగత ఆంధ్ర నగరములలో అద్దకంపరిశ్రమ ప్రస్తుత మేస్థితిలో నున్నదీ తెలుపలేనందుకు విచారపడుచున్నాను. ప్రస్తుత మీ పరిశ్రమవల్ల మన దేశములో కొలదివందలమంది మాత్రమే జీవించుచున్నారు.

గాంధీజీ ముక్తకంఠముతో ఘోషించుచున్న ఖాదీపరిశ్రమ పునరుద్ధరణద్వారానే యీ పరిశ్రమకూడ పూర్తిగా పునరుద్ధరించబడగలదు. అప్పుడే నేడు పనులులేక అల్లాడుచున్న అసంఖ్యాకులగు యీ వృత్తులవారికి జీవనాధార మేర్పడగలదు.

బర్కెన్ హెడ్ “మనము వర్తకవేషముతోనే మొదట యిండియాకు వెడలితిమి. ఇదియే మన భావిరాజ్యమునకు పునాది” యని తెలిపిన విషయం జ్ఞప్తినుంచుకొని, మన వస్త్రపరిశ్రమ నాశనమువల్లనే రాజ్యమును పోగొట్టుకొంటి మనుమాట మరవక, తిరుగ స్వరాజ్యస్థాపనకు ఖాదీని సర్వవ్యాప్తి యగునట్లొనర్చి, మచిలీపట్నమునకు, యితర ఆంధ్ర నగరములకు, తద్వారా అశేషాంధ్రదేశమునకును జగత్ప్రఖ్యాతి నార్జించిన కలంకారీ, అద్దకం పరిశ్రమలను ప్రోత్సహించు భారము నాంధ్రమహాజనులును, భవిష్యజ్జాతీయ ప్రభుత్వమును వహించునట్లీశ్వరు డనుగ్రహించుగాక !



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad

## దీర్ఘమును, దట్టము నగు కేశములచే మీ సౌందర్యము నతిశయింపజేయుడు!



స్త్రీకి శోభగూర్చునది తన కేశసంపదయే. దీర్ఘమును, దట్టమునగు శిరోజములే సౌందర్యమునకు మొదటి మెట్టువ. కాబట్టి కేశ సౌందర్యమును సంపాదించవలెను, కాపాడుకొనవలెను.

మురిపెముగొలుపు కేశములను పెంపొందించుటకు అతి సులభమగుమార్గము అనుదినమును స్వస్తిక్ పరిమళాముదము వాడుట. ఆముదము ప్రధానద్రవ్యముగా తయారుచేయబడియుండుటచే నిది శిరోజములను మృదువుగను దీర్ఘముగను పెంపొందించుట కనన్యముగ పనిచేయును. వెంట్రుకలు రాలిపోవుటయు, నెరసిపోవుటయు నాపును. తలనూనెలు తయారుచేయుటలో వైట్ ఆయిల్ మొదలగు హానికరమగు ద్రవ్యములు తరచుగా వాడుచుందురు. ఇట్టి వేవియు ఇందు చేర్పబడలేదు.




స్వస్తిక్ వారి పరిమళాముదము అతిమనోహరమగు సువాసన గలది. కావున భారతదేశమంతటను సొగసుగొలుపు సుందర వనితల కిది వీరికోరిన తలనూనెయై యున్నది. ఈదినమే ఒక సీసా కొనుడు. అన్నిచోట్లను దొరకును.

## స్వస్తిక్ వారిపరిమళాముదము

## Swastik's Perfumed Castor Oil

స్వస్తిక్ ఆయిల్ మిల్సు, లిమిటెడ్. బొంబాయి 15.

---

## దైవీక వరప్రసాదము

ఆశ్చర్య  ఫలితాలు

లక్ష్మీ కవచం:—ఈ కవచం ధరించినవారికి దారిద్రం తొలగి ధనలాభం కల్గును. అప్పులబాధ తగ్గి మనశ్శాంతి ఏర్పడును. రూ. 5-0-0.

జయ వశీకరణి:—గ్రహచార దోషంచే కలుగు కష్టములన్నియు నివారణమై పరీక్షలో జయము, సౌఖ్యము, సర్వకార్యసిద్ధి ఇతరుల సహాయం మరియన్ని విధముల అదృష్టఫలములు కల్గును. రూ. 2-8-0.

వి. పి. ఖర్చులు 0-7-0. మీ పూర్తివిలాసంతో వ్రాయండి.

**హనుమదుపాసి. వి. కే. శఠకోపాచార్యులు.**

**హనుమాన్ జ్యోతిషాశ్రమం.**

తిరుత్తణి. P. O. (S. India.)

---

మధుమేహం, రాచకురుపులకు మందేమిటి? అంటే

## వసంతకుసుమాకరమే

అంతేకాదు. ముసలైన శరీరాలు దీనిప్రభావంచేత మిరల చిగురు తొడుగుతవి. వాడిచూడండి మా

## వసంతకుసుమాకరము

తులం. రు. **16/-**

**శ్రీమృత్యుంజయ ఫార్మసీ, బెజవాడ.**

మా మందులన్నీ ఇట్టివే.

కేటలాగు తెప్పించి చూడండి.

Telegram : "VIHAR". Telephone : 4292.

# "వసంత విహార్"

## బోర్డింగ్, లాడ్జింగ్ వసతులు

"పార్కు దృశ్యము"

నెం. 262 - 277, వాల్టాక్సురోడ్డు, మద్రాసు.

— సెంట్రల్ స్టేషనుకు, ట్రాము, బస్సు మార్గములకు చాల సమీపము —

సకలసౌకర్యములుగల గదులు, ఆధునిక ఆరోగ్యసౌకర్యములు, ఎలక్ట్రిక్ దీపములు, ఫాన్లు. స్వచ్ఛమైన ఉత్తర, దక్షిణదేశ గౌరవమర్యాదలకు, ఆధునికసౌకర్యములకు, భారతదేశభోజనము (శాఖాహారము) నకు సామాన్యధరలలో అనువైన హోటలు.

బాబూలాల్ గుప్త, ప్రొప్రైటర్.

---

టెలిగ్రాము. "విహార." టెలిఫోన్ : "4292."

కారము, సువాసన గలిగినది ! మనస్సును ఆనందింపజేయునది !

అనేక బహుమతులు పొందిన డాక్టరు పి. జె. గుప్తగారి

జగద్విఖ్యాతి గాంచిన

# శ్రీ గౌరీ నశ్యము

మన భారతదేశమునందును, అన్యరాజ్యములయందును, 'శ్రీ గౌరీ నశ్యము'ను ప్రతి మనుజుడును ఉపయోగించి, అనేక సర్టిఫికేటులు, బహుమతులు పంపియున్నారు. ఈ నశ్యమును వాడనివారు ఒకసారి తెప్పించి వాడి చూచినయెడల మీరే మీ బంధుమిత్రాదులకు శ్రీ గౌరీ నశ్యమును వాడమని సిఫారసు చేయుదురు.

మా తావున గల పరిమలా, డిలక్సు, జాస్మిన్, దిల్ కుష్ అను వైద్యతుల్యమును, మనోహరమును అయిన సువాసన గల నశ్యములు శ్రేష్ఠమయినవిగ పరిగణింపబడినవి.

అన్ని చోట్లా ఏజంట్లు కావలెను.

పి. జె. గుప్త స్నఫ్ కంపెనీ, పో. బా. నెం. 61, మద్రాసు.